ఓమ్

పరబ్రహ్మణే నమః.

—०(*)०—

కృష్ణయజుర్వేద

# తైత్తిరీయసంహితాయాం

# మంత్రభాగః

ప్రాజాపత్యంనామ

ప్రథమమ్మండలం

అర్థవినియోగసంహితం

**(MASULIPATAM.)**

బృందావనపురనివాసినా

వైదికసభాకార్యదర్శినా

## ఆతప్మారి లక్ష్మీనరసింహార్యేణ-

**Madras:**

**PRINTED AT THE V. N. JUBILEE PRESS,**

**AT THE A. S. M. PRESS,**

AND AT THE S. S. M. PRESS, VIZAGAPATAM.

1890 సం॥

మూల్యం రు. 3-0-0.

# పీఠిక.

వేదము అర్థముతో నధ్యయనము చేసినయెడల మిగుల లాభకర
మను సంగతిచెప్ప ననావశ్యకము. మనుజు డిహపరసౌఖ్యము నిమిత్తము
ఏమిచేయవలసినది వేదము చెప్పుచున్నది గనుక నదితెలిసికొనుట యావ
శ్యకము. ఇదివరకు ప్రథమప్రపాఠకము కర్మార్థముతో నచ్చువేయింపఁబ
డినదిగాని జ్ఞానయజ్ఞవిషయమై యచ్చట నేమియువ్రాయబడియుండలేదు.

యజ్ఞము కర్మయజ్ఞమనియు, జ్ఞానయజ్ఞమనియు ద్వివిధము. వేద
ము ఏతద్విషయంబై బోధించునను సిద్ధాంతము ననేకులొప్పుచున్నారు.
శ్రీమాధవాచార్యులవారు కర్మయజ్ఞపరముగ భాష్యము వ్రాసినను జ్ఞాన
యజ్ఞపరమైన యర్థమున్నదని యనేకస్థలములయందు సూచించియున్నా
రు. శ్రీమధ్వాచార్యులవారు ఋగ్వేదమునకు కొంతవరకు జ్ఞానయజ్ఞప
రముగ నర్థముచెప్పియున్నారు. శుక్లయజుర్వేదమునకు శ్రీదయానంద
సరస్వతీస్వాములవారు జ్ఞానయజ్ఞపరముగనర్థముప్రకటనచేసియున్నారు.
కృష్ణయజుర్వేదమునకు జ్ఞానయజ్ఞపరముగ ప్రత్యేకభాష్యము పుట్టకపో
వుటవలన యట్టియర్థము దెలిసికొనుట కొంతదుస్తరంబుగ నున్నను కృష్ణ
యజుర్వేదబ్రాహ్మణముయొక్కయు ఆరణ్యకముయొక్కయు మరియు ని
తరగ్రంథములయొక్కయు సహాయమువలన చాలావరకు నట్టియర్థమును
గ్రహింపవచ్చును. కృష్ణయజుర్వేదసంహిత స్వరయుక్తముగ నీసభవా
రిచే నచ్చువేయింపబడినదిగాననిందు, ప్రతిమంత్రముయొక్కపదము మా
త్రము, ప్రతిపుటయొక్క యెడమభాగమునందు జ్ఞానయజ్ఞార్థమును, కు
డిభాగమందు శ్రీమాధవాచార్యులభాష్యము ననుసరించి కర్మయజ్ఞార్థము
ను ఆపస్తంబశ్రౌతసూత్రముననుసరించి వినియోగమునువ్రాయంబడును.

కర్మార్థమునందు చెప్పబడు అర్థముకంటె జ్ఞానార్థమందు నేపద
ముకైనను వేరర్థము చెప్పబడినయెడల నందుకుండెడిప్రమాణములును మ

రికొన్ని యంశములును వివరణక్రింద వ్రాయబడును. ఈవిషయమిది ప్రథమప్రయత్నము గనుక దీనిని జదువువారిందున్న లోపములను క్షమించి వారివారి తాత్పర్యములను దెలియచేసిన యెడల మిగులకృతజ్ఞతతో వానిని గైకొని మరలసవరణతో ప్రచురింపనగును. జ్ఞానయజ్ఞార్థవిషయమైన యంశము లవతారికయందు విస్తరింపబడును. తైత్తిరీయసంహిత యేడుకాండలు గలది. ఇతరవేదమువలెగాకుండ ఈసంహితయందు మంత్రము బ్రాహ్మణము మిశ్రముగనున్నది. సంహితయందు రెంటిని, విభజించుటకు ననుకూలింపలేదు. అర్థమందు విభజింపబడును. అర్థము రెండుభాగములుగచేసి మొదటిభాగమందు కేవలమంత్రార్థమును, రెండవభాగమందు కేవలబ్రాహ్మణముయొక్క అర్థమును వ్రాయంబడును. ఇందువలన మంత్రబ్రాహ్మణములయందేమేమి చెప్పంబడినది దెలుసుకొనుట మిగుల సులభముగనుండును.



ఓమ్.

శ్రీ పరబ్రహ్మణేనమః



# కృష్ణ యజుర్వేద
# తైత్తిరీయసంహితా మంత్రభాగస్య
# ప్రథమకాణ్డే ప్రథమ ప్రపాఠకే
# ప్రథమోఽనువాకః.



కాండ ఋషిః ప్రజాపతిః.

ఛన్దః- దైవ్యనుష్టుప్.

## ౧. ఇషే త్వా

### జ్ఞానార్థము.

ఇషే=జ్ఞానముకొరకు, త్వా=(ఓ పరబ్రహ్మ) నిన్ను (ధ్యానించుచున్నాను)

తా॥ జ్ఞానముకొరకు పరబ్రహ్మమైన నిన్ను ధ్యానించుచున్నాను.

### కర్మార్థము.

ఇషే= (దేవతలకు దధిరూపమైన) అన్నము కొరకు, త్వా=(ఓ మోదుగకొమ్మా) నిన్ను (కోయుచున్నాను)

వినియోగము॥ ఈమంత్రము చెప్పుచు మోదుగకొమ్మను కోయవలయును.

---

వివరము ౧. వేదమునకు కర్మార్థమే గాని జ్ఞానార్థము లేదనియు శబ్దములకు విపరీతార్థములు చెప్పి జ్ఞానార్థమును సంపాదించుచున్నారనియు కొన్ని క్రైస్తియ నుగ్రంథములయందు వ్రాయబడియున్నది. మీరు ఈమంత్రముయొక్క అర్థమును శ్రద్ధగజూచిన యట్టివాదము సరిగాలేనట్లు తోచబడును. ఈమంత్రమందు రెండు పదములు గలవు. 'ఇషే, త్వా' మొదటిపదము చతుర్థీవిభక్తియు, రెండవపదము ద్వితీయా విభక్తియు, కర్తయు, ధాతువును, అధ్యాహారము. 'ఇషే' అనుపదమునకు దధిరూపమైన అన్నమని కర్మార్థమందు వ్రాయబడినది. వేదములోనుండు పదములకు అర్థము వైదికనిఘంటువును బట్టి తెలుసుకొనదగినది. వైదికనిఘంటువు యాస్కనిరుక్తముకంటె మిగుల ప్రాచీనమనియు, నీయాస్కముని ౨౮౦౦-సంవత్సరములకంటె ముందువాడునైన యున్నట్టిన్యమతస్థు లొప్పుకొనుచున్నారు. ఆవైదిక నిఘం

టువునందు 'ఇషం' అనుపదమునకు 'సూనృతా' అని యర్థము చెప్పబడియున్నది. సూనృతయను పదమునకు "ప్రియంచ సత్యంచ" అని 'మత్యర్థియో ఆకారః' అని వేదనిఘంటువు ౧—౭—౧౪ వ్రాయబడి యున్నది. 'సూనృతా' అనగ ప్రియము సత్యము కలది. అనగ జ్ఞానము. ఈరెండిటినికలది జ్ఞానమే గాని మరియేయితరము కాదు. ఇంతియేగాక 'ఇషే' అనునది ఇషగతౌ అనుధాతువువలన నిష్పన్నమైనది. 'యేగత్యర్థాస్తేజ్ఞానార్థాః' అని మహీధర యజుర్వేదభాష్యముయొక్క ౧౬ అధ్యాయము ౧- మంత్రముక్రింద వ్రాయబడియున్నది. కావున 'ఇషే' యనుపదము జ్ఞానార్థకము. ఇషము అనుపదమునకు అన్నము అర్థముకూడ కలదు.

సర్వనామములు ప్రత్యేకవిశేష్యములతో సంబంధింపనపుడు పరబ్రహ్మవాచ్యములైనటులప్రసిద్ధియైయున్నది. ఇచ్చట 'త్వా' అనుసర్వనామము మరియొక విశేష్యముతో సంబంధింపకపోవుటచే పరబ్రహ్మనే సూచించుచున్నది. కావున కర్మార్థమందు చెప్పబడిన 'పర్ణము' అనగ పలాశకు బ్రహ్మయర్థమని యీయనువాకమునకు సంబంధించిన బ్రాహ్మణమందు వ్రాయబడి యున్నది. 'బ్రహ్మవైపర్ణః' [౩—౨—౧] పర్ణమనగ బ్రహ్మ కావున ధ్యానించుచున్నానని యధ్యాహారము చేయనగును.

దీనికి దైవ్యనుష్టుప్ ఛందస్సు (మహీధరభాష్యం పుట ౨) మూడు అక్షరములుగల మంత్రమునకు దైవ్యనుష్టుప్ ఛందస్సు (పింగళఛందస్సు పుట ౧౦). ఛందస్సునుగూర్చి అనువాకాంతమును జూడుము.

ఇందుకువినియోగసూత్రము ఇషేత్వేత్యాచ్ఛినత్తి(ఆపస్తంబశ్రౌతం ౧-౧-౧౧)

---

## ౨. ఊర్జే, త్వా

**జ్ఞానార్థము.**

టీ॥ ఊర్జే=బలకొఱకు, త్వా=(ఓ పరబ్రహ్మ) నిన్నుధ్యానించుచున్నాను.

తా॥ శరీరముయొక్కయు ఆత్మయొక్కయు బలముకొఱకు పరబ్రహ్మ నిన్ను ధ్యానించుచున్నాను.

**కర్మార్థము.**

టీ॥ ఊర్జే=బలసాధనమైన రసము కొఱకు, త్వా=(ఓమోదుగకొమ్మ) నిన్ను చక్కజేయుచున్నాను.

వినియోగము॥ ఈమంత్రముచెప్పి మోదుగకొమ్మను చక్కచేయవలయును.

---

వివరము॥ ౨. ఊర్జేయనునది "ఊర్జబలప్రాణనయోః" అను ధాతువువలన వ్యుత్పన్నమైనది గావున ఊర్జ మనగ ధ్యానమునకు ననుకూలముగ నుండునటుల శరీరముయొక్కయు నాత్మయొక్కయు బలముకొఱకు భక్తుడు భగవంతుని ప్రార్థించుచున్నాడు. "ఇషేత్వా ఊర్జేత్వా" అనునది రెండుమంత్రములుగ వినియోగము

ననుసరించి భాగింపబడినది- అయితే "ఇషేత్వోర్జేత్వేత్యాహ ఇష మేవోర్జం యజమానే దధాతి" అని యేకమంత్రముగ బ్రాహ్మణమందు చెప్పబడియున్నది. భక్తునికి జ్ఞానమును బలమును భగవంతుడిచ్చుచున్నాడని తాత్పర్యము.

ఇందుకు వినియోగ సూత్రము ఊర్జేత్వేతి స్సన్నమయతి (ఆపస్తంబ శ్రౌతం ౧-౧-౧౧)

## ౩. వాయవః, స్థ, ఉపాయవః, స్థ

జ్ఞానార్థము-

టీ॥ వాయవః=(ఓ ప్రజలారా మీరు మీమీధర్మములాచరించుటకు) వెళ్లినవారు, స్థ=కండు. ఉపాయవః= (భగవద్ధ్యానమునుగూర్చి) తిరిగి వచ్చినవారు స్థ=కండు.

తా॥ ఓజనులారా మీరు మీకు విధిఅయిన ధర్మముల నాచరించుచు భగవద్ధ్యానపరులై యుండుడు.

కర్మార్థము-

టీ॥ వాయవః=(ఓదూడలారా మీరు తల్లులవద్దనుండి వెడలి మేతనిమిత్తమరణ్యమునకు) వెళ్లువారు, స్థ=కండు. ఉపాయవః=(యజమానగృహ సమీపమునకు సాయంకాలమందు) తిరిగవచ్చువారు, స్థ=కండు.

వినియోగము॥ ఈమంత్రము చెప్పుచూ దూడలను తోలవలయును.

వివరము॥ ౩. ఈ అనువాకమునకు ఋషి అయిన ప్రజాపతి ౧-౨ మంత్రములచే భగవత్ప్రార్థన చేసి ౩-వ మంత్రము మొదలుకొని జనులకు జ్ఞానోపదేశము చేయుచున్నాడు.

వాయవః అనుపదమునకు గంతారః అనియు ఉపాయవః=ఉపగంతారః అనియు భట్టభాస్కరభాష్యమందు వ్రాయబడినది.

మనుజులు ఇహలోకసంబంధమైన ధర్మములను ఆచరించుచు భగవద్ధ్యానపరులై యుండవలయునని హిందూసిద్ధాంతము చెప్పుచున్నది.

భగవద్గీతయందు నీసిద్ధాంతమె తెలియచేయబడినది. ఈరెండు ధర్మములలోనేదిపరిత్యజించినను బహుపాపమని స్పష్టముగ ఈశోపనిషత్తు ఒక్కాణించుచున్నది.

(మాచేనచ్చువేయింపబడిన ఈశోపనిషత్తుయొక్క ౯-వపుట జూడుము.)

మనుష్యులను పశువులనుగా ఆరోపించుట సకలసిద్ధాంతములయందు అంగీకరింపబడినది. కావుననే విష్ణువుకు గోపాలుడనియు శివునకు పశుపతియనియు నామములుకలిగెను. కర్మార్థమందు పశువులనియు జ్ఞానార్థమందు మనుజులనియు చెప్పబడినవి. ఇందుకుప్రమాణము "ప్రజావై పశవః" "పశవః పురుషః" (తై. బ్రా)

ఇందుకు వినియోగసూత్రము "వాయవస్థో పాయవస్థేతి తయా షడవరార్థ్యాన్వత్సానపాకరోతి". (ఆపస్తంబశ్రౌతం ౧-౨-౨)

ఛన్దః- ద్విపదా విరాడ్గాయత్రీ.

౪. దేవః, వః, సవితా, ప్ర, అర్పయతు, శ్రేష్ఠతమాయ, కర్మణే

జ్ఞానార్థము-

టీ॥ వః=మిమ్ములను, సవితా=ప్రేరకుడైన, దేవః=పరమేశ్వరుడు, శ్రేష్ఠతమాయ=అత్యంతశ్రేష్ఠమైన, కర్మణే=కర్మకొఱకు, ప్రార్పయతు=ప్రేరణ చేయుగాక.

తా॥ భగవంతుడు మిమ్ములను సత్కర్మలయందు భగవద్ధ్యానమందును ప్రవేశించునట్లు చేయుగాక.

కర్మార్థము-

టీ॥ వః=(ఓయావులారా మిమ్మును) సవితా=ప్రేరకుడైన, దేవః=పరమేశ్వరుడు, శ్రేష్ఠతమాయ=అత్యంతశ్రేష్ఠమైన, కర్మణే=(ఇష్టిరూపకమైన) కర్మకొఱకు, ప్రార్పయతు=(అరణ్యమందు గడ్డిమేయుటకు) ప్రేరణచేయుగాక.

వి॥ ఈమంత్రము చెప్పి యావులను అరణ్యమునకు మేతనిమిత్తమై మోదుగకొమ్మతో దోలవలయును.

వివరము ౪. ఈమంత్రము యజుర్వేదమందు మొదటి ఋక్కు. దీనిఛందస్సు ద్విపదావిరాట్ గాయత్రి యని మాధవాచార్యులవారు వ్రాసియున్నారు. విరాజోదిశః (పింగళ ౩-౫-) విరాటుకు ౧౦ అక్షరములు. గాయత్ర్యావసవః (పింగళ ౩-౩) గాయత్రికి ౮ అక్షరములు. ఈమంత్రమందు ౧౭ అక్షరములుగలవు. అతిశాయనేతమబిష్ఠనౌ (పాణిని ౫-౩-౫౫) అతిశయార్థమందు తమప్ ఇష్ఠన్ ప్రత్యయములు వచ్చును. ఇచట ధ్యానమను యజ్ఞకర్మ అత్యంతశ్రేష్ఠమైనది- అని తెలియచేయుటకు రెండుప్రత్యయములు ఉపయోగింపబడినవి. "యదాచ ప్రకర్షవతాంపునః ప్రకర్షో వివక్ష్యతే తదాతిశాయికాంతాదపరః ప్రత్యయోభవత్యేవ। దేవోవస్సవితాప్రార్పయతు శ్రేష్ఠతమాయ కర్మణే" (కాశికావృత్తి ౫-౩-౫౫)

ఇందుకు వినియోగసూత్రము "దేవోవస్సవితాప్రార్పయత్వితిశాఖయాగోచరాయగాఃప్రస్థాపయతి" (ఆపస్తంబశ్రౌతం ౧-౨-౪)

ఛన్దః- మధ్యే జ్యోతిస్త్రిష్టుప్.

౫. (౧) ఆప్యాయధ్వం అఘ్నియాః దేవభాగం

(౨) (క) ఊర్జస్వతీః పయస్వతీః

(ఖ) ప్రజావతీః అనమీవాః అయక్ష్మాః

[గ] మా వః స్తేనః ఈశత మా అఘశగ్ంసః

జ్ఞానార్థము-

టీ॥ ౫. [౧] అఘ్నియాః=ఓజనులారా, దేవభాగం=భగవత్సేవను, ఆప్యాయధ్వం=వృద్ధినొందించండి.

౫. (౨) (క) ఊర్జస్వతీః=మిమ్ము లను బలముకలవారినిగా, పయస్వతీః=సారముగలవారినిగా (చేయును గాక)

(ఖ) ప్రజావతీః=సంతానముగలవారినిగా, అనమీవాః=స్వల్ప రోగరహితమైనవారినిగా, అయక్ష్మాః=ప్రబలరోగ రహితమైనవారినిగా (చేయునుగాక.)

(గ) స్తేనః=కామక్రోధాదిషడ్వర్గమనే) చోరుడు, వః=మిమ్మును, ఈశత=(స్వాధీనముపరుచుకొనుటకు) సమర్థుడు, మా=కాకపోగాక, అఘశంసః=వధ స్వభావముగల (ప్రకృతి) మా=(మిమ్మును పాపకృత్యములయందు ప్రవేశపెట్టుటకు సామర్థ్యముగలది) కాకపోగాక.

తా॥ (౧) ఓజనులారా మీరు ఎల్లప్పుడు భగవద్ధ్యానపరులై యుండవలసినది.

తా॥ ౫. (౨) మీరు సత్కార్యములను చేయుటకు సమర్థమైనవారగుచు పాప కార్యములయందు ప్రవర్తించక పోవుదురుగాక.

కర్మార్థము

టీ॥ అఘ్నియాః=ఓగోవులారా, దేవభాగం= (ఇంద్రదేవునికి ఇయ్యతగిన దధిరూపకమైన) హవిస్సును, ఆప్యాయధ్వం=[విశేషముగా గడ్డిమేయుటచేత] వృద్ధినొందించండి, ఊర్జస్వతీః=అత్యంతరసముగలిగినట్టియు, పయస్వతీః=అధికపాలు గలిగినట్టియు, ప్రజావతీః=బహుసంతానముగలిగినట్టియు, అనమీవాః=క్రిమిదోషములు లేనట్టియు, అయక్ష్మాః=ఇతరరోగములు లేనట్టియు, వః=మిమ్మును, స్తేనః=చోరుడు, ఈశత=[అపహరించుటకు] సమర్థుడు, మా=కాకపోగాక, అఘశంసః=క్రూరజంతువు, మా=[ఘాతచేయుటకు సమర్థతకలది] కాకపోగాక.

వినియోగమునుగూర్చి వివరణ చూడుము.

వివరము ౫. (౧) విద్యారణ్యభాష్యమందు "ఆప్యాయధ్వం మొదలు మాఘశంసః" వరకు ఏకమంత్రముగా చేయబడినది. "ఆప్యాయధ్వం దేవభాగం" అనునది ఋక్కు శేషంయజుస్సు ఇందువలన ఈమంత్రము ఇచట రెండుభాగములుగా చేయబడినది. "అఘ్నియాః" అనుపదమునకు వ్యుత్పత్తి అహంతవ్యాభవతీత్యఘ్నేతి (నిరుక్తం ౧౧-౪౩) చంపబడుటకు అర్హతకానివి. అఘ్నియాః అనగ ఆత్మలు మనుజులు "భాగం" అనుపదము భజసేవాయాం అనుధాతువువలన వ్యుత్పన్నమైనది. (వేదనిఘంటువు ౨-౧౦-౧౦) భజధాతువునకు 'ఘఞ్' ప్రత్యయము వచ్చుటవ

లనభాగంఅయినదిగనుక భాగమనగా సేవ. దేవభాగం=భగవత్సేవ. ఈమంత్రము ఈవేదమందు రెండవఋక్కు. ఇది మధ్యేజ్యోతి స్త్రిష్టుప్. [తై. భాష్యం. ౧-౧-౧౩] మధ్యేజ్యోతిర్మధ్యమేన [పింగళ ఛం. ౩-౫౩] అనగా మధ్యమందు ౧౧- అక్షరములు గలది. ఈమంత్రమునకు ౧౧- అక్షరములుగలవు. ఈలక్షణమునకును ఋక్ప్రాతిశాఖ్యయందుండు లక్షణమునకును భేదముగానున్నది.

వివరము ౫. [౨] బ్రాహ్మణమందు ఇది మూడుభాగములుగాచేయబడినది.

[క] ఇందుమొదటిది ‹‹ఊర్జస్వతీఃపయస్వతీరిత్యాహ। ఊర్జగ్ంహి పయస్సంభరంతి›› [తై. బ్రా ౩-౨-౧-౫] ఊర్జస్వతిః=బలముగలది [వేదనిఘంటువు ౧-౧౩-౨౮]

౫. [౨] [ఖ] ఇందు రెండవది ప్రజావతీః X X అయక్ష్మాఇత్యాహ ప్రజాత్యై [బ్రా ౩-౨-౧-౫] వృద్ధికొరకు. అనమీవాః =స్వల్పరోగరహితాః [మహీధరభాష్యం ౧-౧] అయక్ష్మాః=ప్రబలరోగరహితాః [మహీధరభాష్యం ౧-౧]

౫. [౨] [గ] ఇందు మూడవది ‹‹మావస్తేన ఈశతమాఘశగ్ంసఇత్యాహగుప్త్యై›› [తై. బ్రా ౩-౨-౧-౫] రక్షణకొరకు, అఘశగ్ంసః=వధస్వభావః [వైదిక నిఘంటువు. ౩-౨౫-౧౩]

ఈమంత్రమునకు ఆపస్తంబులవారు వినియోగము ప్రత్యేకము చెప్పక ‹‹ ఆప్యాయధ్వమఘ్నియా ఇంద్రాయదేవభాగమిత్యేకే సమామనంతి। మహేంద్రాయేత్యేకే›› అనిచెప్పియున్నారు [౧-౨-౬] విద్యారణ్యభాష్యమందు 'ఆప్యాయధ్వం' అని మాత్రము వ్రాసియున్నారుగాని దేవభాగమని యుచ్చరించవలయునో ఇంద్రాయభాగమని యుచ్చరించవలయునో స్పష్టముగా వ్రాసియుండకపోవుటవలన ఈమంత్రమునకు వినియోగము వ్రాయబడలేదు.

"ఆప్యాయధ్వమఘ్నియా ఇంద్రాయభాగమని" శుక్లయజుర్వేదులును "ఆప్యాయధ్వమఘ్నియా దేవేభ్యః ఇంద్రాయభాగం" అని మైత్రాయణులును పఠించుచున్నారు.

---

ఛన్దః- ఏకపదా త్రిష్టుప్.

౬. రుద్రస్య హేతిః పరి వః వృణక్తు.

జ్ఞానార్థము.

టీ॥ రుద్రస్య=ప్రకృతిసంబంధమైన, హేతిః= [అజ్ఞానమనెడి] ఆయుధము, వః=మిమ్ములను, పరివృణక్తు=అంతటవిడుచుగాక.

కర్మార్థము.

వః=మిమ్ములను, రుద్రస్య=క్రూరదేవతయొక్క, హేతిః=ఆయుధము, పరివృణక్తు=విడుచుగాక.

| జ్ఞానార్థము. | కర్మార్థము. |
| --- | --- |
| తా॥ ప్రకృతిసంబంధమైన అజ్ఞానమువలన భగవంతుడు మిమ్మునరక్షించుగాక. | వి॥ ఈమంత్రము చెప్పి పోయెడి గోవులను అనుమంత్రింపవలయును. |

వివరము॥ "రుక్ దుఃఖం ద్రావయతీతి రుద్రః" (మహీధరభాష్యం ౧౬-౧) హేతిః=దేనిచేతచంపబడునో అది హేతిః (వేదనిఘంటువు ౨-౨౦-౩) వృణక్తు, వృజీ వర్జనె (వేదనిఘంటువు ౨-౧౮-౫) అనగా విడుచుట. పరి=సర్వతః (భట్టభాస్కర భాష్యమ్)

ఈమంత్రముయొక్క శబ్దార్థము చూడగ నచేతనమైన హేతిని ప్రార్థించినయటులకనిపించుచున్నది. అయితే పూర్వమందలి సంస్కృతిభాషను బట్టి యాలోచించగ భగవంతునే ప్రార్థించినయటుల తెలియవలయును. ఈమంత్రముయొక్క బ్రాహ్మణమందు దీనియర్థము ఎటులవ్రాయబడినది యనగ "రుద్రస్యహేతిః పరివోవృణక్తు ఇత్యాహ। రుద్రాదేవైనాస్త్రాయతె" (తై. బ్రా. ౩-౨-౧-౫) ఇందుకర్థము. రుద్రునివలన వీరలు రక్షింపబడుగాక.

ఈమంత్రము ఏకపదాత్రిష్టుప్ (తై. భాష్యము ౧-౧-౧౩) త్రిష్టుభోరుద్రాః (పింగళఛందస్సు ౩-౬) అనగ ౧౧ అక్షరములు గలది.

ఈమంత్రముయొక్క వినియోగసూత్రము "రుద్రస్యహేతిః పరివో వృణక్త్విత్తి ప్రస్థితా అనుమంత్రయతె" (ఆపస్తంబశ్రౌతము ౧-౨-౮)

ఛన్దః- ఏకపదా త్రిష్టుప్.

## ౭. ధ్రువాః అస్మిన్ గోపతౌ స్యాత బహ్వీః

| జ్ఞానార్థము. | కర్మార్థము. |
| --- | --- |
| టీ॥ అస్మిన్=ఈ, గోపతౌ=భగవంతునియందు, ధ్రువాః=స్థిరముగను, బహ్వీః=వృద్ధిగను, స్యాత= ఉందురుగాక. | టీ॥ అస్మిన్=(ఓగోవులారా) ఈ, గోపతౌ=గోవులకుయజమానుడైనవానియొద్ద, ధ్రువాః=స్థిరముగ, స్యాత= ఉందురుగాక, బహ్వీః = బహురూపకముగ (నుందురుగాక) |
| తా॥ ఓమనుజులారా మీ మనస్సును భగవంతునియందు యెల్లప్పుడునుంచుడీ. | వి॥ ఈమంత్రము చెప్పి యజమానుని యింటికి రావలయును. |

వివరము. గవాంపతిః 'గోపతిః' గోశబ్దమునకు అనేకార్థములుగలవు. (వేద

నిఘంటువు ) గోపతి యనగ స్వర్గపతియని వాచస్పతి నిఘంటువునందు చెప్పబడి యున్నది. ఈశబ్దమునకు భగవత్పరముగ నర్థము అనేకస్థలములయందున్నది. ఈ మంత్రము ఏకపదాత్రిష్టుప్ (విద్యారణ్యభాష్యము ౧-౧-౧౩ )

ఇందుకు వినియోగసూత్రము "ధ్రువా అస్మిన్ గోపతౌ స్యాత బహ్వీరితియజమానస్య గృహానభిపర్యావర్తతే" (ఆపస్తంబశ్రౌతము ౧-౨-౯)

---

## ౮. యజమానస్య పశూన్ పాహి.

**జ్ఞానార్థము.**

టీ॥ యజమానస్య= (ఓపరబ్రహ్మ) యజమానునియొక్క, పశూన్=సంపదలను, పాహి=రక్షింపుము.

తా॥ ఓపరబ్రహ్మ సత్కర్మలను తపస్సును చేయువాని కిహపర సౌఖ్యముల నిచ్చిరక్షింపుము.

**కర్మార్థము.**

టీ॥ యజమానస్య [ ఓ మోదుగ కొమ్మ ] యజమానునియొక్క, పశూన్=పశువులను, పాహి=రక్షింపుము.

వి॥ ఈమంత్రము చెప్పి దూడలను తోలుటకుగాను తీసిన మోదుగకొమ్మను అగ్నిశాలయందు పైనుంచవలయును.

---

వివరము. యజధాతువునకు శానచ్ ప్రత్యయమువచ్చి యజమానః అయినది. యజ్ అనుధాతువునకు అర్థము దేవపూజ, సంగతి కరణము, దానము. ఈధాతువు వలననే యజ్ఞశబ్దము వ్యుత్పన్నమైనది.

"యజ్ఞస్తపః" ( తైత్తిరీయారణ్యకమ ౧౦-౮ ) కావున యజ్ఞశబ్దము మంచికర్మలయందును తపస్సుయందును వర్తించును.

యజమానుడనగ మంచికర్మలను చేయువాడు, తపస్సుచేయువాడు, యజమానస్య అనగ ' యః పరమేశ్వరం సర్వోపకారం ధర్మంచ యజతి తస్యవిదుషః ' అని శుక్లయజుర్వేదభాష్యమందు వ్రాయబడియున్నది. ఇందుకర్థము. ఎవడు పరమేశ్వరుని ధ్యానించుచు సర్వోపకారమైన ధర్మమును చేయునో యట్టివాడు యజమానుడు.

వేదమందు 'యజ్ఞ' శబ్దము, 'యజమాన' శబ్దము ఈఅర్థములయందు ప్రయోగింపబడినవి.

'శ్రీర్హిపశవః' (శతపథబ్రాహ్మణము ౧-౬-౩-౩౬) అను ప్రమాణమును బట్టి పశూన్ అనుశబ్దమునకు సంపదలు అనగ ఇహపరసౌఖ్యములని చెప్పడమైనది.

ఇందుకువినియోగసూత్రము "యజమానస్యపశూన్పాహీత్యాగ్నిహోత్రశాలాయాః పురస్తాత్ప్రతీచీం శాఖా ముపగూహతి పశ్చాత్ప్రాచీంవా" (ఆపస్తంబశ్రౌతము ౧-౨-౧౦)



## అనువాక సామాన్య విషయము.

ఈఅనువాకము చాలాగూఢార్థముకలది. సత్కర్మచేయుటకును భగవద్ధ్యానముచేయుటకును జ్ఞానమావశ్యకము. ప్రజాపతి ఋషి, ప్రథమమంత్రముచే దనకును ఇతరులకును జ్ఞానమునుగూర్చి భగవంతుని ప్రార్థించుచున్నాడు. కర్మ, జ్ఞానమున కుపలక్షణమగుటచే కర్మయజ్ఞము, జ్ఞానయజ్ఞమునకు అంగముకాని వేరుకాదు. కర్మయజ్ఞము పరోక్షముగ జ్ఞానయజ్ఞమును దెలుపుచున్నది. కావున భట్టభాస్కరుల వారు వారిభాష్యమునకు జ్ఞానయజ్ఞమని నామమిచ్చిరి.

ఇషమను పదమునకు అన్నమర్థముకూడను గలదు. కావున దధిరూపమైన అన్నము సంపాదించుటకు అని కర్మయందు చెప్పంబడినది. దధిస్వచ్ఛముచే జ్ఞానమును బోధించుచున్నది. శ్రీమదాంధ్రభాగవత దశమస్కంధటీకాతాత్పర్యసహిత గ్రంథమందు వెన్నబ్రహ్మవిద్యయనియు, దధివేదశాస్త్రమనియు, చెప్పంబడి యున్నది. (పుట ౧౫౦-౧౫౨) దధిరూపమైన అన్నము జ్ఞానమునకుపలక్షణముగ నెంచవలయును. పశువులను మనుష్యులు దండముచే నెటులపాలించెదరో యటుల భగవంతుడు మనుష్యులను గాయత్రిచే పాలించుచున్నాడని యీఅనువాకముయొక్క బ్రాహ్మణము తేటపరుచుచున్నది.

“బ్రహ్మవై పర్ణః। యత్పర్ణశాఖయావత్సానపాకరోతి। బ్రహ్మణైవైనానపాకరోతి। గాయత్రోవై పర్ణః” [తై. బ్రా. ౩-౨-౧-౧] “ప్రజావైపశవః” [శతపథం ౧-౮-౬-౧౪]

ఈఅర్థమునే మైత్రాయణీ బ్రాహ్మణమున్ను బోధించుచున్నది. “వజ్రో దండో వజ్రేణ పశూనభిప్రవర్తయేత్। * * * యత్పర్ణశాఖయా ప్రార్పయతి। బ్రహ్మణైవైనాః ప్రార్పయతి।” [౮-౧-౧]

౨. మనము అజ్ఞానమునకు లోబడి నడచుట పెద్దపులినోట పశువులు పడుటవలెనేయని కర్మార్థము తెలియచేయుచున్నది. ఈరీతిగ కర్మకాండ పరోక్షముగ జ్ఞానమును బోధించుచున్నదను సంగతికి సందియములేదు. ఈఅనువాకమునకు వత్సాపకరణమని కర్మరీత్యా వాడబడుచున్నది. ప్రాణాగ్రపశవః అనుప్రమాణమును బట్టి వత్సాపకరణమనగ ప్రాణాపకరణమనియు లేదా ప్రాణాయామమనియు చెప్పవచ్చును. ప్రాణాయామమనగ ప్రాణములను స్వాధీనపరుచుకొనుట.

౩. ప్రతిమంత్రమునకును ఋషి ఛందస్సు దేవతా బ్రాహ్మణము తెలుసుకొనుట యావశ్యకము. తెలుసుకొననియడల పాపమనియు ఛందోగమందు చెప్పినట్లు

విద్యారణ్యభాష్యమందు వ్రాయబడియున్నది- [చెన్నపట్టణంకూర్పు పుట ౬] [పింగళఛందస్సు పుట ౧] "యోహవా అవిదతార్షేయ ఛందో దైవతబ్రాహ్మణేన మంత్రేణ యాజయతి యాజయతివా అధ్యాపయతివా స్థాణుం వర్ఛతి గర్తేవా పత్యతే ప్రవామీయతే పాపీయాన్భవతి। తస్మాదేతానిమంత్రే మంత్రేవిద్యాత్."

౪. ఋషికి లక్షణము "యస్యవాక్యం సఋషిః" [అనుక్రమణికాపుట ౧]

దేవత అనగ మంత్రముచే ప్రతిపాదింపబడినది. "యా తేనోచ్యతే సా దేవతా" [ అనుక్రమణికాపుట ౧ ]

౫. ఛందస్సునుగూర్చి భిన్నాభిప్రాయములు గలవు. కొందరు ఋక్కులకు మాత్రమె ఛందస్సుకలదనియు, కొందరు ఋక్కులకును యజుస్సులకును ఛందస్సు కలదనియు చెప్పుచున్నారు. ఇందువిషయమై మహీధరాచార్యులవారు శుక్లయజుర్వేద భాష్యముయొక్క ౧ పుటయందు చెప్పినదియేమనగ "తస్మాద్వేదమంత్రాణాం ఋష్యాదిజ్ఞాన మర్థజ్ఞానంచావశ్యక మన్యథా ఫలవైఫల్యాత్। తత్ర యజుర్వేదమంత్రేషు కానిచిత్ యజూంషి కాశ్చన ఋచః। తత్ర ఋచాం నియతాక్షర పాదావసానానాం ఆవశ్యకం ఛందః కాత్యాయనేనోక్తం। యజుషాం షడుత్తరశతాక్షరావసానానాం ఏకాక్షరాదీనాం పింగలేన దైవ్యేకమిత్యాదినోక్తం ఛందో బోద్ధవ్యం।" ఈ ప్రమాణమునను సరించి "ఇషే త్వేతి ద్విపదః త్ర్యక్షరో మంత్రః తస్యదైవ్యనుష్టుప్ ఛందః" అని రెండవపుటయందు వ్రాసియున్నారు. ప్రణవము యజుస్సుఆయినను ఇది గాయత్రీఛందస్సు అని నారాయణోపనిషత్తు ౩౧ అనువాకమందు చెప్పబడినది. శంకరాచార్యులవారును ఆప్రకారముగానే చెప్పియున్నారు- "ప్రణవేబ్రహ్మాఋషిఃప్రోక్తశ్ఛందోగాయత్రముచ్యతే" [శ్రీకృష్ణపండిత సంధ్యావందన భాష్యము పుట ౪౩] ఇందువలన ఆలోచించగా యజుస్సుకుకూడా ఛందస్సుయున్నట్లె గనుపించుచున్నది. అయినను ప్రతిమంత్రముయొక్క ఛందస్సును స్వాతంత్రించి చెప్పుటకు వీలులేదు. వ్యాఖ్యాతలు చెప్పిన ఛందస్సుమాత్రము తెలియచేయుదుము.

౬. ఈయనువాకము శుక్లయజుర్వేద ప్రథమానువాకముతోను మైత్రాయణీ సంహిత ప్రథమానువాకముతోను కొన్ని మంత్రవ్యత్యయములగాను సంబంధించియున్నది. మైత్రాయణీసంహితయందున్న ప్రథమమంత్రమేమనగా "ఇషే త్వా సుభూతాయ" గ్రంథబాహుళ్యముచే నితరమంత్రభేదముల నిచ్చట కనుపరచలేదు.



మొదటియనువాకసంగ్రహము.

ఓపరమేశ్వరా మేము అందరియందు ప్రేమగలవారమై సత్యప్రవర్తనను కలుగచేసెడి జ్ఞానముకొరకు నిన్ను ప్రార్థించుచున్నారము.

౨. అట్టిసత్కర్మయందు ప్రవర్తించుటకు సామర్థ్యము కలుగజేయుకొరకు నిన్ను యాచించుచున్నారము.

౩. ఓజనులారా మీకు విధియైన కర్మల నాచరింపుచు భగవద్భక్తి కలవారై యుండుడు.

౪. అన్నిటికంటె శ్రేష్ఠమైన భగవద్ధ్యానమునందు ప్రవేశించుటకు అంతర్యామియగు పరమేశ్వరుడు మీకు బుద్ధి పుట్టించుగాక.

౫. మీరు భగవత్సేవయందు ఆసక్తిపరులై యుందురుగాక. మీరు సత్కర్మలాచరించుటకుగాను బలముగలవారై సారముగలవారై సంతానముగలవారై రోగాదిదోషరహితులై యుందురుగాక. కామక్రోధ లోభ మోహ మద మాత్సర్యమను చోరుడు మిమ్మును స్వాధీనపరచుకొని దుర్మార్గప్రవర్తనయందు ప్రవేశపెట్టకపోవుగాక.

౬. మీరు అవిద్యకు లోబడకపోదురుగాక.

౭. సర్వరక్షకుడగు భగవంతునియందు మీచిత్తములను స్థిరముగనుంచి వృద్ధిపొందుడీ.

౮. ఓపరమేశ్వరా సత్కార్యములను చేయువారికి నిహపరసౌఖ్యములనిచ్చి రక్షింపుము.

ప్రథమోనువాకస్సంపూర్ణమ్.

ఓమ్.

శ్రీపరబ్రహ్మణే నమః.

# ద్వితీయో ఽనువాకః.

## కాండ ఋషిః ప్రజాపతిః.

## ౧. యజ్ఞస్య, ఘోషత్, అసి.

### జ్ఞానార్థము.

టీ॥ యజ్ఞస్య=ఓబ్రహ్మవిద్యా లేక (వేదమా నీవు) అత్యంత శ్రేష్ఠమైన కర్మసముదాయమునకు, ఘోషత్ = వాక్కువు లేక సాధనము, అసి = అగుచున్నావు.

తా॥ ఓబ్రహ్మవిద్యానీవు ఋతము సత్యము శ్రుతము శాంతము దానము మొదలగు సత్కర్మలను ప్రజలు చేయవలయునని ఘోషింపుచున్నావు. లేదా అట్టికర్మలను చేయుటకు సాధనమగుచున్నావు.

### కర్మార్థము.

టీ॥ యజ్ఞస్య=(ఓయగ్నీ)యజ్ఞమునకు, ఘోషత్ =సాధనమైన ద్రవ్యము, అసి=(నీవు)అగుచున్నావు.

వినియోగము॥ ఈమంత్రము చెప్పుచు గార్హపత్యాగ్నిని అభిమంత్రించవలయును.

---

వివరణము ౧॥ కర్మయజ్ఞమును గూర్చి యితరశాఖలనుంచి కొన్నిమంత్రములు తీసుకొనినయటుల విద్యారణ్యభాష్యమందు చెప్పబడినది. జ్ఞానయజ్ఞమందు ఆమంత్రములను తీసికొనుట యావశ్యకము లేకనే సంహితానుసారముగ జ్ఞానార్థము చెప్పబడినది. “ఘోషత్” శబ్దమునకు సాధనద్రవ్యమని విద్యారణ్యులవారు వ్రాసియున్నారు. మరియు యాస్కమహాముని “శృణేతేర్ఘోషో ఘుష్యతేః” అని చెప్పియున్నారు. [నిరుక్తం ౬- ౯-] వేదనిఘంటువుయందు ఘోషశబ్దము వాక్ నామములయందు చెప్పబడినది. “ఘుష్యతే శబ్ద్యతే ఘోషః” [వేదనిఘంటువు ౧-౧౧-౩౮] “యజ్ఞ”శబ్దము ఋతము సత్యము శ్రుతము శాంతము దానము మొదలగువాటిని బోధింపుచున్నదనెడి సంగతినిగూర్చి ౧. ౧. ౧. ౭- వివరణ చూడుము. యజ్ఞస్యేతి చతుర్థ్యర్థే షష్ఠీ [భట్టభాస్కరము ౧-౧-౨] కావున సత్కార్యముల కొరకు ఘోషింపుచున్నది. అనగా ఓప్రజలారా మీరు ఈకార్యములను చేయుడీ యని బ్రహ్మవిద్య దృఢముగ చెప్పుచున్నది. ఘోషశబ్దము ఇప్పటికి నీయర్థమందు వాడబడుచున్నది. కావున రెండుఅర్థములు వ్రాయబడినవి. కర్మార్థమందు అగ్ని అధ్యాహారము చేయబడి

నది. ‘‘విజ్ఞాతమగ్నిః” [ఓత్రి ౧- ౬] అనుప్రమాణమునుబట్టి జ్ఞానార్థమందు జ్ఞానము అధ్యాహారము చేయబడినది.

ఈమంత్రముయొక్క వినియోగసూత్రము ‘‘యజ్ఞస్యఘోషదసీతి గార్హపత్యమభిమంత్ర్య” [ఆపస్తంబశ్రౌతము ౧- ౩- ౩]

ఛన్దః- ఏకపదా యాజుషీ గాయత్రీ.

౨. (౧) ప్రత్యుష్టం రక్షః (౨) ప్రత్యుష్టాః అరాతయః.

జ్ఞానార్థము.

టీ॥ [౧] రక్షః=ప్రతిబంధకము, ప్రత్యుష్టం=మిక్కిలిదహింపబడినదౌగాక.

[౨] అరాతయః=అంతర్బహిశ్శత్రువులను విఘ్నములు, ప్రత్యుష్టాః=మిక్కిలిదహింపబడినవియౌగాక.

తా॥ మేముచేయబోవుసత్కార్యములయొక్క ప్రతిబంధకములు నశించి అవిఘ్నమౌగాక.

కర్మార్థము.

టీ॥ రక్షః = రాక్షసుడు, ప్రత్యుష్టం=మిక్కిలి దహింపబడినవాడు [ బౌగాక]. అరాతయః=శత్రువులు, ప్రత్యుష్టాః=మిక్కిలి దహింపబడినవారు [బౌదురుగాక].

వినియోగము॥ ఈమంత్రము చెప్పుచు ఆహవనీయమందుగాని గార్హపత్యాగ్నియందుగాని కత్తినికాచవలయును.

వివరము ॥ రక్షః అనుశబ్దము ‘‘రి హింసాయాం” అను ధాతువువలన వ్యుత్పన్నమైనది. [విలయం నిఘంటువు] ‘‘శ్రేయాంసిబహువిఘ్నాని” అను ధర్మమువలన ముందుచేయబోవు బ్రహ్మవిద్యాసంపాదనకు అన్నివిఘ్నములు నశించవలెనని భక్తులు ప్రార్థించుచున్నారు. ప్రస్తుతసంస్కృతములో ‘‘అవిఘ్నమస్తు” అను వాక్యముచేనీపుంతార్థము తెలియచేయబడుచున్నది. ఈమంత్రముయొక్క ప్రయోజనము ఈబ్రాహ్మణమందు చెప్పబడియున్నది. ‘‘ప్రత్యుష్టగ్ంరక్షఃప్రత్యుష్టాఅరాతయఇత్యాహరక్షసామపహత్యై” [తై- బ్రా- ౩- ౨- ౨- ౨] ఛందస్సునుబట్టి భట్టభాస్కరాచార్యులవారు ఈమంత్రమును రెండుభాగములుగ జేసి గాయత్రైకపదా యజుః అని చెప్పియున్నారు. ‘‘యజుషాంషట్” యత్రక్వచిత్ వేదే షడక్షరం ఛందః తత్ యాజుషీగాయత్రీ [పింగలఛందస్సు ౨- ౬] మైత్రాయణీసంహితయందును ఈమంత్రము రెండుభాగములుగ చేయబడినది.

ఈమంత్రముయొక్క వినియోగసూత్రము ‘‘ప్రత్యుష్టగ్ంరక్షఃప్రత్యుష్టా అరాతయఇత్యాహవనీయేగార్హపత్యేవా స్వదం ప్రతితపతి” [ఆపస్తంబశ్రౌతము ౧-౩-౩] ‘‘నపరశుం” [ఆపస్తంబశ్రౌతము ౧- ౩- ౪].

ఛన్దః- త్రిష్టుప్.

౩. [౧] ప్ర ఇయం అగాత్ ధిషణా బర్హిః అచ్ఛ మనునా కృతా స్వధ

యా వితష్టా తే ఆ వహంతి కవయః పురస్తాత్.

[౨] దేవేభ్యః జుష్టం ఇహ బర్హిః ఆసదే.

జ్ఞానార్థము.

[౧] ధిషణా=ధారణాశక్తి కలిగినట్టి, ఇయం=ఈబుద్ధి, బర్హిః=బ్రహ్మవిద్యను గూర్చి, అచ్ఛ=అభిముఖముగ, ప్ర+అగాత్=వెళ్లుచున్నది, ఆబుద్ధి మరియెటువంటిదనగ, మనునా=భగవంతుని చేత, కృతా=సృష్టించబడినట్టియు, స్వధయా=తగినపదార్థములను భక్షించుట చేత, వితష్టా=తీక్ష్ణము చేయబడినదియై యున్నది, తే=ప్రసిద్ధికెక్కిన, కవయః=ఋషులు, పురస్తాత్=ప్రాచీనకాలమునుంచి, ఆవహంతి=[ఆవిద్యను] తెస్సగా గ్రహించుచున్నారు.

[౨] దేవేభ్యః=విబుధుల కొరకు, జుష్టం=ప్రియమగునటుల, బర్హిః=బ్రహ్మవిద్యను, ఇహ=ఈలోకమందు, ఆసదే=సంపాదింపతగినది.

తా॥ [౧] ధారణాశక్తి కలిగినట్టియు భగవంతుని చేత నిర్మింపబడినట్టియు మనుజుడు, బ్రహ్మవిద్యను సంపాదించుటకు ప్రయత్నము చేయవలసినది. అట్టిబ్రహ్మవిద్య పూర్వకాలమునుంచి ఋషులు అధ్యయనము చేయుచున్నారు. మరియు మదమును, మత్తును కలుగజేయు పదార్థములను భక్షించక బుద్ధిని నిర్మలముగ నుంచవలయుననియు ఈమంత్రముచెప్పుచున్నది.

తా॥ [౨] జ్ఞానులకు సంతోషకరముగు బ్రహ్మవిద్యను ఈలోకమందు సంపాదించుట యావశ్యకము.

కర్మార్థము.

టీ॥ తే=ఆ (ప్రాచీనులైన), కవయః=విద్వాంసులు, (ఏకారణము వలన) పురస్తాత్=తూర్పుదిశనుంచి, ఆవహంతి=(దర్భలను) తెచ్చుచున్నారో [ఆకారణము వలన] దేవేభ్యః=దేవతల కొరకు, జుష్టం=ప్రియమైన, ఇహ=వేదికయందు, బర్హిః=దర్భలు, ఆసదే=ఎంతయుంచతగినదో [అంత], బర్హిః=దర్భలను, అచ్ఛ=తెచ్చుటకు, మనునా=మనుప్రజాపతిచేత, కృతా=నిర్మితమైనట్టియు, స్వధయా=ఆహారము చేత, వితష్టా=అత్యంత తీక్ష్ణముగ చేయబడినటువంటియు, ఇయం=[దర్భలను కోయుటకు ఉపయోగపడ్యే] ఈ [గుజ్జపు ప్రక్కయెముక], ధిషణా=జ్ఞానరూపకమైనదియాటు వలన తెలిసినదై, ప్రాగాత్=తూర్పు దిక్కునకు పోవుచున్నయది.

వినియోగము॥ ఈ మంత్రమునకు ప్రత్యేకవినియోగము ఆపస్తంబులవారు చెప్పలేదు. ఈమంత్రమునకు ఉర్వ్యంతరిక్షమన్విహీతి యనుమంత్రమున కొక వినియోగమును చెప్పియున్నారు. ఎచటనైనను దర్భవికారమైన బర్హిస్సును తీసుకొనిరావలయును.

వివరణము ॥ ఈసూత్రము ఆపస్తంబశ్రౌత సూత్రము ననుసరించి యేకమంత్రముగ విద్యారణ్య భాష్యమందు చెప్పంబడినది. ఈమంత్రమందు ఋక్కు యజుస్సు నుండుటచేత నిది రెండుభాగములుగ చేయబడినది. (౧) ఋక్కు, (౨) యజుస్సు. ఇందు ప్రథమమంత్రమైనఋక్కు బ్రాహ్మణమందు ౩ - భాగములు చేయబడుటచే వానినిజ్ఞానార్థముననుసరించి వేర్వేరుగ వ్రాయనయినది.

ధిషణా అనుశబ్దము “ ధారయత్యర్థానితిధీః” అని స్కందస్వామిచే చెప్పబడినది (వేదనిఘంటువు ౧-౧౧-౪౪) అనగా ధారణశక్తికలది. వేదార్థమును గ్రహించు శక్తికలది బుద్ధి. అట్టి బుద్ధి కలవాడు మనుజుడు గనుక నట్టి విశేషణమిచ్చుట నుపయోగింపబడినది.

“ బర్హిః”అనగా అధ్యయనము చేయబడినది “ అధీతంబర్హిః” (చిత్తి అనెడి యజుర్వేదారణ్యకం ౩-౧-౪) అధీతమనగా ఉచ్చరించదగినది. “ అధీతం ఉచ్చార్యమాణం” (ఆరణ్యకభాష్యం కలకత్తాకూర్పుపుట ౨౮౧) అనగా వేదము.

“ మను”శబ్దము భగవత్పరముప్రసిద్ధి. ఇందుకువ్యుత్పత్తివిషయమై శ్రీశంకరాచార్యులవారు వ్రాసినదేమనగ “ మననాన్మనుఃనాన్యతోఽస్తి మంత్రేతిశ్రుతేః” విష్ణుసహస్రనామములు (చెన్నపట్టణంకూర్పుపుట ౨౨).

స్వధా అనుపదము అన్ననామములయందు చెప్పబడినది. (వేదనిఘంటువు ౨-౭-౧౭) వితష్టా అనుశబ్దము “ తక్షూతనూకరణే” ధాతువువలనవ్యుత్పన్నమైనది “ విశేషేణతనూకృతా”అని భట్టభాస్కరునిచే జెప్పబడినది.

“ కవిః”అనుశబ్దము “ కవృవర్ణనే” ధాతువువలనవ్యుత్పన్నమైనది. “క్రాంతదర్శనోభవతికవిః” (నిరుక్తం ౧౨-౧౩) “ క్రాంతదర్శనః” అనగా “ అతీతానాగతవిప్రకృష్టవిషయం యుగపత్ జ్ఞానంయస్యసః క్రాంతదర్శనః” అని ఉవటాచార్యులుచెప్పియున్నారు. (వేదనిఘంటువు ౩-౧౫-౧౦) “ ఋషయః కవయః” (మైత్రాయణీసంహిత ౪-౧-౨)

పురస్తాత్ = పూర్వ+అస్తాత్. ‘ పూర్వాధరా × × ×’ (పా-౫-౩-౩౯) అను సూత్రమునుబట్టి ‘పూర్వ’అనునది “ పురమై” “ అస్తాతిచ” (పా-౫-౩-౪౦) అనుసూత్రమువలన “ అస్తాత్”తో కలుపబడినది. “ అస్తాత్” అను ప్రత్యయము “ దిగ్దేశకాలపరాత్ పూర్వశబ్దాత్ ప్రథమా పంచమీసప్తమ్యర్థే” వచ్చుననిచెప్పబడినది. (తారానాథవాచస్పతి ౪౩౬౮) కావున పురస్తాత్ అనుపదమునకు ప్రాచీనదిక్కునుంచియనియు పూర్వకాలమునుంచియనియు అర్థములు సిద్ధించుచున్నవి.

దేవేభ్యః శబ్దము విబుధులయందు వర్తిల్లును. “ దేవైఃవిబుధైః” అనిఋగ్వేదముయొక్క మధ్వాచార్యభాష్యమందు వ్రాయబడినది. (మండలం ౧-౧-౫) దేవశబ్దార్థమునుగూర్చి మాచేనివ్వబడిన యుపన్యాసమును చూడుడు.

"ఆసదే"=ఆసాదయితవ్యం (భట్టభాస్కర యజుర్వేదభాష్యము ౧.౧-౨)

ఈప్రథమమంత్రము మూడుపాదములుగల త్రిష్టుప్ ఛందస్సు (విద్యారణ్యభాష్యం ౧-౧-౧౩)

ఈమంత్రముయొక్క వినియోగసూత్రము "ప్రేయమగాదిత్త్యుక్త్వో ర్వంతరిక్షమన్విహీతి ప్రాచీముదీచీంవాదిశమభిప్రవ్రజ్యాయతః కుతశ్చిద్దర్భ మయంబర్హిరాహరతి" (ఆపస్తంబశ్రౌతము ౧-౩-౫) ఈవినియోగమునుబట్టి యాలోచించగనెచ్చటవిద్యారూపమైనబర్హిస్సుకలదో అచ్చటకుపోయి దానిసంపాదించవలయునని తోచుచున్నది. బర్హిశ్శబ్దమునకు రెండర్థములు కలిగియుండుటవలన కర్మార్థమందు దర్భమయమైనబర్హిస్సుఅని ఈసూత్రమందు వ్రాయబడినది జ్ఞానార్థమందు విద్యారూపమైన బర్హిస్సు అని చెప్పబడినది.

---

## ౪. (౧) దేవానాం పరిషూతం అసి.

## (౨) వర్షవృద్ధం అసి.

### జ్ఞానార్థము.

టీ॥ (౧) దేవానాం=విబుధులకు, పరిషూతం=(ఓబ్రహ్మవిద్యా నీవు) గ్రహింపబడుచున్నదానవు, అసి=అగుచున్నావు.

టీ॥ (౨) (ఓబ్రహ్మవిద్యానీవు) వర్షవృద్ధం=ఓషధివి, అసి=అగుచున్నావు.

తా॥ (౧) ఓబ్రహ్మవిద్యానీవు విబుధులప్రయోజనముకొరకు గ్రహింపబడుచున్నదానవగుచున్నావు.

తా॥ (౨) ఓషధులు శరీరపీడను ఎటుల నశింపచేయుచున్నవో అటుల ఆత్మపీడను ఓబ్రహ్మవిద్యా నీవు నశింపచేయుచున్నావు.

### కర్మార్థము.

టీ॥ దేవానాం = [ఓదర్భ-సముదాయమానీవు] దేవతల నిమిత్తము, పరిషూతం = పరిగ్రహింపబడుచున్న దానవు, అసి=అగుచున్నావు.

టీ॥ (౨) వర్షవృద్ధం = వర్షముచేత తిరిగీవృద్ధినొందుదానవుగా, అసి=అగుచున్నావు.

వినియోగము ॥ ఈ మంత్రముచెప్పి దర్భలనుకోయుటకుముందుస్పృశించవలయును.

---

వివరణము ॥ వినియోగానుసారముగ విద్యారణ్యభాష్యమందు ఇది ఏకమంత్రముగవ్రాయబడినది. అయినను బ్రాహ్మణమనుసరించి రెండుమంత్రములుగ నిచ్చటవిభజింపబడినది.

దేవశబ్దముయొక్క అర్థమునుగూర్చి ౧-౧-౨-౩ మంత్రవివరణ చూడుము. "వర్షవృద్ధమసీత్యాహ। వర్షవృద్ధాహ్యోషధయః" (తై. బ్రా. ౩-౨-౫) ఇందుకు వినియోగసూత్రము "దేవానాంపరిషూతమసీతిదర్భాన్పరిషౌతి" (ఆపస్తంబశ్రౌతము ౧-౩-౬)

## ౫. దేవబర్హిః మా త్వా అన్వక్ మా తిర్యక్

### జ్ఞానార్థము.

టీ॥ దేవబర్హిః, దేవ= విబుధులకు ప్రియమైన, బర్హిః = ఓబ్రహ్మవిద్యా, త్వా =నిన్ను, అన్వక్ = నిలువుగాను, మా =హింసించను, తిర్యక్=అడ్డముగాను, మా=హింసించను.

తా ॥ ఓబ్రహ్మవిద్యా నేను నీకు అడ్డముగను నిలువుగను ప్రవర్తించుటచే అనగా అక్రమపు మార్గముచే నెటువంటి యుల్లంఘనను కలుగచేయను.

### కర్మార్థము.

టీ॥ దేవబర్హిః=దేవతలకు ప్రియమైన ఓదర్భా, త్వా=నిన్ను, అన్వక్ = నిలువుగా [కోయుటచేత], మా= [హింసించను], తిర్యక్ = అడ్డముగా [కొయ్యుటచేత], మా=హింసించను.

వినియోగము ॥ ఈ మంత్రము చెప్పి కావలసినదర్భను గ్రహించవలయును.

వివరణము॥ ఈమంత్రముయొక్క బ్రాహ్మణము పైచెప్పినయర్థమును స్పష్టముచేయుచున్నది. "దేవబర్హిరిత్యాహ। దేవేభ్య ఏవైనత్కరోతి" (తై. బ్రా. ౩-౨-౫) అనగాదీనినిదేవతలకొరకు చేయుచున్నాను, సత్కర్మప్రవర్తనయందుపయోగించుచున్నాను. "మాత్వాన్వఙ్మాతిర్యగిత్యాహాహింసాయై" (తై. బ్రా. ౩-౨-౨-౫) అనగా హింసకొరకు కాదు, దుర్మార్గ ప్రవర్తనకొరకుకాదు, బ్రహ్మవిద్యను గ్రహించి యక్రమముగ ప్రవర్తించువాడు ఆవిద్యను ఘాతచేసినవాడని తెలియబడును.

కర్మయందు "విష్ణోఃమొదలు పూష్ణోహస్తాభ్యాం" వరకు కొన్ని మంత్రములను ఇతరశాఖలనుంచి తీసుకొనివచ్చి వినియోగ శ్రౌతమందు వ్రాయుట యావశ్యకమైనది. ఇందువలన ఈ వేదమునకు కేవల కర్మార్థబోధకము కాదని తెలియదగును. కేవల కర్మార్థబోధకమైన యెడల కర్మకు కావలసిన యన్ని మంత్రములు ఇచ్చటనేయుండుట సిద్ధించును.

ఇందుకు వినియోగసూత్రము "దేవబర్హిః ర్మాత్వాన్వఙ్మాతిర్యగితి సంయచ్ఛతి" (ఆపస్తంబశ్రౌతం ౧-౩-౧౨)

వేదమందు ఉపమాద్యలంకారములు ఉన్నట్లు శంకరాచార్య ప్రభృతులు వ్రాసియున్నారు. సాహిత్యరత్నాకరాది గ్రంథములయందు చూడవలయును. ఈ మంత్రమందును మరి యనేక మంత్రములయందును ఉపమాలంకారము కలదు.

## ౬. పర్వ తే రాధ్యాసం.

**జ్ఞానార్థము.**

టీ ॥ (ఓ బ్రహ్మవిద్యా) తే=నీయొక్క, పర్వ=అంకురములను, రాధ్యాసం=వృద్ధిపొందించుచున్నాను.

తా ॥ ఓ బ్రహ్మవిద్యా నిన్ను నేను ఏరీతిగా వ్యాపకము చేయుదునో ఆరీతిగ నాబుద్ధియందు స్థాపనచేయుచున్నాను. అనగా గ్రహించుచున్నాను.

**కర్మార్థము.**

టీ ॥ తే=నీయొక్క, పర్వ=[తిరిగి చిగిరించుటకు స్థానమైన] కణుపు, రాధ్యాసం=నష్టముకాకుండా నిలిపెదను.

వినియోగము ॥ ఈమంత్రము చెప్పి కత్తిని దర్భకు తాకించవలయును.

వివరము ॥ వేదము వృక్షమువంటిదనియు అనేక శాఖలుగలదనియు ప్రసిద్ధి. పర్వ అనుశబ్దము "పర్వపూరణే" అను ధాతువు వలన వ్యుత్పన్నమైనది. అనగా ప్రరోహస్థానము. విద్య కణుపులవంటిది తగిన దోహదము మొదలగు కార్యముల వలన కణుపులలోనుంచి అనేక కొమ్మలు ఆకులు పువ్వులు కాయలు మొదలగునవి పుట్టి వికసించునటుల మనము కొంచము విద్యను సంపాదించినను మననము మొదలగువానిచే విద్యను అనేకవిధముల వృద్ధిపొందించవచ్చును. బ్రహ్మ విద్యయను బర్హిస్సును వృద్ధిపొందించుటనుగూర్చి ౫, ౬, మంత్రములకు సముదాయముగ విద్యారణ్యులవారు చెప్పినదేమనగ "హేదేవబర్హిస్త్వాం అన్వక్ తిర్యగపి మాహింసిషం కింతు యేనతవ పర్వపునః ప్రరోహస్థానం అవినష్టం యథా భవతి తథా స్థాపయామి" చెన్నపట్టణంకూర్పు పుట. ౪ - ౭) ఇందుకు బ్రాహ్మణము "పర్వతేరాధ్యాసమిత్యాహ" (తై. బ్రా. ౩-౨-౨-౫) ఈమంత్రమునకు వినియోగ సూత్రము "పర్వతేరాధ్యాసమిత్యధినిదధాతి" (ఆపస్తంబశ్రౌతము ౧-౩-౧౩) రాధ్యాసమను పదము రాధవృధా అను ధాతువువలన వ్యుత్పన్నమైనది.

## ౭. ఆ చ్ఛేత్తా తే మా రిషం.

**జ్ఞానార్థము.**

టీ ॥ ఆ+ఛేత్తా=లెస్సగా గ్రహించువాడనైనను, తే=నీకు, మా+రిషం=హానిచేయను.

తా ॥ ఓ విద్యానిన్ను నేను గురువు వలన గ్రహించినను అట్టి విద్య ఆయనకు తగ్గక నుండును.

**కర్మార్థము.**

టీ ॥ ఆచ్ఛేత్తా=[నేను] కోయువాడనైనను, తే=దేవతలకు ప్రియమైన ఓ దర్భా]నీకు, మారిషం=హింసచేయను.

వినియోగము ॥ ఈమంత్రము చెప్పి దర్భను కోయ్యవలయును.

వివరము ॥ విద్యాధనమునకును ఇతరధనములకును భేదము ఈమంత్రము వలన స్పష్టముగ తెలియచేయబడుచున్నది. ఇతర ధనములు ఎవరికైన నిచ్చుటవలన పరిగ్రహీతకు అధికము, దాతకు తగ్గుటయు సంభవించును. విద్యావిషయమైన దానము చేయుటవలన ప్రతిగ్రహీతకు దాతకు ఇద్దరికిని వృద్ధియేగాని యెవరికిని తగ్గదు. కావుననే యిట్టి విద్యాధనమును ఇచ్చువానికిగాని పుచ్చుకొనువానికిగాని నాశనములేదని యీమంత్రముయొక్క బ్రాహ్మణము చెప్పుచున్నది.

“ఆచ్ఛేత్తా తేమారిషమిత్యాహ। నాస్యాత్మనోమీయతే” (తై-బ్రా-3-౨-౨౫) కావున సమస్తమైనవారు విద్యాధనమును దానము చేయవలయును. ఈమంత్రముయొక్క వినియోగసూత్రము “ఆచ్ఛేత్తా తేమారిషమిత్యాచ్ఛినత్తి” (ఆపస్తంబ శ్రౌతం ౧. 3. ౧౪).

## ౮. దేవబర్హిః శతవల్శం విరోహ.

### జ్ఞానార్థము.

టీ ॥ దేవ = విబుధులకు ప్రియకరమైన, బర్హిః = బ్రహ్మవిద్యా, శతవల్శం = అనేకశాఖలుగ, విరోహ = విశేషముగ వృద్ధినొందుము.

తా ॥ ఓబ్రహ్మవిద్యా నీవు విస్తారముగ నంతటవృద్ధినొందుము.

### కర్మార్థము.

టీ ॥ దేవబర్హిః = దేవతలకు ప్రియమైన ఓదర్భా, శతవల్శం = నూరుశాఖలుగా, విరోహ = అంకురింపుము-

వినియోగము ॥ ఈమంత్రముచెప్పి దర్భలయొక్క మొదళ్లను స్పృశించవలయును.

వివరణము॥ ‘శతం’ అనుశబ్దము అనేకమను అర్థమందుచెప్పబడినది. (వేదనిఘంటువు 3-౧) వల్శంఅనుపదమునకు శాఖార్థమని విద్యారణ్యులవారును, ప్రరోహములని భట్టభాస్కరాచార్యులవారును, వ్రాసియున్నారు. ఈశబ్దము ఏధాతువువలన వ్యుత్పన్నమైనదియుఁనే గ్రంథమందు కనిపించలేదు. వి=అంతట, అతిశయముగ. ‘రోహ’ అనుపదము “రుహ బీజజన్మని ప్రాదుర్భావేచ” అనుదానివలనవ్యుత్పన్నమైనది. మనుజులు సంతానవృద్ధిచే వ్యాపకులైనటుల బ్రహ్మవిద్యయు వృద్ధిపొందియనేకరీతులవ్యాపించియుండవలయునను అర్థము బ్రాహ్మణముబోధించుచున్నది- “దేవబర్హిశ్శతవల్శం విరోహేత్యాహ ××× ప్రజానాంప్రజననాయ” (తై. బ్రా. 3-౨-౨-౬) ఇందుకు వినియోగసూత్రము “దేవబర్హిశ్శతవల్శంవిరోహేత్యాలవానభిమృశతి” (ఆపస్తంబశ్రౌతము ౧-౪-౮).

## ౯. సహస్రవల్శాః వి వయం రుహేమ.

జ్ఞానార్థము.

టీ॥ వయం=మేము, సహస్రవల్శాః=అనేకశాఖలుగలవారుగ, వి+రుహేమ=అతిశయముగ వృద్ధిపొందుదుము.

తా ॥ ఓబ్రహ్మవిద్యా నిన్ను అధ్యయనముచేయుటవలన మేము మాపుత్రపౌత్రులుఅనేకవిధములుగవృద్ధిబొందెదము.

కర్మార్థము,

టీ॥ వయం=మేము, సహస్రవల్శాః=వెయ్యిశాఖలుగ, వి+రుహేమ = వృద్ధినొందెదము.

వినియోగము॥ ఈమంత్రముచెప్పి తన హృదయమును స్పృశించవలయును.

వివరము ॥ సహస్రపదము బహునామములయందు పఠింపబడినది. (వేద నిఘంటువు ·3-౧) ‘‘సహస్రవల్శాః’’ అని మైత్రాయణీ సంహితయొక్క కొన్నిస్థలములయందు కనిపించుచున్నది (జర్మన్ కూప్పపుట ౨. పరా ౧) బ్రహ్మవిద్యపొందువారు భగవదనుగ్రహమువలన విస్తారముగవృద్ధిపొందుదురనియెడియాశీర్వాదమును బ్రాహ్మణముచెప్పుచున్నది.‘‘సహస్రవల్శావివయగ్ంరుహేమేత్యాహ। ఆశిషమేవైతామాశాస్తే’’(తై.బ్రా. 3-౨-౨-౬) ఇదిఏకపదాత్రిష్టుప్(విద్యారణ్యభాష్యం ౧-౧-౧3) ఈమంత్రమందు ౧౧ అక్షరములుగలవు. ఇందుకు వినియోగసూత్రము ‘‘సహస్రవల్శావివయంరుహేమేత్యాత్మానం’’ (ఆపస్తంబశ్రౌతము ౧-౪-౯)

## ౧౦. పృథివ్యాః సం పృచః పాహి.

జ్ఞానార్థము.

టీ ॥ (ఓబ్రహ్మవిద్యా) పృథివ్యాః = ప్రకృతిసంబంధమైన, సంపృచః=సంపర్కమువలన, పాహి=(మమ్ములు) రక్షింపుము.

తా ॥ ప్రకృతి మమ్ములను బాధించకుండునటుల ఓపరమేశ్వరా జ్ఞానమిచ్చి మమ్ములను రక్షింపుము.

కర్మార్థము.

టీ ॥ పృథివ్యాః = భూమియొక్క, సంపృచః=సంపర్కమువలన, పాహి=రక్షింపుము.

వినియోగము ॥ కోసిన దర్భను భూమిమీద నుంచకుండ నేదైననొక యాధారముమీద నీ మంత్రముచెప్పి యుంచవలయును.

వివరము ॥ పృథివి=ఇహలోకము, ‘‘పృథివ్యాః’’ ఇహలోక సంబంధమైన కామ క్రోధ లోభమోహ మదమాత్సర్యములకు లోబడకుండునటుల జ్ఞానసంపాదనకొరకు నీమంత్రముచే ప్రార్థించుచున్నాడు. కావున బ్రాహ్మణమందు చెప్పినదేమనగ ‘‘పృథివ్యాస్సంపృచః పాహీత్యాహ । ప్రతిష్ఠిత్యై’’ (తై. బ్రా. 3-౨-౨-౬)

కామక్రోధాదులకులోబడినవాడు చెడిపోవుననియు, వాటినిజయించినవాడుస్థిరము గనుండుననియు, తాత్పర్యము. ఇందుకు ఆపస్తంబ వినియోగసూత్రము "పృథివ్యాఃసంపృచఃపాహీత్య నధోనిదధాతి" (ఆపస్తంబశ్రౌతం ౧-౪-౧) కర్మవినియోగముపాఠక్రమముగ చెప్పంబడలేదు. ఈ ౧౦-వమంత్రము ౮-వమంత్రమునకుపూర్వమందే వినియోగింపబడినది.

## ౧౧. సు సంభృ తా త్వా సం భ రామి.

**జ్ఞానార్థము.**

టీ॥ త్వా = (ఓబ్రహ్మవిద్యా) నిన్ను, సు+సంభృతా=బ్రహ్మచేత, సంభరామి =గ్రహించుచున్నాను.

తా ॥ ఓబ్రహ్మవిద్యా నిన్ను భగవదనుగ్రహమువలననుగ్రహించుచున్నాను.

**కర్మార్థము.**

టీ ॥ త్వా=[ఓదర్భసముదాయమా] నిన్ను, సుసంభృతా=యోగ్యమైన ప్రాడుచేత, సంభరామి = సంగ్రహించుచున్నాను.

వినియోగము॥ ఈమంత్రముచెప్పిప్రాడుపై కోసినదర్భలనుంచవలయును.

వివరము ॥ సుసంభృతా అనగ బ్రహ్మయనిబ్రాహ్మణము. "సుసంభృతాత్వా సంభరామీత్యాహ । బ్రహ్మణైవైనత్సంభరతి" (తై-బ్రా 3-౨-౨-౬) "సుసంభృతేతిసుష్టుసంభ్రియతే అనయేతి" (భట్టభాస్కరం ౧-౨-౨) ఈ ౧౧ - ౧౨ మంత్రములనుగూర్చి విద్యారణ్యభాష్యమందు వ్రాయబడినదేమనగ "తత్రపాఠక్రమాదర్థక్రమోబలీయానితి న్యాయేనమంత్రద్వయస్య వ్యత్యాసేన వినియోగకల్పేదర్శితః" అర్థక్రమమునకును పాఠక్రమమునకును భేదముగ నున్నదని చెప్పుట వలన పాఠమందు కించిద్దోషారోపణ కలుగుచున్నది. అయితే జ్ఞానార్థమందు పాఠవ్యత్యములేకనే యర్థముచెప్పనగును. కల్పమునకంటె బహు ప్రాచీనమైన బ్రాహ్మణము పాఠవ్యత్యయములేకనే వ్యాఖ్యానము చేయుచున్నది. బ్రాహ్మణంతు పాఠక్రమేణైవవ్యాచష్టే" అని విద్యారణ్యులవారే చెప్పియున్నారు. ఇట్టి బ్రాహ్మణమునననుసరించి చెప్పబడిన, జ్ఞానార్థములేదనియు కేవలకర్మార్థమే కలదనియెడివాదమెంతనిర్వహింపతగినది పక్షపాతములేకుండ మీరేయోచించుడు. ఇందుకు వినియోగసూత్రము "సుసంభృతాత్వా సంభరామీతితస్మిన్నిధనాని సంభృత్య" (ఆపస్తంబశ్రౌతము ౧-౪-౧౨)

## ౧౨. అదిత్యై రాస్నా అసి.

**జ్ఞానార్థము.**

టీ॥ అదిత్యై= (ఓవేదమాసీవు) అఖండమైన పరబ్రహ్మయొక్క, రాస్నా=శబ్దము, అసి=అగుచున్నావు.

తా॥ ఓవేదమాసీవు పరబ్రహ్మసంబంధమైన దానవు.

**కర్మార్థము.**

టీ॥ అదిత్యై= [ఓత్రాడాసీవు]భూమికి, రాస్నా=మొలత్రాడువు, అసి=అగుచున్నావు.

వినియోగము॥ దర్భలను త్రాడుమీదనుంచడమునకుపూర్వము ఈమంత్రము చెప్పి యుత్తరాగ్రముగ త్రాడునుపరచవలయును.

వివరము॥ అదితిశబ్దమునకర్థము అఖండనీయాః (భట్టభాస్కరము ౧-౧-౨) అనగ అంతములేనివాడు, అనంతుడు ‹‹ అదితిరదీనా›› (నిరుక్తం ౪-౪-౧) అనగ దీనముకానిది, ‹‹ దిజ్ క్షయే››అనుధాతువువలన వ్యుత్పన్నమైనది. ‹‹ సకలప్రపంచ ధారణేప్యదీనాన స్వీద్యతే››(వేదనిఘంటువు ౧-౧-౪) అదితిశబ్దము కర్మార్థమందుభూమియని చెప్పబడినది. అయితె ఖండనలేనిదియు, క్షీణించనదియు, సర్వప్రపంచమునుధరించునట్టి లక్షణముకలది భూమియో, భగవంతుడో మీరే యోచించుడీ. ముఖ్యమైనయర్థము భగవంతునియందె చెందవలసినది. గౌణార్థము భూమి సూర్యుడు మొదలుగునవి. అదిత్యై చతుర్థీవిభక్తి. షష్ట్యర్థేచతుర్థీ (భట్టభాస్కరం ౧-౧-౨) ‹‹అదిత్యారాస్నాసీ››అనిషష్ఠీరూపముగమైత్రాయణీలు పఠించుచున్నారు. రాస్నా అనుశబ్దము రసధాతువవలన వ్యుత్పన్నమైనది. రాస్నాసాస్నాస్థూణా వీణాః (ఉణాదిసూత్రం 3-౧౫) రసపద్దే ఆస్వాదనస్నేహనయోః అనిధాతుపాఠము. ఇందుకు వినియోగము ‘‘అదిత్యైరాస్నాసీత్యుదగగ్రంవితత్య’’(అపస్తంబశ్రౌతము ౧-౪-౧౨)

## ౧౩. ఇంద్రాణ్యై సంనహనం.

**జ్ఞానార్థము.**

టీ॥ (ఓబ్రహ్మవిద్యానిన్ను)ఇంద్రాణ్యై=ముక్తికి, సన్నహనం=(ముముక్షువును) పొందించుచున్నదానవు(అగుచున్నావు)

తా॥ మోక్షేచ్ఛతో భగవంతునిధ్యానముచేయు వానిని ఓ బ్రహ్మవిద్యా నీవు మోక్షమును పొందించుచున్నావు.

**కర్మార్థము.**

టీ॥ సన్నహనం=(దర్భలనుత్రాడుచేత)బిగించడము,ఇంద్రాణ్యై=ఇంద్రాణిదేవికి ప్రియమైనది.

వినియోగము॥ ఈ మంత్రము చెప్పి త్రాటిచే బంధించవలయును.

వివరము ॥ "ఇది పరమైశ్వర్యే" అనుధాతువువలన వ్యుత్పన్నమైన ఇంద్ర శబ్దము భగవత్పరము. ఇందుకుప్రమాణము. "ఇంద్రంమిత్రంవరుణమగ్ని మాహురథో దివ్యఃససుపర్ణోగరుత్మాన్ × × ×" (ఋగ్వేదము౧.౧౬౪.౪౬)ఇంద్రసంబంధమైనది ఇంద్రాణీ అనగా మోక్షలక్ష్మి లేక ముక్తి. (పాణిని ౪. ౧. ౪౯) ఇంద్రాణ్యై షష్ట్యర్థేచతుర్థీ (భట్టభాస్కరం ౧-౧-౨) "ఇంద్రాణ్యాస్సన్నహనం" అనిమైత్రాయణులు ఉచ్చరించుచున్నారు. (౧-౧-౧)"సన్నహ్యతీతిసన్నహనం" సంయమనం (భట్టభాస్కరం ౧-౧-౧) "(ణహ) నహ=బంధనే" అనుధాతువువలన "నహనం" వ్యుత్పన్నమైనది. నహనం=పొందించునది. ఇందుకువినియోగసూత్రము "ఇంద్రాణ్యైసన్నహనమితి సన్నహ్యతి" (ఆపస్తంబశ్రౌతం ౧-౪-౧౨)

---

## ౧౪. పూషాతె గ్రంథిం గ్రథ్నాతు.

జ్ఞానార్థము-

(ఓబ్రహ్మవిద్యా) తే=నీయొక్క, గ్రంథిం=ప్రాప్తిని, పూషా =భగవంతుడు, గ్రథ్నాతు=సంఘటనచేయుగాక.

తా ॥ బ్రహ్మవిద్యను నేను పొందునటుల, భగవంతుడు సంఘటనచేయుగాక.

కర్మార్థము.

టీ ॥ తే=[బిగించబడినత్రాడా]నీకు, పూషా=పోషకుడైనదేవుడు, గ్రంథిం=ముడిని, గ్రథ్నాతు=వేయుగాక.

వినియోగము ॥ ఈమంత్రముచెప్పి త్రాడును ముడివెయ్యవలయును.

---

వివరము ॥ పూషాఅనగా'పోషకో దేవః' విద్యారణ్యభాష్యం. పూషా=పుష్టిః =పుష్టః, సర్వధాసంపూర్ణత్వాత్ పుష్టః (శంకరభాష్య సహస్రనామములు శ్లోకం ౫౪) అనగ భగవంతుడు. పూష అనునది "పుషపుష్టౌ" అను ధాతువువలన వ్యుత్పన్నమైనది. సర్వార్థపోషణాత్పూషా (వేదనిఘంటువు ౧-౧-౧౯) "పుష్టిర్వైపూషా"(మైత్రాయణీసంహిత ౪-౧-౨) గ్రంథిం "గ్రంథసందర్భే"అనుధాతువువలనవ్యుత్పన్నమైనది. ఈమంత్రముయొక్కయర్థముబ్రాహ్మణమందు చెప్పినదేమనగ "పూషాతెగ్రథింగ్రథ్నాత్వితాహ। పుష్టిమేవయజమానేదధాతి" (తై. బ్రా. 3-౨-౨-౧3) అనగ భగవంతుడు (బ్రహ్మజ్ఞానమును) భక్తునికి సంపూర్తిగనిచ్చుగాక. ఇందుకు వినియోగసూత్రము "పూషా తెగ్రథంగ్రథ్నాత్వితిగ్రంథింకరోతి" (ఆపస్తంబశ్రౌతం ౧ - ౪ - ౧3)

(౪)

## ౧౫. సః తే మా అస్థాత్

**జ్ఞానార్థము.**

టీ ॥ (ఓబ్రహ్మవిద్యా) తే=నీయొక్క, సః = అట్టిప్రాప్తి, మా + ఆ + స్థాత్ =(హింసకొరకు) కాకపోవుగాక-

తా ॥ ఓబ్రహ్మవిద్యా నిన్ను గ్రహించియు పాపము చేయువానికి నధికనిత్య. సంభవించును గనుక నట్టి హింసనాకు సంభవించక పోవుగాక.

**కర్మార్థము**

టీ ॥ తే=(ఓదర్భా) నీవు, సః =(నిబంధకరమైన) ఆత్రాటిముడి, మా స్థాత్ = (చిరకాలము) ఉండకపోవుగాక.

వినియోగము ॥ ఈమంత్రము చెప్పి త్రాడుయొక్క కొనలను ముడియందు గుచ్చవలయును.

వివరము ॥ అజ్ఞానికంటె జ్ఞాని పాపమందు ప్రవర్తించిన యెడల వానికి నధిక నరకప్రాప్తియగునని సర్వమతసిద్ధాంతము వేదాధ్యయనము చేసియు అక్రమమందు ప్రవర్తించిన యెడల నెక్కువహింసకు కారణమాను గనుక క్రమప్రవర్తనయందు సంచరించుట యావశ్యకమని యీమంత్రము బోధించుచున్నది ఈ అర్థమునే బ్రాహ్మణమున్ను తెలియచేయుచున్నది. "సతేమాస్థాదిత్యాహ । అహింసాయై" (తై-బ్రా-3-౨-౨-౭) "సతేమాస్థాదితియజమానస్య అహింసాయై" (మైత్రాయణీయసంహితా ౪-౧-౨) ఈమంత్రవిషయమై భట్టభాస్కరమంగు చెప్పబడినదేమనగ "ప్రదేశాంతరమాతిష్ఠత్" (౧-౧-౨) ఇందుకు వినియోగసూత్రము "సతే మాస్థాదితి పురస్తాత్ప్రత్యఞ్చం గ్రంథిముపగూహతి పశ్చాత్ప్రాఞ్చంవా" (ఆపస్తంబశ్రౌతము. ౧-౪-౧౪)

## ౧౬. ఇంద్రస్య త్వా బాహుభ్యాం ఉత్ యచ్ఛే.

**జ్ఞానార్థము.**

టీ ॥ త్వా=(ఓబ్రహ్మవిద్యా) నిన్ను, ఇంద్రస్య=భగవంతునియొక్క, బాహుభ్యాం= బాహువులచేతను, ఉత్+యచ్ఛే=ఊర్ధ్వలోకప్రాప్తికొరకు గ్రహించుచున్నాను.

తా ॥ ఓబ్రహ్మవిద్యా నిన్ను భగవంతునకు బాహువులైన ఋక్ సామముల చేత స్వర్గప్రాప్తినిమిత్తము గ్రహించుచున్నాను.

**కర్మార్థము.**

టీ ॥ ఇందుకు అర్థము విద్యారణ్యమందు మృగ్యము.

వినియోగము ॥ ఈమంత్ర చెప్పి దర్భనెత్తుకొన వలయును.

వివరము ॥ బ్రహ్మవిద్య వేదమువలన తెలియబడుచున్నదను సంగతి ప్రసిద్ధము. "తస్య యజురేవ శిరః । ఋగ్దక్షిణః పక్షః । సామోత్తరః పక్షః" (తై. ఉపనిషత్తు ౨-3) అనగ, యజుస్సు పరబ్రహ్మకు శిరస్సనియు, ఋక్కు కుడిబాహువనియు, సామ మెడమబాహువనియు నారోపించబడినది. ఋక్కు సామ యజుస్సులయొక్క సముదాయముచేత బ్రహ్మవిద్య సంపాదింపవలయునని యీమంత్రము, ౧౭ - వమంత్రము చెప్పుచున్నవి. ఇందుకు వినియోగసూత్రము "ఇంద్రస్యత్వా బాహుభ్యాము ద్యచ్ఛ ఇద్యచ్ఛతే" (ఆపస్తంబశ్రౌతము ౧-౪-౧౫).

౧౭. బృహస్పతేః మూర్ధ్నా హరామి.

జ్ఞానార్థము.

టీ ॥ బృహస్పతేః=(ఓబ్రహ్మవిద్యా) బ్రహ్మయొక్క, మూర్ధ్నా = శిరస్సుచేతను, హరామి=పొందుచున్నాను.

తా ॥ ఓబ్రహ్మవిద్యా బ్రహ్మయొక్క శిరస్సువంటి యజుస్సుచే నిన్ను పొందుచున్నాను.

కర్మార్థము.

టీ ॥ ఇందుకర్థము విద్యారణ్యమందు మృగ్యము.

వినియోగము॥ ఈమంత్రము చెప్పి దర్భలను తలపైనుంచుకొనవలయును.

వివరము.॥ బృహస్పతియనగ బ్రహ్మయని తైత్తిరీయ బ్రాహ్మణమందు చెప్పబడ్డది "బృహస్పతేర్మూర్ధ్నా హరామీత్యాహ బ్రహ్మవై దేవానాం బృహస్పతిః" (తై. బ్రా. 3 - ౨ - ౨౮) యజుస్సు బ్రహ్మయొక్క శిరస్సని పూర్వమంత్రమందు చెప్పబడ్డది. "తస్యయజురేవశిరః" ఇందుకువినియోగసూత్రము "బృహస్పతేః మూర్ధ్నా హరామీతిశీర్షంనధినిధత్తే" (ఆపస్తంబశ్రౌతము ౧-౪-౧౫)

౧౮. ఉరు అంతరిక్షం అను ఇహి.

జ్ఞానార్థము.

టీ॥ (ఓబ్రహ్మవిద్యా నీవు) ఉరు=అనేకములైన, అంతరిక్షం=ఆత్మలను, అన్విహి=పొందుము.

తా॥ ఓబ్రహ్మవిద్యా నీవు అనేకాత్మలనుపొంది యందరికిని ముక్తిని కలుగచేయుము.

కర్మార్థము.

టీ ॥ ఉరు = (ఓదర్భా) విస్తీర్ణమైన అంతరిక్షం = ఆకాశము, అన్విహి = (గమనమునకు) అనుకూలముగా వెడలుము.

వినియోగము ॥ ఈమంత్రమునకు ప్రత్యేకము వినియోగ మాపస్తంబులవారిచే చెప్పబడలేదు.

వివరము ॥ "ఉరు" అనునది బహునామములయందుపఠించబడినది (వేదనిఘంటువు ౩-౧) అంతరిక్షనామాత్మా (యజుర్వేదారణ్యకము ౩-౪). ఉరు అను విశేషణముచే నంతరిక్షం అనుశబ్దము జాత్యేకవచనమని యెంచదగును. "ఇణు" అను ధాతువువలన "ఇహి" వ్యుత్పన్నమైనది ఈమంత్రమునుగూర్చి బ్రాహ్మణమందు చెప్పినదేమనగ "ఉర్వంతరిక్షమన్విహీత్యాహ గత్యై" (తై. బ్రా. ౩-౨-౨-౧౫) ఇందుకు వినియోగసూత్రము "ప్రేయమగాదుర్వంతరిక్షమన్విహీతియాగమనాతా ప్రత్యాయనా" (ఆపస్తంబశ్రౌతము ౧-౫-౧) ప్రేయమగాదనెడి ౩-వ మంత్రము ఉర్వంతరిక్షమన్విహీయనెడి ౧౮-వమంత్ర మీరెండుమంత్రములు కలిపి దర్భనిమిత్తముపోవుసమయమునతిరిగివచ్చుసమయమున చెప్పవలయునని యాపస్తంబులవారు చెప్పియున్నారు. ఈసూత్రభాష్యమునుపట్టియు ౨-మంత్రములనుకలిపియే వినియోగము చెప్పవలయును. ఈవిషయమై రుద్రదత్తభాష్యమందు చెప్పబడినదియేమనగా "యాభ్యామేతాభ్యాంప్రాగ్గమనముక్తంప్రత్యాగమనేపిద్వావపితౌభవతః" (కలకత్తాకూర్పుపుట ౧౬) అయితే విద్యారణ్యభాష్యమందు "కల్పఃఉర్వంతరిక్షమన్విహీతి ఏతి" (చెన్నపట్టణంకూర్పు ౫౧) వ్రాయబడినది. ఈభాష్యమున కొంతవరకు బోధాయన ఆపస్తంబసూత్రముల ననుసరించి వినియోగము తెలియచేయుచు ౭-వ మంత్రముక్రింద "ఇతఊర్ధ్వంయత్రద్వయోర్విశేషాభావః తత్రాన్యతరస్యైవ వినియోగఉదాహరిష్యతే" (విద్యారణ్యభాష్యం పుట ౪౮) అని వ్రాయబడినది కావున కల్పః అనునది ఆపస్తంబము ననుసరించి చెప్పబడునటుల నెంచవలయును. అయితే ఆపస్తంబసూత్రము ఇందుకు వేరుగ నుండుటవలన ఆపస్తంబ సూత్రము ననుసరించి వినియోగము ప్రత్యేకములేదని వ్రాయబడినది. ఇది ఏకపదాగాయత్రి.

## ౧౯. దేవంగమం అసి.

### జ్ఞానార్థము.

టీ ॥ (ఓబ్రహ్మవిద్యా నీవు) దేవంగమం=విబుధులనుపొందించేదానవు, అసి=అగుచున్నావు.

తా ॥ ఓబ్రహ్మవిద్యా నిన్నుగ్రహించి క్రమముగసంచరించువానిని నీవుస్వర్గప్రాప్తికలుగచేయుచున్నావు.

### కర్మార్థము.

టీ ॥ ఇందుకు అర్థము విద్యారణ్యమందువ్యగ్యము.

వినియోగము ॥ ఈమంత్రముచెప్పిదర్భను ఉపరిభాగమందుంచవలయును.

వివరము ॥ ఈమంత్రమునుగూర్చి విద్యారణ్యుల వారు వ్రాసిన దేమనగ "తస్యశబ్దస్యాభిప్రాయందర్శయతి" (చెన్నపట్టణంకూర్పుపుట ౫౧) తదనంతరం

ఈమంత్రముయొక్క బ్రాహ్మణముగ్రవ్రాసినారు "దేవంగమమసీత్యాహ । దేవాన్నేవై సర్గమయతి" (తై. బ్రా. 3-౨-౨౯) అనగ భగవద్భక్తులనేస్వర్గలోకమును పొందించును. ఈ యర్థమునే పైవాక్యము తెలియచేయుచున్నది. "ఉపరీవనిదధాతి" అనగా నీయొక్కచిత్తమును పైగానేయుంచవలసినది. ఉపరీ యనగ స్వర్గలోకము. "ఉపరీవహీ సువర్గలోకః" ఆ సువర్గలోకమును గూర్చి మనసుంచిన స్వర్గలోకప్రాప్తియగును. "సువర్గలోకస్యసమష్ట్యై" (తై. బ్రా. 3-౨-౨-౯) ఇందుకు వినియోగసూత్రము "దేవంగమసీత్యనధోనిదధాతి । యథాప్రాగుపసాదయేత్" (ఆపస్తంబశ్రౌతము ౧-౫-౪)

---

## రెండవయనువాకమునుగూర్చి సామాన్యవిషయములు.

ప్రథమానువాకమందు మనుజులు క్రమముగ ప్రవర్తించుటను గూర్చియు భగవద్ధ్యానమునుగూర్చియు చెప్పబడినది. అందుకు సాధనమైన జ్ఞానమును సంపాదించుటనుగూర్చి రెండవ యనువాకమందు చెప్పబడినది. వేదముఅనుపదము 'విద జ్ఞానే' అనుధాతువువలన వ్యుత్పన్నమైనది. కావున వేదము, జ్ఞానము, బ్రహ్మవిద్య, అభేదముగ నీయనువాకమందుపయోగింపబడినవి.

ఈ అనువాకము మైత్రాయణీ సంహితయొక్క ద్వితీయానువాకముతో చాల సంబంధించియున్నది. ఈ అనువాకము వాజసనేయసంహితయందు గనుపించలేదు.

## రెండవయనువాకసంగ్రహము.

౧. (ఓజ్ఞానమానివు) శ్రేష్ఠమైన కర్మసముదాయమునకు సాధనమగుచున్నావు.

౨. (సత్కార్యములనాచరించుటకు) ప్రతిబంధకము దగ్ధమగుగాక. విఘ్నములు దగ్ధమగుగాక.

౩. ఈ (మనుజునియొక్క) బుద్ధి జ్ఞానమును సంపాదించవలసినది. (ఆబుద్ధి) భగవంతునిచేనిర్మింపబడినదియు (మంచిపదార్థ) భక్షణంచే తీక్షణముగ చెయ్యబడినదియునైయున్నది. మహాఋషులు బ్రహ్మవిద్యను ప్రాచీన కాలమునుంచి గ్రహించుచున్నారు. (ఎందువలననగ) విబుధులకొరకు ప్రియమగునటుల నీలోకమందు బ్రహ్మవిద్యను సంపాదించతగినది.

౪. (ఓబ్రహ్మవిద్యనీవు)విబుధులయొక్క(ప్రయోజనముకొరకు) గ్రహింపబడుచున్న దానవు. నీవు (ఆత్మపీడనుపోగొట్టు) ఓమధివి.

౫. ఓబ్రహ్మవిద్యా నిన్ను అక్రమప్రవర్తనచే నేవిధముగ నుల్లంఘించను.

౬. (అయితే) నీయొక్క యకురించెడి స్థానమును వృద్ధిపొందించుచున్నాను.

౭. నిన్ను (గురువువలన) గ్రహించినను (ఆయనకునిన్ను) తగ్గింపను.

౮. (మరియు) ఓబ్రహ్మవిద్యా నీవనేకశాఖలుగ వృద్ధిపొందుము.

౯. (నిన్ను అధ్యయనము చేయుట వలన) మేమున్ను అనేక శాఖలుగ వృద్ధిపొందెదము.

౧౦. (మరియు) ప్రకృతిసంపర్కమువలనమమ్మలనురక్షింపుము
౧౧. నిన్ను పరమేశ్వరానుగ్రహమువలనగ్రహించుచున్నాను.
౧౨. (ఎందుకనగా) నీవు భగవంతునియొక్క వాక్కువు.
౧౩. నీవు మోక్షలక్ష్మిని సంపాదించుదానవు.
౧౪. భగవంతుడు నిన్ను సంఘటన చేయుగాక.
౧౫. అట్టి సంఘటన నాకు (హానికరము) కాక పోవుగాక.

౧౬. నిన్ను బ్రహ్మయొక్క (ఋక్ సామములనెడి) హస్తములచే గ్రహించు చున్నాను.

౧౭. నిన్ను బ్రహ్మయొక్క (యజుస్సులనెడి) శిరస్సుచే గ్రహించుచున్నాను.

౧౮. నీవు సమస్తమైన యాత్మలం బొందుము.

౧౯. (ఎందుకనగ) నీవు విబుధులను (స్వర్గమును)పొందించుదానవు.

ద్వితీయోఽనువాకస్సమాప్తః.

——:o:○:o:——

☞ ఈసంహిత యనేక గ్రంథములంజూచి యచ్చువేయించ బడినను తగిన శుద్ధప్రతిదొరకక పోయినియు, ముద్రించు స్థలమొకచోటును, మేముండునది మరియొక చోటౌటంజేసియు, నిందు స్ఖాలిత్యములుకలవు. అవి క్రమేపి దెలియచేయబడును. ఇచ్చట కొన్ని మాత్రము దెలియచేయబడుచున్నవి.

| | పేజీ. | అపశుద్ధము. | శుద్ధము. |
|---|---|---|---|
| పీఠిక | ౩ | ౨౧౯౬ | ౨౧౯౮ పనసలు |
| ,, | ,, | ౧౯౨౯౦ | ౧౨౯౨౯౦ పదములు |
| ౭-వ కాండ | ౧౧౮ | ౪౦ | ౪౨ పనసలు |
| ,, | ,, | ౩౩౧ | ౩౩౩ పనసలు |
| ౭-కాండలమొత్తం | ,, | ౨౧౯౬ | ౨౧౯౮ ,, |

ఇందు కాండల యొక్కయు, పన్నముల యొక్కయు, అనువాకములయొక్కయు, పనసలయొక్కయు, మొత్తము సరిచూచియు పదములయొక్కయు, నక్షరములయొక్కయు, మొత్తమీక్రింద నుదహరింపబడినశ్లోకమును బట్టియు నుదహరించడమైనది.

శ్లో॥ సభావర్గకామతాఙ్ఘ్రి కరానాథీరధీరయః ।
జాతుజాలమరార్గకాండార్గ ప్రశ్నానుపపదాక్షరాః॥

# ఓమ్

శ్రీపరబ్రహ్మణేనమః.

కృష్ణయజుర్వేద

# తైత్తిరీయసంహితామంత్రభాగస్య

తృతీయోఽనువాకః.

కాండర్షిః ప్రజాపతిః.

---

## ౧. శుంధధ్వం దైవ్యాయ కర్మణే దేవయజ్యాయై

**జ్ఞానార్థము.**

టీ ॥ దేవయజ్యాయై = దేవపూజయ నెడి, దైవ్యాయ = దేవసంబంధమైన, కర్మణే=కర్మకొరకు, శుంధధ్వం = పరిశుద్ధినొందుడు.

తా ॥ (ఓజనులారా మీరు) మీ అంతఃకరణములను దేవపూజకొరకు పరిశుద్ధమునొందించుడు.

**కర్మార్థము.**

టీ ॥ దేవయజ్యాయై = (ఓ పాత్రలారా) దేవయాగరూపమైనట్టియు దైవ్యాయ = దేవసంబంధమైనట్టియు, కర్మణే=కర్మకొరకు, శుంధధ్వం= పరిశుద్ధ నొందుడు.

వినియోగము ॥ ఈమంత్రముచెప్పి పాత్రములను మఱియును ప్రోక్షించవలయును

---

వివరము॥ఆధ్యాత్మిక(జ్ఞాన)యజ్ఞమునకుకర్మయజ్ఞము సాదృశ్యమైనటుల ఇదివరకువ్రాసిన అంశమువలన స్పష్టమగుచున్నది. మఱియు, చిత్తి అను ఉపనిషత్తు అట్టిసాదృశ్యమును చూపించుచున్నదనియు,స్రుగాదిపాత్రులు అంతఃకరణవృత్తులకు సాదృశ్యములనియు, విద్యారణ్యభాష్యము స్పష్టముగ చెప్పుచున్నది. అదియెట్లన్న ‘‘కేనవిధానేనఆధ్యాత్మికేనేష్టవాన్।తద్యాగవర్తినః స్రుగాదయఃఏతేషుమంత్రేషు ప్రతిపాద్యంతే’’ (ఆరణ్యకం కలకత్తాకూర్పుపుట-౨౮౧) కావున కర్మార్థమందు అధ్యాహారము చేయబడిన పాత్రలు అంతఃకరణములకు సాదృశ్యముగ నెంచతగినది. ఈమంత్రమునకు బ్రాహ్మణము ‘‘శున్ధధ్వం దైవ్యాయకర్మణే దేవయజ్యాయా ఇత్యాహ। దేవయజ్యాయా ఏవైనానిశున్ధతి’’ (తై. బ్రా. 3-౨- 3.) శోధయతీత్యర్థః (విద్యారణ్యభాష్యం) అనగా దేవపూజకొరకు వీటిని పవిత్రము చేయవలసినది. వినియోగమందు ఆపస్తంబులవారు అనేక మంత్రములను ఇతరస్థలములనుంచి తీసుకొనివచ్చినట్లు శ్రౌతసూత్రమువలన స్పష్టముగ కనుపించుచున్నది. శున్ధధ్వంఅనుపదమునుగూర్చి, శుద్ధానిభవత, స్వయమేవాత్మానంశోధయతీతివా, అనిభట్టభా

స్కారులవారు వ్రాసియుండుటంబట్టి పవిత్రముపొందండు, లేక మీఆత్మలను పవిత్రముచేసుకోనండి అని అర్థమువ్రాయబడినది ఇందుకువినియోగ సూత్రము "శుద్ధ్యధ్వం దైవ్యాయ కర్మణ ఇతిత్రిః ప్రోక్ష్యప్రజ్ఞాతే పవిత్రేనిదధాతి" (అపస్తంబశ్రౌతం. ౧- ౧౧- ౧౦)

౨. (౧.) మాతరిశ్వనః ఘర్మ్యః అసి
(౨) ద్యౌః అసి పృథివీ అసి.
(౩.) విశ్వధాయాః అసి పరమేణధామ్నా
(౪.) దృగ్ంహస్వ మా హ్వాః.

జ్ఞానార్థము.

టీ॥ (౧)(ఓపరమేశ్వరా నీవు) మాతరిశ్వనః=వాయువునకు, ఘర్మ్యః = ప్రకాశమైన అంతరిక్షమును ధరించువాడవు, అసి=అగుచున్నావు.

(౨) ద్యౌః= ద్యులోకము ధరించువాడవు, అసి= అగుచున్నావు, పృథివీ = పృథివీలోకము ధరించు వాడవు, అసి=అగుచున్నావు.

(౩) పరమేణ= అతీతమైన, ధామ్నా =సామర్థ్యము చేత, విశ్వధాయాః=ప్రపంచాధారుడవు, అసి= అగుచున్నావు.

(౪)దృగ్ంహస్వ=(మమ్ముల)దృఢము గనుంచుము, మా + హ్వాః=చలించకుము.

తా॥ (ఓపరమేశ్వరా నీవు) సర్వప్రపంచమును అతీతమైనసామర్థ్యముచే ధరించుచున్నావు. నీవు నాకు సుఖాదుఃఖములయందుస్థిరబుద్ధినికలుగచేయుము.

కర్మార్థము.

టీ ॥ మాతరిశ్వనః = (ఓ పాత్రమా నీవు) వాయువుకు, ఘర్మః = [సంచారము చేయుటకు అవకాశము నిచ్చుటచేత] ప్రకాశమైన [అంతరిక్ష లోకరూపముగా] అసి = అగుచున్నావు. ద్యౌః= [ఓపాత్రమానీవు] స్వర్గలోకసంబంధమైన వర్షోదకము చేత నున్న భూలోక సంబంధమైన మంటి చేతనున్న చేయబడినదానవు గనుక స్వర్గలోకరూపముగా, అసి = అగుచున్నావు. పృథివీ = [ఓపాత్రమా నీవు] భూలోకరూపముగా, అసి = అగుచున్నావు, పరమేణ= ఉత్తమమైన, ధామ్నా = సామర్థ్యముచేత, విశ్వధాయాః = [ఓపాత్రమా నీవు]ప్రపంచాధారకమైన [ వర్షరూపముగా] అసి = అగుచున్నావు. దృగ్ంహస్వ = దృఢముగా నుండుము, హ్వాః=భంగము పొందినదిగా, మా = కాకపోగాక.

వినియోగము ॥ ఈ మంత్రము చెప్పి కుంభియను పాత్రమును అంగారముల యందుంచవలయును.

వివరణము ॥ ఈనాలుగు మంత్రములు వినియోగమునుబట్టి ఏకమంత్రముగ విద్యారణ్యభాష్యమందు చేయబడినవి. బ్రాహ్మణము ననుసరించి నాలుగుమంత్రములుగ నిచట విభజింప బడినవి. మాతరిశ్వా నోభుర్మః అనగ అంతరిక్షము. "అంతరిక్షం వైమాతరిశ్వనోభుర్మః" (తై. బ్రా. ౩ ౨ ౩.) పరమేణ తృతీయావిభక్తి "పర" అనుశబ్దమునకు "మ" ప్రత్యయమువచ్చి "పరమ" అయినది. "పర" అనగ అన్యము. లోకమందు నేపదార్థమైనను ధరించుమార్గమువకంటె అతీతమైన రీతిచే భగవంతుడు ప్రపంచమును ధరించుచున్నటుల ఈశబ్దము బోధించుచున్నది. భగవంతుడు సర్వవ్యాపియై ప్రపంచముకంటె భిన్నుడై అశరీరుడై ప్రపంచమును ధరించుచున్నాడు, కావున "పరమేణధామ్నా" అనిచెప్పబడినది. అచేతనమైన పదార్థములు భగవంతునిగా హిందూమతమందు చెప్పబడినవి అని అనగ హిందూమతము వైశ్వదేవమతమును 'Pantheism' నుబోధించుచున్న దని కొందరు అన్యమతస్థులు వాదించుచున్నారు. అట్టివాదము పొరబాటుఅనిన్ని అట్టి సిద్ధాంతము ఆర్షేయముకాదనిన్ని ఈమంత్రము, ఇందుకు వ్యాఖ్యానమైన బ్రాహ్మణము, స్పష్టముగ తెలియచేయుచున్నవి. ప్రస్తుతపు సంస్కృత భాషారీతిని పట్టి వేదముయొక్క అర్థముచెప్పుటవలన ఇట్టి విపరీతార్థములు తోచుచున్నవి. లౌకిక సంస్కృతమునకున్ను వైదిక సంస్కృతమునకున్న విశేషభేదమున్నటుల శ్రీ పాణిని మొదలగువారే చెప్పియున్నారు. "ద్యౌరసిపృథివ్యసి" అనుటవలన ద్యులోకము పృథివీలోకము అని సాధారణార్థము తోచుచున్నదికాని అట్టిఅర్థము కాదనికాండర్షిః అయిన ప్రజాపతిచెప్పుచున్నాడు. "ద్యౌరసిపృథివ్యసీత్యాహ। దివశ్చహ్యేషపృథివ్యాశ్చసంభృతా" (తై. బ్రా. ౩-౨-౩) అనగ, ద్యులోకమునున్ను పృథివీలోకమునున్ను (భగవచ్ఛక్తి) ధరించుచున్నదనితాత్పర్యము. మరియు ౩-వమంత్రము పైచెప్పబడినఅర్థమునే తేటపరుచుచున్నది. కావున ఇటువంటిమంత్రములకు వేదమందుధరించినవాడని అర్థముచెప్పవలసినది కాని అచేతనపదార్థమే చేతనమైనభగవంతుడనిచెప్పి వేదమంత్రములను ఆక్షేపించుట సరికాదు. లోకమునకు పరుడై అద్భుతశక్తిచే లోకమునుధరించుచున్నాడని "పరుడై ఈశ్వరుడై మహామహిముడై" ఇత్యాదిఅనేకపద్యములు భాగవతాదిగ్రంథములయందు చెప్పబడియున్నవి.

౪-వమంత్రముయొక్క తాత్పర్యముస్పష్టమగునటుల వాజసనేయసంహితయందు "మాతేయజ్ఞపతిఃహ్వార్షీత్" అనుపాఠముకలదు. ఈమంత్రమునకర్థము శతపథశ్రుతియందు చెప్పబడినదేమనగ "మాతేయజ్ఞపతిఃహ్వార్షీదితియజమానో వైయజ్ఞపతిః తద్యజమానాయైవైతదహ్వాలామాశాస్తే" (శతపథబ్రాహ్మణం౧అధ్య౭-౧-౧౧) అనగ భక్తునికిచలించకుండ స్థిరబుద్ధికలుగచేయవలయునని ఈమంత్రము భగవంతునిప్రార్థించుచున్నాడు. "హ్వాలా=నాశః" అనిశతపథభాష్యమందు వ్రాయబడినట

చేర్లిన్ కూర్పు ఫుట౧-౨) స్థిరుడైన భగవంతుని స్థిరముగ నుండుమని ప్రార్థించుట యందు సారము లేదు. ఈ మంత్రమునకు శబ్దార్థమును బట్టి అట్టి అర్థము గోచరమగుచున్నను అట్టి అర్థము కానట్టు బ్రాహ్మణము, ఇతర శాఖ పాఠము తెలియ చేయుచుండుటవలన వేదమునకు అట్టి అర్థమును చెప్పి ఆక్షేపణ చేయుటయు ఉచితము కాదు. ఇందుకు వినియోగమాత్రము, "మాతరిశ్వనో ఘర్మోఽసీతి తేషు కుంభీమధిశ్రయతి" (ఆపస్తంబ౧-౧౨-౧)

## ౩. (౧.) వసూనాం పవిత్రం అసి శతధారం
## (౨.) వసూనాం పవిత్రం అసి సహస్రధారం

జ్ఞానార్థము.

టీ ॥ వసూనాం = ప్రాణములు, శతధారం = శతవిధములుగ, పవిత్రం = పవిత్రము చేయువాడవు, అసి = అగుచున్నావు, వసూనాం = ప్రాణములను, సహస్రధారం = సహస్ర విధములుగ, పవిత్రం = పవిత్రము చేయువాడవు, అసి = అగుచున్నావు.

తా ॥ ఓ భగవంతుడా నీవు జీవాత్మలను అనేక విధములుగ పావనము చేయువాడవు.

కర్మార్థము.

టీ ॥ వసూనాం = [ఓ శాఖా పవిత్ర మా నీవు] ప్రాణములు నివసించుటకు కారణమైన పాల బిందువులకు, పవిత్రం = పాలలో నుండెడి ఆకు మొదలైన వానిని నిరోధించి పవిత్రము చేసెడి దానవుగా అసి = అగుచున్నావు, శతధారం = నూరు ధారలు గానున్న, సహస్రధారం = వేయి ధారలుగానున్న, వసూనాం = [పడుతూవున్నట్టువంటి] పాలబిందువులకు, పవిత్రం = శోధకము గా, అసి = అగుచున్నావు.

వినియోగము ॥ ఈ మంత్రము చెప్పి హవిః పాత్రయందు పూర్వాగ్రముగా శాఖాపవిత్రము నుంచవలయును.

వివరము ॥ వసు అనె శబ్దమునకు ప్రాణమని బ్రాహ్మణమందు చెప్పబడినది. "వసూనాం పవిత్రమసీత్యాహ । ప్రాణా వై వసవః" (తై. బ్రా. ౩ - ౨ - ౩) ప్రాణములకు ఉపలక్షణముగ కర్మయజ్ఞమందు క్షీరముల నుపయోగించుటకు కారణము "ప్రాణినాం జీవ హేతుత్వాత్ పయః ప్రభృతీని ధనాని వసు శబ్దేనోచ్యంతే" అని భట్టభాస్కరులు చెప్పియున్నారు, " శతధార " శబ్దమును గూర్చి "శతధారం అనేకప్రకారం పవిత్రం పావనమసి " అని భట్టభాస్కరుల వారు చెప్పియుండుటంబట్టి అనేక విధములుగ పవిత్రము చేయువాడవని వ్రాయబడినది, శతం సహస్రం అను పదములు బహు నామములయందు చెప్పబడినవి, (వేదనిఘంటువు ౩ - ౧) శాఖా పవిత్రమును పూర్వాగ్రముగనుంచుట దేనికి సాదృశ్యమైనది విదా

రణ్యులవారు చెప్పియున్నారు. “అమావాస్యాదినేసాయందోహేకుంభ్యాఉపరిశాఖాపవిత్రం ప్రాగగ్రంపశ్చాన్మూలంనిదధ్యాత్। తథాసతిప్రాణాపాన సదృశంభవతి ప్రాణవాయుః పూర్వయూపేముఖద్వారేణివసతి” (విద్యారణ్యభాష్యం చన్నపట్టణంకూర్పుపుటలుం) ఇందువలన జ్ఞానార్థమును, కర్మార్థము బోధించు చున్నదని స్పష్టముగా తెలియబడుచున్నది. ఇందుకువినియోగసూత్రము “వసూనాంపవిత్రమసీతితస్యాం ప్రాగగ్రంశాఖాపవిత్రమత్యాదధాతి” (ఆపస్తంబశ్రౌతం౧- ౧.౨-౩).

౪. హుతః స్తోకః హుతః ద్రప్సః అగ్నయే బృహతే నాకాయ స్వాహా ద్యావా పృథివీభ్యాం.

జ్ఞానార్థము.

టీ॥ బృహతే = సంపూర్ణుడైనట్టియు, నాకాయ = దుఃఖరహితుడైనట్టియు, అగ్నయే = భగవంతుని కొరకు, స్తోకః = అల్పకార్యము, హుతః = సమర్పణమగుగాక, ద్రప్సః = అనల్ప కార్యము హుతః = సమర్పణమగుగాక, ద్యావా పృథివీభ్యాం = ద్యులోక పృథివీ లోకములను ధరియించుభగవంతునికి, స్వాహా అర్పణమగుగాక.

తా॥ మనముచేయు ప్రతి కార్యము అల్పమైనదైనను గొప్పదైనను భగవంతునికి సమర్పణమగుగాక.

కర్మార్థము.

టీ॥ బృహతే = గొప్పవాడైన, నాకాయ = [స్వర్గలోకమందు వాసము చేయుచుండుట వలన] నాకమనే పేరుగల, అగ్నయే = అగ్నికొరకు, స్తోకః = అల్పక్షీరబిందువు, హుతః = అగ్ని యందు హోమము చేయబడ్డదిగానున్న [అగుగాక], ద్రప్సః = గొప్పక్షీరబిందువు (న్ను), హుతః = హోమముచేయబడ్డదిగా [అగుగాక] ద్యావాపృథివీభ్యాం = ఆకాశము భూమి యీ రెంటికొరకు, స్వాహా = హోమముచేయబడ్డదిగా అగుగాక.

వినియోగము॥ ఈమంత్రము చెప్పి క్షీరబిందువుల నభిమంత్రించవలయును.

వి॥ అగ్నిః అంగతి సకలవేదాంతప్రతిపాద్యత్వంగచ్ఛతీతివ్యుత్పత్త్యాఅగ్నిశబ్దస్యపర మాత్మపరత్వం (కృష్ణపండిత సంధ్యావందనభాష్యం పుట౧౩) నాక శబ్దమునకు వ్యుత్పత్తి కంసుఖంతదస్య నాస్తీత్యకః తస్మాదన్యః నాకంభట్టభాస్కరం. ద్యావాపృథివీశబ్దములను గూర్చి రెండవ మంత్ర వివరణచూడుము. ఇందుకువినియోగసూత్రము “హుతః స్తోకోహుతోద్రప్స ఇతివిప్రుషో అనుమంత్రయతే” (ఆపస్తంబశ్రౌత.౧-౧౩-౭)

## ౫ సా విశ్వాయుః

జ్ఞానార్థము.

సా=అ (వాక్కు) విశ్వాయుః= సంపూర్ణమైన ఆయువు నిచునదిచ్చ

తా ॥ భగవద్వాక్కు సంపూర్ణమైన ఆయువును ఇచ్చునది.

కర్మార్థము.

టీ ॥ సా = మొదటిసారి పాలు పితకబడ్డ ఆ [గోవు], విశ్వాయుః = చిరాయుస్సుగల [పృథివి అభిమానదేవతతో సమానమైనది]

వినియోగము ॥ ఈమంత్రము చెప్పి మొదటి సారిపాలు పితకబడ్డ ఆవునభిమంత్రించవలయును.

వి ॥ కర్మయందు సాఅనగా"గో" అని అర్థము చెప్పబడినది, వేదనిఘంటువు నందు"గౌః" "ధేనుః" 'వాక్' నామములయందు చెప్పబడినవి, కావున కర్మార్థమందు చెప్పబడిన ఆవువేదవాక్కుగ నెంచవలయును, సా=వాక్ అని శుక్లయజుర్వేద భాష్యమందు చెప్పబడినది (బొంబాయికూర్పుపుట ౧౩) ప్రణవము బ్రహ్మను తెలియచేయునది "తస్యవాచకః ప్రణవః" (౧-౨౭) పతంజలియోగ సూత్రము ఆప్రణవార్థమును ఈ అనువాకమందుండు ౧-౯ మంత్రములు తెలియచేయుచున్నవి. "విశ్వాయుః" అనుశబ్దార్థమునుపట్టి "విశ్వమాయుర్యస్యాస్సా" అని వ్యుత్పత్తిఅయినను ఆయువును ఇచ్చునని గ్రహించవలయును 'యజమానస్య సంపూర్ణం ఆయుః ప్రయచ్ఛతీత్యర్థః' అని మహీధరాచార్యులవారు ఈవాక్యమునకు వ్యాఖ్యానము చేసియున్నారు (యజుర్వేదభాష్యం ౧-౪) ఇందుకు వినియోగసూత్రము 'సావిశ్వాయురిత్యను మంత్రయతే' (ఆపస్తంబ శ్రౌతం ౧-౧౩-౧౪)

## ౬. సావిశ్వవ్యచాః

జ్ఞానార్థము.

సా = అ(వాక్కు విశ్వవ్యచాః = అంతటావ్యాపించియున్నది.

తా ॥ భగవద్వాక్కుసమస్తప్రపంచమందు వ్యాపించియుండుగాక

కర్మార్థము.

టీ ॥ సా=అ [గోవు] విశ్వవ్యచాః =సమస్త ప్రపంచమును వ్యాపించినది

వినియోగము ॥ ఈమంత్రము చెప్పి రెండవసారి పాలుపితకబడ్డ ఆవునభిమంత్రించవలయును.

వివరణము ॥ ఐదవమంత్రవివరణచూడుము ఇందుకు శ్రౌతసూత్రము "సావిశ్వ వ్యచా ఇతిద్వితీయామను మంత్రయతె" (ఆపస్తంబ.౧-౧3-౯)

## ౭ సా విశ్వకర్మా

**జ్ఞానార్థము.**

టీ ॥ సా = ఆ (వాక్కు) విశ్వకర్మా = సమస్తమైన కర్మలుకలది

తా ॥ భగవద్వాక్యము మనుజుడు ఏయేవిధులు చేయవలసినది తెలియచేయుచున్నది

**కర్మార్థము.**

టీ ॥ సా = ఆ(ఆవు) విశ్వకర్మా = సమస్తమైనకర్మగలది

వినియోగము ॥ ఈమంత్రము చెప్పి మూడవసారి పాలుపితకబడ్డఆవునభిమంత్రించవలయును

వి ॥ 7వ మంత్రవివరణచూడుము ఇందుకు వినియోగసూత్రము "సావిశ్వకర్మేతితృతీయాం"(ఆపస్తంబ శ్రౌతసూత్రం. ౧-౧3-౯

## ౮ సం+పృచ్యధ్వం ఋతావరీః ఊర్మిణీః మధుమత్తమాః మంద్రాః ధనస్యసాతయే

**జ్ఞానార్థము.**

టీ॥ధనస్య=(అమృత) ధనముయొక్క సాతయే = ప్రాప్తికొరకు ఋతావరీః = ఋతము ననుసరించు నట్టియు, ఊర్మిణీః = ప్రకాశకమైనట్టియు, మధుమత్తమాః= అత్యంత మధుర మైనట్టియు, మంద్రాః = ప్రియమైనట్టియు, (ఓభగవత్కరుణా రసములారా మీరు) సంపృచ్యధ్వం = (నాఆత్మతో) కలుసుకొనండి.

తా ॥ (అమృత) ధనసంపాదన కొరకు ఋతస్వభావముగునట్టియు, ప్రకాశించునట్టియు, అత్యంత మధురమైనట్టియు ప్రియ కరమై నట్టియు, (భగవత్కరుణా రసములారా మీరు) జీవాత్మతో కలుసు కొనండి.

**కర్మార్థము.**

టీ ॥ ఊర్మిణీః = చలించుచున్నట్టియు, మధుమత్తమాః — అతిమధురమైనట్టియు, మంద్రాః = ప్రియములగు నట్టియు,ఋతావరీః = కడిగే సామర్థ్యము గలుగునట్టియు, (ఓయుదకములారా మీరు), ధనస్య = (పెరుగు పాలతో చేయబడ్డ హవిస్సుకలిగిన పాత్రలక్షణమైనన) ద్రవ్యముయొక్క, సాతయే = ప్రాప్తికొరకు, సమ్పృచ్యధ్వం = (పాత్రమందుండు క్షీరములతోడ) కలుసుకొనండి.

వినియోగము ॥ ఈమంత్రము చెప్పి పాలుపితికిన పాత్రను కడిగిన జలమును పెరుగుపాలతో చేయబడ్డ హవిస్సుకలిగిన పాత్రయందుంచ వలయును.

వి॥ ఈమంత్రముఋక్కు- గాయత్రీఛందస్సు. విద్యారణ్యభాష్యం ౧- ౧-౧౩ ) ఋతావరీః మొదలు మంత్రాః వరకు నాలుగు విశేషణములు కలవు విశేష్య మధ్యాహారము, విశేషణములయొక్క అర్థమునుబట్టి విశేష్యము నూహింప వలయును. పూర్వమంత్రములచేభగవంతునిన్ని భగవద్వ్యాపారమున్ను, వర్ణించిభగవత్కారుణను గూర్చి ఈమంత్రమందు చెప్పబడుచున్నది. భగవత్కటాక్షము లేనిది మోక్షసిద్ధికలుగదను సిద్ధాంతము వేదముబోధించుచున్నది. అట్టికటాక్షమువలనే అమృతసిద్ధి కలుగును, భగవత్కటాక్షస్వరూపము ఎట్టిదైనది ఈమంత్రము తెలియచేయుచున్నది. భగవంతుని ప్రార్థించువారికి భగవత్కటాక్షము కలుగునుగనుక భగవంతుడు పక్షపాతము కలవాడని చార్వాకాదులు చెప్పుదురు. ఋతావరీః అను విశేషము వలన అట్టి పక్షపాతము భగవంతునియందు లేనట్లుస్థిరపడుచున్నది. ఋతము యొక్క అర్థముచాలా గూఢమైయున్నది. ప్రపంచమందు నేయేపదార్థమునకు నేయేధర్మముండవలసినది స్థిరపడియున్నది. అనగ అగ్నికి కాల్చుటవాయువు కదలించుట మొదలైన ధర్మములుకలవు. ఇట్టిధర్మములు శాశ్వతముగ నుంటున్నవియని ఋతశబ్దము తెలియచేయుచున్నది. ఇందుకు సరియైన తెనుగుపదముకనుపించలేదునికి ఇంగలీషుపదము (Eternallaw) అట్టి శాశ్వతమైన ధర్మమును మీరకనే భగవత్కటాక్షము ప్రపంచమంత వ్యాపించియున్నదనియు ఇతరపదార్థమునుగూర్చి మనుజుడు ప్రయత్నము చేసినయెడల సంప్రాప్తమగునటుల భగవత్కటాక్షమును గూర్చియు ప్రయత్నము చేసినట్టయితేనే సంప్రాప్త మగుననియు ఈవిశేషణము బోధించుచున్నది. జీవాత్మలకు మోక్షముకలుగ చేయుటకు గాను వేరుకారణము లేకనే సర్వప్రపంచమందు భగవత్కటాక్షము వ్యాపించియుండుటచే ఇట్టికటాక్షము నిర్హేతుకజాయమాన కటాక్షమని చెప్పబడుచున్నది. ఊర్మిణీః అనగ తరంగములుకలదిలేక ప్రకాశించునది (తారానాథవాచస్పతినిఘంటువు ౨౩౯౩) తరంగములుకలదనుటచే పూర్ణత్వమును బోధించుచున్నది భగవత్కారుణ్యరసము అత్యంతమధురమైనట్టును మనోహరమైనట్టును ప్రతిభక్తునికి గోచరమేను. ఇట్టికరుణారసమునకు సాదృశ్యము ఉదకమని కర్మయజ్ఞము తెలియచేయుచున్నది కావుననే బ్రాహ్మణము "ఆపః" అనుశబ్దమునుగురించి "ఆపో వై రక్షోఘ్నీః" అనిచెప్పుచున్నది (తై. బ్రా. 3-౨-3) అనగా పాపములు పోగొట్టునవి. ఇందుకువినియోగసూత్రము. "సంపృచ్యధ్వంఋతావరీః ఇతికుంభ్యాంసంక్షాలనమానీయ"(ఆపస్తంబశ్రౌత ౧-౧౩-౧౦)

## ౯. సోమేన త్వా ఆతనచ్మి ఇంద్రాయ దధి.

జ్ఞానార్థము.

టీ ॥ త్వా = (ఓమనసా లేక జీవాత్మా) నిన్ను, సోమేన = జ్ఞానామృతముతో, ఆతనచ్మి = కలుపుచున్నాను, దధి = (అట్లుకలుపుటచే) జ్ఞానస్వరూపము నొందిన నిన్ను, ఇంద్రాయ = భగవంతుని కొరకు అర్పణ చేయుచున్నాను.

తా ॥ ఓమనసా నిన్ను భగవద్జ్ఞానమను అమృతముతో కూర్చుటచేత నీవు నన్ను జ్ఞానస్వరూపమును పొందుచున్నావు అట్టి నిన్ను భగవంతునికి సమర్పించుచున్నాను.

కర్మార్థము.

టీ ॥ త్వా = (ఓక్షీరమా) నిన్ను, సోమేన = [దధిరూపమైన] సోమరసముచేత, ఆతనచ్మి = తోడుపెట్టుచున్నాను, దధి = [ఆతోడుపెట్టుట చేత అయిన] పెరుగు, ఇంద్రాయ = ఇంద్రునికొరకు (హోమం చెయబడును.)

వినియోగము ॥ ఈ మంత్రము చెప్పి పాలను పెరుగుతో కలపవలెను. (ప్రయస్తేనదధ్నా తనక్తి "రుద్రదత్తభాష్యం ౧.౧౩.౧౪)

వి ॥ ప్రాణము, మనస్సు, జీవాత్మా, వసుః, ఈపదములు ఏకార్థమందు ప్రయోగింపపడినవి. "సోమేన" తృతీయావిభక్తిప్రథమ సోమః "సుమన్" ఈరెండిటి వలన సోమ అనునది నిష్పన్నమైనది 'సు' (షు) అనగ ప్రసవైశ్వర్యయోః అని ధాతు పాఠము కావున సోమః అనగ నిష్పన్నమైనది అని శబ్దార్థము. మన్ అను ప్రత్యయము వలన ఆద్యుదాత్తమైనది. ఈశబ్దమునకు అనేకార్థములు కలవు భగవంతుడు, అమృతము, సోమరసము, సోమలత, చంద్రుడు కర్పూరము, ఉదకము, కాంతి, వాయువు, పర్వతము, ఇత్యాదులు. ఆయాసందర్భమును బట్టితగిన అర్థమును చెప్పవలయును. ఇచ్చట సోమ శబ్దమునకు జ్ఞానస్వరూపమైన అమృతమని చెప్పతగును. సుఅను ధాతువ వలననే సుతః (కొమారుడు) అను పదముకూడ నిష్పన్నమైనది. అమృతము భగవంతుని వలన కలుగుటచే భగవంతుడు తండ్రిగను, అమృతము పుత్రునిగ నెంచి భగవత్పుత్రునిద్వారానే మోక్షము కలుగునని కొందరు మతస్థులు చెప్పుచున్నారు.

సోమలతకు అమృతవల్లి అని పేరుకలదు, సోమమనగ అమృతము గనుక అట్టిసోమమును పొందుట అతిప్రయాసతోకాని కలుగ దనేసంగతిని ఇతరేయబ్రా

హ్మణము (సంచిక ౩ అనువాకము ౨౫) చెప్పుచున్నది “సోమోవై రాజా ము ష్మిఀల్లోక ఆసీత్తం దేవాశ్చ ఋష యశ్చాభ్యధ్యాయన్, కథమయస్మాంత్సో మురచ్ఛే దిత్యాది”, దీనికిఅర్థము. రాజైనసోముడు పరలోకమునందు ఉండెను దేవతలున్ను ఋషులున్న ప్రభువైనసోమము నెటుల పొందెదమని ఆలోచించిరి. గాయత్రీ ఛందస్సుద్వారా ఆట్టి అమృతమును పొందినటుల ౨౬ అనువాకమందు చెప్పబడినది. ప్రణవము గాయత్రీ ఛందస్సాటచే ప్రణవమంత్ర ధ్యానము ద్వారా సిద్ధించునని ఊహించవలెను. ఆట్టి అమృతము పానము చేసిన యడల జీవుడు కూడ జ్ఞానమనుదధి స్వరూపుడై మోక్షమును పొందునని ఈమంత్రము చెప్పుచున్నది. ఈఅనువాకమునకు సంబంధించిన బ్రాహ్మణము “అపునర్భక్షో స్య సోమపీథో భవతి” (తై. బ్రా. ౩ - ౨ - ౩) అని తెలియచేయుచున్నది. అనగ అమృతము పానమును చేసినవారికి ఆకలియుండదు. ఇందుకు వినియోగసూత్రము “సోమేన త్వా తనచ్మీంద్రాయ దధీతి దధ్నా” (ఆపస్తంబశ్రౌత ౧- ౧౩- ౧౪).

## ౧౦. విష్ణో హవ్యం రక్షస్వ.

జ్ఞానార్థము,

టీ ॥ విష్ణో — ఓ పరమేశ్వర, హవ్యం — ప్రాణమును, రక్షస్వ — రక్షించుము.

తా ॥ ఓ పరమేశ్వర జీవాత్మకు మోక్షమునిచ్చి రక్షించుము.

కర్మార్థము.

టీ ॥ విష్ణో — ఓవిష్ణువ (నీవు), హవ్యం — [దధిరూపమైన] హవిస్సును, రక్షస్వ — రక్షింపుము.

వినియోగము ॥ ఈమంత్రము చెప్పి తోడుబెట్టిన క్షీరపాత్రము నేస్థలమందుంచితే సురక్షితముగా నుండునో అక్కడ నుంచవలయును.

వి ॥ విష్ణుశబ్దము విషు౯ — వ్యాప్తౌ అనుదాని వలన నిష్పన్నమైనది అనగ సర్వవ్యాపకుడు. “ప్రాణో హవిః” (ఆరణ్యకం ౩-౧) అను ప్రమాణము వలన హవిః అనగ ప్రాణము లేక జీవుడు అనిఅర్థము చెప్పబడినది. ఇందుకు వినియోగసూత్రము “విష్ణో హవ్యం రక్షస్వేత్యనధోని దధాతి (ఆపస్తంబశ్రౌత ౧- ౧౪-౫.)

## మూడవ అనువాక సామాన్య విషయములు.

౧-౨-3- అనువాకములు జ్ఞాన సంపాదనయు, జ్ఞానసంపాదన దేనివలన సిద్ధించునదియు, అట్టిజ్ఞానముయొక్క ఫలమునుసంక్షేపముగ తెలియచేయుచున్నవి. "అనువాకత్రయేణపర్వదినకర్తవ్యంసమాపితం" అనివిద్యారణ్యభాష్యమందు వ్రాయబడినది. (చెన్నపట్టణంకూర్పు పుట ౭౪)

౨. ఈఅనువాకమందు అంతఃకరణము పాత్రలతోను, ప్రాణములుక్షీరములతోను, బ్రహ్మవాక్గోవుతోను, బ్రహ్మకటాక్షము ఉదకములతోను, బ్రహ్మజ్ఞానము సోమముతోను అట్టిజ్ఞానప్రసరణవలన జీవాత్మయందు జ్ఞానస్వరూపము దధితోను పోల్చబడినవి.

సోమశబ్దమునుగూర్చి వ్రాయబడినసంగతులవలన బ్రహ్మజ్ఞానము మరణరాహిత్యమును కలుగజేయును గనుక అమృతమనియు, అట్టి అమృతము సోమశబ్దముచే తెలియచేయబడుచున్నదనియు తేటపడుచున్నది. అయినను సోమము అనగ సోమలతవలన తీయబడిన రసమేకాని మరియొకటికాదని కొందరు అన్యమతస్థులు వ్రాసియుండుటంబట్టి అదిపొరబాటు అని చూపించుటకుగాను ఇచట మరికొన్ని ప్రమాణములను వ్రాయుట యావశ్యకమని తోచుచున్నది. బ్రహ్మజ్ఞానము సోమము బ్రహ్మ వలన పుట్టినట్టు అథర్వవేదీయ పురుషసూక్తమందు చెప్ప బడినది. "రాజ్ఞస్సోమస్యాజాయంత జాతస్య పురుషా దధి," (అథర్వవేదము౧౯-౬-౧౬-)అనగ విరాట్ పురుషుని వలన సోమరాజుపుట్టినట్లుల చెప్పుచున్నారు. మరియు ప్రగాథుడను మహాఋషి సోమమునుగూర్చి ఋగ్వేదమందు చెప్పిన మంత్రమునుచూడదగినది. "అపామ సోమ మమృతా అభూమా గన్మా జ్యోతి రవిదామ దేవాన్ । కిం నూన మస్మాన్కృణవ దరాతిః కిము ధూర్తి రమృత మర్త్యస్య" (మం ౮ సూ ౪౮ మ ౩.) ఇందుకు సాయనాచార్యభాష్యము "హే అమృత అమరణ సోమ త్వా మపామ పానం కరవామకుర్మః । తతో అమృతా అభూమ భవేమ । యస్మాత్త్వా మమృతో అతస్తవ పానాద్వయమప్యమృతా స్స్యామ । పశ్చాజ్జ్యోతిర్ద్యోతమానం స్వర్గమగన్మ ।

అవిదామ జ్ఞాతవంతో దేవాన్ । తథాభూతానస్మాన్నూన మిదానీం అరాతిః శత్రుః కిం కృణవత్ । కిము కింవా మర్త్యస్యేదానీం మనుష్యభూతస్య మమ ధూర్తిః హింసకః కిం కృణవత్ కుర్యాత్" అనగ అమృతమను ఓసోమమా నిన్ను పాన ము చేయుటచే మేమున్ను అమృతత్వమును పొందుచున్నాము, ప్రకాశిస్తున్న స్వర్గమును పొందుచున్నాము, మహాత్ములను తెలుసుకొనుచున్నాము. కామక్రోధాదులను శత్రువులు మమ్మున ఏమి చేయగలవు,

౨- ౩-౧- ౨- ౩-౧- ౨-౩

సామవేదమందు సోమవర్ణన విస్తారముగలదు "త్వాం దేవా సో అమృతాయ
౧- ౨

కం పపుః" అనగ సుఖకరమైన నిన్ను జ్ఞానులు అమృతత్వముకొరకు పొందుచున్నారు. సామవేదం ఉత్తరార్చికా. (ప్రపాఠకం౫అ-౨ సూ౧౭ ఋ౨ పాదము-౨) "తద్యత్తదమృతగ్ం సోమః సః,, (శతపథబ్రాహ్మణం ౪౯-౫-౧-౮) ఇందుకు మాధవీయభాష్యం సోమస్య అమృతత్వా త్సోమాభిషేకేణ అమృతాభిషేకో భవతి (బర్లిన్ కూర్పుపుట ౭౫౭) ఇటువంటి ప్రమాణము లనేకములు కలవుగ్రంథ బాహుళ్యముచే అన్నిటినిచట వివరించ లేదు.

౩. ఈ అనువాకమునకు "కర్మరీత్యావ్యోహః" అని చెప్పబడు చున్నది. జ్ఞానార్థమందు "బ్రహ్మవాక్యోహః" లేక "బ్రహ్మవాక్సారగ్రహణః" అని చెప్పవచ్చును. "తృతీయేనరాత్రౌ కర్తవ్యోద్యోహః" (విద్యారణ్యభాష్యంచెన్నపట్టణంకూర్పు పుట-౫౭) అని కర్మార్థమందు చెప్పియుండుటచే ధ్యానమునకు రాత్రి ఎక్కువ అనుకూలమని గ్రహించవలయును.

౪. ఈ అనువాకమునందు "సంపృచ్యధ్వం" అనుమంత్రముమాత్రము మూడు పాదములుగల ఋక్కు మిగిలిన అన్ని మంత్రములు యజుస్సు.

౫. మంత్రబ్రాహ్మణాత్మకము గుం౨పస్నములు ౫౪ కాండలుగ చేయబడి ఆయా కాండలకు నరయే ఋషియైనది కాండానుక్రమణికయొక్క ద్వితీయాధ్యాయమందు చెప్పబడినది- కాండఋషులు ౧౨ గురు వారిపేర్లు బ్రహ్మజ్ఞమందు స్మరించబడుచున్నవి, అదియెట్లన్న "అథకాండఋషితర్పణం" ౧ ప్రజాపతికాండ ఋషి ౨ సోమకాండ ఋషి ౩ అగ్నికాండఋషి ౪ విశ్వదేవకాండ ఋషులు ౫ సాంహితీర్దేవతాకాండఋషి ౬ యాజ్ఞికీర్దేవతాకాండఋషి ౭ వారుణీర్దేవతాకాండ

ఋషి ౮ హవ్యవాట్కాండఋషి ౯ విశ్వేదేవకాండఋషులు ౧౦ బ్రహ్మకాండ ఋషి ౧౧ విశ్వేదేవకాండ ఋషులు ౧౨ అరుణకాండఋషి.

౬. ఏయేఋషి యేయేకాండకు అధికారి అయినది సాధారణముగ తెలియ కపోవుటచేత ఇందువిషయమై కాండానుక్రమణికయందు వ్రాయబడిన శ్లోకముల ను ఇచట వ్రాయుచున్నారము.

(౧.) శాఖాదియాజమానంచ హౌత్ర్యాణ్ పాత్రంచ దార్శికం| తద్విర్ధిః పితృ మే ధంచన వాపుః కస్యతద్విదః.

(౨.) అధ్వరప్రభృతిత్రీణితద్విధిర్వాజపేయకే । సవాక్యక్రియకాండేచనవేందో విలిధారణా.

(౩.) త్రివ్వగ్న్యాధేయపూర్వేషు అగ్నేచసవిధిద్వయే । విధౌచైవాగ్ని హౌత్రిస్యసప్తస్వగ్నిం ఋషింవిదుః.

(౪.) అవశిష్టానియాన్యస్యః కాండాన్యన్యానిషోడశ । విశ్వాన్ దేవాన్ఋషీంస్తేషు విదుర్వేదవిదోజనాః.

(౫.) రాజసూయస్యబ్రాహ్మణః పశుబంధస్య హేష్టిభిః । ఉపానువాక్యం యాజ్యాశ్చ అశ్వమేధస్య బ్రాహ్మణః.

(౬.) సత్రాయణంచ హౌమాశ్చసూక్తానిచస హేష్టిభిః|సౌత్రామణీసహోక్చిద్రైః పాత్రంమేధశ్చషోడశ.

(౭.) కాండస్యోపనిషత్సుకాఠకాగ్నిషుహవ్యవాట్ । తదిష్టి కాండయోర్వేదే బ్రహ్మామ్నాయవిధౌ ఋషిః.

(౮.) ఐకాగ్నికోవిధిఃకాండం వైశ్వదేవమితిస్థితిః । అరణ్యకోవిధిఃకాండం అరుణ స్తత్రదైవతం.

(౯.) కాండశేషాన్యథాకాండంవిదధ్యాత్తువిచక్షణః । యథాసారస్వతేపాకే జ్ఞానమాత్రము హౌచ్యతే.

వీటి అర్థము ముందు సంచికలలో వ్రాయబడును

౭. మంత్ర ఋషులు కాండఋషులు అని ప్రసిద్ధిగనున్నను వారిలక్షణము తెలుసుకొనుట ఆవశ్యకము మంత్రబ్రాహ్మణమను ఆరుణకుయొక్క ౪వ ప్రశ్నమందు చెప్పబడినది యేమనగ "నమఋషి భ్యోమంత్ర కృద్భ్యో మంత్రపతిభ్యః" ఇతి ఇందుకు విద్యారణ్యభాష్యము (కలకత్తా కూర్పు పుట ౩౬౬) "తద్వ దృషిభ్యో నమస్కారోస్తు, కీదృశేభ్యః మంత్రకృద్భ్యః మంత్రంకుర్వంతీతి మంత్రకృతః" మంత్రఋషులకు మంత్రకృతులని మంత్రద్రష్టలని పేళ్లుమరియు మంత్రపతులను గూర్చి భాష్యమందు చెప్పినది యేమనగ "సంప్రదాయ ప్రవృత్త్యా మంత్రాణాంపాలనాన్మంత్రపతయ ఇత్యుచ్యంతే" వీరినే కాండ ఋషులని చెప్పవచ్చును కాండఋషులనుగూర్చి తారానాథవాచస్పతి (౧౮౬౧ పుటయందు) చెప్పినదియేమనగ "కాండస్య వేదభేదస్య ఋషి తదధికారేణ విచారకః" ఇందువలన మంత్ర ఋషి కాండఋషి వేరయినటుల తెలియందగును.

౮. ఇషేత్వాది ౯. కాండలకు ప్రజాపతి కాండఋషి అని ౬. పేరాలో వ్రాయబడిన ప్రథమశ్లోకమునందు చెప్పబడుటచే ౧-౭ అనువాకములకు ప్రథమమందు ఋషిః ప్రజాపతిః అని వ్రాయబడినది. ఈఋషి మంత్రఋషి అని కొందరు భ్రమించుట వలన ఈ అనువాకప్రారంభమందు కాండఋషి అని సవరణచేయబడినది. కాండ ఋషులలోనుండు "భూమిర్భూమ్నా ద్యౌః" అనుమంత్రములకు ప్రత్యేకము మంత్రఋషియున్నట్లు స్పష్టముగ కనుపించుచున్నది.

ఇషేత్వాది మంత్రములకు మంత్రఋషి యెవ్వరైనది ఇప్పటికి తెలియక పోవుట వలన కాండఋషిని మాత్రము తెలియచేసినాము. ప్రజాపతిపేరుగలిగిన కాండఋషియేగాక ఆపేరుగలిగిన మంత్రఋషులు కూడ ఋగ్వేద సర్వానుక్రమణిక యందు చెప్పబడిరి "ప్రజాపతిః ప్రజాపతిః పరమేష్ఠీ. ప్రజాపతిః వాత్స్యః. ప్రజాపతిః వైశ్వామిత్రః" ఇత్యాదులు.

(౯) ఇదివరకు వ్రాసిన అంశములవలన జ్ఞానయజ్ఞమే ప్రాధాన్య మైనటులను కర్మయజ్ఞము అందుకు సాదృశ్యమైనటులను తెలియుచున్నది. కావుననే కర్మద్వారా జ్ఞానము సంపాదించ వలయునని చెప్పుదురు. ఈవిషయమై ఎవ్వరికైనను సందేహమున్న యెడల ఈ అనువాకము చివరను విద్యారణ్యులవారు బృహదారణ్యకమందు చెప్పినటుల వ్రాసిన సంగతులను చూచిన అట్టిసందేహ నివృత్తి యగును. బృహదారణ్యకోపనిషత్తుయందు చెప్పినది యేమనగ "మనఏవాస్య

త్వా । వాగ్జాయా। ప్రాణః ప్రజా। చక్షుర్మానుషంవిత్తం । శ్రోత్రందైవమ్ తచ్ఛృణో తి । ఆత్మైవాస్యకర్తా । ఆత్మనాహి కర్మకరోతి ” (అధ్యాయ 3 - ౪ - బ్రాహ్మణం ) ఇందున గూర్చి విద్యారణ్యుల వారు చెప్పినది యేమనగ “ ఉపాసనయా యావత్సం పూర్తిరామ్నాయతే” మరియు “ ఆత్మాదేహా వేదగమ్యం మంత్రాది కందైవం విత్తం అతః సోమభావనయా వైకల్ప్యపరిహారోయుజ్యతే ” (చన్నపట్టణంకూర్పు పుట౬౬-౬౭)

౧౦. ఈ అనువాకము ఈక్రింద నుహరించబడిన వాటితో కొన్ని మంత్ర వ్యత్యయములుగ సంబంధించియున్నది.

కాఠకసంహిత. ౧ - 3.
వాజసనేయసంహిత. ౧- ౨- ౪.
మైత్రాయణీసంహిత. ౧- 3.

౧౧. మాచేత ప్రకటింపబడిన తైత్తిరీయసంహిత పీఠికయొక్క ౫౦ వ పుట యందు ఈక్రిందనుదహరింపబడిన శ్లోకము పొరబాటున విడువబడినది. ”మయూరంపర్వతాచ్చైవ యావద్గూర్జరదేశతః । వ్యాప్తావాయవ్యదేశాత్తు మైత్రాయణీ ప్రతిష్ఠితా.”

## మూడవ అనువాక సంగ్రహము.

౧. భగవత్సంబధమైన కర్మయనెడి భగవత్పూజ కొరకు (మీ అంతః కరణలను) పరిశుద్ధి నొందించండి.

౨. (ఓ పరబ్రహ్మా నీవు)అంతరిక్షమును ధరించు వాడవు. ద్యులోకమును ధరించువాడవు. పృథివీలోకమునుధరించువాడవు.సమస్త ప్రపంచమును ఉత్కృష్టమైన సామర్థ్యముచే ధరించువాడవు. (మమ్ముల) చలించనీయ్యకుము. (మాయందు) దృఢముగనుండుము.

౩. (ఎందువల ననగ( ప్రాణములను శత విధములుగ పవిత్రము చేయువాడవు (మరియు) ప్రాణములను సహస్ర విధములుగ పవిత్రము చేయువాడవు.

౪. మేము చేయు అల్పానల్ప కార్యములు వ్యాపకుడైనట్టియు దుఃఖరహితుడైనట్టియు భగవంతుని కొరకు సమర్పణమగుగాక. ద్యావాపృథువులను ధరించువాని కొరకు సమర్పణమగుగాక.

౫. ఆ (బ్రహ్మవాక్కు) సంపూర్ణాయువును కలుగ చేయునది.
౬. ఆ (బ్రహ్మవాక్కు) అంతటా వ్యాపించుచున్నది.
౭. ఆ (బ్రహ్మవాక్కు) సమస్త ధర్మములు కలిగి యుంచున్నది.

౮. (అమృత) ధన సంపాదన కొరకు ఋత స్వభావము కలిగినట్టియు ప్రకాశించునట్టియు అత్యంత మధురమైనట్టియు ప్రియకరమైనట్టియు (భగవత్కరుణారసమును లారా మీరు జీవాత్మతో) కలుసుకొనండి.

౯. సోమము అనగ అమృతముతో (ఓ జీవాత్మా) నిన్ను కలుపుచున్నాను.(అందు వలన కలిగిన) దధిని అనగజ్ఞానస్వరూపమునుపొందిన జీవాత్మను భగవంతుని కొరకు సమర్పణ చేయుచున్నాను.

౧౦. భగవంతుడు ప్రాణమను హవిస్సును రక్షించుగాక.

౩-వ అనువాకము-సంపూర్ణము.

ఓమ్

శ్రీపరబ్రహ్మణేనమః

——o——

కృ ష్ణ య జు ర్వే ద

# తైత్తిరీయసంహితామంత్రభాగస్య

చ తు ర్థో ఽ ను వా కః.

కాండర్షిః ప్రజాపతిః.



## ౧. కర్మణేవాం దేవేభ్యః శకేయం.

జ్ఞానార్థము.

టీ ॥ వాం = (కరచరణములు మొదలగు,) జోడుగానుండెడు (ఇంద్రియములారా) మిమ్మును, దేవేభ్యః = దేవతా సంబంధమైన, కర్మణే = కర్మనిమిత్తము శకేయం= (వినియోగ పరుచుటకు) శక్తుడనయ్యెదనుగాక.

తా ॥ హస్తములు పాదములు మొదలగు రెండు రెండుగానుండెడి ఇంద్రియములారా, మిమ్ములను భగవత్సంబంధమైన సత్కర్మాచరణకుగానుఉపయోగించుటకు (నేను) సమర్థుడ నైయ్యెదను గాక.

కర్మార్థము

టీ ॥ వాం= (ఓహస్తములారా) మిమ్ములను, దేవేభ్యః= దేవతాసంబంధమైన, కర్మణే = కర్మనిమిత్తము, శకేయం=(ప్రయోగించుటకు) శక్తుడనయ్యెదను.

వినియోగము ॥ ఈమంత్రము చెప్పి ఉదకముచేహస్తములను కడగవలయును

వి ॥ "వాం" ద్వివచనము అనగ రెండు, మనుజునియొక్క ఇంద్రియములు కొన్నిజంటగనున్నవి; అవిహస్తములు పాదములు నేత్రములు మొదలగునవి. వీటిని ద్వివచన ప్రయోగముచే గ్రహింపదగును. ఏకముగానుండు జిహ్వామొదలగు నింద్రియములు రెండవమంత్రమందుండు త్వా అను ఏకవచనముచే తెలియందగును. ఏకముగానున్నట్టి జంటగానున్నట్టి సర్వేంద్రియములు సత్కర్మలయందుఉపయోగించవలయునని ఈ ౧-౨ మంత్రములు బోధించుచున్నవి. దేవేభ్యః అనునది 'షష్ఠ్యర్థే చతుర్థీ' అని భట్టభాస్కరాచార్యులవారు తమభాష్యమందు చెప్పియున్నా

రు (౧-౧-౪) ఇందుకు బ్రాహ్మణము "కర్మణేవాం దేవేభ్యశ్శకేయ మిత్యాహ। శక్త్యై" (తై. బ్రా. ౩-౨-౪) అనగ సామర్థ్యము కొరకు. ఈమంత్రము మైత్రాయణులు ఎటుల పఠించుచున్నారనగ "కర్మణే వాంసుకృతాయవాం" (మైత్రాయణీసంహిత. ౧-౧-౪.) ఇందువలన కర్మయనగ సుకృత కర్మయని గ్రహించ వలయును. సుకృత కర్మయందు మనస్సు ప్రవేశింప చేయువాడు యెవ్వడైనది ఆకర్మయెవ్వరి నిమిత్తము చేయ వలసినది వాజసనేయ సంహిత స్పష్టముగ తెలియచేయుచున్నది. అదియెట్లన్న "కస్త్వాయునక్తి, సత్వాయునక్తి, కస్మైత్వాయునక్తి, తస్మైత్వాయునక్తి" (౧-౧-౭) అనగ ఎవ్వడు నిన్ను కూర్చుచున్నాడు? ఆయన నిన్ను కూర్చుచున్నాడు. నిన్నుయెవ్వరినిమిత్తము కూర్చుచున్నాడు? ఆయన కొరకుకూర్చుచున్నాడు. ప్రథమ అనువాకమునందు సర్వనామములు ప్రత్యేకవిశేష్యములతో సంబంధించనపుడుపర బ్రహ్మవాచ్యములైనటుల ప్రసిద్ధియైయున్నదని వ్రాసియున్నాము. (పుట౪-) సః అను సర్వనామము ప్రత్యేక విశేష్యముతో సంబంధించక పోవుటవలన "స ఏవపరమేశ్వరః" అనిమహీధరాచార్యుల వారు భాష్యమందు వ్రాసినారు (కలకత్తాకూర్పుప్రుట ౭) "తచ్ఛబ్దః ప్రసిద్ధార్థవాచీసర్వేషు వేదేషు జగన్నిర్వాహకత్వేన ప్రసిద్ధోయః ప్రజాపతిరస్తి సఏవ పరమేశ్వరః" ఇందుకు వినియోగసూత్రము "కర్మణేవాం దేవేభ్యశ్శకేయమితి హస్తావవనిజ్య" (ఆపస్తంబ ౧-౧౯-౪)

## ౨. వేషాయ త్వా.

**జ్ఞానార్థము.**

టీ॥ వేషాయ = సత్కర్మకొరకు, త్వా = (జిహ్వామొదలగు) ఒకటొకటొకటిగనుండు (ఓ యింద్రియమా) నిన్ను ఉపయోగించుచున్నాను.

తా॥ జిహ్వామొదలైన ఒకటొకటిగానుండు ఇంద్రియములనుభగవత్పూజకొరకు ఉపయోగించుచున్నాను.

**కర్మార్థము.**

టీ॥ త్వా = (ఓశూర్పమా) నిన్ను, వేషాయ = యజ్ఞముకొరకు (గ్రహించుచున్నాను.)

వినియోగము॥ ఈమంత్రము చెప్పి శూర్పమును గ్రహించవలయును.

వి॥ 'వేషాయ' చతుర్థీ విభక్తి ఇందుకుప్రథమ 'వేషః' ఈశబ్దముయొక్క వ్యుత్పత్తినిగూర్చి 'విషౢవ్యాప్తౌ' 'పచాద్యచ్' అనిభాష్యము చెప్పుచున్నది (వేదనిఘంటువు కలకత్తాకూర్పు ౧,౬౪) 'వేషః' 'వ్రతం' 'క్రతుః' అనెడి ౨౬ పదములు కర్మనామముల యందు చెప్పబడియున్నవి. (వేదనిఘంటువు ౨-౧) మనుజునికి వాక్పాదపాణి పుపస్థలను కర్మేంద్రియములున్ను త్వక్చక్షు శ్రో

త్ర జిహ్వాఘ్రాణములను జ్ఞానేంద్రియములున్ను కలవు. ఈసర్వేంద్రియములు సత్కర్మయం దుపయోగించవలయునని ౧-౨ మంత్రములు తెలియ చేయుచున్నవి. చిత్తవృత్తులు పరిశుద్ధిగ నుండవలయునని ౩-వ అనువాకమందు చెప్పబడినటుల ఇదవరకే వ్రాసియున్నాము. కర్మయజ్ఞమందుపయోగించబడు 'స్రుక్' 'శూర్పం' మొదలగుపూర్వాపరపాత్రములు, అంతఃకరణముతో పోల్చబడినటుల "చిత్తిస్రుగాది" ప్రమాణముల వలన తెలియందగును. ఇందుకు బ్రాహ్మణము "వేషాయత్వేత్యాహ। వేషాయహ్యేనదాదత్తే" (తై. బ్రా. ౩-౨-౪) అనగ సుకృత కర్మకొరకు దీని గ్రహించుచున్నాడు. ఇందుకు వినియోగసూత్రము "వేషాయత్వేతిశూర్పం" (ఆపస్తంబ. ౧-౧౭-౧) శూర్పమనగ "వంశనిర్మితంవ్రీహ్యాదీనాం పురోడాశ సంబంధినాంనిస్తుష కరణోపయోగి శూర్పమిత్యుచ్యతే" అని శ్రౌతపదార్థనిర్వచనమందు చెప్పబడినది (కాశీకూర్మపుటం-౩౬).

### ౩. ప్రత్యుష్టగ్ం రక్షః ప్రత్యుష్టాః అరాతయః

ద్వితీయానువాకమందు రెండవమంత్రమును చూడుము.

కర్త్రార్థము.

టీ॥ రక్షః=రాక్షసుడు, ప్రత్యుష్టగ్ం=మిక్కిలి దహింపబడినవాడుగా (అవుగాక) అరాతయః=శత్రువులు, ప్రత్యుష్టాః = మిక్కిలి దహింపబడిన వారుగా అగుదురుగాక.

వినియోగము ॥ ఈమంత్రము చెప్పి చాటను కాచవలయును.

వి॥ ఇందుకు వినియోగసూత్రము "ప్రత్యుష్టగ్ంరక్షః ప్రత్యుష్టా అరాతయ ఇత్యాహవనీయే గార్హపత్యేవా ప్రతితప్య" (ఆపస్తంబశ్రౌత ౧-౧౭-౨)

### ౪. (౧) ధూః అసి.
### (౨) ధూర్వ ధూర్వంతం.
### (౩) ధూర్వతం యః అస్మాన్ ధూర్వతి.
### (౪) తం ధూర్వ యం వయంధూర్వామః.

జ్ఞానార్థము.

(౧) ధూః=(ఓపరబ్రహ్మా నీవు పాపులను) శిక్షించువాడవు, అసి=అగుచున్నావు (౨) ధూర్వంతం = (నన్ను) వేధించు

కర్త్రార్థము.

టీ॥ ధూః=(ఓ అగ్ని నీవు) హింస చేసేవాడవు, అసి=అగుచున్నావు. ధూర్వంతం= (పాపరూపకమై) హింసించు

యున్నదానిని అనగ పాపమును ధూర్వ = నశింపచేయుము, (3) యః = ఏ (అంతశ్శత్రువు) అస్మాన్ = మమ్ములను, ధూర్వతి = హింసచేయుచున్నాడో, తం = ఆశత్రువును, ధూర్వ = నశింపచేయుము, (౪) యం = ఎవనిని (అనగ మాయందుండు ఆలస్యాది రూపకమైన ఏశత్రువుని) వయం= మేము, ధూర్వామః= హింసించ నిచ్ఛయించుచున్నామో తం = వానిని, ధూర్వ = నశింపచేయుము.

తా ॥ ఓ భగవంతుడా నీవు పాపాత్ములను శిక్షించువాడవు గనుక మాయందుండు పాపములను నశింపచేయుము.

దానిని, ధూర్వ=నశింపచేయుము, యః ఎవడు, అస్మాన్= మమ్ములను, ధూర్వతి =హింసచేయుచున్నాడో, తం= వానిని, ధూర్వ=నశింపచేయుము, యం= ఎవనిని(మాయందుండెడుఆలస్యాదిరూపమైన ఏశత్రువుని), వయ =మేము, ధూర్వామః=హింసించనిచ్ఛయించుచున్నామో, తం=వానిని, ధూర్వ= నశింపజేయుము.

వినియోగము ॥ ఈ మంత్రము చెప్పి బండికాడియొక్క దక్షిణరథ్యమునుగాని ఉత్తరరథ్యమునుగాని స్పృశించవలయును.

వి ॥ ధూః అనుదానియొక్క వ్యుత్పత్తి "తుర్వీ దుర్వీ ధుర్వీహింసార్థాః ధుర్వతే క్విప్" ఈపదమునకర్థము "సర్వదోషనాశకో అంధకార నాశకో వా" అని శుక్లయజుర్వేద భాష్యమందు చెప్పబడినది. (బొంబాయి కూర్పుపుట ౨౨.) శత్రువులైన మనుష్యులయొక్క నాశనమును. గూర్చి వేదమంత్రములు చెప్పుచున్నవని కొందరు ఆక్షేపించుచున్నారు ఇట్టివాదము "నహింస్యాత్సర్వా భూతాని" ఇత్యాదిశ్రుతులకు విరుద్ధమగుటచే అంగీకరించ తగినదికాదు. శత్రువులనగా దుర్మార్గగుణమును పుట్టించు అంతశ్శత్రువులుగ నెంచవలయును. కావున "ఆలస్యాదిరూపం వైరిణం వయంజిఘాంసామః తమపివినాశయ" అని విద్యారణ్యులవారు ఈయనువాక భాష్యమందు వ్రాసినారు. (చెన్నపట్టణం కూర్పుపుట 3౫) మరియు భగవద్గీతయందు "కామఏషః క్రోధ ఏషరజోగుణసముద్భవః। మహాశనో మహాపాప్మా విద్ధ్యేనమిహ వైరిణం" (అధ్యాయం 3 శ్లోకం 3౭) ఇందుకు బ్రాహ్మణము "ధూరసీత్యాహ । ఏషవైధుర్యోఽగ్నిః ++ ధూర్వంతం యోఽస్మాన్ ధూర్వతి తంధూర్వయం వయంధూర్వామ ఇత్యాహ । ద్వౌవావపురుషౌ । యంచైవధూర్వతి । యశ్చైనంధూర్వతి । తావుభౌశుచార్పయతి" ॥ (తై. బ్రా. 3 - ౨ - ౪.) ఇందుకు వినియోగసూత్రము "ధూరసీతిదక్షిణాం యుగధురమభిమృశత్యుత్తరాంవా" (ఆపస్తంబశ్రౌ. ౧. ౧౭- ౬)

## (౫) త్వం దేవానాం అసి సస్నితమం పప్రితమం జుష్టతమం వహ్నితమం దేవహూతమం

### జ్ఞానార్థము.

టీ ॥ (ఓ భగవంతుడా) నీవు దేవానాం=జ్ఞానులకు, సస్నితమం = అత్యంత పరిశుద్ధతను ఇచ్చువాడవు, అసి= అగుచున్నావు, పప్రితమం = అత్యంత సమృద్ధి నిచ్చువాడవు, జుష్టతమం= అత్యంత ప్రియము నిచ్చువాడవు, వహ్నితమం = అత్యంత కాంతినిచ్చువాడవు, (మరియు) దేవహూతమం=స్వర్గమును ఇచ్చువాడవు.

తా ॥ (ఓ భగవంతుడా) నీవు జ్ఞానులకు అత్యంత ఆనందాదులు కలుగచేసి మోక్షమునిచ్చువాడవు.

### కర్మార్థము.

టీ ॥ త్వం = (ఓ శకటమా) నీవు దేవానాం = దేవసంబంధమైన దానవు, అసి = అగుచున్నావు, సస్నితమం= (గనుక నీవు) పరిశుద్ధమైన దానవు గానున్నూ, పప్రితమం= (ధాన్యముచే) నిండియున్న దానవు గానున్నూ, జుష్టతమం = ఇష్టమైన దానవు గానున్నూ, వహ్నితమం = (హవిస్సును) ధరించేదానవు గానున్నూ దేవహూతమం = దేవతలను పిలిచేదానవు గానున్నూ (అగుచున్నావు)

వినియోగము ॥ ఈమంత్రము చెప్పి ఉత్తరనగను స్పృశించి జపము చేయవలయును.

ని ॥ పూర్వమంత్రమునందు పాపములను పోగొట్టుటకు గాను తేజోరూపము భగవంతునకు వర్ణింపంబడెను. భక్తులయెడల అత్యంత దయారసుడుగా ఈమంత్రమందు చెప్పబడుటచే "త్వం" అను సర్వనామము భగవంతునికే కాని మరియొకనికి చెందదు. జ్ఞానుల వహించువాడు గనుక కర్మార్థమందు భగవంతుని శకటముతో పోల్చబడెను, కావుననే భగవంతునికి నారాయణుడు అనగ సర్వాత్మలకు ఆధారుడను పేరుగలిగెను. ఇందుకు ప్రమాణము "నరాణాం నిత్యానామయనమితి నారాయణపదం" (అష్టశ్లోకీ 3 శ్లో) సస్నితమం ప్రపితమమిత్యాదితమ ప్రత్యయములుగల విశేషణములు మనుజునిచేనిర్మింపంబడిన శకటమునకు చెందునో లేక శకటముచే ప్రతిపాదితుడైన భగవంతునికిచెందునో మీరే ఆలోచించుడి. సస్నితమం అనునది (ష్లా) స్నాశుద్ధౌ అను దానివలన నిష్పన్నమైనది. 'వహ్ని' శబ్దమునకు అనేకార్థములుకలవు. అశ్వము, అగ్ని మొదలైనవి. వేదనిఘంటువందు అశ్వార్థమందు ప్రయోగింపపడినది. (వేదనిఘంటువు ౧-౧౪-౬) 'వహప్రాపణే' అను ధాతువవలన వ్యుత్పన్నమైనది. ఇందువలన సమస్తమును ధరించువాడు అని చెప్పవచ్చును. వహ్నితమం' వేదమందు అత్యంతము ప్రకాశార్థమందు ప్రయోగింపబడినట్లు విలియంనిఘంటువులో చెప్పబడినది (పుట [illegible]) ఇట్లు అత్యంత ప్రకాశము

నిచ్చువాడు అని చెప్పుటబాగుగనున్నట్టుల కనుపించుచున్నది 'దేవహూతమం' అనునది, దేవశబ్దము మొదలుకల, దానాదనార్థకమైన 'హు' అను ధాతువునకు 'క్త' ప్రత్యయము చేరుటవలన దేవహూతమం అనిసిద్ధించినది. అనగ భగవంతుడు జీవుల యొక్క ప్రార్థనలనుస్వీకరించి ఇష్టార్థములను ఇచ్చువాడు. స్వర్గమునిచ్చువాడు అనితాత్పర్యము. ఇందుకు బ్రాహ్మణము "త్వందేవానాం+ + + దేవహూతమమిత్యాహ ॥ యథాయజురేవైతత్" (తై. బ్రా. 3- ౨ ౪) ఈబ్రాహ్మణమునకు భాష్యము "మంత్రపదైర్యోర్థో ప్రతీయతేసతత్రైవ" (విద్యారణ్య భాష్యం చెన్నపట్టణంకూర్పు పుట ౭౭) అనగ మంత్రపదమువలననేయర్థముతోచునో అయర్థమేను అయితే మైత్రాయణీ బ్రాహ్మణమందు ఈమంత్రమునకు చెప్పబడిన వ్యాఖ్యానమే మనగ "దేవేభ్యఏవైవద్వహ్నితమంసస్నితమంపప్రితమంజుష్టతమం దేవహూతమం కరోతి" (మైత్రా+ సంహితా బ్రాహ్మణం౪-౧-౫) అనగ జ్ఞానులకొరకే ప్రకాశమును శుద్ధమును పూర్ణత్వమును ప్రియమును స్వర్గ ప్రాప్తిం చేయుచున్నాడు మంత్రమందుండు శబ్దార్థములవలన భగవంతుడుపై జెప్పబడిన గుణములుకలవాడనితోచుచున్నను, మనుజులకు ఇట్టిగుణములను కలుగచేయుచున్నాడని ఈ బ్రాహ్మణము ననుసరించి అర్థము వ్రాయబడినది. ఇందుకు వినియోగసూత్రము "త్వందేవానామసి సస్నితమమిత్యుత్తరా మీషామాలభ్యజపతి" (ఆపస్తంబశ్రౌత ౧ - ౧౭- ౭) 'ఈషే' అనగ "యుగశకటయో, సంబంధ కేదారుణీ" (రుద్రదత్తభాష్యం పుట ౬౨) ఈసూత్రమునకు విద్యారణ్యభాష్యమందు ఉదహరింపంబడిన సూత్రమునకును కించిద్వ్యత్యాసముకలదు.

## ౬. (౧) అహ్రుతం అసి హవిర్ధానం (౨) దృగ్ంహస్వ మా+ హ్వాః.

**జ్ఞానార్థము.**

టీ॥ (౧) అహ్రుతం — కుటిలరహితుడవు, హవిర్ధానం — జీవులను పోషించువాడవు, అసి — అగుచున్నావు, (౨) దృగ్ంహస్వ — దృఢముగనుండుము, మాహ్వాః — చలించకుము.

తా॥ భగవంతుడు పక్షపాత రహితుడై ఎల్లజీవులను రక్షించువాడు గనుక ఓజీవాత్మా నీవు చలించక దృఢముగ నుండుము.

**కర్మార్థము.**

టీ॥ అహ్రుతం — [వడ్లయొక్క బరువుచేత] వంగనిదానవై, హవిర్ధానం — హవిస్సును ధరించుదానవు, అసి — అగుచున్నావు, దృగ్ంహస్వ — [అందువలన] దృఢముగానుండుము హ్వాః — భగ్నము, మా — కాకపోగాక.

వినియోగము ॥ ఈమంత్రముచెప్పి ఆరోహణ చేయవలయును.

వి॥ అహ్రుతశబ్ద వ్యుత్పత్తిని గూర్చి భట్టభాస్కరాచార్యులవారు వ్రాసిన

దేమనగ "హృకాటిశ్యక్త ప్రత్యయః హృహ్వారేఛందసీతినిష్ఠాయాం హ్వఆదేశః" (౧ - ౧ - ౪) హవిశ్శబ్దము మొదట కలిగిన, ధారణపోష ణార్థకమైన "ధా" ధాతువునకు అనాదేశముచే "హవిర్ధానం" అనునదిసిద్ధించునది, దీనిచేహవిస్సును పోషించువాడవు అని అర్థము గ్రాయఃమైనది. (౧) ఇందుకు బ్రాహ్మణము "అహ్రుతమసి హవిర్ధానమిత్యాహ । అనార్త్యై" (తై. బ్రా. ౩ - ౨ - ౪) అనగనాశనము కొరకు కాదు. (౨) ఇందుకు బ్రాహ్మణము "దృగ్ంహస్వమాహ్వాఇత్యాహ । ధృత్యై" (తై. బ్రా. ౩- ౨- ౪) అనగ దృఢముకొరకు. ఇందుకు వినియోగ సూత్రము 'అహ్రుతమసి హవిర్ధానమిత్యారోహతి" (ఆపస్తంబశ్రౌత ౧-౧౭-౯)

## ౭, (౧) మిత్రస్య త్వా చక్షుషా ప్రేక్షే.
## (౨) మా భేః మా సం + విక్థాః మా త్వాహిగ్ంసిషం

జ్ఞానార్థము.

టీ ॥ (౧) మిత్రస్య = స్నేహితుని యొక్క, చక్షుషా = దృష్టి చేతను, త్వా = (ఓజీవాత్మా) నిన్ను, ప్రేక్షే = చూచుచున్నాను. (౨) మాభేః = (నీవు) భయపడకుము, మా+ సంవిక్థాః = (నీవు) చలించకుము, త్వా = నిన్ను మాహిగ్ంసిషం = హింసించను.

తా ॥ ఓజీవాత్మా నిన్ను మిత్రునివలె స్నేహ దృష్టిచేత చూచుచున్నాను. అనగ భగవంతునికి సమర్పణచేయుటవలన నీకు సౌఖ్యము కలుగచేయుచున్నాను.

కర్మార్థము.

టీ॥ త్వా= [ఓధాన్యసముదాయమా] నిన్ను, మిత్రస్య= [జగత్తునకు] మిత్రుడైన సూర్యునియొక్క, చక్షుషా = నేత్రముచేత, ప్రేక్షే = చూచుచున్నాను, భేః=[గనుకనీవు] భయపడకుము, మా+ సంవిక్థాః=చలించకుము, త్వా= నిన్ను మా + హిగ్ంసిషం=హింసించను.

వినియోగము॥ ఈమంత్రము చెప్పి పురోడాశీయమును చూడవలయును.

వి॥ (౧) ఇందుకు బ్రాహ్మణము "మిత్రస్యత్వాచక్షుషాప్రేక్షేఇత్యాహ । మిత్రత్వాయ" (బ్రా. ౩- ౨- ౪) ఈ బ్రాహ్మణమునకు విద్యారణ్య భాష్యం "అనుకూలోయమితిబుధ్యుత్పాదనాయ (౧ - ౧- ౪) అనగ ఇతడను కూలుడనీ బుద్ధి పుట్టించుటకొరకు. (౨) 'మాభేః' ఇది మధ్యమ పురుష ఏకవచనము దీనికి లౌక్యపదము 'మాభైషీః' అనునది '(ఞి) భీభయే' అను ధాతువువలనవ్యుత్పన్నమైనది. అపాదాది అయినధాతువులకుసామాన్యముగాఅనుదాత్తము సంభవించుచుండగ 'భేః' అనుపదమునకు ఉదాత్తస్వరముతో ఉచ్చరించుటకు కారణ మేమనగ "చాదిలోపేవిభాషా" (పా ౮ - ౧ - ౬౩) అనగ, చ, వా, హ, ఏవ, అను

వాటికిక్లోపము గలిగెనేని ప్రథమ మందుండు ధాతువునకు అనుదాత్తము వికల్పముగ కలుగునను విశేషసూత్రము. మాచ భేఃమా చ సంవిక్థాః అనుచోట 'చ' అనుదానికి లోపము వచ్చుటచే ప్రథమమైన తిఙ్వ్యభక్తికి అనుదాత్తము సిద్ధించెదాని వలన ధాతుస్వరమైన ఉదాత్తమే 'భేః' అను దానికి కలిగినది. విక్థాః అనునది గౌడమవచ్చౌటవలన నిఘాతస్వరము సిద్ధించినది (౨) ఇందుకు బ్రాహ్మణము " మాభేర్మాచ సంవిక్థా మాత్వాహింసిషమిత్యాహ హింసాయై " (తై. బ్రా. ౩ - ౨ - ౪ అనగ హింస కొరకు కాదు. ఇందుకు వినియోగసూత్రము " మిత్రస్యత్వా చక్షుషా ప్రేక్ష ఇతిపురోడాశీయాన్ ప్రేక్షతే" (ఆపస్తంబశ్రౌత ౧- ౧౭-౯).

## ౮. ఉరు వాతాయ.

**జ్ఞానార్థము.**

టీ॥ వాతాయ = భగవంతునికొరకు ఉరు=విశాలమైనదానవు అగుము.

తా॥ ఓ (జీవాత్మానివు) భగవదనుగ్రహము నీయందు ప్రసరించుటకు హృదయగ్రంధినివిప్పుము.

**కర్మార్థము.**

టీ॥ వాతాయ= [ధాన్యగోతమునకు చెయ్యబడే ద్వారమా నవు] వాయుసంచారముకొరకు, ఉరు= విశాలమైనదానవు [అగుము]

వినియోగము॥ ఈమంత్రముచెప్పి గోతము ముడివిప్పవలయును.

వి॥ 'వాతాయ' చతుర్థి విభక్తి " వాతః, వాయుః" ఈశబ్దములు ఏకార్థములు " వీగతిగంధనయోః" అను ధాతువు వలన వ్యుత్పన్నమైనవి. వ్యాపించువాడు అని అర్థము. ఈపదములు భగవత్పరము ప్రసిద్ధి. "ఓంతద్వాయుః" (నారాయణోపనిషత్తు కలకత్తాకూర్పు అనువాకం ౪౯ పుట ౧౫౭)"వైకుంఠః పురుషః ప్రాణః ప్రాణదః ప్రణవః పృథుః। హిరణ్యగర్భశ్శత్రుఘ్నో వ్యాప్తోవాయురధోక్షజః" (శ్రీమహాభారతం అనుశాసనికపర్వం అ ౧౪౯. శ్లో ౫౭) హృదయగ్రంథి అనగ ఆత్మను భగవంతునియందు ప్రవేశింపనివ్వని సంసారబంధము. "అవిద్యాసంబంధరూపే సంసారబంధే" అని తారానాథవాచస్పత్యమందు వ్రాయబడినది. (పుట ౫. ౪౩౩) ఇట్టి బంధనను ఛేదించి భగవత్ప్రసరణ కలుగునటులచేయవలయును, కావుననే " భిద్యతెహృదయగ్రంధిః"అని భాగవతమందు చెప్పబడినది. ఈఅర్థమునే బ్రాహ్మణమున్ను తెలియచేయుచున్నది. " ఉరువాతాయేత్యాహ। అవారుణమేవైనత్కరోతి" (తై. బ్రా. ౩.౨-౪) అనగ అవారుణమునే చెయ్యవలసినది. అవారుణమనగ వరుణసంబంధము కానిది. వరుణమనగ భగవద్వ్యాపకము కానిది. అదియె అజ్ఞానమను సంసారసాగరము "యద్వైకించవాతోనాభివాతి। తత్సర్వం వరుణదైవత్యం" (తై. బ్రా. (౩-౨-౪) దేనినిభగవంతుడుపొందడో అదియావత్తు

వరుణసంబంధము గనుక ఆట్టిగ్రంధిని “వాతాయ” భగవత్ప్రసరణనిమిత్తము “ఉరు”విప్పవలయును. ఈయర్థమునే ఉపనిషత్తులున్ను తెలియచేయుచున్నవి. “యదా సర్వే ప్రభిద్యంతే హృదయస్యేహ గ్రంథయః । అథమర్త్యో ఽమృతో భవత్యేతావదనుశాసనం” (కఠోపనిషత్ ౬ ౧౫) అనగా కామాదులను హృదయము యొక్క ముళ్లు ఎపుడు తెంపబడునో అప్పుడు ఉపాసకుడు మోక్షమును బొందును. “భిద్యతే హృదయ గ్రంథిశ్ఛిద్యంతే సర్వ సంశయాః । క్షీయంతే సర్వకర్మాణి తస్మిన్ దృష్టే పరావరే” (ముండకోపనిషత్ ౨-౨-౯-) ఇందుకు వినియోగసూత్రము “ ఉరువాతాయేతి పరిణాహమపచ్ఛాద్య” (ఆపస్తంబ శ్రౌత ౧- ౧౭- ౯)

౯. దేవస్య త్వా సవితుః ప్రసవే అశ్వినోః భాహుభ్యాం పూష్ణః హస్తాభ్యాం అగ్నయే జుష్టం నిర్వపామి.

జ్ఞానార్థము.

టీ॥ సవితుః = ప్రేరకుడైన, దేవస్య = భగవంతునియొక్క, ప్రసవే = ప్రేరణ కలుగుచుండగ, అశ్వినోః = అశ్వులయొక్క, బాహుభ్యాం = భుజములచేత. పూష్ణః = పూషయొక్క, హస్తాభ్యాం = హస్తములచేత, త్వా = (ఓ జీవాత్మా) నిన్ను, అగ్నయే = భగవంతునికొరకు, జుష్టం = ఇష్టమగునటుల, నిర్వపామి = సమర్పించుచున్నాను.

తా ॥ (ఓజీవాత్మా) నిన్ను ఎల్లప్పుడు నియమముతో భగవంతునికి సమర్పించుచున్నాను.

కర్మార్థము.

టీ॥ త్వా = ఓ ధాన్య సముదాయమా నిన్ను, సవితుః = ప్రేరకుడైన, దేవస్య = దేవునియొక్క ప్రసవే = ప్రేరణ కలుగుచుండగా, అశ్వినోః = అశ్వనిదేవతలయొక్క, బాహుభ్యాం = భుజములచేతను, పూష్ణః = పూషణయను దేవతయొక్క, హస్తాభ్యాం = చేతులచేతను, అగ్నయే = అగ్నిదేవత కొరకు, జుష్టం = ఇష్టమగునటుల, నిర్వపామి = ఉంచుచున్నాను.

వినియోగము॥ ఈమంత్రము చెప్పి ధాన్యమును ఉంచవలయును.

వి॥ అశ్విన్ శబ్దము యొక్కయు పూషశబ్దము యొక్కయు అర్థమును గూర్చి భిన్నాభిప్రాయములు కలవు. అశ్వినులనగ విబుధులలో యజ్ఞము చేయించువారికి పేరైనటుల బ్రాహ్మణమందు చెప్పబడని జ్ఞానులు యజ్ఞాదులను పుణ్యకర్మలను చేసి దేవత్వమును పొందినటుల ప్రసిద్ధియైయున్నది. “సహ దేవమనుష్యా అస్మిన్ లోకే పురా బభూవుః। అథ దేవాః కర్మభిర్దివం జగ్మురహీయంత మనుష్యాః। తేషాం యే తథా కర్మాణ్యారభంతే సహ దేవైః బ్రహ్మణా చాముష్మిన్ లోకే భవంతి” (ఆపస్తంబీయ ధర్మసూత్రము. ౨. ౭- ౧౬- ౧) దేవతలు యజ్ఞాదులను చేసినపుడు అధ్వర్యు

ము చేసిన వారు అశ్వినులని చెప్పబడిరి. అటువంటివారివలెనే నిర్మలమయిన భుజములతో తానును భగవత్పూజ చేయవలయునని చెప్పుచున్నాడు "అశ్వినోర్బాహుభ్యామిత్యాహ । అశ్వినౌ హి దేవానా మధ్వర్యూ ఆస్తాం"(తై. బ్రా. ౩-౨-౪). "పూష్ణోహస్తాభ్యాం" అనగ 'యత్యై' నియమముకొరకు అని బ్రాహ్మణమందు అర్థము చెప్పబడుచున్నది. బ్రాహ్మణము ననుసరించి అశ్వినీదేవతలవలెనే నియమముతో సమర్పించుచున్నాను అని అర్థము చెప్పవచ్చును. లేదా యాస్కమహాముని చెప్పిన వ్యాఖ్యానము ననుసరించి మరియొకవిధముగను అర్థము చెప్పవచ్చును. "అశ్వినౌ యద్వ్యశ్నువాతే సర్వం రసే నాన్యో జ్యోతిషాన్యః అశ్వైరశ్వినా విత్యౌర్ణవాభః । తత్కావశ్వినౌ ద్యావా పృథివ్యావిత్యేకే । అహోరాత్రావిత్యేకే। సూర్యాచంద్రమసావిత్యేకే రాజానౌ పుణ్యకృతావిత్యైతిహాసికాః। తయోః కాల ఊర్ధ్వమర్ధరాత్రాత్ప్రకాశీభావస్యానువిష్టంభమను। తమోభాగో హి మధ్యమో జ్యోతిర్భాగ ఆదిత్యః। తయోరేషా భవతి" (నిరుక్తం దైవతకాండ ఉత్తరషట్కం౧౨-౧) అనగ సర్వమును ఒకటి రసముతోను ఒకటి జ్యోతిస్సుతోను వ్యాపించుచున్నవిగనుక అశ్వినులు, గుఱ్ఱములవంటివి గనుక అశ్వినులని ఔర్ణవాభుడు చెప్పుచున్నాడు అటులయితే ఏవి అశ్వినులు? ద్యావాపృథువులని కొందరున్ను, అహోరాత్రులని కొందరున్ను, సూర్యచంద్రులని కొందరున్ను, పుణ్యవంతులయిన ఇద్దరు రాజులని ఇతిహాసకులున్ను, చెప్పుచున్నారు. వారి కాలము మధ్యరాత్రికి పైనిన్ని ప్రకాశించుట ఆటంకపడినపుడు చీకటి యొక్క భాగమున్ను సూర్యసంబంధమయిన జ్యోతి ర్భాగమున్ను అత్యంతము మధ్యమము ఈ రెంటిది, ఇది యగుచున్నది. అనగ సంధ్యాకాలములు, యాస్కునిచే చెప్పబడిన ఈఅంశము కఠినముగనుండుట వలన దీనికి దుర్గాచార్యునిచే చెప్పబడిన భాష్యము ఇచట వ్రాయచున్నారము "తయోః కాల ఊర్ధ్వమర్ధ రాత్రాత్ప్రకాశీభావస్యాను విష్టంభం। జ్యోతిషా వ్యతిభిద్యమానమూర్ధ్వమర్ధరాత్రాత్తమో యదా జ్యోతి అనువిష్టంభనాతి సోఽశ్వినోః కాలః। తతః ప్రభృతి సంధిష్టోత్తర పురోదయాదశ్వినం। ఉదితే సౌర్యాణి। తత్ర యత్తమో అనువిష్టజ్యోతిషి తద్భాగో మాధ్యమస్యరూపం। యజ్జ్యోతిః తమసి అనువిష్టం తద్భాగం తద్రూపమాదిత్యః। తావేతౌ మధ్యమోత్తమౌ వితిస్వమతమాచార్యస్య। యతః సమర్థనాయ ఉదాహరతి తయోరేషా భవతి వసాతిషుస్తేతి" అనగ ప్రాతఃకాల సంధ్యాకాలములయొక్క సంధివేళలు అశ్వినులని చెప్పబడును. వీటికే 'నాసత్య' 'దస్ర' అనిపేరులు. ఇందువలన 'అశ్వినోర్బాహుభ్యాం' అనగ సంధ్యాకాలములయందు అని చెప్పవచ్చును. పూష అనగ సూర్యుడను అర్థము కూడా కలదు. రాత్రింపగళ్లు చేయువాడు కనుక ఈరెండున్ను ఆయన హస్త

ములని చెప్పవచ్చును. ఆయనకు సహస్ర కిరణములు కలిగియుండుటచే 'సహస్రకరః' అనిపేరుయున్నను హస్తాభ్యాం అనుద్వివచనముచే రాత్రింబగళ్లని ఊహింపవలెను. ఆయన ఉదయాస్తమానములను పొందుటలేదనియు రాత్రింబగళ్లను చేయువాడనియు ఐతరేయ బ్రాహ్మణమందు చెప్పబడినది. "సవా ఏష న కదాచనాస్తమేతి । నోదేతితం యదస్తమేతీతి మన్యంతేఽహ్న ఏవ తదంతమిత్వా అథాత్మానం విపర్యస్యతే రాత్రిమేవావస్తాత్కురుతే అహః పరస్తాదథ యదేనం ప్రాతరుదేతీతి మన్యంతే । అహరేవావస్తాత్కురుతే" (3 - ౪౪-) ఇందుకు తాత్పర్యము. ఆయన ఎప్పుడున్ను ఉదయించడు ఎప్పుడున్ను అస్తమించడు. ఒకవైపున పగటినిన్ని రెండవవైపున రాత్రినిన్ని చేయుచున్నాడు. ఇందువలన రాత్రింబగళ్లు సంధ్యాకాలములయందు భగవంతునికి నాచిత్తమును సమర్పించుచున్నానని ఈమంత్రమునకు అర్థము చెప్పవచ్చును. సంధ్యాకాలములను కూడా ప్రత్యేకముగ చెప్పుటకుప్రయోజనము హిరణ్యకశిపునియొక్క వధకాలములను గూర్చి పురాణమందు చెప్పిన సంగతిని గ్రహించిన యెడల స్పష్టమౌను. అగ్నిశబ్దము పరబ్రహ్మ వాచకమైనటుల ఇదివరకు వ్రాసిన ప్రమాణముల వలననే స్పష్టమగుచున్నది. మరియు శతపథబ్రాహ్మణమున్ను ఈఅర్థమునే తెలియచేయుచున్నది. 'బ్రహ్మాహ్యగ్నిః' (౧-౪- ౨ ౧౧) అందుకువినియోగసూత్రము "దేవస్యత్వేత్యను దృత్య అగ్నయేజుష్టం నిర్వపామి" (ఆపస్తంబశ్రౌతం౧- ౧౭ ౧౨)

## ౧౦. అగ్నిషోమాభ్యాం.

### జ్ఞానార్థము.

టీ ॥ అగ్నిషోమాభ్యాం — అగ్నియని పేరు గలిగినట్టియు సోమమని పేరు గలిగినట్టియు, భగవంతుని కొరకు (జీవాత్మను) సమర్పించుచున్నాను.

తా ॥ (ఓజీవాత్మా) అగ్నిసోములనే పేరుగల భగవంతునికి నిమ్ములను సమర్పించుచున్నాను।

### కర్మార్థము.

టీ॥ అగ్నిషోమాభ్యాం — అగ్నిషోమ దేవతల కొరకు (ఇష్టమగునటుల ధాన్యమును యెత్తిపోసి కొనుచున్నాను).

వినియోగము ॥ ఈ మంత్రము చెప్పి పౌర్ణిమదినమందు ఉంచవలెను.

వి॥ అగ్నిశబ్దమును గూర్చి ౯ మంత్రము చూడుము సోమశబ్దము భగవత్పరము ప్రసిద్ధి "సోమపోఽమృతపస్సోమః పురుజిత్పురుసత్తమః । వినయోజయస్సత్యసంధో దాశార్హస్సాత్వతాంపతిః" (భారతం అనుశాసనిక పర్వము అధ్యా ౧౪౯ శ్లో ౮౭) భగవంతునికి ఏకవచన, ద్వివచన, బహువచనములు పుల్లింగ స్త్రీలింగ

నపుంసక లింగములు, అభేదముగ ప్రయోగింపదగును, లింగవచనరాహిత్యుడు గనుక అట్లు ప్రయోగించుటయందు నేమియు దోషములేదు. కావుననే శ్రీమధ్వాచార్యులవారు ఋగ్వేదభాష్యమందు "ద్విరూపత్వం బహుత్వంచ విశేషాదేవ తత్త్వతః । ఏకస్యైవ హరేర్నాత్ర భేదశ్శంక్యః కథంచన" (౧-౨-౪) అనిచెప్పిరి అనగా, ఒక్కడైన భగవంతునికి కేవలం ఆధిక్యతచే ద్వివచనము బహువచనము ప్రయోగింపం బడుచున్నవి. ఇందువలన వేరువేరు అని యంతమాత్రము శంకించ కూడదు. ఈమంత్రమునకు బ్రాహ్మణమందు ప్రత్యేకవ్యాఖ్యానము చెప్పియుండుట లేదు. మైత్రాయణీ సంహితయందు ఈ ౯ - ౧౦ మంత్రములు ఎటుల పఠించబడుచున్నవనగ "అగ్నయేవోజుష్టాన్నిర్వపామి అముష్మైవోజుష్టాన్" (౧-౧-౫) ఇందువలన ఆలోచించగను 'అగ్నయే' అని ఉచ్చరించినను 'అగ్నీషోమాభ్యాం' అని ఉచ్చరించినను ఒకనికే చెందునటుల అర్థమగుచున్నది. 'అముష్మై' అనగవీని కేను. ఇందుకువినియోగసూత్రము "అగ్నీషోమాభ్యామితి పౌర్ణమాస్యాం ఇంద్రాగ్నిభ్యామిత్యమావాస్యాయాం" (ఆపస్తంబ౧ - ౧౮- ౧) ఇందువలన కూడా ఏపేరు అయినను ఆయన కుపయోగించవచ్చునని కనిపించుచున్నది. అగ్నీషోమ, ఇంద్రాగ్ని, సోమ, ఇంద్ర, అగ్ని, ఈమొదలయినఅన్ని పేర్లు ఒక్కభగవంతునికే చెందునని గ్రహించదగును.

## ౧౧- ఇదందేవానాం-

| జ్ఞానార్థము. | కర్మార్థము. |
| --- | --- |
| టీ॥ ఇదం = ఈ సమర్పించుట, దేవానాం = జ్ఞానులకు (ప్రియమైనది) | టీ॥ ఇదం = (చాటయందుంచబడిన) ఈధాన్యము దేవానాం = దేవతలకే. |
| తా॥ జీవాత్మను భగవదర్పణచేయుటయనునది జ్ఞానులకార్యమను. | వినియోగము॥ ఈమంత్రము చెప్పి చాటయందుంచబడిన ధాన్యమును స్పర్శించవలయును. |

వి॥ ఈ ౧౧- ౧౨ మంత్రములకు బ్రాహ్మణమందు ఏకవ్యాఖ్యానము చేయబడినది "ఇదం దేవానామిదము నస్సహేత్యాహ వ్యావృత్త్యై" (తై. బ్రా. ౩ - ౨ - ౪) ఇందుకు వినియోగసూత్రము "ఇదం దేవానామితి నిరుప్తానభిమృశతి" (ఆపస్తంబశ్రౌత ౧-౧౮-౨).

౧౨. ఇదం ఉ నః సహాః-

జ్ఞానార్థము.

టీ ॥ ఇదం = ఈ (జీవాత్మను భగవంతునికి సమర్పణ చేయుట) సహ = (జ్ఞానులతో) కూడుకొన్న నః+ ఉ =మాకున్ను (ఇష్టమైనది).

తా ॥ ఈజీవాత్మను భగవత్సమర్పణ చేయుటయనునది, జ్ఞానులతో చేరుటచే మాకును ఇష్టమైనది.

కర్మార్థము.

టీ॥ ఇందం (బండియందున్న) ఈ ధాన్యము, సహ = (దేవతలతో) కూడుకొన్న, నః = మాకు.

వినియోగము ॥ ఈమంత్రము చెప్పి మిగిలిన ధాన్యము స్పృశించవలయును.

---

వి ॥ 'ఉ' అనుపదము "చాదయోఽసత్త్వే" అను సూత్రమునుపట్టి నిపాతగణములో చేరినది (పా ౧-౪-౫౭-) ఈనిపాతకు 'తు' అని అర్థము విద్యారణ్యభాష్యమందు చెప్పబడినది మరియు "అథయోఽప్రవృత్తే అర్థేమితాక్షరేషుగ్రంథేషు వాక్యపూరణా ఆగచ్ఛంతి, పదపూరణాస్తే" అనియాస్కుడుచెప్పెను(నిరుక్తం, ౧ ౯) ఇందుకుభాష్యము "యేఽప్రవృత్తేపరిసమాప్తే అర్థే అసైర్యరేవవాక్యగతైః పదైరమితాక్షరేషుగద్యగ్రంథేషు వాక్యపూరణా ఆగచ్ఛంతిపదపూరణార్థాస్తఏవమితాక్షరేషుభవంతి। ఉభయత్రాపితుతే అనర్థకాః। అనర్థాంతరవాచకాః। ప్రకృతాదర్థాన్నకించిదర్థాంతరంద్యోతయంతి । పదమేవవాక్యమేవ వాపూరయితవ్యమిత్యయ మేవహితేషామర్థేనాన్యదర్థాంతరం। ఉక్తంచ ॥ క్రియావాచకమాఖ్యాతముపసర్గోవిశేషవత్ । సత్వాభిధాయకంనామ నిపాతఃపదపూరణః ॥ కితమేపునస్తేకమీమిద్వితి । ఏతేచత్వారః । కమ్, ఇమ్, ఇత్, ఉ, ఇతి" (దుర్గాచార్యభాష్యం కలకత్తాకూర్పు పుట ౭౪) మనుజుడు సాధారణముగ ఇహసౌఖ్యమునే చూచునుగాని, పరసౌఖ్యముచూచుటఅసాధారణము. అట్టిసుగుణముసత్సంగత్వమువలన గల్గునని ప్రసిద్ధిగనుక జ్ఞానులతో కూడిన మాకుభగవత్సేవయందు ప్రియముకలుగునని సంగతిని బోధించుటకుగాను "సహ"శబ్దము ఈమంత్రమందు ప్రయోగింపబడినది. ఈ ౧౨వ మంత్రమునకున్ను పూర్వమంత్రమునకున్ను బ్రాహ్మణము ఏక మౌటవలన ౧౧వ మంత్రముక్రింద బ్రాహ్మణము వ్రాయబడినది. ఇందుకు వినియోగసూత్రము "ఇదమునస్సహేత్యవశిష్టాన్" (ఆపస్తంబశ్రౌత ౧-౧౮-౨)

## ౧౩- స్ఫాత్యై త్వా న అరాత్యై-

**జ్ఞానార్థము**

టీ॥ త్వా = (ఓజీవాత్మ) నిన్ను స్ఫాత్యై=జ్ఞానాభివృద్ధికొరకు (సమర్పించుచున్నాను), అరాత్యై = కామాద్యరిషడ్వర్గమనే శత్రువులకొరకు, న= కాదు.

తా॥ (ఓజీవాత్మా) నిన్ను భగవంతునికి సమర్పించుటవలన నీకు జ్ఞానాభివృద్ధి కలుగును, కామాదులునశించును.

**కర్మార్థము.**

టీ॥ త్వా = [ఓహవిస్సా] నిన్ను, స్ఫాత్యై= అభివృద్ధికొరకు [అభిమంత్రణము చేయుచున్నాను], అరాత్యై = [ఆ అభివృద్ధి] దేవతలకు దానమివ్వకుండానుండుటకు, న= కాదు.

వినియోగము॥ ఈమంత్రము చెప్పి ఉంచబడినదానిని స్పృశించవలయును.

---

వి॥ "అరాతి" అనగ "అరాతీనాం షట్ సఙ్ఖ్యానాం కామాదీనాంఅంతరరిపూణాం సంఖ్యాసామ్యాత్" అని తారానాథ వాచస్పతి చెప్పియున్నారు (పుట ౩౫౪) ఇందుకు వ్యుత్పత్తి "అ+రాతి= న+రాతి. రా=దానే. సుఖం నదదాతీత్యరాతిః" ఇందుకు బ్రాహ్మణము "స్ఫాత్యై త్వా నారాత్యా ఇత్యాహ గుప్త్యై" (తై. బ్రా. ౩- ౨ - ౪) అనగ, రక్షణకొరకు, ఇందుకు, వినియోగ సూత్రము "స్ఫాత్యై త్వా నారాత్య ఇతినిరుప్తా నేవాభిమంత్ర్య" (ఆపస్తంబశ్రౌత ౧-౧౯-౩)

---

## ౧౪- సువః అభి + వి + ఖ్యేషం-

**జ్ఞానార్థము.**

టీ॥ సువః=స్వర్గలోకమును, అభివిఖ్యేషం= తెస్స గా చూచుచున్నాను.

తా॥ ఈప్రకారము చేయుటవలన స్వర్గమును పొందుచున్నాను.

**కర్మార్థము.**

టీ॥ సువః=విహార ప్రదేశమును, అభివి=అంతటను విశేషముగా, ఖ్యేషం = చూచుచున్నాను.

వినియోగము॥ ఈ మంత్రము చెప్పి విహార ప్రదేశమునంతయు చూడవలయును.

---

వి॥ ఈమంత్రమును ౧౫ వ మంత్రమును చేర్చి ఏకమంత్రముగ బ్రాహ్మణమందు వ్యాఖ్యానము చేయబడినది. "సువరభివిఖ్యేషం వైశ్వానరం జ్యోతిరిత్యాహ। సువరేవాభివిపశ్యతి" (తై. బ్రా. ౩ - ౨ - ౪) అనగ స్వర్గలోకమునే చూచుచున్నాడు. ఇందుకు వినియోగసూత్రము "సువరభివిఖ్యేషమితి సర్వంవిహారమనువీక్షతే" (ఆపస్తంబశ్రౌతం ౧- ౧౯- ౪)

## ౧౫- వైశ్వానరం జ్యోతిః-

**జ్ఞానార్థము.**

టీ॥ వైశ్వానరం = సర్వజీవులను పరమపదమును పొందించునట్టి, జ్యోతిః = పరబ్రహ్మను (పొందుచున్నాను)

**కర్మార్థము.**

టీ॥ జ్యోతిః = [స్వర్గప్రకాశమైన] జ్యోతిస్స్వరూప, వైశ్వానరం = ఆహవనీయాగ్నిని (చూచుచున్నాను).

వినియోగము ॥ ఈమంత్రము చెప్పి ఆహవనీయాగ్నిని చూడవలయును.

---

వి ॥ వైశ్వానరశబ్దముయొక్క వ్యుత్పత్తిః "వైశ్వానరానితో లోకాల్లోకాంతరం నయతీతి" (వేదనిఘంటువు కలకత్తాకూర్పు పు. ౪౬) వైశ్వానరశబ్దము భగవత్పరమైనందుకు బ్రహ్మసూత్ర వైశ్వానరాధికరణమందు చెప్పబడినది. "వైశ్వానరస్సాధారణ శబ్దవిశేషాత్" (౧ - ౨ - ౨౪) "వైశ్వానరః పరమేశ్వర ఇతి సిధ్యతినతు జఠరాగ్నిర్వాభూతాగ్నిర్వా తదభిమానినీ దేవతానవాజీవ ఇతి శంకర భాష్యతాత్పర్యం" "వైశ్వానరో విష్ణురేవ" (మధ్వభాష్యం కలకత్తాకూర్పు పు. ౨౭) "వైశ్వానరశబ్దో బ్రహ్మైవాభిధత్తే ఇతి విజ్ఞాయతే" ఇతి రామానుజాచార్యః "వైశ్వానరః పరమాత్మేతి" వల్లభః (షడ్దర్శనచింతనిక పునహా కూర్పు పుట ౧౭౬) జ్యోతిశబ్దము పరబ్రహ్మపరమైనటుల బ్రహ్మసూత్ర జ్యోతిరధికరణమందు చెప్పబడినది (౧- ౧- ౨౪) "తస్మాదిహ జ్యోతిరితి బ్రహ్మ ప్రతిపత్తవ్యం" అని శ్రీశంకరాచార్యులవారు చెప్పియున్నారు. (చన్నపట్టణం కూర్పు పుట ౭౫ "ద్యుసంబంధితయా నిర్దిష్టం నిరతిశయదీప్తియుక్తం జ్యోతిః పరమపురుష ఏవ" అని శ్రీరామానుజాచార్యులవారు చెప్పియున్నారు. "విష్ణురేవజ్యోతిః" అని శ్రీమధ్వాచార్యులవారు చెప్పియున్నారు. (కలకత్తాకూర్పు ౧౬) ఇచట వైశ్వానరం జ్యోతిః అను రెండు పదములు ఉపయోగింపబడుటవలన వ్యుత్పత్తి అర్థమునుబట్టి వైశ్వానరమను పదము విశేషణముగను జ్యోతిః అనుపదము విశేష్యముగను అర్థము వ్రాయబడినది దీనికి బ్రాహ్మణమును గూర్చి ౧౧-వ మంత్రమును చూడుము. ఇందుకు వినియోగసూత్రము "వైశ్వానరం జ్యోతిరిత్యాహవనీయం" (ఆపస్తంబ శ్రౌత ౧ - ౧౭ - ౪)

---

## ౧౬- దృగ్ంహంతాం దుర్యాః ద్యావాపృథివ్యోః-

**జ్ఞానార్థము.**

టీ॥ ద్యావాపృథివ్యోః = ఇహపరలోకములయందు (మాయొక్క) దుర్యాః = సౌఖ్యములు, దృగ్ంహంతాం = దృఢముగానుండుగాక,

తా॥ ఓభగవంతుడా మాయొక్క ఇహపరసౌఖ్యములు దృఢముగనుండుగాక

**కర్మార్థము.**

టీ॥ ద్యావాపృథివ్యోః = ఇహలోకపరలోకమందుండు, దుర్యాః = (మా) గృహములు, దృగ్ంహంతాం = దృఢముగానుండుగాక.

వినియోగము॥ ఈమంత్రము చెప్పి దిగవలయును.

వి॥ దుర్యాః అను పదమునకు వేదనిఘంటు వ్యాఖ్యానమందు దేవరాజయజ్వాను వ్రాసినదేమనగ «ధుర్వీహింసార్థః|అఘ్న్యాదిత్వాత్ యత్ప్రత్యయేవ కారలోపే దీర్ఘాభావశ్చనిపాత్యతే । హింసంతిమీనాతిహింతందుఃఖం" (నిరుక్తనిఘంటు పుట ౩౦౯) దుఃఖములనుపోగొట్టిసుఖములిచ్చునది. ఇందుకుబ్రాహ్మణము "దృగ్ంహంతాం దుర్యాద్యావా పృథివ్యోరిత్యాహ। గృహాణాం ద్యావాపృథివ్యోర్ధృత్యై" (తై బ్రా- ౩- ౨ - ౪-) అనగ స్థిరముగనుండుటకొరకు ఇందుకు వినియోగసూత్రము "దృగ్ంహంతాం దుర్యాద్యావా పృథివ్యోరితి ప్రత్యవరోహ్య" (ఆపస్తంబశ్రౌత ౧- ౧౮- ౪)

## ౧౭- ఉరు అంతరిక్షం + అను ఇహి-

**జ్ఞానార్థము.**

టీ॥ ఉరు=(ఓజీవాత్మా)గొప్పదియగు, అంతరిక్షం=పరమాత్మను, అను + ఇహి = పొందుము.

తా॥ (ఓజీవాత్మానీవు) భగవంతుని పొందుము.

**కర్మార్థము.**

టీ॥ ఉరు = [ఓధాన్యహవిస్సానీవు] విశాలమగుచున్న, అంతరిక్షం= ఆకాశము తో, అన్విహి=పొందుము.

వినియోగము॥ ఈమంత్రముచెప్పితీసికొనవలయును.

వి॥ అంతరిక్షశబ్దమునుగూర్చి తైత్తిరీయా ఆరణ్యక భాష్యమందు వ్రాసినదేమనగ «అంతరిక్షమాత్మా" (అనువాకం ౫౨) ఇచటపరమాత్మనియర్థముచెప్పవచ్చును. ఇందుకు బ్రాహ్మణము «ఉరుఅంతరిక్ష మన్విహీత్యాహగత్యై" (తై. బ్రా. ౩- ౨- ౪) అనగపొందుటకొరకు. ఇందుకు వినియోగసూత్రము "ఉర్వంతరిక్షమన్విహీతిహరతి" (ఆపస్తంబశ్రౌత ౧- ౧౮- ౪)

## ౧౮. అదిత్యాః త్వా ఉప + స్థే సాదయామి-

**జ్ఞానార్థము.**

టీ॥ అదిత్యాః=భగవంతునియొక్క ఉపస్థే=సమీపమందు, త్వా = (ఓజీవాత్మా) నిన్ను సాదయామి = ఉంచుచున్నాను.

తా॥ ఓజీవాత్మా నిన్ను భగవంతునియొక్క సమీపమందుంచుచున్నాను.

**కర్మార్థము.**

టీ॥ త్వా = [ఓధాన్యహవిస్సా] నిన్ను, అదిత్యాః = భూమియొక్క, ఉపస్థే=సమీపమందు, సాదయామి = ఉంచుచున్నాను.

వినియోగము॥ ఈ మంత్రముచెప్పిగార్హపత్యాగ్ని సమీపమందుంచవలయును.

వి ॥ ఈమంత్రమునకు బ్రాహ్మణము "అదిత్యాస్త్వోపస్థే సాదాయామీత్యాహ ఇయంవా అదితిః । అస్యా ఏవైనదుపస్థే సాదయతి" (తై. బ్రా. ౩ - ౨ - ౪) ఇందుకువినియోగ సూత్రము "అదిత్యాస్త్వోపస్థే సాదయామీత్యుత్తరేణ గార్హపత్యం యథాదేవత ముపసాదయతి" (ఆపస్తంబశ్రౌత ౧- ౧౫- ౭)

## ౧౯- అగ్నే హవ్యం రక్షస్వ-

| జ్ఞానార్థము. | కర్మార్థము. |
|---|---|
| టీ॥ అగ్నే — ఓపరమాత్మా, హవ్యం — జీవాత్మను, రక్షస్వ— రక్షించుము. | టీ॥ అగ్నే - ఓ గార్హపత్యాగ్ని [నీవు], హవ్యం — హవిస్సును, రక్షస్వ— రక్షించుము. |
| తా॥ ఓభగవంతుడా జీవాత్మను రక్షించుము. | వినియోగము॥ ఈమంత్రముయొక్క వినియోగమునుగూర్చి వివరము చూడవలయును. |

వి ॥ ఇందుకు బ్రాహ్మణము "అగ్నే హవ్యగ్ం రక్షస్వేత్యాహ । గుప్త్యై" (తై. బ్రా. ౩ - ౨ - ౪) రక్షణకొరకు. ఇందుకు ప్రత్యేక వినియోగసూత్రము ఆపస్తంబులచే చెప్పబడలేదు పూర్వసూత్రములు "అపరేణ" అని చెప్పటచేతం డవలైన ఈమంత్రము చెప్పి "యథాదేవతం" అనగ ఇష్టమైన దేవతాసమీపమందు ఉంచవలయును. యథాదేవతం అని చెప్పటవలన "అగ్నే హవ్యంరక్షస్వ" లేక "అగ్నీషోమౌ హవ్యం రక్షేథాం" అనిగాని ఉంచవలసినది. అయితే విద్యారణ్యభాష్యమందు "గార్హపత్యమభిమంత్రయతే, అగ్నే హవ్యంరక్షస్వేతి" చెప్పబడినది. (చెన్నపట్టణం కూర్పు పుట ౨౦) మైత్రాయణీ సంహితయందు "అగ్నే హవ్యంరక్షస్వేతిపురడుపసాదయతి అగ్ని దేవహవ్యం రక్షతే' అనిచెప్పియున్నది. (౪- ౧- ౭) ఈమంత్రమునకు వ్యాఖ్యానమందు మహీధరాచార్యులవారు చెప్పినదేమనగ "హే అగ్నే తవసమీపే స్థాపితమిదం హవ్యం త్వం రక్ష, సుప్తప్రమివబాధకేభ్యః పాలయ" అనగ ఓపరమాత్మా నీసమీపమందుంచబడిన దానిని నిదురపోవుచున్న అనగ కేవల సమర్థుడైన కొమారునివలెనే బాధలు లేకుండ రక్షించుము, (కలకత్తాకూర్పు పుట ౯)

## నాలుగవ అనువాక సామాన్య విషయములు.

౧. మూడవ అనువాకమందు భగవత్కారుణముతో జీవాత్మను సంఘటింప చేయవలయునని చెప్పబడెను. అట్టి సంఘటన ఏరీతిని సిద్ధించుననగు సంగతి ఈ అనువాకమందు చెప్పబడినది. ౧-౨- మంత్రములచే మనుజునియొక్క కర్మేంద్రియములు జ్ఞానేంద్రియములు, సత్కర్మయందు ఉపయోగించవలయుననియు, ౪- మంత్రముచే మనయందుండు దుష్టగుణములను నశింపచేయవలయుననియు, ౫-వ మంత్రముచే శుద్ధసత్వము ప్రియత్వము మొదలగు దివ్యగుణములను సంపాదించ వలయుననియు, ౬-వ మంత్రముచే మనచిత్తమును భగవంతునియందె ఉంచవలయుననియు, ౭-వ మంత్రముచే భగవత్కారుణమాయందు వ్యాపించుటకు కల్మషముచే నిండియున్న హృదయ గ్రంథిని విప్పవలయుననియు, ౮-వ మంత్రముచే నెల్లప్పుడు నిష్కల్మష మైనబుద్ధి కలిగియుండవలయుననియు, ౧౨-వ మంత్రముచే జ్ఞానులతో కూడియుండవలయునని యు ౧౩-వ మంత్రముచే అరిషడ్వర్గమును జయించవలయుననియు, ఇత్యాదిసుకృతాచర చరణవలన పరంజ్యోతి అయిన భగవంతుని దర్శనమగుననియు ఈ అనువాకమందు చెప్పబడిన ముఖ్య అంశములైయున్నవి.

౨. ఈ అనువాకమందు ఋఙ్మంత్రములు కనుపించలేదు 'ధూరసి'. మొదలు 'దేవహూతమః' మువరకు అతిజగతీ ఛందస్స అని శుక్లయజుర్వేదభాష్యమందు చెప్పంబడినది. (బొంబాయికూర్పు పుట ౨౧) జగతీ ఛందస్సుకు సాధారణముగ ౪౮ అక్షరములుగలవు, అతిజగతీ ఛందస్సుకు ౫౨ అక్షరములని ఋగ్వేద ప్రాతిశాఖ్యయందు చెప్పబడినది. "ద్వావాతి ఛందసాంవర్గా వుత్తరాచతురుత్తరా ప్రథమాతిజగత్యాసాం సాద్విపంచాదశాక్షరా" (జర్మనీ కూర్పు పుట౩౨౩) ౫-౬ మంత్రములయందు ౫౨ అక్షరములుగలవు. ఇది యజస్సౌటవలన దీనియందు పాదములు లేవు.

౩. నిఘంటువు, నిరుక్తము, అనునవి ఈ గ్రంథమందు విస్తారము ప్రమాణములుగ వ్రాయబడుచున్నవి. ఆ గ్రంథములు ప్రాచుర్యముగ దొరకకపోవుటవలన వాటి స్వరూపమును తెలియచేయవలయునని కొందరు కోరినందున వాటినిగూర్చి సంగ్రహముగ నిచట వ్రాయుచున్నారము. లౌక్యపదములకు అమర నిఘంటువువలెనే వేదమునకు వేదనిఘంటువు అను గ్రంథముకలదు. దానియందు ౫ అధ్యాయములు (అన్ని అధ్యాయములు క్రమేణ ప్రచురింపబడును.) ఈ నిఘంటువునకు నిరుక్తమనుభాష్యము యాస్కమహామునిచే చేయబడినది. ఉత్తరషట్కమని పూర్వషట్కమని దీనియందు ౧౨ అధ్యాయములుకలవు. పరిశిష్టమను రెండుఅధ్యాయ

ములును కలవు. నిఘంటువునకు నిర్వచనము చేసినవారు దేవరాజయజ్వ యాస్క-నివలెనే ఈ నిఘంటువునకు నిరుక్తమును చేసినవారు స్కందస్వామి. యాస్క నిరుక్తమునకు వ్యాఖ్యానము చేసినవారు దుర్గాచార్యులు. ఈ నిఘంటువున్ను నిరుక్తమున్ను వేదార్థమునుగూర్చి రెండువేల సంవత్సరములకు పూర్వమందే రచియింపంబడుటచేత వేదార్థమును తెలుసుకొనుటకు ముఖ్యప్రమాణగ్రంథములు.

౪. వేదము మంత్రబ్రాహ్మణాత్మకమని ప్రసిద్ధి. "మంత్రబ్రాహ్మణయోర్వేద నామధేయం" అని ఆపస్తంబులవారు పరిభాషయందు చెప్పియున్నారు. బ్రాహ్మణమను పదమునకు సాధారణార్థము విశేషార్థము అని రెండు కలవు. సాధారణార్థమందు అరణ్యకములు ఉపనిషత్తులున్నూ బ్రాహ్మణమందు చేరుచున్నవి. జైమినులవారు పూర్వమీమాంసా మంత్ర నిర్వచనాధికరణమందు (౨ - ౩౨) "తచ్చోదకేషు మంత్రాఖ్యా" అని చెప్పియుండుట వలనను ౩౩-వ సూత్రమున "శేషే బ్రాహ్మణశబ్దః" అని చెప్పియుండుట వలనను బ్రాహ్మణము సామాన్యార్థమందు ఉపనిషత్తులకున్ను చెందుచున్నది. విశేషార్థమందు బ్రాహ్మణమను పేరు కేవలకర్మనుగూర్చిన భాగమునకు చెందును. మంత్రము, బ్రాహ్మణమునకున్ను ఉపనిషత్తులకున్ను మూలగ్రంథమగుటచే మంత్రార్థమునే బ్రాహ్మణాదులు తెలియ చేయుచున్నవి. శ్రుతియనుశబ్దము వలన యావత్తు వేదము అర్థమగుచున్నను, విశేషముగ బ్రాహ్మణముకే శ్రుతియను పేరు ఉపయోగింపబడుచున్నది. కావుననే శ్రీవిద్యారణ్యులవారు "మంత్రః శ్రుత్యా వినియుజ్యతే" అని తైత్తిరీయ భాష్యమందు చెప్పియున్నారు (చెన్నపట్టణంకూర్పు పుట ౨౫) ఇందువలననే వినియోగమును బోధించు గ్రంథము శ్రౌతమనుబడుచున్నది. బ్రాహ్మణముకర్మను ప్రతిపాదించుచు కర్మభావనయా పరోక్షముగనున్ను, ఉపనిషత్తులు ప్రత్యక్షముగనున్న జ్ఞానమును బోధించుచున్నవి. ఇందు వలన ఆలోచించవగ మంత్రము బ్రహ్మజ్ఞానమును బోధించుటకే ముఖ్యమైనటుల కాంచవలయును. మంత్రము కర్మను ప్రతిపాదించుటయే ముఖ్యతాత్పర్యము అని కొందరు వాదించుచున్నారుగాని అది సరికాదు. వాక్యమనగ ఒకధాతువు కలిగి సంపూర్ణార్థమును తెలియచేయునది. ప్రతి వాక్యమునకు ప్రత్యేక వినియోగ ముండవలసిన యావశ్యకము. కర్మవినియోగమునకుగాను అనేకవాక్యములు కలిపి ఏక వాక్యముగా ఉపయోగించ బడుచున్నవి. ౧వ మంత్రము "అహృతమసి" మొదలు "మాహ్వాః" వరకు ౩ వాక్యములు కూడినదైయున్నది "దృగ్ంహాస్వ" అనునది వాక్యాదియందు లేక పోవుటవలన అనుదాత్తము సిద్ధించవలసియుండెను. ౭వ మంత్రవినియోగమందు దహాకాంపంబడిన "చాదిలోప" సూత్రమునుం బట్టి నిఘాతసిద్ధించక పోవుటవలన ౬-వ మంత్రము యావత్తు ఏకవాక్యముగ కాంచవచ్చును. అయితే ౪వ మంత్రమందు "ఊర్ధ్వా" అనునది ౩ పర్యాయములు ఉపయోగింపంబడినది, వినియోగమునందు "ఊర్ధ్వా"

సి" మొదలు 'ధూర్వామః' వరకు ౪గు భిన్నవాక్యములు కలవు. వీటిఅన్నిటినిఏక వాక్యము చేసి కర్మయందు వినియోగింపబడుచున్నవి. మొదటి 'ధూర్వ' అనుపదము వాక్యాదియందు లేకపోవుటచే అనుదాత్తము సిద్ధించవలసి యున్నది. ఇచట "చాదిలోపేవిభాషా" అనువిశేషసూత్రము ఉపయోగించుటకు వల్లలేదు. కావున స్వరవిషయమై భిన్నవాక్యములు చేయవలసిన యావశ్యకమై యున్నది. కర్మవినియోగమునుగూర్చి ఏకవాక్యముచేయవలసి యున్నది. జ్ఞానార్థమందు స్వరమునను సరించి భిన్నవాక్యములుగనే చెయ్యబడినవి. ఇందువలనజ్ఞానార్థమే వేదముయొక్క ముఖ్యతాత్పర్యమనియు కర్మ రెండవపక్షమనగ జ్ఞానమునకు సాధనమనియు ఊహించవలయు గనుక జ్ఞానార్థమును తెలుసుకొనుట అత్యంతావశ్యకము.

౫. కర్మరీత్యా ఈఅనువాకమునకు "హవిర్నిర్వాపః" అని చెప్పబడినది. జ్ఞానార్థమందు "భరన్యాసం" అని చెప్పవచ్చును. భరన్యాసమనగ "ఆత్మార్పణం".

౬. ఈ యనువాకముకొన్నిమంత్ర వ్యత్యయములుగా నీక్రింద చెప్పిన వాటితో సంబంధించియున్నది.

కాఠకసంహిత ౧- ౪- ౩౧- ౩-

మైత్రాయణీసంహిత ౧- ౪- ౫-

వాజసనేయసంహిత ౧ ౬-౧౧-



## నాలుగవ అనువాక సంగ్రహము.

౧. (హస్తములు, పాదములు మొదలగువానివలె) జోడుగ నుండుమిమ్ముల దేవకర్మకొరకు (ఉపయోగించుటకుగాను) శక్తుఁడన య్యెదనుగాక.

౨. (జిహ్వాత్వక్ మొదలగువానివలె) ఏకముగా నుండునిన్ను (దేవ) కర్మకొరకు (ఉపయోగించుటకుగాను శక్తుఁడనయ్యెదనుగాక).

౩. (సత్కర్మాచరణకొరకుగాను) ప్రతిబంధకమునశించును గాక విఘ్నములునశించునుగాక,

౪. (ఓభగవంతుఁడా నీవుపాపాత్ములను) శిక్షించువాఁడవు.(మమ్ముల) హింసించుదానిని (అంతశ్శత్రువును) నశింపచేయుము. ఏ (అంతశ్శత్రువు) మమ్ములహింసించుచున్నాడో వానిని నశింపచేయుము. ఏ (అంతశ్శత్రువును) మేమునశింపచేయ నిశ్చయించుచున్నామో వానిని నశింపచేయుము.

౫. (ఓపరమేశ్వరానీవు)సాధువులకు అత్యంత పరిశుద్ధమును కలుగచేయువాఁడవు అగుచున్నావు. (మరియు) అత్యంత పూర్ణత్వమును కలుగజేయువాఁడవు. అత్యంతప్రియమును కలుగచేయువాఁడవు. అత్యంతకాంతిని కలుగచేయువాఁడవు దివ్యమోక్షమునిచ్చువాఁడవు లేదా సాధువులను మిక్కిలి ఆహ్వానముచేయువాఁడవు.

౬. నీవుఅకుటిలుఁడవు. (నీవు) జీవాత్మలను ధరించువాఁడవు.మమ్ముల దృఢముగనుంచుము, చలించనీయకుము.

౭. (ఓజీవాత్మా) నిన్నుస్నేహదృష్టిచేత చూచుచున్నాను అనగా నీకు క్షేమము కలుగునటుల భగవంతునికి సమర్పించుచున్నాను, కావున భయపడకుము, చలించకుము, నిన్నుహింసించను.

౮. భగవంతునికొరకు (హృదయగ్రంధిని) విప్పుము.

౯. అంతర్యామియైన భగవంతునియొక్క ప్రేరణకలుగుచుండగా, అశ్వనులయొక్క బాహువులచేతననగా ఉభయసంధ్యాకాలములయందును, పూషయొక్క హస్తములతోననగా రాత్రింబగళ్లయందును, భగవంతుని కొరకు ప్రియమగునటుల (ఓజీవాత్మానిన్ను) సమర్పించుచున్నాను.

౧౦. అగ్నియనుపేరు గలిగినట్టియు, సోముడను పేరుగలిగినట్టియు, భగవంతునికొరకు (సమర్పించుచున్నాను).

౧౧. ఇట్టిసమర్పణ సాధువులకు (ఇష్టము).

౧౨. ఇట్టిసమర్పణ (వారితో) కూడిన మాకును (ఇష్టము).

౧౩. నీవృద్ధికొరకును, అంతశ్శత్రువుల నాశనముకొరకును (సమర్పించుచున్నాను).

౧౪. స్వర్గమును లెస్సగాచూడుము.

౧౫. మోక్షమును కలుగజేసెడు భగవంతుని (చూడుము).

౧౬. ఇహపర సౌఖ్యములు దృఢముగా నుండుగాక-

౧౭- మహాత్మనుపొందము-

౧౮- భగవంతునియందు (ఓజీవాత్మానిన్ను) ఉంచుచున్నాను-

౧౯- ఓపరమాత్మా సమర్పింపబడినదానిని అనగ జీవాత్మను రక్షించుము-

—*—

# ఓమ్

శ్రీపరబ్రహ్మణేనమః.

—౦—

కృ ష్ణ య జు ర్వే ద

# తైత్తిరీయసంహితామంత్రభాగస్య

ప ఞ్చ మో ఽ ను వా కః.

కాండర్షిః ప్రజాపతిః.

---

౧- (౧) దేవః వః సవితా ఉత్పునాతు
(౨) అచ్ఛిద్రేణ పవిత్రేణ
(౩) వసోః సూర్యస్య రశ్మిభిః

### జ్ఞానార్థము.

టీ ॥ సవితా — ప్రేరకుడగు, దేవః — పరమాత్మ, వః — మిమ్ములను, ఉత్పునాతు — అత్యంత పవిత్రమును చేయుగాక). (౨) అచ్ఛిద్రేణ — అఖండమైన పవిత్రేణ — పవిత్రముచేత, (పవిత్రమును చేయుగాక) (౩) వసోః — ఆత్మస్వరూపుడైన, సూర్యస్య — భగవంతుని యొక్క, రశ్మిభిః — అమృత కిరణముల చేత, (పవిత్రమును చేయుగాక).

తా ॥ సర్వాంతర్యామియగుభగవంతుడు తనయొక్క అమృతకిరణములచేత మిమ్ములను పవిత్రము చేయుగాక.

### కర్మార్థము.

టీ ॥ వః — (ఓ యుదకములారా) మిమ్ముల, అచ్ఛిద్రేణ — రంధ్రములు లేని పవిత్రేణ — దర్భపవిత్రము చేతనున్ను, వసోః — (జగత్తునకు) ఆధారుడయిన, సూర్యస్య — సూర్యుని యొక్క, రశ్మిభిః — కిరణములచేతనున్ను, సవితా — ప్రేరకుడయిన, దేవః — పరమాత్మ, ఉత్పునాతు — పరిశుద్ధము జేయుగాక.

వినియోగము ॥ ఈ మంత్రము చెప్పి అగ్నిహోత్రహవణియను పాత్రయందు దకమును మూడుసార్లు దర్భతో తాకి పవిత్రము జేయవలయు.

---

వివరణము ॥ ఈమంత్రము ఏకమంత్రముగ విద్యారణ్యులవారు కర్మార్థమందు భాష్యమువ్రాసియున్నను, బ్రాహ్మణమందునుసూత్రమందును మూడుభాగములుగ చేయుటంబట్టి జ్ఞానార్థమందును మూడుభాగములుగ చేయబడినది. వసుశబ్దమునకు "జగన్నివాసహేతుః" అని విద్యారణ్యులవారు భాష్యమందు చెప్పియున్నారు. ఇందువలననున్ను సూర్యశబ్దము భగవత్పరమైనటులఅనేకస్థలములయందు ఉండుటవలనను సూర్యఅనుపదమునకుభగవంతుడని అర్థము చెప్పబడెను. "విహాయసంగతి

ర్జ్యోతిః మరశ్మిర్హుతభుక్ప్రభుః । రవిర్విరోచనస్సూర్య స్సవితారవిలోచనః"(శ్రీమహాభారతం అనుశాసనిక.అ ౧౪౯ శ్లో౧౦౭) ఈశ్లోకమందుండు సూర్యశబ్దమునకు భాష్యము "సూతేసర్వమితిసూర్యః" సూతేశ్రియమితిసూర్యః "సూతేః సువతేర్వా" సవితశబ్దమునకు వ్యుత్పత్తి "సర్వస్యజగతః ప్రసవితా సవితా" (విష్ణుసహస్రనామభాష్యంపుట ౬౩) ౧-వ భాగమునకు బ్రాహ్మణము "దేవోవస్సవితా ఉత్పునాత్విత్యాహ । సవితృప్రసూతమేవైనానుత్పునాతి" అనగ భగవంతునియొక్క అనుగ్రహమువల్లనే వీటినిపవిత్రముచేయుచున్నాడు. (౨) - వ భాగమునకు బ్రాహ్మణము "అచ్ఛిద్రేణపవిత్రేణేత్యాహ। అసౌవా ఆదిత్యోఽచ్ఛిద్రం పవిత్రంతేనైవైనాడుత్పునాతి" అనగ నితడు అఖండుడు పవిత్రము అఖండమైనది. దానిచేతనే పవిత్రముచేయుచున్నాడు. "యోవాఅయంపవత ఏషోఽచ్ఛిద్రం పవిత్రం" (౩)-వభాగమునకు బ్రాహ్మణము "వసోస్సూర్యస్య రశ్మిభిరిత్యాహ । ప్రాణావా ఆపః । ప్రాణావసవః । ప్రాణారశ్మయః । ప్రాణైరేవ ప్రాణాన్ సంపృణక్తి" (తై. బ్రా. ౩- ౨- ౫) అనగ 'ఆపః' 'వసవః' 'రశ్మయః' అనుపదమువలన ప్రాణము అర్థను ప్రాణముచేతనే ప్రాణములనుశుద్ధిచేయవలయును. ప్రాణశబ్దముఆత్మశబ్దము అభేదముగ ప్రయోగింపబడుచున్నవి జీవాత్మలను పవిత్రము చేయు వాడు పరమాత్మయేగాని మరియొకరుగారు. ఆత్మసంబంధమైన దానిని ప్రకృతిసంబంధము పవిత్రముచేయుటకు శక్తిలేదు, కావునఈమంత్రమందున్న వసో అను పదమువలన ఆత్మస్వరూపుడైన భగవంతుడే మనలపవిత్రముచేయువాడుగాని మరియొకడుకాడని బ్రాహ్మణము స్పష్టముగా చెప్పుచున్నది. పవిత్రమనగ పావనము చేయునది అని మహీధరభాష్యమందు వ్రాయబడియున్నది. "యోవా అయంపవత ఏషోఽచ్ఛిద్రం పవిత్రం" (శతపథబ్రాహ్మణము ౧- ౧- ౩- ౬) ఇదిగాయత్రీఛందస్సుగలదియొక్క "పఙ్క్తిగాయత్రీ" తై. బ్రా. ౩- ౨- ౫) ఇందుకు వినియోగం॥ "అద్వైతస్యైవ + + + పచ్ఛః" (విద్యారణ్యభాష్యంపుట ౯౧) పచ్ఛఃఅనగ ఒకొకపాదముచర్చించుచు మూడుపర్యాయములు పవిత్రముచేయవలసినది. అదియెట్లనగ "దేవోవస్సవితోత్పునాత్వితి" ప్రథమం, అచ్ఛిద్రేణ పవిత్రేణేతిద్వితీయం, వసోస్సూర్యస్య రశ్మిభిరితి తృతీయం" అని యజుర్వేదభాష్యం (చెన్నపట్టణంకూర్పుపుట౯౨) కర్మయందుపయోగింపంబడు దర్భలు ప్రాణములకు సాదృశ్యమగునటుల విద్యారణ్యులవారు ౯౧పుటయందు వ్రాసియున్నారు "తతస్సూర్యరూపప్రాణత్వేన. భావితైఃదర్భప్రాణైః" ఇందువలన కర్మయందుపయోగింపంబడు దర్భమొదలగునవి మానసయ

జ్ఞమందు ప్రాణములు మొదలగువాటికి సాదృశ్యముగ నెంచవలయునను సిద్ధాంతము స్థిరపరచుచున్నది.

౨ (౧) ఆపః దేవీ అగ్రేపువః అగ్రేగువః
(౨) అగ్రే ఇమం యజ్ఞం నయత
(౩) అగ్రే యజ్ఞపతిం ధత్త
(౪) యుష్మాన్ ఇంద్రఃఅవృణీత వృత్రతూర్యే
(౫) యూయం ఇంద్రం అవృణీధ్వం వృత్రతూర్యే
(౬) ప్రోక్షితాః స్థ

జ్ఞానార్థము.

(౧) దేవీః=దేవతాసంబంధమైన,ఆపః = ఓ కరుణారసములారా (మీరు) అగ్రేపువః=ముందుగ పవిత్రము చేయువారు, అగ్రేగువః=(మనుష్యులను రక్షించుటకు) ముందుగ వెళ్లువారు.

(౨)ఇమం=ఈ, యజ్ఞం=భగవత్పూజను, అగ్రే=సమాప్తియందు అనగసమాప్తిని, నయత=పొందించుడు.

(౩) యజ్ఞపతిం = భగవత్పూజ చేయువానిని, అగ్రే=శ్రేష్ఠస్థానమందు, ధత్త=ఉంచుము, అనగ మోక్షము కలుగ చేయుము.

(౪)యుష్మాన్=మిమ్ములను, ఇంద్రః=భగవంతుడు, వృత్రతూర్యే=అజ్ఞానాంధకారసంహారమందు, అవృణీత=కోరెను.

(౫) యూయం=మీరు, ఇంద్రం=భగవంతుని, వృత్ర తూర్యే=అజ్ఞానాంధకారసంహారమందు,అవృణీధ్వం కోరితిరి.

(౬) (ఓ కరుణారసములారా మీరుస్వయముగానే పవిత్రములైనవారుగను

కర్మార్థము.

టీ॥ అగ్రేపువః=ముందుగాపవిత్రముజేయునట్టియు, అగ్రేగువః = ముందుగా వెళ్లునట్టియు, ఆపోదేవీః=ఓ యుదకదేవతలారా [మీరు], ఇమం = ఈ, యజ్ఞం=యాగమును, అగ్రే=సమాప్తిని, నయత=పొందించుడు. అగ్రే=శ్రేష్ఠస్థానమందు, యజ్ఞపతిం=యజమానుని, ధత్త=ఉంచుమః అనగా స్వర్గమును పొందించుడు. ఇంద్రః=ఇంద్రుడు, యుష్మాన్=మిమ్మున, వృత్రతూర్యే=వృత్రాసురునిని చంపుటయందు, అవృణీత=[సహాయము] కోరెను, వృత్రతూర్యే=వృత్రాసురుని చంపుటయందు, యూయం=మీరు, ఇంద్రం=ఇంద్రునిని, అవృణీధ్వం= [సహాయము] కోరితిరి, ప్రోక్షితాః [ఈమంత్రముచేతమీరు] ప్రోక్షించబడినవారుగా, స్థ=అగుచున్నారు.

క మంత్రోచ్చారణచేత) ప్రోక్షితాః=పరిశుద్ధిచేయబడినవారు, స్థ=అగుచున్నారు

తా॥ భగవత్కారుణారసముఅజ్ఞానాంధకారమును పోగొట్టి జీవులను పవిత్రముచేసి మోక్షమును ఇచ్చును.

వినియోగము॥ ఈమంత్రముచెప్పి ఆయుదకము నభిమంత్రించవలయును.

వి॥ ఈ మంత్రము బ్రాహ్మణముననుసరించి ఆరుభాగములుగ విభజింపబడినది. "ఆపః" అనగ సాధారణార్థమందు ఉదకమైనను వేదమందు మనుజులను పవిత్రముచేయు భగవత్కారుణారసమునకు ఉపయోగింపబడుచున్నది. కావుననే "యాఏవమేధ్యాయజ్ఞియాస్సదేవా ఆపః" అని బ్రాహ్మణమందు చెప్పబడ్డది. (తై బ్రా. 3 - ౨ - ౫) అనగ ఏవి అయితే పవిత్రమైనవిన్ని యజ్ఞసంబంధమైనవిన్ని అయి ఉన్నవో అవియె, దేవసంబంధమైన రసములు. ఆపః అను పదముయొక్క లక్షణము ఈమంత్రమును సంబంధించిన మైత్రాయణీ బ్రాహ్మణమందు చెప్పబడినది ఎట్లనగ "ఆపఃప్రణయతి । ఆపోవై శ్రద్ధా । శ్రద్ధామేవాలభ్యయజత । ఆపోయజ్ఞో యజ్ఞంతత్వాత్ప్రచరతి । ఆపోదేవానాంప్రియంధామ । దేవానాంప్రియంధామప్రణీయప్రచరతి । ఆపస్సత్యం । సత్యమేవాలభ్యయజత । ఆపోరక్షోఘ్నీ । రక్షసామపహత్యై । ఆపోవజ్రోవజ్రంభ్రాతృవ్యాయ ప్రహరతిస్తుత్యా । ఆపశ్శ్రద్ధా । శ్రద్ధాస్య దేవాః । శ్రన్మనుష్యా । ఇష్టాయదధతే । యస్యైవగ్ం విదుషః ఏవగ్ం విద్వానపః ప్రణయతి" (మై. బ్రా- ౪ - ౧ - ౪) ఇట్టి ధర్మములు కలిగిన ఆపః అను శబ్దమునకు ఉదకములని అర్థముచెప్పి అట్టి ఉదకములను హిందువులు ప్రార్థించుచున్నారని అన్యమతస్థులుచేయు ఆక్షేపణ నిరర్థకము. మనము ధ్యానముచేయునది భగవత్కారుణయును ఆపోదేవికాని సాధారణ ఉదకముకాదు. అట్టికరుణ బహిరింద్రియముల కగోచరమగుటచే కర్మయందు భావనయా ఉదకము వినియోగింప బడుచున్నది. భగవత్కారుణారసము అంతటను వ్యాపించి అజ్ఞానమును పోగొట్టి మనుజునికి మోక్షము నిచ్చుచున్నది.

'వృత్ర' శబ్దము వేదనిఘంటువునందు మేఘార్థమందు చెప్పబడినది. వెలుతురను మేఘము ఏప్రకారముగ ఆచ్ఛాదించునో ఆప్రకారముగానె జ్ఞానమును ఆచ్ఛాదించునది, వృత్రము. "వృణోతేరాచ్ఛాదనార్థాత్" అనిదేవరాజయజ్వ వేదనిఘంటుభాష్యమందు చెప్పినారు. (కలకత్తాకూర్పుపుట ౭౨) నిరుక్తమందు ఈ శబ్దమునుగూర్చి యాస్కమహాముని చెప్పినదేమనగ. "తత్కోవృత్రోమేఘఇతి నైరుక్తాః । త్వాష్ట్రోఅసుర ఇత్యైతిహాసికాః అపాంచజ్యోతిషశ్చమిశ్రీభావకర్మణో వర్షకర్మ జాయతే । తత్రోపమార్థేనయుద్ధవర్ణాభవంతి. అహివత్తుఖలుమంత్రవర్ణాబ్రాహ్మణవాదాశ్చ" అని (పూర్వషట్కం ౨ - ౫ - ౧౬) అనగావృత్రాసురుడని సర్పమ

ని ఆరోపణ. ఈ శబ్దమునకు అంధకారమర్థమని తారానాథ వాచస్పత్యమందు చెప్పబడినది. (పుట ౪౩౪౭) మేఘమును ఛేదించి వర్షమును కలుగచేయునటుల అజ్ఞానమును ఛేదించి జ్ఞానమును కలుగచేయునని వృత్రాసుర వధకథాతాత్పర్యము. వేదార్థము ప్రకటనకాకుండ వాటిని ఆచ్ఛాదించి అజ్ఞానమందు పడద్రోయువాడనియు శ్రుత్యంతరమందు వృత్రుడువర్ణింపబడెను. ఏలాగనగ. "వృత్రోహవై ఇదం। అగ్రేసర్వంఆసయత్ ।ఋచోయద్యజూగ్ంషి।యత్సామాని। తస్మైఇంద్రోవజ్రంప్రాజిహీర్షత్ ।" (శతపథబ్రాహ్మణము ౫-౫-౫-౧) అనగ పూర్వమందువృత్రుడు ఋగ్యజుస్సామములను తనలో దాచుకొనెను. ఇంద్రుడువజ్రాయుధమును వాని పైకి పంపుట కపేక్షించెను. ఈ వాక్యార్థము ప్రస్తుతపు ఇండియాస్థితిని స్పష్టముగ తెలుపుచున్నది. వృత్రతూర్యమనగ సంగ్రామము అర్థమని వేదనిఘంటువు చెప్పుచున్నది (౨-౧౭-౩౨)

ప్రోక్షితాః అనగ శుద్ధిచేయబడినవి అనగఎల్లప్పుడు భగవత్కారుణారసములు శుద్ధియైనవని తాత్పర్యము. కావుననే "స్వతయేవయూయం శుద్ధాస్థేతిమంత్రోచ్చారణమేవసంప్రోక్షణం" అని (భట్టభాస్కరులవారు చెప్పియున్నారు. ౧-౧-౫) "అసంస్కృతా అన్యసంస్కారత్ మానభవంతీతి" మహీధరాచార్యులవారు చెప్పినారు. (కలకత్తాకూర్పుపుట ౧౦) అనగ నితరపదార్థములచేశుద్ధిచేయతగనివి.

ఇందుకు వినియోగము "ఆపోదేవీరగ్రేపువ ఇత్యభిమంత్ర్య" విద్యారణ్యభాష్యము(చెన్నపట్టణం కూర్పుపుట ౯౨)

---

## 3. అగ్నయే వః జుష్టం ప్రోక్షామి.

### జ్ఞానార్థము

టీ॥ (ఓజీవాత్మలారా) వః=మిమ్ములను, అగ్నయే = భగవంతునికొరకు, జుష్టం = ప్రియమగునటుల ప్రోక్షామి =శుద్ధిచేయుచున్నాను.

తా॥ జీవాత్మను భగవంతునికి ప్రియమగునటుల శుద్ధిచేయుచున్నాననగ కామాదిదోషరహితముగ చేయుచున్నాను.

### కర్మార్థము.

టీ॥ వః = [ఓ ధాన్యమా] మిమ్మున అగ్నయే, అగ్ని దేవతకొరకు, జుష్టం= ఇష్టమగునటుల; ప్రోక్షామి = ప్రోక్షించుచున్నాను.

వినియోగము॥ ఈమంత్రముచెప్పి ఆ యుదకముచే అగ్ని దేవతానిమిత్తము ధాన్యహవిస్సును ప్రోక్షించవలయును.

---

వి॥ ఈమంత్రవిషయమై ౪-వ అనువాకముయొక్క ౯-వ మంత్రము చూడవలయును. ఇందుకు వినియోగసూత్రము "అగ్నయేవోజుష్టం ప్రోక్షామితియథాదేవతం హవిస్త్రిః ప్రోక్షన్నగ్ని మభిప్రోక్షేత్" (ఆపస్తంబశ్రౌత ౧-౧౯-౧)

## ౪. అగ్నీషోమాభ్యాం.

**జ్ఞానార్థము.**

టీ॥ (ఓజీవాత్మలారామిమ్ము) అగ్ని యను పేరుగలిగినట్టియు సోమఅనుపేరుగలిగినట్టి భగవంతునికొరకు శుద్ధిచేయుచున్నాను.

తా॥ అగ్ని సోమములను పేర్లుగలిగిన భగవంతునికొరకు జీవాత్మను శుద్ధిచేయుచున్నాను.

**కర్మార్థము**

టీ ॥ అగ్నీషో మభ్యాం = (ఓధాన్యమామిమ్మున) అగ్నిసోమ=దేవతలకొరకు ఇష్టమగునటుల ప్రోక్షించుచున్నాను

వి॥ ౪వ అనువాకముయొక్క ౧౦-వ మంత్రముచూడుడు వినియోగవిషయమై 3-వ అనువాకముచూడుము.

## ౫. శున్ధధ్వం దైవ్యాయ కర్మణే దేవయజ్యాయై

**జ్ఞానార్థము**

మూడవఅనువాకముయొక్క మొదటి మంత్రమును చూడుడు.

**కర్మార్థము.**

టీ ॥ దేవయజ్యాయై = (ఓపాత్రలారామీరు) దేవయాగ రూపమైనట్టియు, దైవ్యాయ = దేవసంబంధమైనట్టియు, కర్మణే=కర్మకొరకు, శుంధధ్వం పరిశుద్ధినొందుడు.

వినియోగము॥ ఈమంత్రము చెప్పతూ పాత్రములను ప్రోక్షించవలయును

## ౬. అవధూతం రక్షః అవధూతాః అరాతయః

**జ్ఞానార్థము.**

టీ॥ రక్షః = ప్రతిబంధకము అవధూతం = నశించునుగాక ఆరాతయః = విఘ్నములు అవధూతాః = నశించునుగాక.

తా॥ ఇందుకు ౨వ అనువాకముయొక్క ౨-వ మంత్రముచూడుడు.

**కర్మార్థము.**

టీ॥ రక్షః = (కృష్ణాజినములో అంతర్భూతముగా నుండెడి) రాక్షసుడు, అవధూతం = మిక్కిలినశింప చేయబడినవాడుగా (అగుగాక), అరాతయః = (కృష్ణాజినములో అంతర్భూతముగా నుండెడి) శత్రువులు, అవధూతాః = మిక్కిలి నశింప బడిన వారుగా (అగుగాక).

వినియోగము॥ ఈమంత్రము చెప్పి కృష్ణాజినమును మూడుసార్లుగా దులుప వలయును.

వి॥ " అవధూతమితి యజూరాదికైక పదయాగాయత్ర్యా అవధూతంవినాశితం శిష్టంవ్యాఖ్యాతం ప్రత్యుష్టాదిమంత్రేణ" అని (భట్టభాస్కరీయం ౧-౧-౫) ఇచటవినియోగము ననుసరించి ఏకమంత్రముగనున్నను ఛందస్సునుబట్టి ౨ మంత్రములుగ చేయబడినది. మొదటిమంత్రము ఆరక్షరములు కలిగియుండుటచేయాజుషీగాయత్రీఅనియు రెండవ మంత్రము ఎనిమిది అక్షరములు కలిగియుండుటచే ప్రాజాపత్యగాయత్రీయనియు తెలియందగును. "యజుషాంగాయత్రీషడక్షరా భవతి యత్రక్వచిద్వేదే షడక్షరంఛందః తద్యాజుషీగాయత్రీ సంజ్ఞాయతే ప్రాజాపత్యాగాయత్ర్యే అష్టాక్షరాభవతి। యత్రక్వచిద్వేదే అష్టాక్షరంఛందః సాప్రాజాపత్యాగాయత్రీతిజ్ఞేయం"(పింగళఛదస్సు కలకత్తాకూర్పు పుట ౧౨) అనగవేదమందెచటనైనను ౬ అక్షరముల ఛందస్సుగలిగెనేని అదియాజుషీగాయత్రీయని తెలియదగును. ౮ అక్షరములఛందస్సు కలిగెనేని ప్రాజాపత్యగాయత్రీయని గ్రహించవలయును. " శర్మాస్యాఅవధూతగ్ం రక్షోవధూతరాతయః' అనిశుక్లయజుర్వేదులు పఠించుచున్నారు (౧ - ౧౪) ఈమంత్రము మొదలుకొని శరీరలక్షణము చెప్పబడుచున్నది. శర్మయనగాగృహనామములయందు చెప్పబడినది, (వేదనిఘంటువు 3-౪-౨౧) ఆత్మకుశరీరము గృహము వంటిదిగనుక శర్మ అనగ దేహమనిగ్రహించవలయును ఇందుకుబ్రాహ్మణం " అవధూతగ్ంరక్షః అవధూతా అరాతయఇత్యాహ। రక్షసామపహత్యై" (తై. బ్రా. 3 - ౨ - ౫) అనగప్రతిబంధక నాశనముకొరకు.

ఇందుకు వినియోగసూత్రము "అవధూతం రక్షః అవధూతా అరాతయ ఇత్యుత్కరే త్రిరవధునోతి" (అపస్తంబశ్రౌత ౧ - ౧౯ - 3)

## ౭. అదిత్యాః త్వక్ అసి ప్రతి త్వా పృథివీ వేత్తు

జ్ఞానార్థము.

టీ॥ (ఓశరీరమా) నీవు, అదత్యాః = పరమాత్మయొక్క త్వక్ = త్వగింద్రియము, అసి = అగుచున్నావు, (ఐనను) పృధివీ = భూమి, త్వా = నిన్ను ప్రతివేత్తు = (తనదిగా) తెలుసుకొనును గాక.

కర్మార్థము.

టీ॥ అదిత్యాః = (ఓకృష్ణాజినమా నీవు) భూమికి, త్వక్ = చర్మరూపము అసి = అగుచున్నావు, త్వా = నిన్ను పృథివీ = భూమి, ప్రతి = పొంది, వేత్తు = (తనచర్మమని) తెలిసికొనవలయును.

తా॥ శరీరమందు భగవంతుడున్నను పృథివీ సంబంధమైనదని తెలుసుకొనవలయును.

వినియోగము ॥ ఈమంత్రముచెప్పి కృష్ణాజినమును గార్హపత్యాగ్ని ఉత్తరమందుగాని, ఉత్కరదేశమందుగాని, పశ్చిమదిక్కున కంఠముండునటుల, రోమములు క్రిందుగ నుండునటుల, పరచవలయును.

వి॥ దేహమందు పరమాత్మయున్నట్టు అనేకశ్రుతిస్మృతులవలన స్పష్టము ‘నీవారశూకవత్తన్వీపీతా భాస్వత్తనూపమా । తస్యాశ్శిఖాయామ ధ్యేపరమాత్మా వ్యవస్థితః’’ అనినారాయణోపనిషత్తు ‘‘స్వకృతపురేష్వ బహిరంతర సంవరణంతవ పురుషం వదంత్యఖిలశక్తి ధృతీంశకృతం । ఇందుకుచంద్రికా భాష్యమందుభాగ పురశబ్దమునుగూర్చి చెప్పబడినదేమనగా ‘‘ త్వన్నివాస భూతేషుదేవేషుసంతమితి శేషః’’ శరీరమిటువంటిదైనను పృధివివలనే నసించునదని గ్రహించవలెను. ఇందుకుబ్రాహ్మణం ‘‘ అదిత్యాస్త్వగసీత్యాహ । ఇయంవాఅదితిః అస్యాఏవైనత్వచంకరోతి’’ (తై. బ్రా. 3-౨-౫) అనగా ఇదిఅదితి, అదితికేశరీరమును చేయుచున్నాను. ‘‘ ప్రతిత్వాపృథివీవేత్త్విత్యాహ । ప్రతిష్ఠిత్యై’’ (తై. బ్రా. 3 - ౨ - ౫) అనగా ఈశరీరము నశించెడిదని తెలుసుకొను జీవుడుపరమాత్మయందు స్థిరుడగుచున్నాడు ఇందుకువినియోగసూత్రం ‘‘అదిత్యాస్త్వగసీత్యుత్తరేణగార్హపత్యముత్కరదేశేవా ప్రతీచీనగ్రీవ ముత్తరలోమోపస్తృణాతి’’(అపస్తంబశ్రౌత ౧ - ౧౯ - ౪).

## ౮. (౧) అధిషవణం అసి వానస్పత్యం. (౨) ప్రతి త్వా అదిత్యాః త్వక్ వేత్తు.

### జ్ఞానార్థము.

టీ॥ (౧) (ఓశరీరమానీవు) వానస్పత్యం=కట్టెతోచేయబడినదాన్నవు అయినను అధిషవణం=సత్కార్యాచరణమునకు లేక జీవునిశోధించుటకు సాధనమైనదానవు, అసి=అగుచున్నావు.

(౨) అదిత్యాః = భగవంతునియొక్క, త్వక్=శరీరమైనభూమి, త్వా=నిన్ను, ప్రతివేత్తు=తన సంబంధమైనదానిగా తెలుసుకొనుగాక.

### కర్మార్థము.

టీ॥ అధిషవణం=[ఓరోలానీవు]దంపుటకు నాధారమయినదానవున్ను, వానస్పత్యం=చెట్టువలన బుట్టినదానవున్ను, అసి=అగుచున్నావు, [త్వా=అటువంటి నిన్ను, అదిత్యాః=భూమియొక్క, త్వక్= [కృష్ణాజినరూపమైన] చర్మము వేత్తు = [తనరోలుఅని] తెలిసికోవలయును.

తా॥ శరీరముసత్కర్మ చేయుటకులేక జీవుని శోధించుటకు ఉపయోగమైనది. మరియు భగవంతుడు దీనియందు ఉన్న నుశరీరమునశించుననిగ్రహించవలయును

వినియోగము॥ ఈమంత్రము చెప్పి కృష్ణాజినముమీద ఉలూఖలము నుంచవలయును. శ్రౌతపదార్థనిర్వచనం ౬ (౪౨)

వి॥ బ్రాహ్మణానుసారముగ ఈమంత్రము రెండుగా విభజింపడినది. (౧) శరీరముదారు సంబంధమైనట్టును పాషాణసంబంధమైనట్టునుప్రసిద్ధి, వాటితో చేయబడినను భగవత్పూజ సత్కార్మాచరణకు జీవుడుశరీరము ధరించుట యావశ్యకము. ౭-వ మంత్రమందు వ్రాసినప్రమాణములవలన పరమాత్మ యాశరీరమందున్న వాడైనను ఈశరీరమస్థిరమేను. అధిషవణం, అధి, సవనం, ఈశబ్దములతో చేర్పబడినది. సవనమనగ యజ్ఞనామమని వేదనిఘంటువు చెప్పుచున్నది. శబ్దార్థమునుబట్టి సత్కర్మాచరణమునకు ఆధారమైనది అని అర్థమువ్రాయబడెను. ‘‘అవఘాతాధారం కర్తుంఅధిషవణమని’’ విద్యారణ్యభాష్యమందు వ్రాయబడుటచే జీవునిదంపుటకు అనగశోధించుటకు ఆధారమైనదనియు అర్థముగవ్రాయబడెను. అధిషవణమనగ ‘‘సోమాభిషవచర్మాదిపాత్రఅని’’ తారానాధవాచస్పతి (౧౩౪) కర్మార్థమందుచెప్పెను. అనగ సోమమును సంపాదించుటకు తోలుమొదలగువానితో చేయబడినపాత్ర ఇది ఈశరీరమునకు తగినఉపమానము.

మొదటి మంత్రమునకు బ్రాహ్మణము ‘‘అధిషవణమసి వానస్పత్యమిత్యాహ। అధిషవణమేవైనత్కరోతి’’ (తై. బ్రా. 3 - ౨ - ౫) అనగ సత్కర్మనే చేయవలయును. రెండవమంత్రమునకు బ్రాహ్మణము ‘‘ప్రతిత్వాఅదిత్యాస్త్వగ్వేత్త్విత్యాహ। సయత్యాయ’’ (తై బ్రా. 3 - ౨ - ౫) ఇందుకుభాష్యము ‘‘సయ;సంబంధవాక్షిఙ్ బంధన ఇత్యస్మాద్ధాతో రుత్పన్నత్వాత్’’ (చెన్నపట్టంకూర్పుపుట ౯౫) అనగ పృధివిన్నీ శరీరమున్ను పరస్పరసంబంధముకలవి.

ఇందుకువినియోగసూత్రము ‘‘అధిషవణమసీతితస్మిన్ ఉలూకలం అధివర్తయతి’’ (ఆపస్తంబశ్రౌత ౧-౧౯-౬)

౯. (౧) అగ్నేః తనూః అసి.

(౨) వాచః విసర్జనం.

(3) దేవవీతయే త్వా గృహ్ణామి.

జ్ఞానార్థము.

(౧) (ఓశరీరమానీవు) అగ్నేః = భగవంతునికి తనూః = దేహము అసి =అగుచున్నావు.

కర్మార్థము.

టీ॥ అగ్నేః = [ఓధాన్యమానీవు] అగ్నికి, తనూః = శరీరముగానున్న వాచః = వాక్కును, విసర్జనం = క

(౨) వాచః = భగవంతునియొక్క వాక్కును విసర్జనం = ఉచ్చరించుదానవు.

(3) (గనుక) త్వా = నిన్ను దేవవీతయే=భగవత్ప్రీతికొరకు గృహ్ణామి= ధరించుచున్నాను.

తా॥ భగవంతుడు తేజోరూపముగ ఈశరీరమందున్నాడు, ఆయనయొక్క వాక్కును శరీరము ఉచ్చరించుచున్నది. భగవత్ప్రీతికొరకు ఓశరీరమానిన్ను ధరించుచున్నాను.

లుగజేయుదానవుగానున్ను, అసి = అగుచున్నావు, త్వా = [గనుకయిటువంటి]నిన్ను, దేవవీతయే = దేవతాభక్షణనిమిత్తము. గృహ్ణామి = [రోలులో] వేయుచున్నాను,

వినియోగము॥ ఈమంత్రము చెప్పిదాని పురోడాశమునుంచవలయును.

వి॥ ఈమంత్రము బ్రాహ్మణానుసారముగ 3 భాగములు చేయబడినది. తనూః 'త్వక్' శరీరము ఇవి యేకార్థములు ''తనోతికర్మతనుః'' (వాచస్పత్యం 3.౨౧౯) 'బ్రహ్మహ్యగ్నిః' (శ్రుతి) ఈశరీరముయొక్క ముఖ్యప్రయోజనము బ్రహ్మవాక్కునుచ్చరించుటకర్మ యజ్ఞమందు శరీరమునకు సాదృశ్యముగ కృష్ణాజినముపయోగింపబడుచున్నది. అట్లుపయోగించుటకు కారణము శతపథబ్రాహ్మణముతెలియచేయుచున్నది. తస్యయానిశుక్లానిచ కృష్ణానిచలోమాని । తాన్యృచాంచసామ్నాంచరూపం । యానిశుక్లానితాని సామ్నాంరూపం । యానికృష్ణానితాన్యృచాం । యదివేతరథా । యాన్యేవశుక్లాని తానిసామ్నాంరూపం । యానిశుక్లాని తాన్యృచాం । యాన్యేవబభ్రూణీవ హరీణితా నియజుషాంరూపం । సైషాత్రయీవిద్యాయజ్ఞః । తస్యయేతచ్ఛిల్పమేవవర్ణస్తద్యత్కృష్ణాజినంభవతి' (౧ - ౧ - ౪ - ౨ - 3) అనగాదానియొక్క తెల్లనినల్లని రోమములు ఋక్సామములనున్ను పచ్చనివియజుస్సునున్ను తెలియచేయుచున్నవి. ఈమూడున్నుత్రివిద్యారూపమైన యజ్ఞము. ఈవన్నెలు గలిగిన శిల్పము కృష్ణాజినమగుచున్నది.

'వాచః' అనునదిఅంతోదాత్తమగుటచే షష్ఠీవిభక్తి ద్వితీయాబహువచనము. అయ్యోనేని ఆద్యుదాత్తమున్ను స్వరితాంతమున్ను అయ్యుండవలెను.

వీతయేఅనుధాతువు ''వీగతివ్యాప్తిప్రజనకాంత్యసనఖాదనేషు' అనుధాతువవలన వ్యుత్పన్నమైనది. 'వీతయే' అనగ 'తర్పణాయఅనిశుక్లయజుర్వేదభాష్యమందు వ్రాయబడినది. (౧ - ౧ - ౫)

(౧)కి బ్రాహ్మణము ««అగ్నే స్తనూరసీత్యాహ। అగ్ని ర్వాఏషాతనూః। యదోషధయః'' అనగాదారుసంబద్ధమైన ఇదిభగవంతునికి శరీరము.

(౨)కి బ్రాహ్మణము ««వాచోవిసర్జనమిత్యాహ। యదాహిప్రజాఓషధీనామంచంత। అథవాచంవిసృజంతే'' । అనగాఓషధులను భక్షించుటవలన వాక్కు కలుగుచున్నది.

(3)కి బ్రాహ్మణము ««దేవవీతయేత్వాగృహ్ణామీత్యాహ। దేవతాభిరేవైనత్సమర్ధయతి'' (తై. బ్రా- 3 - ౨ - ౫) అనగాఇది జ్ఞానులచేతనే సమర్థింపబడుచున్నది.

ఈ ౧ - ౨ - మంత్రములను మైత్రాయణులు «« అగ్నేజిహ్వాసివా చోవిసర్జనం'' అనిపఠించుచున్నారు. (౧ - ౧ - ౬ - ౧౩)

ఇందుకువినియోగనూత్రం ««అగ్నే స్తనూరసీతి తస్మిన్హవిః ఆవపతిత్రర్యజూంషా తూష్ణీంచతుర్థం'' (ఆపస్తంబశ్రౌతం ౧ - ౧౯ - ౭)

## ౧౦. (౧) అద్రిః అసి వానస్పత్యః
## (౨) సః ఇదం దేవేభ్యః హవ్యం సు+శమీా శమిష్వ.

**జ్ఞానార్థము.**

టీ॥ (౧) (ఓశరీరమా నీవు) వానస్పత్యః = దారుసంబంధమైనదానవు, అద్రిః = పాషాణ సంబంధమైన దానవు, అసి = అగుచున్నావు.

(౧) సః = ఆ(నీవు) ఇదం = ఈ హవిస్సును అనగజీవుని, దేవేభ్యః = సద్వృత్తులకొరకు సు+శమీా = శాంతికలుగునటుల శమిష్వ = చేయుము.

తా॥ (ఓశరీరమానీవు) పాషాణముతోను దారువుతోను చెయ్యబడినదానవు అయినను జీవుని నిర్మలమైనదానిగ చేయుము.

**కర్మార్థము.**

టీ॥ వానస్పత్యః = [ఓరోకలీనీవు] చెట్టువలన బుట్టినదానవుగానున్న, అద్రిః = [దృఢత్వముచే] రాయివంటిదానవుగానున్న, అసి = అగుచున్నావు, సః = ఆ[నీవు] దేవేభ్యః = దేవార్థమైన, ఇదం = ఈధాన్యరూపమైన, హవ్యం = హవిస్సును, సు+శమీా = భుజించుటకువిరోధమైన, ఊకమొదలగునవిలేకుండనటుల] సుష్టుగాఅయ్యేలాగున శమిష్వ = చేయుము.

వినియోగము॥ ఈమంత్రముచెప్పిముసలము నుంచవలయును.

వి॥ దేవేభ్యః = అనగ సద్వృత్తులకొరకు (ఈపదమునుగూర్చి సామన్యవిషయములుచూడుము)

'హవ్యం'నుగూర్చి 3-వ అనువాక ౧౦-వమంత్రవివరణచూడుము. సు+శమీా అనగ సుకర్మ,శమీా అను పదము కర్మనామములయందు చెప్పబడినది. (వేదని

ఘంటువు ౨-౧) శమఉపశమె అను ధాతువవలన వ్యుత్పన్నమైనది. 'శమ' అనగ కామక్రోధాదులులేకుండుట. (గురుబాలప్రబోధిక ౭౯౮) ఈపదమునకుఋగ్వేద భాష్యమందు "సుశమిశోభనకర్మయథాభవతి తథా సుకర్మత్వాయేత్యర్థః" అని చెప్పబడినది. (ఋగ్వేదం ౫-౮౭-౯) శమిష్వఅను ధాతువుకూడ "శమశాంతౌ" అను ధాతువువలననే వ్యుత్పన్నమైనది.

"సఇదందేవేభ్యో సుశమిశమిష్వేత్యాహ।శాంత్యై"(తై. బ్రా. 3-౨-౫)ధాన్యమును రాతిసంబంధమైన కఱ్ఱసంబంధమైనరోళ్లలోదంపి పొట్టుమొదలైనవాటిని తీసివేసి శుభ్రము చేయునటులజీవుని ఈశరీరమందు తపస్సుమొదలగు సత్కర్మాచరణచే శాంతినిపొందించి భగవంతునికి అర్హతకలుగచేయవలయునని బోధించుచున్నది.

'సుశమిష్వ' అనుమంత్రమున్ను 'శాంత్యై' అను బ్రాహ్మణమున్ను అచేతనమైన ధాన్యమునకు చెందునో ధాన్యము ఉపమానముగాగల ఉపమేయమైన జీవునికి చెందునో అనేసంగతి కర్మార్థమేగాని జ్ఞానార్థములేదని వాదించువారు ఆలోచించతగినది.

ఇందుకువినియోగసూత్రము "అద్రిరసి వానస్పత్యమితి ముసలమాదాయ" (ఆపస్తంబశ్రౌత ౧-౧౯-౮)

ముసలము తీసికొనివచ్చి యేమి చేయవలసినది ఈమంత్రముయొక్క వినియోగమందు చెప్పబడలేదు "హవిష్కృదేహీతిత్రిరవహంతి" అని సూత్రశేషము చెప్పుచున్నది "హవిష్కృదేహీ" అనుమంత్రము తైత్తిరీయసంహితయందు వ్యాఖ్యామైనను బ్రాహ్మణమందు చెప్పబడినది. వాజసనేయసంహితయందు "హవిష్కృదేహీ" అని 3-సార్లు పఠించబడుచున్నది.

౯ - ౧౦ - సూత్రములలో ఈమంత్రమునుగూర్చి ఆపస్తంబులవారు చెప్పినదేమనగ "హవిష్కృదేహీతిబ్రాహ్మణస్య, హవిష్కృదాగహీతిరాజన్యస్య, హవిష్కృదాద్రవేతి వైశ్యస్య, హవిష్కృదాదేవేతిశూద్రస్య, ప్రథమంవా సర్వేషాం" ఈసూత్రమునకు భాష్యమందు "శూద్రస్యేతినిషాదస్థపత్యర్థం" అని రుద్రదత్తాచార్యులవారు చెప్పినారు.

---

౧౧. (౧) ఇషం ఆ వద ఊర్జం ఆ వద.
(౨) ద్యుమత్ వదత వయం సంఘాతం జేష్మ.

జ్ఞానార్థము.

టీ॥ (౧) ఇషం=(ఓశరీరమానీవు) జ్ఞానమునుగూర్చి, ఆవద=ప్రకటించండి, ఊర్జం=బలమును,ఆవద=ప్రకటించండి.

కర్మార్థము.

టీ॥ ఇషం=(ఓ రాయి నీవు) హవిస్స్వరూప మయిన యీ అన్నమును, ఆవద = (యజమానుడు తీసికొనివచ్చు

(౨) ద్యుమత్ = (ఓ ఇంద్రియము లారా) ప్రకటించండి, వయం= మేము, సంఘాతం=అరిషడ్వర్గమును, జేష్మ=జయించెదము.

తా ॥ (౧) ఓ శరీరమా నీవు) జ్ఞానమును బలమును ప్రకటింపుము.

(౨) (ఓ ఇంద్రియములారా) జ్యోతిని ప్రకటించండి. మేము అరిషడ్వర్గమును జయించెదము.

చున్నాడని దేవతలకొరకు) ప్రకటింపుము ఊర్జం= (ఆ అన్న)రసమును, ఆవద= యజమానుడు తీసికొనివచ్చు చున్నాడని దేవతలకొరకు) ప్రకటింపుము, ద్యుమత్= ఓయజ్ఞాయుధములా మీరు ఈహవిస్సు మంచిరసముకలదని, వదత = (దేవతల కొరకు) ప్రకటింపుడు, వయం= మేము, సంఘాతం=శత్రుసముదాయమును, జేష్మ రాయినూరెశబ్దము చేత)జయించగలము.

వినియోగము॥ ఈమంత్రము చెప్పి దృషదుపలములను లెస్సగా గుట్టవలయును.

వి ॥ బ్రాహ్మణము ననుసరించి రెండుమంత్రములుగ విభజింపబడినది. ఇషం అనుశబ్దమునుగూర్చి ప్రథమా అనువాక ప్రథమమంత్ర వివరణచూడుడు.

ఇందుకు బ్రాహ్మణముననుసరించి ‹‹ ఇషమావదోర్జమావదేత్యాహ ’’ ఇషమేవోర్జంయజమానేదధాతి (తై. బ్రా. ౩. ౨. ౫) అనగా యజమానికి జ్ఞానము బలముకలుగజేయుచున్నాడు.

(౨) ద్యుమత్ అనునది జ్వలనార్థమందు వేదనిఘంటువులో చెప్పబడినది. (౧-౧౬-౧౧) ద్యుమత్ ద్యోతనవాక్ అనియాస్కుడు చెప్పియున్నాడు. (పూర్వషట్కం ౬. ౧౯)

జ్యోతినిగూర్చి ఇంద్రియములు బాగుగ యత్నము చేయవలసినదనియు ఆప్రకారముగచేసినయెడల అంతశ్శత్రువుల సంఘాతమును జయించి మోక్షమును పొందెదమనియు నీమంత్రము తెలియచేయుచున్నది. ఈయర్థమునే బ్రాహ్మణము తెలియచేయుచున్నది. ‹‹ ద్యుమద్వదతవయం సంఘాతం జేష్మేత్యాహ । భ్రాతృవ్యాభిభూత్యై ’’ (తై-బ్రా. ౩ ౨. ౫.) మనలోపలనే సద్గుణములు దుర్గుణములు పుట్టును సద్గుణములుభ్రాతృలు దుర్గుణములుభ్రాతృవ్యులు చేయు‹‹మనోశ్రద్ధాదేవీస్యయజమానసురక్షీన్నిస్యావాకం +++శ్రేష్ఠయేషాంభవతి’’ అని బ్రాహ్మణము చెప్పుచున్నది. అనగా మనస్సునుజయించి శ్రేష్ఠుడగును.

ఇందుకు వినియోగసూత్రము ‹‹ ఇషమావద ఊర్జమావదేతి దృషదుపలె సమాహన్తి (ఆపస్తంబశ్రౌత ౧-౨౦-౨)

## ౧౨. వర్షవృద్ధం అసి.

**జ్ఞానార్థము.**

టీ ॥ (ఓ శరీరమా నీవు) వర్షవృద్ధం=వృక్షము, అసి=అగుచున్నావు.

తా ॥ నీవు వృక్షమువంటిదానవు.

**కర్మార్థము.**

టీ ॥ వర్షవృద్ధం=(ఓశూర్పమానీవు) వర్షముచే వృద్ధిపొందిన వెదురుచేత చెయ్యబడినదానవు గనుక) వర్షముచెవృద్ధినొందినదానవు, అసి=అగుచున్నావు.

వినియోగము ॥ దంపిన ధాన్యమును పొట్టులేకుండా చెరిగినతర్వాత ఈమంత్రము చెప్పి ముందుగాగాని ఉత్తర మందుగాని చాటనుంచవలయును.

---

వి ॥ శరీరము వృక్షమైనట్లును దానియందు జీవాత్మ పరమాత్మ నివసించియున్నట్లును అనేకస్థలములయందు చెప్పబడినది. "ఊర్ధ్వమూల వృఖంమవాక్ఛాఖంయోవేదసంప్రతి" (ఆరణ్యకం ౧-౫౨) "ఊర్ధ్వమూలమధశ్శాఖం అశ్వత్థం ప్రాహురవ్యయం" "సుపర్ణావేతౌసుయుజౌ సఖాయౌ యదృచ్ఛయాకృతనీడౌచ వృక్షే । ఏకస్తయోః ఖాదతిపిప్పలాన్నం అన్యోనిరన్నోపి బితేనభూయాన్" భాగవతము (చెన్నపట్టణముకూర్పు పుట ౧౦. ౩౫)

"ద్వాసుపర్ణాసయుజాసఖాయాసమానం వృక్షంపరిషస్వజాతే । తయోరన్యః పిప్పలంస్వాద్వత్త్యనశ్నన్నన్యో అభిచాకసీతి" (ముండకోపనిషత్తు ౩.౧.౧)

ఇందుకు వినియోగసూత్రము "వర్షవృద్ధమసీతి పురస్తాచ్ఛూర్పముపోహత్యుత్తరతోవా" (ఆపస్తంబశ్రౌత ౧-౨౦-౫)

---

## ౧౩. ప్రతిత్వా వర్షవృద్ధం వెత్తు.

**జ్ఞానార్థము.**

టీ॥ త్వా=(ఓశరీరమా) నిన్ను, వర్షవృద్ధం=వృక్షముగ, ప్రతివెత్తు=తెలుసుకొనుగాక.

తా॥ ఓశరీరమానీవు వృక్షమువంటిదానవు.

**కర్మార్థము.**

టీ॥ త్వా=[ఓధాన్యసముదాయమా] నిన్ను, ప్రతి=గ్రహించి, వర్షవృద్ధం=వర్షముచే వృద్ధినొందినదానవుగనుక.

వినియోగము॥ ఈమంత్రముచెప్పి చెరగవలయును.

వి॥ ౧౨ - ౧౩ - మంత్రములుకలిపి ఏకమంత్రముగ బ్రాహ్మణమందు వ్యాఖ్యానముచేయబడినది "వర్షవృద్ధమసి ప్రతిత్వా వర్షవృద్ధావా వోషదయఇత్యాహ। వర్షవృద్ధాఇషీకాసమృద్ధ్యై" (తై. బ్రా. ౩-౨-౫) "ఇషీకావేణవః" అనివిద్యారణ్యులవారు అర్థమువ్రాసినారు. (చెన్నపట్టణంకూర్పుపుట = ౭) ఇషీకయొక్క వ్యుత్పత్తినిగూర్చి ఉజ్వలదత్తులవారు "ఇషేఃకిద్ధ్రస్వశ్చ" (౪-౨౧)అను ఉణాది సూత్రముక్రింద వ్రాసినదేమనగ "ఇషగతౌఅస్మాదీకన్ ప్రాస్వశ్చకిత్వా ద్గుణాభావః, ఇషీకాశరశలాకా వీరణకాష్ఠికాచ" ఈపదమునకు యాస్కుడు నిరుక్తమందువ్రాసినదేమనగ "ఇషీకఏషీకేషతేఃగతికర్మణః" (ఉత్తరషట్కం ౩-౮) ఇందువలన ఇషీకమనగ వృద్ధిపొందెడిది అని ద్యోతకమాచున్నది. విద్యారణ్యులవారు వ్రాసినదేమనగ "మంత్రద్వయేవృద్ధిశబ్దేన సమృద్ధిఃద్యోతతె" అనగ ౨-మంత్రముల యందు వృద్ధిశబ్దము ఉపయోగించుటచే సమృద్ధిద్యోతకమాచున్నది. ఈ అర్థమునే మైత్రాయణీబ్రాహ్మణము చెప్పుచున్నది "ప్రతిత్వావర్షవృద్ధం వేత్వితి ప్రతిష్ఠిత్యై" (౪ - ౧ - ౭) కావున ౧౨, ౧౩-మంత్రములయొక్క తాత్పర్యము "ఓశరీరమా నీవు వృక్షమువలనె వృద్ధిపొందుము."

ఇందుకు వినియోగసూత్రము "ప్రతిత్వావర్షవృద్ధంవేత్త్యుద్వపతి"ఆపస్తంబశ్రౌత (౧-౨౦-౬)

---

## ౧౪. పరాపూతం రక్షః పరాపూతాః అరాతయః.

**జ్ఞానార్థము.**

టీ॥ రక్షః = ప్రతిబంధకము, పరాపూతం=నశించుగాక, అరాతయః=అంతర్బహిశ్శత్రువులను విఘ్నములు, పరాపూతాః=నశించుగాక.

తా॥ మేము చేయబోవు సత్కార్యములయొక్క ప్రతిబంధకములు నశించి అవిఘ్నమవుగాక.

**కర్మార్థము.**

టీ॥ రక్షః=రాక్షసుడు, పరాపూతం=పోగొట్టబడుగాక, అరాతయః=శత్రువులు, పరాపూతాః=పోగొట్టబడుదురుగాక.

వినియోగము॥ ఈమంత్రముచెప్పి ఉత్కరస్థలమందు వేయవలయును.

---

వి॥ ఈమంత్రముయొక్క బ్రాహ్మణము కామక్రోధాదులను దేనితోపోల్చబడినది తెలియచేయుచున్నది. "యజ్ఞగ్ంరక్షాగ్ం స్యనుప్రావిశన్" సత్కర్మను కామక్రోధాదులు పొందినవి. "తాన్యస్నాపశుభ్యోనిరావదయంత" "అస్నా" కు బదులు "అశ్నా"అని కాఠకశాఖయందు (౩౧-స్థానకం ౪) పఠించబడుచున్నది, 'అస్నా'అను పదము నిఘంటువులయందు మృగ్యము. అశ్నాఅనుపదము వేదనిఘం

టువందును వేదాంగమయిన నిరుక్తమందును మేఘమనగ అంధకారార్థమందుప యోగింపబడినది. "అస్నా" "అశ్నా" ఏకార్థములుగ నెంచవలయును. 'అస్ర' అనగ రక్తము. "అస్న' శబ్దముకూడ రక్తార్థమం దుపయోగింపబడినటుల విద్యారణ్యభాష్యమువలన కనుపించుచున్నది. "తుషైరోషధీభ్యః" ఓషధులనుంచి పొట్టుచేతను (నివారింపబడుచున్నవి) "రక్షాంసినిష్కాసితవంతః తుషత్యాగేనచ ఓషద్యుపలక్షితేభ్యః" అని విద్యారణ్యులవారు వ్రాసినారు (చెన్నపట్టణంకూర్పు పుట ౯౨) అనగా ఓషధులు జీవునికి ఉపలక్షణమనియు, జీవుడు అంధకారముచె కప్పబడినటుల ధాన్యము తుషచేకప్పబడినదనియు, తుషనుపోగొట్టి ధాన్యమునుస్వ చ్ఛతగ చేయవలయుననునది ఉపమానమనియు అంధకారమునుపోగొట్టి ఆత్మను జ్ఞా నముకలదిగచేయవలయుననుట ఉపమేయమనియుగ్రహించతగును. "పరాపూతంర క్షః పరాపూతా అరాతయఇత్యాహ । రక్షసామపహత్యై" (తై. బ్రా. 3-౨-౫) అనగ తుషవంటి అజ్ఞానమునశించుటకు.

ఛందస్సువిషయమై ఈ అనువాకముయొక్క ౬-మంత్ర వివరణచూడుము.

"పరాపూతమితియజురాదికైకపదయాగాయత్ర్యా" అనిఇచటనున్న భట్ట భాస్కరులవారు చెప్పియున్నారు. (౧-౧-౫)

ఇందుకు వినియోగసూత్రం "పరాపూతంరక్షః పరాపూతాఅరాతయ ఇత్యు త్కరెపరాపునాతి" (ఆవస్తంబ ౧-౨౦-౭)

## ౧౫. రక్షసాం భాగః అసి.

**జ్ఞానార్థము.**

టీ॥ (ఓ అజ్ఞానమానీవు) రక్షసాం= రాక్షసులయొక్క, భాగః=భాగము, అ సి=అగుచున్నావు.

తా॥ అనగ దుర్వృత్తులను నశింపచే యవలయును.

**కర్మార్థము.**

టీ॥ [ఓఊకానీవు] రాక్షసులకు,భా గః=భాగము, అసి=అగుచున్నావు.

వినియోగము॥ ఈమంత్రముచెప్పి కృ ష్ణాజినముక్రిందనేకాని ఉత్తరదేశమందే కాని అనాంతరదేశమందేకాని మధ్యమ మైన పురోడాశ కపాలముతో తీసుకొ నవేయవలయును. లేకహస్తముచేతనైనా వేయవలయును.

వి॥ దేవతలనగ జ్ఞానులని ఇదివరకు అర్థం వ్రాయబడియున్నది దేవత అను శబ్దమునకు మరియొక అర్థముకలదు. మనలోనుండు సద్వృత్తుల్లు దేవతలనియు దు ర్వృత్తులు రాక్షసులనియు లేక అసురులనియు చాందోగ్యోపనిషత్తులందును బృహ

దారణ్యకోపనిషత్తుయందును చెప్పబడ్డది. ఈవిషయము ఈ అనువాకాంతసామాన్యవిషయములలో విస్తరింపబడును. సద్వృత్తులను వృద్ధిచేయవలయును. దుర్వృత్తులను నశింపచేయవలయును. సద్వృత్తులను దేవభాగమనియు దుర్వృత్తులను రక్షసాంభాగమనియు చెప్పబడుచున్నది. ప్రథమనువాకం ౫-మంత్రమందు "ఆప్యాయధ్వమఘ్న్యా దేవభాగం" అని చెప్పియుండుటవలన జ్ఞానసంపాదనచే సద్వృత్తులను వృద్ధిచేయవలయుననియు, ఈమంత్రముయొక్క బ్రాహ్మణమందు "తుష్పైరే వరక్షాంసినివయదతె" అని చెప్పియుండుటవలన అజ్ఞానమును పరిత్యజించుటచే దుర్వృత్తులు నశించుననియు బోధఅగుచున్నది. ఈమంత్రమునకు సంబంధించిన మైత్రయణీసంహితయందు (౧-౧౭.౨) "ప్రవిద్ధోరక్షసాంభాగః" అనియు వాజసనేయసంహితయందు (౧-౧౬) "అపహతంరక్షః" అనియు పఠింపబడుచున్నవి.

మహీధర భాష్యమందు ౧౪-౧౫-మంత్రములనుగూర్చి వ్రాయబడినదేమనగ "పురాపూతంఇతినిః పునాతీతి, "రక్షః" పరాపూతంనిరాకృతంశూర్పేణతుషేషుప రాపూతేషుతద్గతంరక్షోపితైస్సహభూమా పాతితం అరాతయః హావిః ప్రతికూలాః ఆలశ్యాదిశత్రవశ్చ పరాపూతాఃనిరాకృతాః అపహతమితి తుషాన్నిరస్యతీతి "రక్షః" అపహాతందూరెఅపనీయమారితంతాన్ దూరె నిస్సారయేత్" (శుక్లయజుర్వేదభాష్యం కలకత్తాకూర్పుపుట ౧౨) ఇందువలన రాక్షసులు పొట్టుచేత తృప్తిపడి వెళ్ళిపోదురని చెప్పుట ఆరోపణఅనితేటబడుచున్నది. మరియు ఆలశ్యాది దుర్గుణములను పరిత్యజించి భగవత్కారుణారసమును పొందినయెడలపరిశుద్ధతకలుగును; కావుననే ఈమంత్రముయొక్కబ్రాహ్మణమందు "అపఉపస్పృశతిమేధ్యత్వాయ" అనిచెప్పబడినది. (తై.బ్రా. 3-౨-౫)

ఇందుకు వినియోగసూత్రము "మధ్యమేపురోడాశకటాలేతుషానోప్య రక్షసాం భాగోసీత్యధస్తాత్కృష్ణాజినస్యో పవపత్యుత్తర మపరమవాంతరదేశం" "హస్తేనోపవతీతిబహ్వృచబ్రాహ్మణం" (ఆపస్తంబశ్రౌత ౧-౨౦-౧౦)

---

## ౧౬. వాయుః వః వి + వినక్తు

**జ్ఞానార్థము.**

టీ ॥ వాయుః = భగవంతుడు, వః =మిమ్ములను, వి=లెస్సగ, వినక్తు=పవిత్రముచేయుగాక.

తా॥ భగవంతుడు మీయందుండు దుర్మార్గవృత్తులను నశింపచేసి మిమ్ములను పవిత్రముచేయుగాక.

**కర్మార్థము.**

టీ ॥ వః = (ఓబియ్యమా) మిమ్మున, వాయుః=వాయువు, వివినక్తు=(నూకలుమొదలగునవి లేకుండ నటుల) బాగుచేయుగాక.

తా ॥ ఈమంత్రముచెప్పి విడదీయవలయును.

వి ॥ వాయుః అనగ భగవంతుడని ౪-వ అనువాకము ౮-వ మంత్ర వివరములో వ్రాయబడినది. వాయుః అనగ పవిత్రముచేయువాడని ఈబ్రాహ్మణము చెప్పుచున్నది "వాయుర్వోవివినక్త్వత్యాహ । పవిత్రంవైవాయుః । పునాత్యేవై నాన్" (తై-బ్రా. 3. ౨. ౫) వీటిని పవిత్రముచేయుచున్నాడు.

ఇందుకు వినియోగసూత్రము "వాయుర్వోవివినక్త్వితివివిచ్య" (ఆపస్తంబ శ్రౌత ౧. ౨౦. ౧౧)

## ౧౭. దేవః వః సవితా హిరణ్యపాణిః ప్రతి గృహ్ణాతు

జ్ఞానార్థము

టీ ॥ వః=(ఓజీవులారా) మిమ్ములను హిరణ్యపాణిః=అమృతముహస్తమందు కలిగిన, సవితా=ప్రేరకుడగు, దేవః=భగవంతుడు, ప్రతిగృహ్ణాతు=గ్రహించుగాక.

తా ॥ ఓజీవులారా మిమ్ములను భగవంతుడు అమృతము నిచ్చిరక్షించుగాక.

కర్మార్థము.

టీ ॥ వః= (ఓ బియ్యమా) మిమ్మున హిరణ్యపాణిః= బంగారుఉంగరమును చేతులో ధరించిన, సవితా = ప్రేరకుడైన దేవః=దేవుడు, ప్రతిగృహ్ణాతు= ప్రతిగ్రహించు గాక.

వినియోగము ॥ ఈమంత్రము చెప్పి పాత్రయందు బియ్యమునుంచవలయును

వి ॥ హిరణ్యపాణి అనుశబ్దమునకు వ్యాఖ్యాతలు భిన్నార్థములు వ్రాసినారు "హిరణ్యంజ్యోతిః । పాణిఃహస్తః । హిరణ్యవ్యవహారోవాయస్య సః । జ్యోతిర్హిరణ్యం" శుక్లయజుర్వేదభాష్యం (బొంబాయికూర్పు పుట ౪౬) ఈశబ్దమునకు అనేకార్థములుకలవు వేదనిఘంటువునందు అమృతము మొదలగు అర్థములుకలవని వ్రాయబడియున్నది. (౧. ౨) 'అమృతంజ్యోతిః' ఈపదములు అజ్ఞానమునుపోగొట్టి జ్ఞానానందమును కలుగచేయునది అని తెలుసుకొనవలయును. హిరణ్యశబ్దముయొక్క వ్యుత్పత్తి ఈఅర్థమునేబోధించుచున్నది "ద్విధాతుజంరూపం । హినోతేఃరమతేశ్చధాతుద్వయాత్ సముదితాత్ రూపసిద్ధిః" దేవరాజయజ్వాభాష్యము (వేదనిఘంటువు కలక. కూర్పు ౨౦)

ఇందుకు బ్రాహ్మణము "దేవోవస్సవితా హిరణ్యపాణిః ప్రతిగృహ్ణాత్విత్యాహ ప్రతిష్ఠిత్యై । హవిషోస్కందాయ" (తై. బ్రా. 3-౨-౫)

ఇందుకు వినియోగసూత్రము "దేవోవస్సవితాహిరణ్యపాణిఃప్రతిగృహ్ణాత్వితి పాత్ర్యాం తండులాన్ప్రస్కందయిత్వా" (ఆపస్తంబశ్రౌతం ౧-౨౦-౧౧)



## ఐదవ అనువాక సామాన్య విషయములు.

———:0:◡:0:———

౧. కర్మరీత్యా ఈ అనువాకము వ్రీహ్యవఘాతమని చెప్పబడుచున్నది. జ్ఞానరీత్యా జీవాత్మతాడనమని చెప్పవచ్చును. ఈ అవఘాతకర్మనుగూర్చి నైయాయికులుచెప్పినదేమనగ «సంస్కారః పుంసఏవేష్టః ప్రోక్షణాభ్యుక్షణాదిషు"(కుసు.తారానాథవాచస్పతీ పుట ౪౧౯) ప్రోక్షణాదికర్మలు పురుషునికేకాని మరియొకరికికావు. వ్రీహ్యాదులకు భావనయా ప్రోక్షణాదికర్మలు జరుగుచున్నవి. బహిర్యజ్ఞమందు అంతస్థితమైన తుషమొదలగునవి పోవునటుల ధాన్యమును దంపినరీతిని అంతస్థిత దుర్గుణములు నశించునటుల జీవుని తాడనచేయవలసినది గనుక అంతర్యజ్ఞమందు జీవతాడనమని చెప్పబడినది.

౨. దేవాసురయుద్ధము అనేకస్థలములయందు కనుపించుటచే దీన్నిగురించి కొన్ని సంగతులు ఇచట వ్రాయుచున్నాము. మనుజుడు ప్రజాపతి అనియు, జ్ఞానాజ్ఞానములు అతనికి భార్యలనియు, జ్ఞానమువలన పుట్టెడు వృత్తులు దేవతలనియు, అజ్ఞానమువలన పుట్టెడు వృత్తులు అసురులనియు, లేక రాక్షసులనియు, మన గ్రంథంబులయందు చెప్పంబడినది. దేవాసురయుద్ధమనగ సద్గుణములకు దుర్గుణములకు రెంటికి జగడమనియు జ్ఞానమను సోమమును గ్రహించి భగవద్వాక్యులయిన ప్రణవమును స్మరించి, సద్గుణములు దుర్గుణములను జయించెను.

సామవేదోపనిషత్తయిన ఛాందోగ్యమందు "దేవాసురాహవైయత్రసంయతిరేఉభయే ప్రాజాపత్యాః" అని చెప్పబడినది (౧-౨-౧) ఇందుకు భాష్యము « దేవాఃదీవ్యతేర్ద్యోతనార్థస్య శాస్త్రోద్భాసితా ఇంద్రియవృత్తయః" అసురాఃతద్విపరీతాః స్వేష్వేవాసుషు విష్వగ్విషయ విషయాసు ప్రాణనక్రియాసుర మణాత్స్వాభావిక్యస్తమాత్మికా ఇంద్రియవృత్తయః । ప్రాజాపత్యాఃప్రజాపతిః కర్మజ్ఞానాధికృతః పురుషః" శంకరభాష్యం ౧-౨-౧ « దిత్యదిత్యాదిత్యపత్యుత్తర పదాణ్ణ్య ఇతిణ్యః। (పా ౪-౧-౮౫) అదితి అఖండమైనది గనుక జ్ఞానము; అదితిపుత్రులు ఆదిత్యులు; దితిఖండమైనదిగనుక అజ్ఞానము; దితిపుత్రులు దైత్యులు బృహదారణ్యకమందు "ద్వయాఃప్రాజాపత్యాదేవాశ్చ అసురాశ్చ" అని చెప్పబడియున్నది. (3-3-౧) ఇందుకుశంకరభాష్యము "శాస్త్రజనిత జ్ఞానకర్మభావితాః ద్యోతనాద్దేవాభవంతి తయేవస్వాభావిక ప్రత్యక్షానుమానజనిత దృష్టిప్రయోజన కర్మజ్ఞానభావితాః అసురాః" బ్రహ్మసూత్రముయొక్క అ. 3. పా. 3. సూ. ౬-క్రిందను వ్రాయబడిన రత్నప్రభాభాష్యము «తేహదేవాస్సాత్విక వృత్తయఃప్రాణాః. రజస్తమోవృత్తిరూపా అసురాః." ఈలక్షణములయందు కొంచము భేదమున్నను అన్నివ్యాఖ్యానముల

యందు దుర్మార్గవృత్తులుదుర్మార్గప్రాణములు దుర్మార్గగుణములు అసురులనియు, సత్ప్రాణములు సద్గుణములు మొదలగు దేవతలనియు చెప్పబడ్డది.

3. ఇందుకు వంశావళి.

ప్రజాపతి
పురుషుడు

| ప్రథమభార్య అయిన జ్ఞానమువలన | రెండవభార్యఅయిన దితి అజ్ఞానమువలన |
|---|---|
| దేవతలు | దైత్యులు |
| అనగ సద్వృత్తులు. | దుర్వృత్తులు. |

౪. దేవతలయొక్క రాక్షసులయొక్క కొన్ని పేర్లు ప్రబోధ చంద్రోదయమందు చెప్పియున్నారు.

| దేవతలు. | | రాక్షసులు. | |
|---|---|---|---|
| ౧ శాంతి | ౬ నీతి | ౧ కామః | ౬ క్రోధః |
| ౨ కరుణా | ౭ భక్తి | ౨ రతిః | ౭ లోభః (లేక అత్యాశ) |
| 3 శ్రద్ధా | ౮ విరాగం | 3 దంభః | ౮ హింసా |
| ౪ మైత్రీ | ౯ ధ్యానం | ౪ అహంకారః | ౯ భ్రమః |
| ౫ క్షమా | ౧౦ బోధ | ౫ మహామోహః | ౧౦ మిథ్యా |

మరియు శ్రీమద్గీతాభాష్యముయొక్క ౧౬-వ అధ్యాయమందు దైవీ సంపత్తులున్ను అసురీసంపత్తులున్ను చెప్పబడినవి.

ఇవి సద్గుణములు.

అభయం సత్వసంశుద్ధిః జ్ఞానయోగవ్యవస్థితిః దానందమః యజ్ఞః స్వాధ్యాయః తపః ఆర్జవం (౧) అహింసా సత్యం అక్రోధః త్యాగః శాంతిః అపైశునం దయా అలోలుత్వం మార్దవం హ్రీః అచాపలం (౨) తేజః క్షమా ధృతి శౌచం నాతిమానితా (3) ॥

ఇవి దుర్గుణములు.

దంభః దర్పః అభిమానః క్రోధః పారుష్యం అజ్ఞానం ॥ (౪)

రాక్షసులను దేవతలు జయించుమార్గము ఐతరేయబ్రాహ్మణమందు చెప్పబడినది. అదియెట్లనగ "దేవాసురావా ఏషులోకేషుసమయ తంతతతఏతస్యాం ప్రాచ్యాందిశ్యయతంత । తాంస్తతోఅసురా అజయం స్తదక్షిణస్యాం దిశ్యయతంత । తాంస్తతోఅసురా అజయంస్తఉదీచ్యాంప్రాచ్యాందిశ్యయతంత । తేతతో నపరాజ

యంత । సైషాదిగపరాజితా తస్మాదేతస్యాందిశియతేతవా యాతయేద్వేశ్వరోహ్యవృణాకర్త్తోస్తేదేవాఅబ్రువన్నరాజతయావైనోజయంతి రాజానంకరవామహా ఇతి తథేతి తేసోమంరాజానం అకుర్వంస్తే సోమేనరాజ్ఞాసర్వాదిశోజయన్'' (౧, ౧౪)(సోమ విషయమై ౩-వ అనువాకము చూడుడు.)

౫. రెండవ అనువాక చివరను అనగ ౩౨ పుటయందు వ్రాయంబడిన శ్లోకములకు అర్థము కఠినముగానున్నదని కొందరు తెలియచేసినందున దాని అర్థము ఇచటవ్రాయు చున్నారము.

౧ ౨ ౩ ౪ ౫ ౬
సః । భావః । కామతా । జగ్ధికరా । నాధీరధీరయః । జాతుజాలమరాః ।

౧ ౨ ౩ ౪ ౫ ౬
కాండాః । ప్రశ్నాః । అను । ప । పద । అక్షరాః ॥

క్రమాలంకారమువలె ఈపదములను చూచుకొనవలయును.

| | ౧ | ౨ | ౩ | ౪ | ౫ | ౬ | ౭ | ౮ | ౯ |
|---|---|---|---|---|---|---|---|---|---|
| ౧. కాదినవ= | క | ఖ | గ | ఘ | ఙ | చ | ఛ | జ | ఝ |
| ౨. టాదినవ= | ట | ఠ | డ | ఢ | ణ | త | థ | ద | ధ |
| ౩. పాదిపంచ= | ప | ఫ | బ | భ | మ | | | | |
| ౪. యాద్యష్టౌ= | య | ర | ల | వ | శ | ష | స | హ | |
| ౫. నబిందు= | ం | | | | | | | | |

పైశ్లోకమందున్న ప్రథమ అక్షరము 'సః' ఇది ౪-పంక్తిలో ౭-అక్షరము సః, కాండాః=౭-కాండలు.

భావః, ప్రశ్నాః=౪౪-ప్రశ్నలు.

(భా ౩-వపంక్తిలో ౪-వ అక్షరము. వ ౪-వపఙ్తిలో ౪-వ అక్షరము)

కామతా, అను ౬౫౧-అనువాకములు.

(క ౧-పంక్తిలో ౧-టో అక్షరము. మ ౩-పంక్తిలో ౫-వఅక్షరము. త ౨ పంక్తిలో ౬-అక్షరము. ఈ అంకెలు వామపార్శ్వముగచూచిన ౬౫౧ - ఔను)

౬. ఈప్రకారముగానె శేషించినవాటికని. జగ్ధికరా పం=౪౯౧౨, వామముగ చూచిన ౨౧౯౪-పనసలు, నాధీరధీరయః పద = ౦-౯౨-౯౨౧, వామముగ చూచిన, ౧౨౯౨౯౦-పదములు జాతుజాలమరాః, అక్షరాః=౪౬౪౩౫౨, వామముగ చూచిన ౨౫౩౪౬౪-అక్షరములు. ఇవి యజుర్వేద తైత్తిరీయసంహిత యందుకలవు.

౭. ఈ అనువాకముక్రింద నుదహరించబడినవాటితో కొన్నిమంత్రవ్యత్యయములుగ సంబంధించుచున్నది.

| | |
|---|---|
| కాఠకసంహితా | ౧ - ౫ |
| వాజసనేయసంహితా | ౧ - ౧౨ - ౧౬ |
| మైత్రాయణీసంహితా | ౧ - ౧ - ౬ - ౭ |

అయిదవ అనువాకము

సంపూర్ణము.



ఓమ్

శ్రీపరబ్రహ్మణేనమః.

కృష్ణయజుర్వేద

# తైత్తిరీయసంహితామంత్రభాగస్య

## షష్ఠమోఽనువాకః.

కాండఋషి ప్రజాపతిః.

---

### ౧. అవధూతం రక్షః అవధూతాః అరాతయః.

జ్ఞానార్థము.

ఈమంత్రమునకు ౫-వఅనువాక ౭వ మంత్రమును చూడుము.

కర్మార్థము.

టీ॥ రక్షః=కృష్ణాజినంలో అంతర్భూతముగా నుండెడి రాక్షసుడు, అవధూతం=మిక్కిలి నశింప చేయబడినవాడుగా [అగుగాక], అరాతయః=[కృష్ణాజినంలో అంతర్భూతముగానుండెడి] శత్రువులు, అవధూతాః=మిక్కిలి నశింపబడినవారుగా [అగుగాక]

వినియోగము॥ ఈమంత్రముచెప్పి కృష్ణాజినమును దులుపవలయును.

### ౨. అదిత్యాః త్వక్ అసి ప్రతి త్వా పృథివీ వేత్తు.

జ్ఞానార్థము.

ఈమంత్రార్థమునుగూర్చి ౫-వ అనువాకముయొక్క ౮-వమంత్రమును చూడుము.

కర్మార్థము.

టీ॥ అదిత్యాః = (ఓకృష్ణాజినమా నీవు) భూమికి, త్వక్= చర్మరూపము, అసి=అగుచున్నావు, త్వా = నిన్ను, పృథివీ = భూమి, ప్రతి=పొంది, వేత్తు = (తనచర్మమని) తెలిసికొనవలయును.

వినియోగము॥ ఈమంత్రముచెప్పి కృష్ణాజినమును గార్హపత్యాగ్నికి తూర్పుభాగమున పరచవలయును.

3. దివస్కంభనిః అసి (౨) ప్రతి త్వా ఆదిత్యాః త్వక్ వేత్తు.

**జ్ఞానార్థము.**

టీ॥ (౧) (భగవంతుడా నీవు) దివస్కంభనిః=దివః = స్వర్గలోకమునకు స్కంభనిః=ఆధారుడవు, అసి=అగుచున్నావు.

టీ॥ (౨) త్వా=నిన్ను, ఆదిత్యాః=భగవంతునియొక్క, త్వక్=త్వక్ అయిన ఈశరీరము, ప్రతి+వేత్తు=(తనసంబంధమైనదానిగా) తెలుసుకొనుగాక.

తా॥ భగవంతుడు సర్వప్రపంచమునకు ఆధారుడని తెలుసుకొనవలయును.

**కర్మార్థము.**

టీ॥ దివః = (ఓశమ్యా) స్వర్గలోకమును, స్కంభనిః= ధరించెడుదానవు, అసి=అగుచున్నావు. ఆదిత్యాః=భూమియొక్క (కృష్ణాజినరూపమైన) చర్మము, త్వా=నిన్ను, ప్రతి=పొంది, వేత్తు = (తనశమ్యాఅని) తెలిసికోవలయును.

వినియోగము ॥ ఈ మంత్రము చెప్పి కృష్ణాజినమందు కుంభము కలశమ్యాఅనె కట్టునుంచ వలయును.

వి ॥ స్కంభః=అనగ పరబ్రహ్మయనియు సర్వమునకు ఆధారుడనియు అథర్వణ వేదమందు చెప్పబడినది. "యస్మైహస్తాభ్యాం పాదాభ్యాంవాచాశ్రోత్రేణచ క్షుషా । యస్మైదేవాఃసదాబలిం ప్రయచ్ఛంతి విమతేమతిం । స్కంభం బ్రూహికతమంస్విదేవసః" (౧౦ - ౭ - 3౯) అనగ ఎవనికొరకు దేవతలు హస్తములు పాదములు వాక్ శ్రోత్రము మొదలయినవాటితో నెల్లప్పుడు సమితమైన నివేదనను సమర్పించుచున్నారో. అను నీగ్రంథబాహుళ్యముచే అధ్యాయము నిచట పూర్తిగా వ్రాయబడలేదు.

భగవంతుడు స్కంభముచేత ఇహలోక పరలోకములను విడదీసినటుల ఋగ్వేదమందు చెప్పంబడినది. ‹‹సధామపూర్వంమమేయఃస్కంభేనవిరోదసి అజోనద్యాం అధారయత్ (౮ - ౪౧ - ౧౦)

ఈయర్థమునె బ్రాహ్మణమున్ను తెలియచేయుచున్నది. "దివస్కంభనిరసి ప్రతిత్వాదిత్యాస్త్వగ్వేత్విత్యాహ । ద్యావాపృథివ్యాఃవిధృత్యై" (తై.బ్రా. 3-౨-౬) అనగా విడదీయుటకు జగత్తంతయు పూర్వమందొకటిగానే యుండినదనియు, భగవంతుడు తనశక్తిచేతను రెండిటిని విడదీసెననియు సూచించుటకు శమ్యాఅనేకట్టును బాహ్యయజ్ఞమందు నిలవబడుచున్నాను.

ఇందుకు వినియోగసూత్రము ‹‹ దివస్కంభనిరసీతికృష్ణాజినముదీచీనకుంభాంశమ్యాంనిధాయ'' (అపస్తంబశ్రౌత ౧ - ౨౧ - 3)

శమ్యమనగ ‹‹ ఖాదిరకాష్ఠనిర్మితాషట్ త్రింశదంగులపరిమితాయామా అగ్రభాగేఅష్టా స్వంగులీషు కుంభ్యాష్టకయుతా తండులాదిపేషణకాలే దృషదో అధస్తా

త్స్థాపనాయోపయుజ్యమానా అగ్నిధ్రకర్తృకదృషదుపలాది సమమూహననాదౌ కరణభూతాశమ్యా పదవాచ్యా'' (శ్రౌతపదార్థనిర్వచనము ౮ - ౪౧)

"ఆదిత్యాఃస్కంభోసి'' అని మైత్రాయణులు పఠించుచున్నారు (౧ - ౧ ౨ - ౭ - ౫)

## ౪. ధిషణా అసి పర్వత్యా ప్రతీతిత్వా దివస్కంభనిః వెత్తు.

### జ్ఞానార్థము.

టీ॥ (ఓమనుజుడా నీవు) ధిషణా= ఆత్మసంబంధమైనదానవు, అసి = అగుచున్నావు, దివః = స్వర్గ లోకమును, స్కంభనిః = ధరించెడు భగవంతుడు, త్వా=నిన్ను, ప్రతివెత్తు=తెలుసుకొనుగాక.

తా॥ మనుజుడు పరమాత్మ సంబంధమైన జీవునితోను ప్రకృతిసంబంధమైన శరీరముతోను నిరూపించబడినవాడు గనుక జీవాత్మ పరమాత్మ సంబంధమైనదిగా తెలుసుకొనవలయును.

### కర్మార్థము

టీ॥ ధిషణా = (ఓసన్నికల్లా నీవు నూరడమునకు తెగినదానవుగానున్న, పర్వత్యా= (ధృఢమైన దానవు గనుక) పర్వత సమానమైన దానవుగా నున్న, అసి=అగుచున్నావు, త్వా = (ఆ) నిన్ను, దివః = స్వర్గలోకమును, స్కంభనిః=ధరించిన (శమ్యా) ప్రతి=పొంది, వేత్తు = (తనసన్నికల్లు అని) తెలిసికోవలయును.

వినియోగము ॥ ఈ మంత్రము చెప్పి శమ్యా అనే కఱ్ఱమీద సన్నికల్లు నుంచవలయును.

వి॥ ధిషణా అనుశబ్దమునుగూర్చి మహీధరాచార్యులవారు వ్రాసిన దేమనగ "ధియంబుద్ధింకర్మవాధినోతి వ్యాప్నోతిదదాతి వాధిషణాప్రాస్వమార్షం'' (శుక్లయజుర్వేదభాష్యం బొంబాయికూర్పు పుట ౧౪) ధారయత్యర్థమితిధీః బుద్ధిః ధారయతికర్తారం ఫలప్రదానే నేతిధీః కర్మబుద్ధిః కర్మవాసనోతి సంభజతేసనోతేః పచాద్యచ్ పృషో దరాదిత్వేచధిషణా'' (౨-వ అనువాకం 3-వమంత్రమును చూడుము)

స్కంభని అను పదమునుగూర్చి పై మంత్రముచూడుము.

ఇందుకు బ్రాహ్మణము "ధిషణాసిపర్వత్యాప్రతిత్వా దివస్కంభ నిర్వేత్విత్యాహ। ద్యావాపృధివ్యోఃవిధృత్యై'' (తై. బ్రా. 3-౨-౬) ఇహపరలోక సౌఖ్యముయొక్క దృఢముకొరకు.

ఇందుకు వినియోగసూత్రము "ధిషణాసిపర్వత్యేతిశమ్యాయాం దృషదమత్యాధాయ'' (ఆపస్తంబశ్రౌత ౧-౨౧-3)

"పాషాణమయీ పేషణకాలే పేషణీద్రవ్యాశ్రయభూతాదృషదిత్యుచ్యతే'' (శ్రౌతపదార్థ నిర్వచనము పేజీ ౯ - ౪౪)

## ౫. ధిషణా అసి పార్వతేయీ ప్రతి త్వా పర్వతిః వేత్తు.

### జ్ఞానార్థము.

టీ॥ ధిషణా=(ఓమనుజుడా నీవు) జ్ఞానముకలవాడవు, పార్వతేయీ=పర్వత సంబంధమైన వాడవు, అసి = అగుచున్నావు; త్వా=నిన్ను, పర్వతిః=ప్రకృతి, ప్రతివెత్తు = తెలుసుకొనుగాక.

తా॥ మనుజునియొక్క శరీరము పర్వత సంబంధమైనదానినిగా తెలుసుకొనవలయును.

### కర్మార్థము.

టీ ॥ ధిషణా= (ఓపాత్రరమా నీవు) నూరడమునకు తెలిసినదానవుగానున్ను, పార్వతేయీ=(దృఢమైనదానవుగనుక పర్వత సమానమైన దానవుగా నున్ను, అసి=అగుచున్నావు, త్వా=(అ)నిన్ను ప్రతి=పొంది, పర్వతిః= పర్వతసంబంధమైన సన్నికల్లు, వేత్తు=తనది అని= తెలిసికోవలయును.

వినియోగము॥ ఈమంత్రము చెప్పి సన్నికల్లుమీదపాత్రరమునుంచవలయును.

---

వి॥ ౪-౫ మంత్రములయొక్క తాత్పర్యమేమనగ మనుజుడు జ్ఞానముకలిగిన ఆత్మతోను జ్ఞానములేని ప్రకృతితోను రూపించబడినాడు ౪-వమంత్రములో జ్ఞానముకలిగిన ఆత్మ భగవత్సంబంధమైనదానిగానున్ను, ఈమంత్రములో అచేతనమైన శరీరము ప్రకృతిసంబంధమైనదిగాను తెలుసుకొనవలయునని చెప్పబడ్డవి.

ఇందుకు బ్రాహ్మణము “ధిషణాసిపార్వతే యీప్రతిత్వా పర్వతిర్వేత్త్విత్యాహ। ద్యావాపృథివ్యోర్ధృత్యై” (తై. బ్రా. 3 - ౨ - ౬)

ఇందుకు వినియోగసూత్రము “ధిషణాసిపార్వతేయీతిద్యుషద్యపలామత్యాదథాతి” (ఆపస్తంబశ్రౌత ౧ - ౨౧ - 3)

ఉపలా అనగ “పాషాణనిర్మితా పేషణసాధనభూతా ఉపలాకథితా”(శ్రౌతపదార్థ నిర్వచనము (౯ - ౪౫)

---

## ౬. (౧) దేవస్య త్వా సవితుః ప్రసవే (౨) అశ్వినోః బాహుభ్యాం (3) పూష్ణః హస్తాభ్యాం అధి+వపామి (౪) ధాన్యం అసి (౫) ధినుహి దేవాన్.

### జ్ఞానార్థము.

టీ॥ సవితుః=ప్రేరకుడైన, దేవస్య =భగవంతునియొక్క, ప్రసవె=అనుగ్రహము కలుగుచుండగ. (౨) అశ్వినోః=

### కర్మార్థము.

టీ॥ సవితుః=ప్రేరకుడైన, దేవస్య =పరమాత్మయొక్క, ప్రసవే= అనుజ్ఞ గలుగుచుండగా, అశ్వినోః = అశ్వినుల

అశ్వినులయొక్క, బాహుభ్యాం = బాహువులచేతను. (3) పూష్ణః = పూషయొక్క, హస్తాభ్యాం=హస్తములచేతను, త్వా=నిన్ను, అధివపామి=సమర్పించుచున్నాను. (౪) ధాన్యం=(నీవు)ధాన్యమువలె శుద్ధిచేయబడువాడవు, అసి=అగుచున్నావు. (౫) దేవాన్=దేవతలను, ధినుహి=సంతోషపెట్టుము.

తా॥ ఓజీవాత్మా నిన్ను ఎల్లప్పుడు భగవంతునికి సమర్పించుచున్నాను. నీవు దేవతలకు సంతోషమగునటుల సత్కార్మయందు ప్రవర్తించుము.

యొక్క, బాహుభ్యాం= బాహువులచేతనున్ను, పూష్ణః=పూషయను దేవతయొక్క, హస్తాభ్యాం= హస్తముల చేతనున్ను, త్వా=(ఓ బియ్యమా) నిన్ను, అధివపామి= (నూరుటకు రాతిమీద) ఉంచుచున్నాను, ధాన్యం = (నీవునూరతగిన) తండులము, అసి= అగుచున్నావు, దేవాన్=దేవతలను, ధినుహి=సంతోషపెట్టుము.

వినియోగము ॥ ఈమంత్రము చెప్పి అభిమంత్రించి సన్నికల్లుమీద బియ్యము నుంచవలయును.

వి॥ ఈమంత్రము బ్రాహ్మణానుసారముగ ౫-భాగములుగ విభజించబడినది, ఈమంత్రములోనుండు ౧ - ౨ - 3-భాగములను గూర్చి ౪-వ అనువాక ౯-వ మంత్రము చూడుము.

అధివపామికి బదులు పొరబాటున అధివసామి అని సంహితలో అచ్చుపడినది. ధాన్యం అనగ ఇచట శుద్ధిచేయబడిన బియ్యము పూర్వ అనువాకమందుచెప్పబడినరీతిని ఈధాన్యము ఆత్మకు ఉపమానము. కావుననే ‟ ధాతుమర్హంయత్ యజ్ఞాత్ శుద్ధం'' అని ధాన్యశబ్దమునుగూర్చి శుక్లయజుర్వేదభాష్యమందు వ్రాయబడినది (బొంబాయికూర్పు పుట ౬౦) దేవశబ్దమునుగూర్చి ౫-వ అనువాక సామాన్య తుదనుచూడుము.

ఇందుకు బ్రాహ్మణము ‟ దేవస్యత్వాసవితుః ప్రసవఇత్యాహ । ప్రసూత్యై । అశ్వినోర్బాహుభ్యా మిత్యాహ + + + + + ధాన్యమసిధినుహి దేవానిత్యాహ। ఏతస్యయజుషోవీర్యేణ'' (తై. బ్రా. 3 - ౨ - ౬).

ఈమంత్రమునకు ప్రత్యేకవినియోగము మృగ్యము. ఈమంత్రములో కొన్ని మంత్రములనుచేర్చి వినియోగము చెప్పబడినది. అదియెట్లన్న ‟దేవస్య త్వేత్యనుత్యాత్వాగ్నయేజుష్ట మధివపామీతి యథాదేవతం దృషదితండులా నధివపతిత్రిర్యజుషా తూష్ణీంచతుర్థం'' (అపస్తంబశ్రౌత ౧ - ౨౧ - ౫)

## ౭. ప్రాణాయ త్వా.

**జ్ఞానార్థము.**

టీ॥ (ఓజీవాత్మా) త్వా=నిన్ను, ప్రాణాయ = ప్రాణవాయువుకొరకు (ఉపయోగించుచున్నాను).

తా॥ ప్రాణముకొరకు జీవాత్మనుఉపయోగించవలయును.

**కర్మార్థము.**

టీ ॥ త్వా= (ఓబియ్యమా) నిన్ను, ప్రాణాయ=ప్రాణవాయువకొరకు(నూరుచున్నాను)

వినియోగము॥ ఈ మంత్రము చెప్పి సన్నికల్లుమీద తూర్పు వైపుననూరవలయును.

వి॥ ఇందుకు బ్రాహ్మణము "ప్రాణాయత్వా అపానాయత్వేత్యాహ । ప్రాణానేవయజమానే దధాతి" (తై. బ్రా 3 - ౨ - ౬)

ఇందుకు వినియోగసూత్రము "ప్రాణాయత్వేతిప్రాచీముపలాం ప్రోహత్య" (ఆపస్తంబశ్రౌత ౧ - ౨౧ - ౬)

## ౮. అపానాయ త్వా.

**జ్ఞానార్థము.**

టీ॥ (ఓజీవాత్మా) త్వా=నిన్ను, అపానాయ=అపానమను వాయువుకొరకు (ఉపయోగించుచున్నాను).

తా॥ (ఓజీవాత్మా) నిన్ను అపానవాయువుకొరకు ఉపయోగించుచున్నాను.

**కర్మార్థము.**

టీ ॥ త్వా= (ఓబియ్యమా) నిన్ను, అపానాయ = అపానవాయువుకొరకు (నూరుచున్నాను)

వినియోగము॥ ఈ మంత్రము చెప్పి సన్నికల్లు మీద పడమరవైపున నూరవలయును.

వి॥ ఈమంత్రముయొక్క బ్రాహ్మణమునుగూర్చి ౭-మంత్రమును చూడుము.

ఇందుకు వినియోగసూత్రము "అపానాయత్వేతిప్రతీచీం" (ఆపస్తంబశ్రౌత ౧ - ౨౧ - ౬)

## ౯. వ్యానాయ త్వా.

**జ్ఞానార్థము.**

టీ॥ (ఓజీవాత్మా) త్వా=నిన్ను, వ్యానాయ = వ్యానవాయువుకొరకు (ఉపయోగించుచున్నాను).

**కర్మార్థము.**

టీ ॥ త్వా= (ఓబియ్యమా) నిన్ను, వ్యానాయ=వ్యానవాయువుకొరకు(నూరుచున్నాను.)

| | |
|---|---|
| తా॥ ఓజీవాత్మా నిన్ను వ్యానవాయువుకొరకు ఉపయోగించుచున్నాను. | వినియోగము ॥ ఈ మంత్రము చెప్పి సన్నికల్లు మధ్య నూరవలయును. |

వి॥ ఇందుకు వినియోగసూత్రము «వ్యానాయత్వేతి మధ్యదేశే వ్యవధారయతి" (ఆపస్తంబశ్రౌత ౧ - ౨౧ - ౬)

## ౧౦, దీర్ఘాం అను ప్రసితిం ఆయుషే ధాం.

| జ్ఞానార్థము. | కర్మార్థము. |
|---|---|
| టీ॥ ఆయుషే=ఆయువుకొరకు, దీర్ఘాం = అవిచ్ఛిన్నమైన, ప్రసితిం= సత్కర్మసమూహమును, అనుధాం=ధరించుచున్నాను. | దీర్ఘాం = అవిచ్ఛిన్నమైన, ప్రసితిం = కర్మ సమూహమును (హేతువైన పాత్రరమును), ఆయుషే = (యజమానునికి) ఆయుర్వృద్ధికొరకు, అనుధాం =ధరించుచున్నాను. |
| తా॥ సత్కర్మాచరణవలన ఆయుర్వృద్ధి కలుగును. | వినియోగము ॥ ఈ మంత్రము చెప్పి నూరిన పిండి తూర్పునకు త్రోయవలయును. |

వి॥ ఇందుకు బ్రాహ్మణము «దీర్ఘామనుప్రసితిమాయుషే ధామిత్యాహ । ఆయురేవాస్మిన్ దధాతి" (తై. బ్రా. 3 - ౨ - ౬)

ఇందుకు వినియోగసూత్రము «దీర్ఘామనుప్రసితిమాయుషే ధామితి ప్రాచీమంతతోఽనుప్రోహ్య" (ఆపస్తంబశ్రౌత ౧ - ౨౧ - ౭)

## ౧౧. దేవః వః సవితా హిరణ్యపాణిః ప్రతిగృహ్ణాతు.

౫-వఅనువాకముయొక్క ౧౭-వమంత్రము చూడుము.

వినియోగము ॥ ఈమంత్రము చెప్పి పిండిని కృష్ణాజినముమీద నుంచవలయును.



## ఆరవ అనువాక సామాన్యవిషయములు.

౧. ఐదవ అనువాకమున్ను ఈఅనువాకమున్ను జీవాత్మయందుండు కల్మషములను పోగొట్టి శుద్ధిచేయుమార్గమును తెలియచేయుచున్నవి. పొట్టుతో కూడిన దానికి సాధారణముగ ధాన్యమని పేరు. పొట్టుమొదలగు కల్మషములను తీసివేసి, బియ్యమందు మాలిన్యమును పోగొట్టి నూరుటచేత భక్షించుటకు ఎటుల అర్హమౌనో అటులనె తాడనవంటి తపస్సు శాంతి పశ్చాత్తాపము మొదలగువానిచే జీవాత్మయందుండు దుర్గుణములను నసింపచేసి భగవంతునికి అర్పణచేయ నర్హమగునటులచేయ వలయునని ఈరెండు అనువాకములు తెలియచేయుచున్నవి. (౭-అనువాకవివరణ చూడుము)

౨. ఈ అనువాకమందుండు ధాన్యశబ్దమునుగూర్చి జైమిని న్యాయమాల యను మీమాంసగ్రంథమందు చెప్పబడినదేమనగ "నోహ్యాఊహోఽథవాధాన్య శబ్దోనాసంగతో క్తితః। ఊహ్యోలక్షణయార్థస్యగోపానస్యేవసంగతేః"(౯-౧-౧౯) అనగ అథివపామి అనుమంత్రమందు అగ్నయే అనుపదము ఊహించతగినది. ధాన్యమని అనుమంత్రమందు, ధాన్యశబ్దము ఉపయోగింపంబడుటవలన లక్షణచేత నిజమైన అర్థమును గ్రహించవలయును. ఈశబ్దముచే కర్మార్థమందు తండులములను జ్ఞానార్థమందు కామాదిరాహిత్యమైన జీవాత్మను లక్షణయాగ్రహించవలయును.

3. మీమాంసయొక్క ౯- అధ్యాయమందు "అతిదిష్టపదార్థానాం ఊహానూహవిచారణా" అని చెప్పబడినది. కర్మయందుపయోగింపబడు పదార్థములవలన నేమియూహించతగినది కనుగొనవచ్చును. ఇదియే జ్ఞానార్థము. పూర్వమీమాంసచదివినయెడల కర్మయందుపయోగింపంబడు పదార్థములకుపలక్షణములనుటకునేమియు సందియముండదు.

౪. ఈ అనువాకమునకు కర్మరీత్యా 'పేషణమని' చెప్పబడుచున్నది. జ్ఞానరీత్యా 'ఆత్మశోధన'మని చెప్పవచ్చును. పేషణమనగ "అవయవవిభాగేన చూర్ణేన" (తారానాథ వాచస్పతి పేజీ ౪౪౨౦)

౫. మూడవ అనువాకమందు కాండ ఋషులనుగురించి వ్రాయబడినశ్లోకములకు వివరణ ఇచట వ్రాయబడును.

ఆపస్తంబ శాఖయందు ౭౨ - పన్నములుకలవు, అవి ౫౪ - కాండలుగ కాండానుక్రమణికయందు విభజింపంబడినవి. ఇందుకు ౧౨ గురుకాండ ఋషులు.

కాండ ఋషులపేర్లు, ప్రతికాండ ఋషి ఎన్నికాండలకు అధికారి అయినది, ఈక్రిందనుదహరింపంబడును.

| ఋషులపేర్లు. | కాండలసంఖ్య |
|---|---|
| ౧ ప్రజాపతిఋషికి | ౯ కాండలు |
| ౨ చంద్రఋషికి | ౯ కాండలు |
| ౩ అగ్నిఋషికి | ౭ కాండలు |
| ౪ విశ్వేదేవ ఋషులకు | ౧౬ కాండలు |
| ౫ సాగంహితీర్దేవతాఋషికి | ౧ కాండ |
| ౬ యాజ్ఞికీర్దేవతాఋషికి | ౧ కాండ |
| ౭ వారుణీఋషికి | ౧ కాండ |
| ౮ హవ్యవాట్ ఋషులకు | ౫ కాండలు |
| ౯ విశ్వేదేవఋషులకు | ౨ కాండలు |
| ౧౦ బ్రహ్మాస్వయంభూఋషికి | ౧ కాండ |
| ౧౧ విశ్వేదేవఋషికి | ౧ కాండ |
| ౧౨ అరుణఋషికి | ౧ కాండ |

| కాండపేరు. | అందుకుఋషి. |
|---|---|
| ౧ పురోడాశీయం | (ప్రజాపతి ౧) |
| ౨ అధ్వరం | (చంద్ర ౧) |
| ౩ గ్రహ | (చంద్ర ౨) |
| ౪ దక్షిణాని | (చంద్ర ౩) |
| ౫ ఆధాన | (అగ్ని ౧) |
| ౬ పునరాధేయం | (అగ్ని ౨) |
| ౭ అగ్న్యుపస్థానం | (అగ్ని ౩) |
| ౮ ఐష్టికం యాజమానం | (ప్రజాపతి ౩) |
| ౯ తద్విధిః | (ప్రజాపతి ౪) |
| ౧౦ వాజపేయం | (చంద్ర ౫) |
| ౧౧ తద్విధిః | (చంద్ర ౬) |
| ౧౨ రాజసూయం | (విశ్వేదేవులు ౧) |
| ౧౩ కామ్యాపశవః | (విశ్వేదేవులు ౩) |
| ౧౪ ఇష్టయః | (విశ్వేదేవులు ౪) |
| ౧౫ దార్శ్యకబ్రాహ్మణం | (ప్రజాపతి ౮) |
| ౧౬ ఉపానువాక్యం | (విశ్వేదేవులు౫) |
| ౧౭ అగ్నిః | (అగ్ని ౪) |
| ౧౮ తద్విధిః | (అగ్ని ౫) |
| ౧౯ తద్విధిః | (అగ్ని ౬) |
| ౨౦ అధ్వదీనాం త్రయాణాంవిధిః | (చంద్ర ౪) |
| ౨౧ యాజ్యాః | (విశ్వేదేవులు ౬) |
| ౨౨ రాజసూయవిధిః | (విశ్వేదేవులు౨) |
| ౨౩ సత్రాయణం | (విశ్వేదేవులు౯) |
| ౨౪ అశ్వమేధః తస్యక్రమః పంచాదో సాత్రికాదశన్యోనువాకోనాః షడనువాకం అగ్నికంమహాపృష్టన్నామద్వైతైౖశక దసిన్యాత్ర్యను వాకం ద్విచత్వారింగ్ం శకంద హరపృష్టం నామత్తైౖగ్ంశకోత్తమ దశినీద్విచత్వారింగ్ం శకావనువాకాదశిన్యుత్తమశ్చ | (విశ్వేదేవులు ౭) |
| ౨౫ ప్రవర్గ్యః | (చంద్రః ౮) |
| ౨౬ తద్విధిః | (చంద్ర ౯) |
| ౨౭ అగ్నిహోత్రవిధిః | (అగ్ని ౭) |
| ౨౮ హోతారః | (పజాపతి ౫) |
| ౨౯ తద్విధిః | (ప్రజాపతి ౬) |
| ౩౦ ఉపహోమాః | (విశ్వేదేవులు ౧౦) |
| ౩౧ కాకిలీ | (విశ్వేదేవులు ౧౩) |
| ౩౨ సవాః | (చంద్ర ౭) |
| ౩౩ సూక్తాని | (విశ్వేదేవ ౧౧) |
| ౩౪ సత్రత్రేష్టయః | (విశ్వేదేవులు౧౨) |
| ౩౫ పురోడాశవిధిః | (ప్రజాపతిః ౨) |
| ౩౬ నృమేధం | (విశ్వేదేవులు ౧౬) |
| ౩౭ పితృమేధం | (ప్రజాపతి ౯) |
| ౩౮ దార్శగంహూత్రం | (ప్రజాపతి ౭) |
| ౩౯ పాశుకం | (విశ్వేదేవులు౧౫) |
| ౪౦ అచ్ఛిద్రం | (విశ్వేదేవులు ౧౪) |
| ౪౧ అశ్వమేధవిధిః | (విశ్వేదేవులు ౮) |

“ఇతిఏతా వంతిశాఖా కాండాని ఉపనిషదో వేదాంతాః తాస్త్రయః”

| | |
|---|---|
| ౪౨ సాగంహిత్యః | (సాగంహితిఋ౧) |
| ౪౩ యాజ్ఞికీ | (యాగ్నికఋ ౧) |
| ౪౪ వారుణ్యాః | (వారుణీఋ ౧) |

ఏతావత్ తి త్రిరిః ప్రోవాచ
అథాష్టౌకాశకాని

| కాండపేరు. | అందుకుఋషి. | కాండపేరు. | అందుకుఋషి. |
|---|---|---|---|
| ౪౫ సావిత్ర | (హవ్యవాట్ ౧) | ౫౦ దివశ్శ్యేనయః | (విశ్వేదేవత ౧) |
| ౪౬ నాచికేత | (హవ్యవాట్ ౨) | ౫౧ అపాద్యాః | (విశ్వేదేవత ౨) |
| ౪౭ చాతుర్హోత్ర | (హవ్యవాట్ 3) | ౫౨ స్వాధ్యాయ బ్రా. | (స్వయంభూః౧) |
| ౪౮ వైశ్వసృజ | (హవ్యవాట్ ౪) | ౫౩ } ప్రత్యేకము ఈఅధ్యాయమందు | |
| ౪౯ అరుణా ౫చితయః | (హవ్యవాట్ ౫) | ౫౪ } వ్రాయబడలేదు. | |

పరాయాతముయొక్క 3 - వ అష్టకము ౯-వ ప్రపాఠకము యొక్క చివరను భట్టభాస్కర భాష్యమందు చెప్పబడినదేమనగ ‟అశ్వమేధాంతాని తిత్తిరిణా ప్రోక్తాని, అథకాఠకాని కాండాన్యష్టౌ.” ౬. ఇందువలన ౪౪-కాండలు తిత్తిరి సంబంధమైన విన్ని ౮-కాండలు కాఠకసంబంధమైనవిన్ని ౧-కాండ, ఏకాగ్ని కాండ సంబంధమైనదిన్ని ౧-కాండ ఆరణ్యాకాండ సంబంధమైనదియై యున్నవి ౮౨-పన్నములు కలిగిన ఆపస్తంబీయమందు ౪-శాఖలుకలవు. విశ్వేదేవ ఋషులు 3- శాఖల యందుండుట వలన వారిని 3-పర్యాయములు ప్రత్యేకముగ బ్రహ్మయజ్ఞమందు స్మరించ బడుచున్నారు.

కొన్ని దేశములయందు ౯ - ఋషులనే స్మరించుచున్నారు. కాండానుక్రమణిక భాష్యమందు ‟ప్రజాపతిప్రభృతీన్ అరుణ పర్యంతాన్ ద్వాదశకాండఋషీన్” అనివ్రాయబడియున్నది. కొన్ని దేశములయందు ఉపనిషత్తులు ౫-భాగములుగచేసి ఏకాగ్నికాండ అరుణవిధి కలిపి ౮౨-పన్నములుగ లెక్కించుచున్నారు.

ఈ ౮౨-పన్నములలో ప్రథమ ౪౪-పన్నములు సంహిత యనియు ౨౮-పన్నములు పరాయాతమని, శాఖయని, బ్రాహ్మణమనియు, నామములచే వాడుక చేయబడుచున్నవి.

౭. ‟అవధూతమిత్యేక పదాగాయత్రీ” అనగ అవధూతమను మంత్రము ఏకపదమైనగాయత్రి 'దీర్ఘాం' అను ౧౦-వమంత్రము ఏకపదాత్రిష్టుభ్ అని విద్యారణ్య భాష్యమందు చెప్పబడినది. (పుట ౨౧౭) ఈఅనువాకము కొన్నిమంత్ర వ్యత్యయముగ నీక్రిందచెపంబడిన శాఖలతో సంబంధించి యున్నది.

కాఠకసంహిత { ౧—౬ / 3౧—౫

మైత్రాయణీసంహిత ౧—౧—౭

వాజసనేయసంహిత ౧—౧౯—౨౦

ఆరవ అనువాకము

సంపూర్ణము.

—:0:◯:0:—

ఓమ్

శ్రీపరబ్రహ్మణేనమః.

కృష్ణయజుర్వేద

# తైత్తిరీయసంహితామంత్రభాగస్య

సప్తమోఽనువాకః.

కాండఋషి ప్రజాపతిః.



## ౧. ధృష్టిః అసి బ్రహ్మ యచ్ఛ.

**జ్ఞానార్థము.**

టీ॥ (ఓభగవంతుడా నీవు) ధృష్టిః=జ్ఞానమును ధరించువాడవు, అసి=అగుచున్నావు, (కావున) బ్రహ్మ = జ్ఞానమును, యచ్ఛ=ఇమ్ము.

తా॥ ఓపరమాత్మా నీవు జ్ఞానాధారుడవు గనుక మాకు జ్ఞానమును ఇమ్ము.

**కర్మార్థము.**

టీ॥ ధృష్టిః = [మోదుగ కొమ్మా నీవు అంగారములను] పట్టుకొనే కారువంటిదానవు, అసి=అగుచున్నావు, బ్రహ్మ=మంత్రపూతమైన పురోడాశమును [దేవతలకు], యచ్ఛ=ఇమ్ము.

వినియోగము॥ ఈమంత్రముచెప్పి ఉపవేషమునుగ్రహించవలయును.

వి॥ "కేతో అగ్నిః" అను శ్రుతిప్రమాణమునుబట్టి కర్మయందుజ్ఞానమునకు లక్షణముగ అగ్ని ఉపయోగింపబడుచున్నది. ఇచట కర్మయందుపలాశ పరమాత్మనుపలక్షణముగానున్న, అంగారములు జ్ఞానమునకుపలక్షణముగానున్న, ఉపయోగింపంబడినవి.

బ్రహ్మశబ్దమునకు తత్వము, తపస్సు, జ్ఞానము, ఇత్యాద్యర్థములు సర్వశబ్దసంబోధిని అనుసంస్కృతనిఘంటువునందు వ్రాయబడినది (పుట ౬౮౨)

ఇందుకు బ్రాహ్మణము "ధృష్టిరసిబ్రహ్మయచ్ఛేత్యాహ। ధృత్యై" (తై. బ్రా 3-2-౬) దృఢముకొరకు.

ఇందుకు వినియోగమాత్రము "ధృష్టిరసిబ్రహ్మ యచ్ఛేత్యుపవేషమాదాయ" (ఆపస్తంబశ్రౌత ౧-౨౨-౨) ఉపవేషమనగ తతస్తస్యాశ్శాఖాయా పర్ణానిచ్ఛిత్వాయం మూలభాగంప్రాదేశమాత్రంఛిత్వా దృష్ట్యాకారంకరోతి సన్నాయ్యసంస్కా-

రకాలే గార్హపత్యాంగారాణా ముదగ్నిశినిరూహణాదౌ ఉపయోగీస ఉపవేషఇతిగీయతే'' (శ్రౌతపదార్థనిర్వచనము పుట ౧౪-౨౦)

## ౨ అప అగ్నే అగ్నిం ఆమాదంజహి.

జ్ఞానార్థము.

టీ॥ అగ్నే = ఓపరమేశ్వర, ఆమాదం=ఇహసౌఖ్యములను అనుభవించెడి, అగ్నిం=జ్ఞానమును, అప+జహి = పోగొట్టుము.

తా॥ ఓపరమేశ్వరవిజ్ఞానమును పోగొట్టుము.

కర్మార్థము.

టీ॥అగ్నే=ఓగార్హపత్యాగ్ని(నీవు) ఆమాదం = ద్రవ్యమును భక్షించుచున్నటువంటి, అగ్నిం=అగ్నిని,అప+జహి=పోగొట్టుము.

వినియోగము ॥ ఈ మంత్రముచెప్పి గార్హపత్యాగ్నిలోనుంచి రెండంగారములను పడమరగా విడదీయ వలయును.

వి ॥ ఈమంత్రముయొక్క అర్థమునున్ను ఈఅనువాకమునుగురించి విద్యారణ్యులవారు వ్రాసిన భాష్యమునున్ను శ్రద్ధగ చూచినయెడల వేదమునకు జ్ఞానార్థములేదనియు కర్మార్థమేయనియు చెప్పెడిసిద్ధాంతము నిరసనమగుచున్నది.

౨-౩- మంత్రములకు ఏకముగ అర్థము విద్యారణ్య భాష్యమందు వ్రాయబడినది. ‟హేగార్హపత్యాగ్నే యోఽగ్నిః శా(స్త్రీ) యపాకమంతరేణా మంద్రవ్యమత్తినతుపాకార్థస్థాపితస్యపాకంకరోతి తమపనయమారయ యశ్చలౌకికం మాంసమత్తితమపినిషేధయ'' (పుట ౧౧౧) అనగ ద్రవ్యమునుభక్షించు అగ్నినిన్ని లౌకికమాంసమునుభక్షించు అగ్నినిన్ని విడిచివేయవలయును.

ఈప్రకారముగ విడిచి వేయుటకుగాను ౨ - అంగారములను కర్మయందు తీసివేయుచున్నారు.

అగ్ని జ్ఞానమునకు ఉపమానము. జ్ఞానము ౩-విధములు బ్రహ్మజ్ఞానము, విజ్ఞానము, దుర్జ్ఞానము. విజ్ఞానము ఆమాదముతోను, దుర్జ్ఞానము క్రవ్యాదముతోను, పోల్చబడినటుల శతపథబ్రాహ్మణములో చెప్పంబడిన నీమంత్రవివరణవలన కనుపించుచున్నది ‟ఆమాద్యేనైదంమనుష్యాః పక్త్వాఽశ్నంత్యథయేనపురుషందహంతిసక్రవ్యాదేతావేవైతదుభావతోఽపహంతి'' (౧-౨-౧-౪) అనగ మనుష్యులు దేనితో పక్వముచేయుచున్నారో దానిని, అనగ లౌకికజ్ఞానమునున్ను మరియు దేనిచేత పురుషుని బాధపెట్టుచున్నారో దానిని, అనగ దుర్జ్ఞానమునున్ను ఈ రెంటిని విడిచివేయవలయును విజ్ఞానమనగ లౌకికజ్ఞానమనిప్రసిద్ధి ‟ సిల్పకర్మమోక్షేతశాస్త్రబుద్ధిః'' అని విజ్ఞానమునకు అర్థము సర్వశబ్దసంబోధిని అను నిఘంటువునందు

చెప్పబడినది (పుట ౮౪౩) ఆమాదమనుశబ్దముయొక్క వ్యుత్పత్తి ‹‹ఆ+అమ్‌ఘఞ్,’’ (తారానాథవాచస్పతి ౭౬౨) ఆమ అనుపదమునకు సాధారణముగ మాంసమని అర్థమైనను ద్రవ్యమని విద్యారణ్యభాష్యమందు అర్థమువ్రాయబడినది.

ఇందువలన ఆలోచించినను ద్రవ్యమనగ ప్రపంచసంబంధమైన సౌఖ్యమును విడిచిపెట్టి శుద్ధాగ్ని ఉపలక్షణమైన శుద్ధజ్ఞానసంపాదనకు ప్రయత్నించవలయును అని ౨-౩-౪. మంత్రములయొక్క తాత్పర్యముగ నెంచదగును.

ఈ ౨. ౩-౪ మంత్రములు ఏకమంత్రముగ బ్రాహ్మణమందు వ్యాఖ్యానము చేయబడినది ‹‹అపాగ్నే గ్నిమామాదంజహినిష్క్రవ్యాదంసేధాదేవ యజంవహేత్యాహ । యఏవామాత్క్రవ్యాత్ । తమపహత్య। మేధ్యేగ్నౌకపాలముపదధాతి’’ (తై. బ్రా. ౩-౨-౭) కేవలబ్రహ్మజ్ఞానమును పొందుటకు విజ్ఞానమునుకూడ విడుచుటయావశ్యకము.

ఇందుకు వినియోగసూత్రము ‹‹అపాగ్నేఅగ్నిమామాదంజహీతిగార్హపత్యాత్ప్రత్యంచావంగారౌనిర్వర్త్య’’ (అపస్తంబశ్రౌత ౧-౨౨-౨)

## ౩. నిః క్రవ్యాదం సేధ.

| జ్ఞానార్థము. | కర్మార్థము. |
|---|---|
| టీ ॥ క్రవ్యాదం=అజ్ఞానమును, ని+షేధ=నశింపచేయుము. | టీ ॥ క్రవ్యాదం = మాంసమును భక్షించుచున్నటువంటి అగ్నిని, నిః+సేధ=నిషేధించుము. |
| | వినియోగము ॥ ఈ మంత్రముచెప్పి, ఆఅంగారములలో నొకదానిని వెలుపల బడవేయవలయును. |
| తా ॥ (ఓభగవంతుడా) అజ్ఞానమును నశింప చేయుము. | |

వి ॥ రెండవ మంత్ర వివరణ చూడుము.

క్రవ్యాదమనగ క్రవ్యమును భక్షించునది. క్రవ్యశబ్దముయొక్క వ్యుత్పత్తి ‹‹క్లవ్ యత్ లస్య రః’’ (తారానాథవాచస్పతి పుట ౨౩౦౯) క్రవ్యాదశబ్దమునకు రాక్షసుడని అర్థము ‹‹క్రవ్యాదః రాక్షసః’’ (సర్వ శబ్దసంబోధిని పుట-౨౧౮) అనగ దుర్ జ్ఞానము.

౨-వ మంత్రముచే మోక్షేతరజ్ఞానమనగ విజ్ఞానమునున్ను, ఈ మంత్రముచే దుర్ జ్ఞానమునున్ను పోగొట్టి ౪-వ మంత్రముచే శుద్ధజ్ఞానమునుసంపాదించవలయును.

ఇందుకు వినియోగసూత్రము ‹‹ నిష్క్రవ్యాదంసేధేతి తయోరన్యతరా ఉత్తరమపరంవాంతరదేశంనిరస్య’’ (అపస్తంబశ్రౌత ౧-౨౨-౨)

## ౭. ఆ దేవయజ౦ వహ.

**జ్ఞానార్థము.**

టీ ॥ దేవయజం=భగవత్పూజచేయు జ్ఞానముఅనగ భగవద్ధ్యానమును, ఆ+వహ =లెస్సగవహింపచేయుము.

తా ॥ ఓభగవంతుడా నిన్నుధ్యానించు జ్ఞానమును మేము పొందునటుల చేయుము.

**కర్మార్థము.**

టీ ॥ దేవయజం = దేవయాగమునకు అనుకూలమైన అగ్నిని, ఆ+వహ = లెస్సగవహించుము.

వినియోగము ॥ ఈ మంత్రముచెప్పి రెండవయంగారమును దక్షిణ భాగమందుంచవలయును.

---

వి ॥ ఈమంత్రముయొక్క బ్రాహ్మణమందు “ మధ్యే అగ్నౌకపాల ముపదధాతి” అని చెప్పియుండుట వలన శుద్ధజ్ఞానాగ్నియందు మనబుద్ధినుంచవలయునని గ్రహించదగును. మేధ్యః అనగ “మేధార్హః” అని భట్టభాస్కర భాష్యమందు చెప్పబడినది. కపాలశబ్దమునుగూర్చి ౧౨ మంత్రమును చూడుడు.

చిత్తి ఉపనిషత్తుయందు “ కేతోఅగ్నిః విజ్ఞాతమగ్నిః” అని చెప్పియుండుటవలన బ్రహ్మజ్ఞానమునకున్ను లౌకికజ్ఞానమునకున్ను అనగ నిర్వికల్పకజ్ఞానమునకున్ను సవికల్పకజ్ఞానమునకున్ను అగ్ని ఉపలక్షణముగనున్నది. ఈ ౨-విధములైనజ్ఞానములు మనుజునికి అవశ్యకమేను అయినను బ్రహ్మధ్యానము చేయునపుడు లౌకికజ్ఞానమును విడువ వలయును. కావున “అపజహి” అని ౨-వమంత్రమందు చెప్పంబడినది.

“బ్రహ్మహ్యగ్నిః ” అను ప్రమాణమునుబట్టి అగ్నిశబ్దమునకుబ్రహ్మఅనిఅర్థము కూడాకలదు.

అగ్నిశబ్దమునకు భగవంతుడనియు జ్ఞానమనియు అర్థము ఉండుటచేత ప్రథమ అగ్నిశబ్దమునకు భగవంతుడనియు రెండవశబ్దమునకు జ్ఞానమనియు అర్థముర్రాయబడెను.

పైన త్రివిధమైన జ్ఞానమునకుపలక్షణముగ అగ్నినిచెప్పుటకు కారణము అగ్నియొక్క స్వభావమును చూచినయెడల తేటపడును.

ఒకదీపమును కదలకుండ గదిలోనుంచి దానిని చూడవలయును. 3-భాగములుగ అజ్వాల ఉంచుచున్నది. 3-జోనుసు (Zones) ఉన్నటుల ఇంగిలీషుగ్రంథములయందు వ్రాయబడినది. క్రిందిభాగము దుర్జ్ఞానముతోను మధ్యభాగము విజ్ఞానతోను పైభాగము బ్రహ్మజ్ఞానముతోను పోల్చుటకు సరిగనున్నది.

ఇందునగూర్చి మహీధరాచార్యులవారు (౧ - ౧౭) చెప్పినదేమనగ "త్రయోఽగ్నయః। ఏకః ఆమాత్ ద్వితీయః క్రవ్యాత్ తృతీయః యాగయోగ్యః తథావిద్వాన్ త్రీనంగారాన్ గార్హపత్యాత్ప్రాగ్భాగే పృథక్కృత్యతేషాం మధ్యేయాగయోగ్యో హ్యేకః ద్వావగ్నీఆమాత్ క్రవ్యాత్సంజ్ఞౌతౌ వారయతుంగార్హపత్యం ప్రత్యుద్యతే"

ఈమంత్రములకు శుక్లయజుర్వేదభాష్యమందుచెప్పబడినదేమనగ "అగ్నే పరమేశ్వరధనుర్వేదవిద్వాన్వా అగ్నింవిద్యుదాఖ్యం ఆమాదం ఆమానపక్వాన త్తితం జహిహింసయ నిష్క్రవ్యాదంక్రవ్యం పక్వమాంసమత్తితస్తా నిర్గత స్తం సేధశాస్త్రాదిశిక్షయ అక్రియాయోగే దేవయజం దేవాన్ విదుషోదివ్యగుణాన్యజతి సంగతాన్ కరోతి యేనయజ్ఞేనసదేవయట్ తం అత్రఅన్యేభ్యోపిదృశ్యంత ఇతిసూత్రేణక్వతో బహులమితివార్తికేనకరణే విచప్రత్యయఃవః ప్రాపయప్రాపయేతివా" (బొంబాయికూర్పుపుట ४౭)

అనగ ఓపరమేశ్వర అపక్వమైనదానిని పక్వమైన మాంసమును భక్షించుదానిని నశింపజేసి దానిచేత మంచిగుణములను పొందుచున్నారో దానిని కలుగ చేయుము.

ఇందుకు వినియోగసూత్రము "అదేవయజంవహేతి దక్షిణమవస్థాప్య" (ఆపస్తంబశ్రౌత ౧-౨౨-౨)

---

౫. నిః + దగ్ధం రక్షః నిః దగ్ధాః అరాతయః.

**జ్ఞానార్థము.**

ఈమంత్రముయొక్క అర్థమునుగూర్చి ౫-వ అనువాకం ౬ - వ మంత్రమును చూడుము.

**కర్మార్థము.**

టీ ॥ రక్షః=రాక్షసుడు, నిర్దగ్ధం=దగ్ధుడుగా (ఔగాక), అరాతయః=శత్రువులు,నిర్దగ్ధాః=దగ్ధులుగా (ఔగాక)

వినియోగము ॥ ఈ మంత్రముచెప్పి కపాలమనే పెంకుయందు అంగారము నుంచవలయును.

---

వి ॥ ఇందుకుబ్రాహ్మణము, నిర్దగ్ధంరక్షః నిర్దగ్ధా అరాతయ ఇత్యాహ । రక్షాగ్ంస్యేవనిర్దహతి" (తై-బ్రా 3-౨-౭)

ఇందుకు వినియోగసూత్రము "నిర్దగ్ధంరక్షో నిర్దగ్ధారాతయ ఇతి కపాలేఽంగారమత్యాధాయ" (ఆపస్తంబశ్రౌత ౧-౨౨-3) శ్రౌతమందు ౬-వ మంత్రమునకు వినియోగము చెప్పబడిన తరువాత ఈ ౫-వ మంత్రమునకు వినియోగము చెప్పంబడినది.

జ్ఞానార్థమందు మంత్రవ్యత్యయము చేయకనే బ్రాహ్మణముననుసరించి అర్థము చెప్పబడినది ‘‘ఆమ్నాయక్రమేణనిర్దగ్ధ మంత్రమాదౌవ్యాచష్టే’’ అనగ వేదమందు పఠించురీతినే బ్రాహ్మణమందును వ్యాఖ్యానము చేయంబడినది అని విద్యారణ్యభాష్యమందు చెప్పబడినది. (పుట-౧౧౨) ఆమ్నాయక్రమము బ్రాహ్మణ వ్యాఖ్యానము జ్ఞానార్థము ఏకరీతిగనున్నవి. వినియోగక్రమము భిన్నముగనున్నది. ఇందువలన కర్మార్థముగౌణమని నెంచందగును.

౬. ధ్రువం అసి పృథివీం దృగ్ంహ ఆయుః దృగ్ంహ ప్రజాం దృగ్ంహ సజాతాన్ అస్మై యజమానాయ పరి ఊహ.

జ్ఞానార్థము.

ధ్రువం=(ఓశిరోభాగమా నీవు) నిశ్చలమైనదానవు, అసి = అగుచున్నావు, పృథివీం = (గనుక) పృథివీస్థానమును, దృగ్ంహ=చలించనియ్యకుము, ఆయుః =ఆయుస్థానమును, దృగ్ంహ=చలించనియ్యకుము, ప్రజాం=సంతాన స్థానమును, దృగ్ంహ = చలించనీయకుము, సజాతాన్=కూడాపుట్టినవాటిని, అస్మై =ఈ, యజమానాయ=యజమానునికొరకు, పర్యూహ=స్వాధీనముగచేయుము

తా ॥ ఓజీవాత్మా నీవు శిరస్సుయందుండు పృథివీస్థానమును ఆయుస్థానమును సంతానస్థానమును చలించకుండచేయుము అటులచేసినేని చిత్తవృత్తులుయజమానునికి స్వాధీనమౌను.

కర్మార్థము.

టీ ॥ ధ్రువం = [ఓకపాలమా నీవు] ధృఢముగా, అసి=అగుచున్నావు, పృథివీం= [గనుక] భూమిని, దృగ్ంహ= దృఢముగాజేయుము, ఆయుః = [యజమానునికి]ఆయుస్సును, దృగ్ంహ=దృఢముగాజేయుము, ప్రజాం=[యెజమానునికి] సంతానమును, దృగ్ంహ=దృఢముగాజేయుము, సజాతాన్ = జ్ఞాతులుమొదలైనవారిని, అస్మై = ఈ, యజమానాయ=యజమానునికొరకు, పర్యూహ=స్వాధీనులుగా [జేయుము]

వినియోగము ॥ ఈమంత్రముచెప్పి దక్షిణభాగమందుంచిన అంగారమందు ప్రథమకపాలము నుంచవలయును.

వి ॥ కపాలము శిరస్సుతో పోల్చబడినది ‘‘తస్మాత్ అష్టాకపాలం పురుషస్యశిరః’’ (తై. బ్రా. 3-౨-౫) ‘‘సర్వస్యగాత్రస్య శిరఃప్రధానం’’ అనుప్రమాణమునుబట్టి శరీరసంబంధమైన అన్నిటికి శిరస్సుప్రధానము. బ్రహ్మాండముయావత్తుపిండాండమందున్నట్లు హిందూసిద్ధాంతము.

పృధివీ మొదలగు తత్వములు మనశరీరమందున్నవి. వాటినన్నిటిని చలించనీయకుండ చేసినయెడల వాటివలన పుట్టెడివృత్తులనుస్వాధీనముచేసుకొని భగవంతునియందు చిత్తము నిలపవచ్చును. ఇది యోగమనబడును. పైమంత్రములలో పృధివ్యేతర తత్వములను స్వాధీనపరుచుకొనుట చెప్పబడుచున్నది.

‟ధ్రువం నిశ్చలం” అని భట్టభాస్కరమందు చెప్పబడినది (౧-౧-౭) ఇందుకుబ్రాహ్మణము ‟ధ్రువమసిపృధివీం దృగ్ంహేత్యాహ।పృథివీమేవై తేనదృగ్ంహతి” (తై. బ్రా. 3-౨-౭) అనగ పృథివిని దీనిచేతను దృఢముగ నుంచుచున్నాడు.

ఇందుకు వినియోగసూత్రము ‟ధ్రువమసీతితస్మిన్మధ్యమం పురోడాశకపాలముపదధాతి” (అపస్తంబశ్రౌత ౧ - ౨౨ - ౨)

౭. ధర్త్రమసి అంతరిక్షం దృగ్ంహ ప్రాణం దృగ్ంహ అపానం దృగ్ంహ సజాతాన్ అస్మై యజమానాయ పరి ఊహ.

జ్ఞానార్థము.

టీ ॥ ధర్త్రమ్ = దృఢమైనదానవు, అసి=అగుచున్నావు, అంతరిక్షం= అంతరిక్షస్థానమును, దృగ్ంహ=చలించనీయకుము, ప్రాణం = ప్రాణస్థానమును, దృగ్ంహ=చలించనీయకుము, అపానం =అపానస్థానమును. దృగ్ంహ=చలించనీయకుము, సజాతాన్=కూడాపుట్టినవాటిని, అస్మై = ఈ, యజమానాయ= యజమానునికొరకు. పర్యూహ = స్వాధీనముగ చేయుము.

తా ॥ ఓజీవాత్మా శిరస్సుయందుండు అంతరిక్షప్రాణ అపానస్థానములుల చలించకుండ చేయుము అటుల చేసినేని చిత్తవృత్తులుయజమానునికిస్వాధీనమౌను

కర్మార్థము.

టీ॥ ధర్త్రం = (ఓకపాలమా-నీవు, ధరించేసామర్థ్యముగలదానవు, అసి = అగుచున్నావు, అంతరిక్షః = (గనుక) అంతరిక్షమును, దృగ్ంహ= దృఢముగా జేయుము, ప్రాణం=(ఈయజమానునికి) ప్రాణమును, దృగ్ంహ=దృఢముగా జేయుము. అపానం=(ఈయజమానునికి) అపానమును, దృగ్ంహ = దృఢముగా జేయుము, సజాతాన్ = జ్ఞాతులుమొదలైనవారిని, అస్మై=ఈ, యజమానాయ =యజమానునునికొరకు, పర్యూహ = స్వాధీనులుగా జేయుము.

వినియోగము॥ ఈమంత్రముచెప్పిప్రధమకపాలమునకు తూర్పుగా రెండవకపాలము నుంచవలయును.

వి ॥ ఈ అనువాకముయొక్క ౬వ మంత్రవివరణచూడుము.

ధర్త్రమొదలగు శబ్దార్థమునుగూర్చి విద్యారణ్యులవారు వ్రాసినదియేమనగ

"తత్ర ధర్త్రి ధర్మధరుణశబ్దాధారకత్వం బృహతోదృఢత్వంలక్షయతి" (చెన్నపట్టణంకూర్పు పుట ౧౧౩)

అంతరిక్షశబ్దమునుగూర్చి వేదాంగమైన నిరుక్తమందు చెప్పబడినది యేమనగ "అంతరిక్షనామాన్యుత్తరాణి షోడశాంతరిక్షం" (నిరుక్తం ౨-౩-౧) దీనికి దుర్గాచార్యులవారు వ్రాసినభాష్యమేమనగ "అంతరిక్షం ఏవతావత్ కస్మాత్ ఉచ్యతె అంతరా హీదం ద్యావాపృథివ్యో రవస్థితంక్షాంతంచభవతిపృథివ్యంతమిత్యర్థః అథవా అంతరా ఇమే ద్యావాపృథివ్యోక్షియతి నివసతి ఇతి అంతరిక్షం అథవా శరీరేషు ఏతదేవ అంతర్ మధ్యే అవస్థితం అక్షయం ఇతరాణి పృథివ్యాదీని భూతానిక్షియంతె తస్మాదక్షయత్వాదంతరిక్షం" (పుట ౧౯౭)

ఇందుకుబ్రాహ్మణము "ధర్త్రమస్యంతరిక్షం దృగ్ంహేత్యాహ । అంతరిక్షమేవై తేనదృగ్ంహతి" (తై-బ్రా ౩-౨-౭) ఇందుకు వినియోగసూత్రము "ధర్త్రమసీతి పూర్వం ద్వితీయంసంస్పృష్టం" (ఆపస్తంబశ్రౌత ౧. ౨౨. ౩)

౮. ధరుణం అసి దివం దృగ్ంహ చక్షుః దృగ్ంహ శ్రోత్రం దృగ్ంహ సజాతాన్ అస్మై యజమానాయ పరి ఊహ

జ్ఞానార్థము

టీ॥ ధరుణం=(ఓశిరోభాగమానీవు) దృఢమైనదానవు, అసి=అగుచున్నావు, దివం=దివస్థానమును, దృగ్ంహ=చలించనీయకుము, చక్షుః=చక్షుస్థానమును, దృగ్ంహ=చలించనీయకుము, శ్రోత్రం=శ్రోత్రస్థానమును, దృగ్ంహ=చలించనీయకుము, సజాతాన్=కూడాపుట్టినవాటిని, అస్మై=ఈ, యజమానాయ=యజమానునికొరకు, పర్యూహ=స్వాధీనముగచేయుము.

తా॥ఓజీవాత్మానీవుశిరస్సునందుండు దివస్థానమును చక్షుస్థానమును శ్రోత్రస్థానమును చలించకుండచేయుము అటులచేసినేని చిత్తవృత్తులు యజమానునికి స్వాధీనమగును.

కర్మార్థము.

టీ॥ ధరుణం= [ఓకపాలమానీవు]ధరించే సామర్థ్యముగలదానవు, అసి=అగుచున్నావు, దివం=[గనుక] స్వర్గలోకమును, దృగ్ంహ=దృఢముగా జేయుము, చక్షుః = [ఈయజమానునికి] చక్షుస్సును, దృగ్ంహ=దృఢముగాజేయుము, శ్రోత్రం=[ఈయజమానునికి]శ్రోత్రమును,దృగ్ంహ=దృఢముగాజేయుము, సజాతాన్=జ్ఞాతులుమొదలైన వారిని, అస్మై=ఈ, యజమానాయ=యజమానునికొరకు, పర్యూహ = స్వాధీనులుగా [జేయుము]

వినియోగము॥ ఈమంత్రముచెప్పిరెండవకపాలమునకు తూర్పుగా మూడవకపాలమునుంచవలయును.

వి॥ ఈమంత్రార్థవిషయమై ౬-౭-మంత్రములను చూడుడు.

ఇందుకుబ్రాహ్మణము ‟ధరుణమసిదివం దృగ్ంహేత్యాహ । దివమేవైతేన దృగ్ంహతి” (తై. బ్రా. 3-౨-౭)

ఇందుకు వినియోగసూత్రము ‟ధరుణమసీతిపూర్వాంతృతీయం” (ఆపస్తంబ శ్రౌత ౧-౨౨-3)

౯. ధర్త్రా అసి దిశః దృగ్ంహ యోనిం దృగ్ంహ ప్రజాం దృగ్ంహ సజాతాన్ అస్మై యజమానాయ.

జ్ఞానార్థము.

ధర్త్ర= (ఓశిరోభాగమా) దృఢమైన దానవు, అసి=అగుచున్నావు, దిశః= దిశస్థానమమును, దృగ్ంహ=చలించనీయకుము, యోనిం=యోనిస్థానమును, దృగ్ంహ=చలించన్నియకుము, ప్రజాం= సంతానస్థానమును, దృగ్ంహ=చలించనీయకుము, సజాతాన్ = కూడాపుట్టిన వాటిని, అస్మై = ఈ, యజమానాయ = యజమానునికొరకు పర్యూహ = స్వాధీనముగ చేయుము.

తా ॥ ఓజీవాత్మా నీవు శిరస్సుయందుండు దిశస్థానమును యోనిస్థానమును సంతాన స్థానమును చలించకుండ చేయుము అటులచేసినేని చిత్తవృత్తులుయజమానునికి స్వాధీనమౌను.

కర్మార్థము.

టీ ॥ ధర్త్రా = [ఓకపాలమా] ధరించు సామర్థ్యముగల దానవు, అసి= అగుచున్నావు. దిశః = [గనుక] దిక్కులను,దృగ్ంహ=దృఢముగా జేయుము. ప్రజాం = యజ మానుని యొక్క, సంతానమును, దృగ్ంహ = దృఢముగాజేయుము. సజాతాన్ = జాతులు మొదలయినవారిని, అస్మై = ఈ, యజమానాయ = యజమానునికొరకు, పర్యూహ = స్వాధీనులుగా[జేయుము].

వినియోగము ॥ ఈమంత్రము చెప్పి ఏడవకపాలము నుంచవలయును.

వి ॥ ౬. ౭. మంత్రములయొక్క వివరణచూడుము.

ఇందుకు బ్రాహ్మణము ‟ధర్త్రాసిదిశోదృగ్ంహేత్యాహ । దిశఏవైతేన దృగ్ంహతి” (తై. బ్రా. 3 - ౨ - ౭) ‟ధర్త్రాసీతిసప్తమం” ఆపస్తంబశ్రౌతం ౧ - ౨3 - ౧).

౧౧. చితః స్థ ప్రజాం అస్మై రయిం అస్మై సజాతాన్ అస్మై యజమానాయ పరి ఊహ.

జ్ఞానార్థము.

టీ॥ చితః = (ఓ శిరోభాగములారా మీరు) చిత్తస్వరూపులు, స్థ = అగుచున్నారు (గనుక) అస్మై = ఇతనికొరకు, ప్రజాం=సంతానమును, అస్మై=ఇతనికొరకు, రయిం=ధనమును, అస్మై = ఈ, యజమానాయ=యజమానునికొరకు, సజాతాన్=కూడాపుట్టినవాటిని, పర్యూహ=స్వాధీనముచేయుము.

తా॥ చిత్తవృత్తులను భగవంతునియందుంచి ఇహసౌఖ్యములనుగూర్చి ఆలోచించకపోయినను భగవంతుడె సంతానాదిసౌఖ్యములను కలుగచేయును.

కర్మార్థము.

టీ ॥ చితః = [అష్టమకపాలమా! నీవు] చితరూపమైనదానవు, స్థ = అగుచున్నావు, అస్మై = [గనుక] ఈ[యజమానునికొరకు], ప్రజాం = సంతానమును కలుగజేయుము, అస్మై = ఈ [యజమానునికొరకు] రయిం = ధనమును కలుగజేయుము, అస్మై = ఈ, యజమానాయ = యజమానునికొరకు, సజాతాన్ = జ్ఞాతులుమొదలయినవారిని, పర్యూహ = స్వాధీనులుగాజేయుము.

వినియోగము ॥ ఈ మంత్రము చెప్పి ఎనిమిదవ కపాలము నుంచవలయును.

వి ॥ ఈమంత్రమునకు బ్రాహ్మణమందు ప్రత్యేక వ్యాఖ్యానము చెప్పబడియుండలేదు. "చితస్థేత్యాహ । యథాయజురేవైతత్"(తై. బ్రా. 3-౨-౫)

౬, ౭, ౮, ౯, మంత్రములయందు అధ్యాహారము చేయబడిన సంబోధన పదము కపాలమనగ పుట్టెయెముక అది యచేతనమగుటచే స్థిరముగ నుండుమని చెప్పుటప్రయోజనములేదు. అట్టికపాలము ఆధారమైన చిత్స్థానము చలించకనుండవలయునని తెలియుటకుగాను "చితః"అని ఈమంత్రమందు చెప్పంబడినదనగ ఓకపాలమా నీవు స్థిరముగనుండుమని చెప్పుటవలనకపాలము ఆధారమైన ఓజ్ఞానస్థానమా నీవు స్థిరముగనుండుము అనిపూర్వమంత్రములతాత్పర్యము. "చితః"అనగ"చేతనంతిసజ్ఞానంతియే తేచితః" (శుక్లయజుర్వేదభాష్యము బొంబాయికూర్పుపుట ౫3)

ఈశబ్దమునుగూర్చి తారానాధ వాచస్పత్యమందు చెప్పబడినదేమనగ "అచేతనదేహాదిసంఘాతస్య చేతనత్వంసంపాదయంతీ బాహ్యావస్తుషునిర్వికల్పరూపంసామాన్యజ్ఞానంజనయంతీవృత్తిశ్చిత్తం తదేవాత్రచిదిత్యుచ్యతే"(పేజీ ౨౯30)"చితః" బహువచనము ఇందుకు ఏకవచనము "చిత్" కర్మయందు కపాలము అధ్యాహారముచేయబడినది. కపాలము చిత్తుకుపలక్షణము కావున "కపాల, త్వం, చితరూపాసి" అని విద్యారణ్యభాష్యమందు చెప్పంబడినది. (పుట ౧౧3) "చితస్థేతి

బహువచనమాదరార్థం అని విద్యారణ్యభాష్యమందు చెప్పంబడినది. "ప్రత్యేకమభిధానా ఏకవచనమని" భట్టభాస్కరమందు చెప్పంబడినది. "చిదసి" అని మైత్రాయణీసంహితయందు పఠించబడుచున్నది.

ఇందుకు వినియోగసూత్రము "చితస్థేత్యష్టమం"(ఆపస్తంబశ్రౌత ౧-౨౩-౧)
ఈవినియోగమునుగురించి సామాన్యవిషయములను చూడుము.

## ౧౧. భృగూణాం అంగిరసాం తపసాం తప్యధ్వం.

**జ్ఞానార్థము.**

టీ॥ భృగూణాం=భృగువులయొక్కయు, అంగిరసాం= అంగీరసులయొక్కయు, తపసాం = తపస్సుచేతను, తప్యధ్వం= (ఓచిత్తవృత్తులారా) తపించబడినవారుగా ఔదురుగాక.

తా ॥ ఓజీవులారా మీరుభృగు అంగీరసులవంటి తపస్సుచేతను మీ చిత్తవృత్తులను శుద్ధిచేయుడు.

**కర్మార్థము.**

టీ॥ భృగూణాం = [ఓకపాలసముదాయమా మీరు] భృగువుల యొక్క, అంగీరసాం = అంగిరసుల యొక్క, తపసా = తపోరూపమైనఅగ్నిచేతను, తప్యధ్వం = తపింపబడినవారు అవుదురుగాక.

వినియోగము॥ ఈమంత్రముచెప్పి కపాలములయందు అంగారముల నుంచవలయును.

వి ॥ భట్టభాస్కరమందు "భృగవో అంగిరసశ్చతపశ్వినఃప్రసిద్ధాః తేషాం తపసాంతప్యధ్వంతప్తాభవత్" భృగ్వంగిరసులు మంచితపశ్శాలులని ప్రసిద్ధి కావున వీరినిదేవతలని బ్రాహ్మణమందును విద్యారణ్యభాష్యమందును చెప్పంబడినది.

"దేవతాతపోరూపేణా అనేనాగ్నినాతప్తానిభవతఇమమేవార్థందర్శయతి"
"భృగూణామంగిరసాంతపసాతప్యధ్వమిత్యాహ । దేవతానామేవైనానితపసాతపంతి" (తై-బ్రా-3-౨-౭)

తపస్సుచేత ననగ "ధర్మవిద్యానుష్టానేనతాపేనతేజసావా" అని శుక్లయజుర్వేదభాష్యమందు చెప్పబడినది (పుట ౧౧౭)

పూర్వమంత్రములయందు చిత్తవృత్తులను దృఢపరచవలయునని చెప్పియున్నది ఏప్రకారముగ దృఢపరచవలసినది ఈమంత్రముచెప్పుచున్నది. అదియెట్లనగ ధర్మాచరణయును తపస్సుచేత ఈఅర్థమే బ్రాహ్మణము తెలియచేయుచున్నది. "తానితతస్సగ్గంస్థితే" (తై. బ్రా. 3-౨-౭)

ఇందుకువినియోగసూత్రము "భృగూణామంగిరసాం తపసాతప్యధ్వంవేదేనకపాలేష్వంగారాన ధ్యూహ్యమదంతిరధిశ్రయతి" (ఆపస్తంబశ్రౌత ౧-౨3-౬)

(౧౫)

౧౨. యాని ఘర్మే కపాలాని ఉప చిన్వంతి వేధసః పూష్ణః తాని అపి వ్రతే ఇంద్రవాయూ వి ముంచతాం.

జ్ఞానార్థము.

టీ ॥ వేధసః = జ్ఞానులు, యాని = ఏ, కపాలాని = చిత్‌స్థానములను, ఘర్మే = తపోయజ్ఞమందు, ఉపచిన్వంతి = ఉంచుచున్నారో, తాని = ఆ చిత్తవృత్తులను, పూష్ణః = భగవంతుని యొక్క, వ్రతే = తపస్సనెడి యజ్ఞము, అపి = సమాప్తి నొందుచుండగ, ఇంద్రవాయూ = ఇంద్రుడని వాయువని పేరు కలిగిన భగవంతుడు, విముంచతాం = ముక్తినొందించునుగాక.

తా ॥ ఏజ్ఞానులు తమయొక్క చిత్తములను భగవంతునియందు నిలుపుచున్నారో వారిని ఆభగవంతుడు ముక్తినొందించుచున్నాడు.

కర్మార్థము.

టీ ॥ వేధసః = అధ్వర్యులు, ఘర్మే వేడిమిగల అగ్నియందు, యాని = ఏ, కపాలాని = కపాలములను, ఉపచిన్వంతి = ఉంచినారో, తానిఅపి = ఆకపాలములను. ఇంద్రవాయూ=(విడిపించేదానికిసమర్థులైన) ఇంద్రవాయుదేవతలు, పూష్ణః = పోషకుడైన యజమానునియొక్క, వ్రతే = [యాగరూపమైనటువంటి] వ్రతము [సమాప్తమాచుండగా,] విముంచతాం = [అగ్నిలోనుంచి] తీయుదురుగాక.

వినియోగము ॥ ఈమంత్రముచెప్పి దర్శపూర్ణ మాసముల యందు కపాలమును తీసి లెక్క పెట్టి ఉద్వాసనచేయవలయును.

వి ॥ ఈమంత్రమునకు కర్మవినియోగము ఇచ్చట లేదనియు ప్రసంగము వలన ఇచ్చటమంత్రము చెప్పబడినదనియు విద్యారణ్యభాష్యమందు చెప్పంబడినది. "అయంమంత్రోయద్య పియాగసమాప్తౌ పఠనీయః తథాపికపాలప్రసంగాత్ ఇహ ఆమ్నాతః" అనగ ఈమంత్రము యాగసమాప్తియందు పఠింపబడుచున్నను, కపాల ప్రసంగమువలన ఇచ్చట చెప్పంబడినది. ఐతేజ్ఞానార్థవిషయమై ఇట్టి అసందర్భము లేకనే అర్థము చెప్పబడుచున్నది.

ఈమంత్రమునకు వ్యాఖ్యానమైన బ్రాహ్మణమంత్ర పాఠక్రమరీతినే చెప్పబడ్డది. "యానిఘర్మేకపాలాన్యుపచిన్వంతి వేధసఇతి. చతుష్పదర్చావిముంచతి" (బ్రా ౩ - ౨ - ౭) అనగ నాలుగుపాదములు కలిగిన ఋక్కుచేతను (పాపములోనుంచి) విముక్తి చెందుచున్నాడు. మరియు బ్రాహ్మణమందు చెప్పంబడినది యేమనగా "చతుష్పాదఃపశవః పశేష్వేవోపరిష్టాత్ప్రతితిష్ఠతి" (తై. బ్రా. ౩ - ౨ - ౭.)

ఈమంత్రము ఈకాండయొక్క ౫-వ ప్రపాఠకము ౧౦-వ అనువాకమందును పఠింపబడుచున్నది. ఘర్మశబ్దమునకు "దీప్తేవహ్నౌ" అనివిద్యారణ్యభాష్యమందు

స "యజ్ఞః"యని వేదనిఘంటువునందును చెప్పబడ్డది "యజ్ఞః, ౧ వేనః, ౨ అధ్వరః ౩, మేఘః ౪, విదథః ౫, నార్యః ౬, సవనం ౭, హోత్రా ౮, ఇష్టిః ౯, దేవతాతా ౧౦, మఖః ౧౧, విష్ణుః ౧౨, ఇందుః ౧౩, ప్రజాపతిః ౧౪, ఘర్మ ౧౫. ఇతి పంచదశయజ్ఞనామాని" (౧౩-౧౭)

"వేధసః" అనగ "అధ్వర్యురూపా వేధసః" అనివిద్యారణ్యభాష్యమునందు చెప్పబడినది (౧౧౫ పుట) అచట వేధసః అనగా "బ్రహ్మసమానాః" అనివిద్యారణ్యభాష్యమందు అర్థము చెప్పబడినది (పుట ౭౦౨) వేద నిఘంటువునందు "జ్ఞాని యని" చెప్పబడినది. విప్రః౧। విగ్రః ౨। గృత్సః౩। ధీరః ౪। వేనః౫। వేధాః ౬। కణ్వః ౭। ఋభుః ౮। నవేధాః ౯। కవిః ౧౦। మనీషీ ౧౧। మన్ధాతా ౧౨। విధాతా ౧౩। విపః ౧౪। మనశ్చిత్ ౧౫। విపశ్చిత్ ౧౬। విపన్యవః ౧౭। ఆకేనిపః ౧౯। ఉశిజః ౨౦। కీస్తాసః ౨౧। అద్ధాతయః ౨౨। మతయః ౨౩। మతుధాః ౨౪। వాఘతః ఇతిచతుర్వింశతి మేధావినామాని". (౩ - ౧౫) వేద నిఘంటువను ప్రత్యేకము గ్రంథములేదని కొందరు ఆక్షేపించుట వలన ముఖ్యపదములకు యాథ త్తుఖండికను వ్రాయుచున్నారము.

'పూషణః' పోషకస్యయజమానస్య అనియు ౫ - వ పన్నములో "పూషణః పోషకాః ఋత్విజః అనియు విద్యారణ్యమందు చెప్పబడినది. "పూషణః పోషకస్య అగ్నేః" అనిభట్టభాస్కరమందు చెప్పబడియుండుటవలననున్ను (౧ - ౧౪) పూషాఅనుశబ్దము భగవత్పరమైనటుల విష్ణుసహస్ర నామములయందు ప్రసిద్ధిగనుండుట వలననున్ను పూషశబ్దమునకు భగవదర్థము చెప్పబడినది. ఈశబ్దమునుగూర్చి యీ గ్రంథముయొక్క ౨౫ పుటచూడుము. 'అపి' శబ్దమునకు అనేకార్థములు కలవు. ఈ అనువాకభాష్యమందు అపిశబ్దమునకు ప్రత్యేకము అర్థము వ్రాయబడియుండలేదు. "అపిసమాప్తై" అనిభట్టభాస్కర భాష్యమందు వ్రాయంబడినది, వేదాంగనిఘ

క్తమందు ‘‘అపీతిసంసర్గమని’’ చెప్పబడినది (౧ - ౧ - ౫) ఇంద్రవాయుశబ్దముల నుగూర్చి ఈగ్రంథమందు ఇదివరకే చెప్పబడినది. భగవంతునికిని ఏవచనమైననుఉప యోగించవచ్చునని మధ్వాచార్యులవారు ‘‘ద్విరూపత్వం బహుత్వంచ విశేషాదేవకే వలంఏకస్యైవహారేన్నాత్ర భేదశ్శంక్యఃకథంచన’’ అని చెప్పిరి(ఈగ్రం ౬౦ పుట)ప్ర థమకాండ ౫-వ ప్రపాఠకము ౧౦-వ అనువాకమందు ‘‘యానిఘర్మేకపాలాని’’ అనుమంత్రమునకు పూర్వము ‘‘ కస్త్వాయునక్తి సత్వాయునక్తు’’ అనువాక్యముకల దు ఈవాక్యముయొక్క అర్థము ఈగ్రంథం ౫౦-వ పుటయందు చెప్పబడినది. ఈ మంత్రమందు ఇంద్రవాయూ అనునది ద్వివచనము ఇందువలన ఇద్దరు భగవంతులని వేదముచెప్పుచున్నట్లు కొందరు ఆక్షేపించెదరుగాని మధ్వాచార్యుల వారుచెప్పిన ప్రమాణముబట్టిన్ని ఈమంత్రమునకు వేదమందే ‘కస్త్వాయునక్తి’ ఎవ్వడుకూర్చుచు న్నాడు ‘సః’ ఆపరమాత్మే ‘‘యునక్తుకూర్చుచున్నాడు. అని ఏకవచనప్రయోగముం డుట వలనసున్ను అట్టిఆక్షేపణ నిరర్థకమవుచున్నది.

ఈమంత్రమునకు ఇచట వినియోగములేదుగాని దర్శపూర్ణమాస సమాప్తియం దు వినియోగం చెప్పబడినది అనివిద్యారణ్యులవారు వ్రాసినారు. ‘‘యానిఘర్మేక పాలానీతిచతుష్ట దయర్చాకపాలాని విముచ్య సంఖ్యాయోద్వాసయతిసంతిష్టేతే దర్శపూర్ణమాసౌ (చెన్నపట్టణంకూర్పు పుట ౧౧౫).

## ఏడవ అనువాక సామాన్యవిషయములు.



మధుసూదన సరస్వతులవారు ప్రస్థానమను గ్రంథమందు చెప్పినదేమనగ "శిక్షాకల్పోవ్యాకరణం నిరుక్తంఛన్దో జ్యోతిషమితి వేదాంగానిషట్. పురాణ న్యాయమీమాంసా ధర్మశాస్త్రాణిచేతి చత్వార్యుపాంగాని" ఈదశగ్రంథములు వేదార్థమును గ్రహించుటకు సహాయకారులు.

౧. "శిక్ష" అనేకశిక్షలుకలవు శిక్షలనుబట్టి ప్రతిశాఖకు వేరువేరుప్రాతిశాఖ్యలు పుట్టినవి. స్వరమునుగురించియు సంధులనుగురించియు ప్రాతిశాఖ్య చెప్పుచున్నది. తైత్తిరీయప్రాతిశాఖ్య త్రిభాష్యరత్నము అను టీకతోకూడ కలకత్తాలో అచ్చుబడినది. ఇందు ౨౪-అధ్యాయములు గలవు. ఈవేదముయొక్క యేయేమంత్రములు ప్రాతిశాఖ్యయొక్క యేసూత్రమందు ఉదహరింపబడినది ఆయా అనువాకముక్రింద తెలియచేయబడును.

"ఉదాత్తముదాత్తవతి" అని (౧౦-అధ్యా. ౧౦-సూ) అనగా ఉదాత్తముతోనేస్వరముకలసినను ఉదాత్తమగును. ఇందుకుఉదాహరణగాను ఈఅనువాకమందుండు రెండవమంత్రమందు చెప్పబడినది "బ్రహ్మాయచ్ఛ,అపాగ్నే" ఇచట 'చ్ఛ' అనుదాత్తము 'అ' ఉదాత్తము ఈరెండున్ను కలసిఉదాత్తమగుచున్నది. అనగ 'చ్ఛా' ఉదాత్తము.

౨. "కల్పః" తైత్తిరీయశాఖకు బోధాయన అపస్తంబకల్పములు. బోధాయనకల్పము అచ్చుబడియుండలేదుగాని ఆసూత్రము విద్యారణ్యభాష్యమందు అచటనచట ఉదహరించబడుచున్నది. అపస్తంబసూత్రము ౧౫-పన్నములు రుద్రదత్తవృత్తితో కలకత్తాలో నచ్చువేయంబడినది. ప్రతి మంత్రముయొక్క వినియోగము ఈసూత్రమునుబట్టి వ్రాయంబడుచున్నది.

3. "వ్యాకరణం" ౮ - అధ్యాయములు ప్రతి అధ్యాయము ౪ పాదములు ప్రతిపాదము సూత్రములుగ పాణినీయవ్యాకరణము భాగింపబడినది. ఇందునగురించి అనేకగ్రంథములుకలవు. "పురాణప్రోక్తేషుబ్రాహ్మణకల్పేషు" (౪ - 3 - ౧౦౫) అనుసూత్రము వలన ప్రాచీన నవీనబ్రాహ్మణములను కల్పములను గ్రహించవచ్చును.

౪. "నిరుక్తం" వేదనిఘంటువుతోకలిపి నిరుక్తము ౧౧ అధ్యాయములు మాత్రము దుర్గాచార్యభాష్యముతో కలకత్తాలోనచ్చువేయంబడినది. సంపూర్ణముగ సీమలోనచ్చువేయబడినది. అర్థమునుగ్రహించుటకు ఈగ్రంథము అచ్చటచ్చటయు పయోగింపంబడుచున్నది.

౫. "ఛన్దః" పింగళునిచేచేయంబడినదిఛన్దస్సు. ఇది ౮-అధ్యాయములుకలది మృతసంజీవనీఅనిపేరుగలహలాయుధవృత్తిసహితముకలకత్తాలో నచ్చుబడినది. ఈ

అనువాకమందు ‹‹యానిఘర్మే'' అను౧౨-వమంత్రముబుక్కు. ఇది ‹‹అనుష్టుప్ ఛన్దస్సు'' ‹‹అనుష్టుప్ గాయత్రైః'' అని ఈఛన్దస్సుయందు అనుష్టుప్ కులక్షణముచెప్పబడినది. (౩-అ-౨౩-సూ) ఇందుకుభాష్యం. ‹‹చతుష్పాదిత్యనువర్తతే గాయత్రైః అష్టాక్షరైః పాదైః చతుష్పాచ్ఛన్దః అనుష్టుప్సంజ్ఞంభవతి'' అనగా ఎనిమిది అక్షరములు నాలుగుపాదములుగలది అనుష్టుపు అనబడును.

౬. "జ్యోతిషం" వేదాంగమయిన జ్యోతిషము సీమలో అచ్చుబడినది. కర్మయందు ఈ అనువాకము దర్శపూర్ణమాసమందుపయోగించ బడుచున్నది దర్శ అనగా అమావాస్య పౌర్ణమాస్య అనగా పౌర్ణమి ‹‹యె అహోరాత్రే తెదర్శపౌర్ణమాసౌ' అని నారాయణోపనిషత్తుయందు చెప్పబడుటవలన జ్ఞానార్థమునందు యీ అనువాకమును రాత్రింబగళ్లు పఠించవలయునని తాత్పర్యము.

౭. ‹‹న్యాయం'' గౌతమన్యాయమని కాణాదన్యాయమని రెండువిధములు. గౌతమన్యాయము ౫-అధ్యాయములుగాను ప్రతి అధ్యాయము ఆహ్నికములుగాను ప్రతి ఆహ్నికముసూత్రములుగానువిభజింపబడినది. ఈగ్రంధముకలకత్తాలోవాత్స్యాయనభాష్యముతోను విశ్వనాధవృత్తితో నచ్చుబడినది.

కణాదుడుచేసిన వైశేషికమనెడిగ్రంథం ౧౦-అధ్యాయములుగాను ప్రతి అధ్యాయము ఆహ్నికములుగాను ప్రతిప్రకరణము సూత్రములుగాను భాగింపబడినది. ఈగ్రంథము జైనారాయణతర్క పంచాననవృత్తితోను, శంకరమిశ్రుణిచే చేయంబడిన ఉపస్కారమను పేరుగల వ్యాఖ్యతోను కాశిలో నచ్చుబడినది. ఈయనువాకముయొక్క ౬-మంత్రమునందు ‹‹ పృథివీదృగ్ంహ''అనిచెప్పియున్నది. అనగా మనశరీరమందు పృధివీతత్వములు కలదనిన్ని అట్టిగుణములను చలించకుండాచేయవలెననిన్ని మంత్రితాత్పర్యము. గౌతములవారు చెప్పినదేమనగ ‹‹పార్థివం గుణాంతరోపలబ్ధేః'' (౩-అ. ౧-ఆ. ౨౮-సూ) అనగా శరీరమందు ప్రధివీగుణములుండుటవలన శరీరము పృథివీసంబంధమయినదని చెప్పబడినది. మరియు ఈప్రకారముగా చెప్పుటకు వేదమే ప్రమాణమని చెప్పుచున్నారు "శ్రుతిప్రామాణ్యాచ్చ'' (౩-అ. ౧-ఆ. ౨౯-సూ)

౮. ‹‹మీమాంస'' ఉత్తరమీమాంస, పూర్వమీమాంసఅనిరెండువిధములు.

(౧) పూర్వమీమాంస, ఈగ్రంథము జైమినిచే చేయంబడినది. ఇది ౧౨-అధ్యాయములుగాను, ప్రతిఅధ్యాయము ౪-పాదమాలుగను, ౩-౬-౧౦-అధ్యాయములు ౮-పాదములుగను అనగా మొత్తము ౬౦-పాదములుగను ప్రతిపాదము సూత్రములుగాను భాగింపబడినది. యావత్తుసూత్రములు ౨౬౫౨-అనిన్ని అధికరణములు ౯౧౫-అనిన్ని శ్రీమాధవాచార్యులవారు చెప్పియున్నారు. ఈగ్రంధము శబరభాష్యముతో కలకత్తాలో నచ్చువేయంబడినది. ఈసూత్రముల అర్థమునే వివర

ణముగా తెలియునటుల జైమిని న్యాయమాలయను గ్రంథము భాష్యముతో శ్రీమాధవాచార్యులవారిచే రచియింపంబడినది. ఇందు ౯-అధ్యాయములు విశాఖపట్ణములో తెనుగులిపితో అచ్చుబడినది. మీమాంసయొక్క ముఖ్యతాత్పర్యము శ్రుత్యర్థమునిశ్చయించుటయని సోమనాథుడు మయూఖ అను గ్రంథమందు (౨-౧-౧౭) చెప్పిరికావున వేదార్థమును గ్రహించుటకు ఈగ్రంథము అత్యావశ్యకము.

## పూర్వమీమాంసయందుండు ముఖ్య అంశములు.

### ౧ - అధ్యాయము.

| | |
|---|---|
| ౧ పాదం | విధి |
| ౨ పాదం | అర్థవాదము |
| ౩ పాదం | స్మృతిరూపం |
| ౪ పాదం | ఉద్భివిచ్ఛిత్రాదినామము |

### ౨ - అధ్యాయము.

| | |
|---|---|
| ౧ పాదం | అపూర్వబోధకము |
| ౨ పాదం | ధాతుభేదము |
| ౩ పాదం | రథంతరాదికర్మభేదములు |
| ౪ పాదం | నిత్యకామ్యము |

### ౩ - అధ్యాయము.

| | |
|---|---|
| ౧ పాదం | శ్రుతివిచారణ |
| ౨ పాదం | లింగం |
| ౩ పాదం | వాక్యప్రకరణము |
| ౪ పాదం | నివీత ఉపవీత |
| ౫ పాదం | ప్రతిపత్తి |
| ౬ పాదం | అనారభ్యఅధీతం |
| ౭ పాదం | ప్రయాజ |
| ౮ పాదం | యాజమానం |

### ౪ - అధ్యాయము.

| | |
|---|---|
| ౧ పాదం | ఆమిక్షాదధ్యానయనం |
| ౨ పాదం | వత్సాపకరణం |
| ౩ పాదం | జుహూపర్ణం |
| ౪ పాదం | రాజసూయం |

### ౫ - అధ్యాయము.

| | |
|---|---|
| ౧ పాదం | శ్రుత్యర్థపాఠాధిక్రమము |
| ౨ పాదం | రాజపేయం |
| ౩ పాదం | ప్రయాజాది |
| ౪ పాదం | శ్రుత్యర్థపాఠాదనాంప్రబలదుర్బలభావము |

### ౬ - అధ్యాయము.

| | |
|---|---|
| ౧ పాదం | కర్మాధికారము |
| ౨ పాదం | సత్రాధికారము |
| ౩ పాదం | ద్రవ్యమునకుప్రతినిధి |
| ౪ పాదం | పదార్థలోపము |
| ౫ పాదం | కాలాపరాధం |
| ౬ పాదం | సత్రాధికారము |
| ౭ పాదం | పిత్రాదికం |
| ౮ పాదం | ఉపనయనహోమధర్మము |

### ౭-అధ్యాయము.

| | |
|---|---|
| ౧ పాదం | ప్రత్యక్షవచనం |
| ౨ పాదం | రథంతరం |
| ౩ పాదం | అగ్నిహోత్రం |
| ౪ పాదం | ఒషధద్రవ్యము |

### ౮-అధ్యాయము.

| | |
|---|---|
| ౧ పాదం | లింగాతిదేశవిశేషము |
| ౨ పాదం | లింగాతిదేశవిశేషము |
| ౩ పాదం | ప్రబలలింగవిశేషము |
| ౪ పాదం | దర్వీహోమము. |

౯-అధ్యాయము.

౧ పాదం ఊహావిచారః వ్రీహ్యాది స్వరూపసాధనం
౨ పాదం సపరికరము
౩ పాదం మంత్రము
౪ పాదం మంత్రహోమప్రసంగము

౧౦-అధ్యాయము.

౧ పాదం ద్వారలోపినిరూపణం
౨ పాదం సంక్షేపేణద్వారలోపము
౩ పాదం బాధకారణం
౪ పాదం నక్షత్రేష్టివిచారము
౫ పాదం షోడశగ్రహము
౬ పాదం సామవిచారం
౭ పాదం ప్రకీర్ణవిచారము
౮ పాదం ప్రతిషేధము

౧౧-అధ్యాయము.

౧ పాదం తంత్రోపోద్ఘాతము
౨ పాదం ఉదకము
౩ పాదం తంత్రము
౪ పాదం ఉదకము

౧౨-అధ్యాయము.

౧ పాదం పశుపురోడాశము
౨ పాదం సవనీయపశువు
౩ పాదం ఋజుత్వం
౪ పాదం ఇంద్రబార్హస్పత్యం

“భావార్థాః కర్మశబ్దాః తేభ్యః క్రియా ప్రతీయేతైష హ్యర్థో విధీయతే” అని ౨-అధ్యాయం ౧-పాదం ౧-సూత్రమందు జైమిని చెప్పుటవలన కర్మను బోధించుశబ్దమునకు భావార్థమును తెలుసుకొనుట యావశ్యకము. ఈయనువాకము కర్మరీత్యా అష్టాకపాలోపధానము. ఈకర్మయొక్క భావము బ్రాహ్మణమందు తెలియచేయబడ్డది. “ఏకమగ్రేకపాలముపదధాతి ఏకంవా అగ్రేకపాలం పురుషస్యసంభవతి. అథద్వే, అథత్రీణి, అథచత్వారి, అథాష్టౌ, తస్మాదష్టాకపాలంపురుషస్యశిరః” (తై. బ్రా. ౩-౨-౭) ఇందుకు విద్యారణ్యభాష్యము పురుషస్యాపిగర్భే ప్రథమం శిరోరూపమఖండం కపాలముత్పద్యతే పశ్చాత్క్రమేణరేఖాభి రష్టధాభిద్యతె (౧౧౪-పుట) పురుషునియొక్క శిరస్సు ౮-ఎముకలతో చేయబడ్డట్లు ఇంగ్లీషుగ్రంథములయందు వ్రాయబడుటయేగాక, పుర్రెను తెప్పించిచూచితే దృష్టాంతము కనుపించుచున్నది. అష్టాకపాలోపధానమను కర్మ శిరస్సుయొక్క స్థితిని తెలియచేయుచున్నది. ఆశిరస్సుయందు పృథివీమొదలగు స్థానములుండినట్లును వాటిని చెలించకుండ చేసినయెడల భృగు అంగిరసులవలెనె గొప్పతపస్సుచేయుటకు సాధనమనియు అట్లుచేసిన సంసారబంధమునుంచి విముక్తియగుననెడి జ్ఞానమును ఈకర్మ బోధించుచున్నది.

(౨) “ఉత్తరమీమాంస” ఈగ్రంథము బాదరాయణునిచే చేయంబడినది. ఇది ౪-అధ్యాయములుగానున్న ప్రతి అధ్యాయము ౪-పాదములుగాను ప్రతిపాదము సూత్రములుగాను భాగింపబడినది. ఇందుమొత్తము ౪౫౫-సూత్రములు ౧౯౧ అధికరణములు. కొందరితాత్పర్యప్రకారము అధికరణసంఖ్య భిన్నముగానున్నది.

కర్మసంబంధములేకనే జ్ఞానముబోధించుట ఉత్తరమీమాంసయొక్క ముఖ్యతాత్పర్యము. ఇందుకనేకభాష్యములు వ్యాఖ్యానములుగలవు. భగవంతునికిఏలింగమయినను ఏవచనమయినను చెప్పవచ్చునని ౧౨-వ మంత్రమువలనకనుపించుచున్నది. ఉభయలింగాధికరణముక్రింద ఈసంగతి చెప్పబడినది. (౩-అ ౨-పా ౧౧-సూ)

౯. 'ధర్మశాస్త్రము' ఇందు అనేకగ్రంథములుగలవు. ఈయనువాకమందు భృగు అంగిరసులు గొప్పతపశ్శాలులుగా చెప్పబడినది. భృగుమహాఋషిని గురించి మనుస్మృతియందుచెప్పినదేమనగ "ఏతద్వోయంభృగుశ్శాస్త్రంశ్రావయిష్యత్యశేషతః ఏతద్ధిమత్తోఅధిజగే సర్వమేషోఖిలంమునిః తతస్తథాసతేనోక్తో మహర్షిః మనునా భృగుః తానబ్రవీత్ఋషీన్ సర్వాన్ ప్రీతాత్మాశ్రూయతామితి" (౧-అధ్యాయము ౫౯-౬౦-శ్లో) అనగా భృగుమహాఋషి మన్వాభులకు శాస్త్రముబోధించెను.

౧౦. 'పురాణం' ౧౮-పురాణములున్ను ౧౮-ఉపపురాణములున్ను భారత-భాగవతరామాయణములున్నకూడ వేదార్థమునకుసహాయకారి. భగవద్గీతలయందు ఈయనువాకార్థముఅనేకస్థలములయందు చెప్పంబడినది. జ్ఞానవిజ్ఞానతృప్తాత్మాకూటస్థోవిజితేంద్రియః" ఇత్యాదివాక్యములు (౬-అధ్యాయములు ౮-శ్లో) జ్ఞానవిజ్ఞానములనుగూర్చి ఇదివరకె వ్రాయబడినది.

౧౧. పైచెప్పినవిగాక పతంజలియోగశాస్త్రమున్ను వేదార్థమును తెలియచేయుచున్నది. ఈయనువాకముయొక్క "చితస్థే" అను ౧౧-౧౨-మంత్రములయొక్క తాత్పర్యమును పతంజలియోగసూత్రముయొక్క ౪-పాదం ౨౧-సూత్రము బోధించుచున్నది. "చితేరప్రతిసంగమాయాస్తదాకారాపత్తౌస్వబుద్ధిసంవేదనం" అనగా చిత్తము అన్యథా పొందనియెడల స్వబుద్ధిని తెలుసుకొనును పతంజలియోగశాస్త్రము ౪-పాదములుగాను ప్రతిపాదము సూత్రములుగాను భాగింపబడినది. ఈ గ్రంథము రాజమార్తాండాఖ్య వృత్తిసహితము కలకత్తాలో అచ్చువేయంబడినది.

౧౨. శాండిల్యసూత్రములు వేదార్థమును గ్రహించుటకు ఆవశ్యకము ఈసూత్రములుముఖ్యముగాభక్తిని గురించిచెప్పుచున్నవి. శాండిల్యవిద్య యావశ్యకమనిఛాందోగ్యోపనిషత్తుయందు చెప్పబడినది. "యస్యస్యాదద్ధానవిచికిత్సా అస్తీతిహస్మాహ శాండిల్యశ్శాండిల్యః" మరియు బ్రహ్మసూత్రముయొక్క, ౩-అ ౩-పా ౩౧-వ సూత్రముయొక్క శ్రీశంకరభాష్యమందు శాండిల్యవిద్యవిషయమై ప్రశంసచేయబడినది. ఈ గ్రంథము ౩-వ అధ్యాయములుగను, ప్రతిఅధ్యాయము ౨-ఆహ్నికములును, అన్ని అధ్యాయములు ౧౦౦-సూత్రములుగను విభజింపంబడినది. ఈగ్రంథము స్వప్నేశ్వరభాష్యముతో కలకత్తాలో నచ్చుబడినది. ౫ - ౬ అనువాకములు వ్రీహిఅవఘాతములను చెప్పుచున్నవనిన్ని ఆరీతినేచిత్తమునుకూడా శుద్ధిచేయవలెననన్ని చెప్పి

యున్నాము. ఆసంగతియే ఈ గ్రంథముయొక్క ౨౭ సూత్రమందు చెప్పబడుచున్నది "బుద్ధిహేతుప్రవృత్తిరావి శుద్ధేరవఘాతవత." ఇందుకుభాష్యము "భక్తిపరిశుద్ధి పర్యంతం తత్ప్రవృత్తిరావశ్యకీ యథావ్రీహీన వహంతీత్యనేన వ్రీహిఅవఘాతస్య యావద్వైతుష్యమనుష్ఠానం శాస్త్రార్థః తథాదృష్టోపకారకత్వాత్ మనోమాలిన్యనిరాస పర్యంతంజ్ఞానాద్యనుష్ఠానే యతనీయమితి" ఇందువలన ౫-౬ అనువాకములయందు చెప్పబడుచున్న వ్రీహిఅవఘాత పేషణములు దృష్టాంతముగాను ఆప్రకారముగానే మనోమాలిన్యము పోవువరకు 'శ్రవణమనననిధిధ్యాసనాదు' లనుఆచరించవలయుననియు స్పష్టముగ గ్రహించవలయును.

౧౩. కాండానుక్రమణిక అనగఏయేఅనువాకము ఏయేవిషయమై చెప్పుచున్నది వాటికి కాండఋషులుఎవరైనది ఇత్యాదిసంగతులను తెలియచేయునది. ఇది జర్మనుదేశమునందు అచ్చుబడినది. ఈఅనువాకమునకు కర్మరీత్యా "కపాలోపధానము" అనిచెప్పబడుచున్నది జ్ఞానరీత్యా "చితోపధానమని చెప్పవచ్చును.

౧౪. ఈఅనువాకమునకు సంబంధించిన ఇతరశాఖలు, బ్రాహ్మణము, కల్పము.

శాఖలు.

కాఠకసంహిత. ౧. ౭.
మైత్రాయణీసంహిత ౧. ౧.
కపిష్ఠలకఠసంహిత. ౧. ౭.
వాజసనేయసంహిత. ౧. ౧౭-౧౯,

బ్రాహ్మణము,

కాఠకబ్రాహ్మణము, ౩౧, ౬
మైత్రాయణిబ్రాహ్మణము ౪, ౧,
తైత్తిరీయబ్రాహ్మణము ౩, ౨, ౭,
శథపథబ్రాహ్మణము, ౧,౨,౧,౩-౧౩.

కల్పము,

మానవశ్రౌతం ౧, ౨, ౩,
కాటీయశ్రౌతం { ౨,౪,౨౬-౩౯ / ౨,౯,౧౬
ఆపస్తంబశ్రౌతం ౧,౨౩,౧-౬,

## సప్తమోఽనువాకము

సంపూర్ణము.



# ఓమ్

శ్రీపరబ్రహ్మణేనమః.

కృ ష్ణ య జు ర్వే ద

# తైత్తిరీయసంహితా మంత్ర భాగస్య

అ ష్ట మో ౽ ను వా క ః.

కాండఋషి ప్రజాపతిః.

---

## ౧. సం వపామి.

**జ్ఞానార్థము.**

టీ॥ సం = (ఓచిత్తమా నిన్ను) ఏకీభావమగునటుల, వపామి = ఉంచుచున్నాను.

తా ॥ మనుజుడు తనమనస్సునుభగవంతునియందుంచవలయును.

**కర్మార్థము.**

టీ॥ సంవపామి = [ఓపిష్టమా నిన్ను పాత్రయందు] ఉంచుచున్నాను.

వినియోగము ॥ ఈమంత్రము చెప్పి ఆయా దేవతలనుగూర్చి పిష్టమును నిర్దేశించవలయును.

---

వి ॥ "సంవపామి" యను మంత్రమునకు అర్థము విద్యారణ్య భాష్యమందు ప్రత్యేకము వ్రాయబడియుండలేదు. భట్టభాస్కరమందు చెప్పబడినదేమనగ "సం ఇతి ఏకీభావేసహక్షిపామి" అనగ ఏకీభావము చేయవలసినది. "సం" అనేఉపసర్గకు ఏకీభావమని వేదాంగనిరుక్తమందును చెప్పబడినది. "సమిత్యేకీభావం" (నిరుక్తము ౧-౧-౫) 'వపామి' అనెడి పదమువపధాతువువలన నిష్పన్నమయినది. "వపబీజవపనేతంతు వయనేముండనే" (తారానాథవాచస్పతి ౪౭౪౯)

"డ్ వప్, బీజసంతానే" ధాతుపాఠము భూవాదులలో ౧౧౫-ధాతువు ఈమంత్రమునుకూర్చి విద్యారణ్యభాష్యమందు జెప్పినదేమనగ "సంవపామీత్యస్యఆమ్నాతస్య మంత్రస్యశేషం పూరయిత్వావినియోగఃకల్పే దర్శితః అధోత్తరేణ. గార్హపత్యముపవిశ్యవాచంనియమ్యతిరఃపవిత్రంపాత్ర్యాం కృష్ణాజినాత్ పిష్టానిసంవపతి" (పుట ౧౧౭) అనగ ఈయనువాకమందు చెప్పబడిన మంత్రశేషమును పరిపూర్తిజేసి వినియోగమందు చెప్పిబడినది. గార్హపత్యాగ్నికి నుత్తరమందుకూర్చొనివాక్నియమముచేసి పవిత్రపాత్రయందు పిష్టమునుంచవలయును. ఈవినియోగమునకు ఆపస్తంబశ్రౌతసూత్రమందు చెప్పబడినవినియోగమునకుకొంచము భేదము:

౭-వ అనువాకమందు చిత్తదృఢత్వము చెప్పబడినది. ఆచిత్తమిచ్చుట అధ్యాహారము. కర్మయందు చిత్తమునకు లక్షణయాపిష్టము నుంచుచున్నారు. కపాలము పిష్టము పురోడాశమునుగూర్చి శథపథశ్రుతియందు చెప్పబడినదేమనగ “శిరోహ వాఏతద్యజ్ఞస్యయత్పురోడాశః సయాన్యేవేమానిశీర్ణః కపాలాన్యేతాన్యేవాస్యకపాలాని మస్తిష్కఏవపిష్టాని తద్వా ఏతదేకమఙ్గమేకగ్ంసహ కరవావసమానం కరవావేతితస్మాద్వాఏతదుభయగ్ం సహక్రియతే” (౧.౨.౧.౨-౫)

అనగ యజ్ఞముయొక్క శిరస్సు పురోడాశముయొక్క శిరస్సు ఎముకలే కపాలములు, మెదడుపిష్టము ఈరెండును ఒక అంగము ఈరెంటినికలిపినయెడల రెండుయొకటిగా చేయబడుచున్నవి. “మస్తిష్కోవైపురోడాశః” అని ఈబ్రాహ్మణమందు చెప్పబడినది. (3-౨-౮) కపాలము పిష్టము, పురోడాశము చిత్తమునకుగాని బుద్ధికిగాని ఉపలక్షణముగ యజ్ఞకర్మయం దుపయోగింపబడుచున్నది.

ఈమంత్రమందుండు పదములయొక్క అర్థమును ఆలోచించగ తనచిత్తమును ఏకీభావమగునటుల ఉంచుట దేనియందయినది ఆలోచించవలయును. పాత్రయందు అని వినియోగము చెప్పుచున్నది. ఏపాత్రయందయినది ఆలోచించవలయును. “పవిత్రవతిసంవపతి” అని శథపథశ్రుతియందు చెప్పబడినది. (౧-౨-౨-౧) “పవిత్రవతి” అనునది పరబ్రహ్మమునకు ఉపలక్షణము పవిత్రవతి అనగ పవిత్రముకలది, ఈమంత్రముయొక్క బ్రాహ్మణము ఈయర్థమునే బోధించుచున్నది.

“సంవపామీత్యాహ యథాదేవతమేవైనాని సంవపతి” (తై. బ్రా. 3-౨-౮) యథా ఏప్రకారముగా దేవతమేవ భగవంతునే (సంతోషముచేయుచున్నామో) తథా=ఆప్రకారముగానే, ఏనాని=వీటిని, సంవపతి=ఏకీభావమగునటుల చేయుచున్నాను. కావున భగవంతునియందు అని అధ్యాహారము చేయబడినది. మరియు ఈయనువాకముయొక్క ౧౪-వమంత్రము ఈయధ్యాహారపదమునే తెలియచేయుచున్నది. “సంబ్రహ్మణాపృచ్యస్వ” ఈమంత్రమునకు ప్రత్యేకముగ వినియోగములేదు. ఆపస్తంబశ్రౌతమందు చెప్పబడినదేమనగ “ప్రక్షాళితాయాంపాత్ర్యాంనిష్టప్తోపవాతాయాం పవిత్రవత్యాం పిష్టానిసంవపతి దేవస్యత్వేత్యనుద్రుత్యాగ్నయేజుష్టం సంవపామీతి యథాదేవతంతిర్యజుషా తూష్ణీంచతుర్థం”(౧-౨౪-౧)

---

౨. (౧) సం ఆపః అద్భిః అగ్మత సం ఓషధయః రసేన (౨) సం రేవతీః జగతీభిః మధుమతీః మధుమతీభిః సృజ్యధ్వం

| జ్ఞానార్థము. | కర్మార్థము. |
|---|---|
| టీ॥ (౧) ఆపః=ఉదకములు, అద్భిః = ఉదకములతో, సం=ఏకీభావమగు | టీ ॥ ఆపః= [ప్రణీతాపాత్రమందు ఉండే] ఉదకములు, అద్భిః = [మదం |

నటుల, అగ్మత=కలసుకొనుగాక, ఓష ధయః=ఓషధులు, రసేన = ఉదకముతో, (ఏకీభావమాగాక). (౨) రేవతీః =ఉదకములారా (మీరు) జగతీభిః= పశువులతోనున్న, మధుమతీః=ఓఓషధులారా (మీరు) మధుమతీభిః = ఓషధులతోనున్న, సం=ఏకీభావమగునటుల, సృజధ్వం=కలసుకొనండి.

తా ॥ పిండము ఉదకముతోనున్న, ఓషధులతో నున్న పశు సంబంధమైన దానితోనున్న అనగ మాంసముతోనున్న చేయబడుచున్నది.

తీపాత్రమందుండెడు ] ఉదకములతో, సం అగ్మత= కలుసుకొనుగాక, ఓషదయః=(పిష్టరూపమైన)ఓషధులు, రసేన =ఆద్వివిధమైనఉదకములతో (ఏకీభావమగుగాక), రేవతీః = సస్యాభివృద్ధిచేత ధనమునభివృద్ధిజేయునట్టియు, మధుమతీః = మధురములగునట్టియు, జగతీభిః = ( ఓయుదకములారమీరు ) పశ్వాభివృద్ధి హేతువగుటచేతను పశురూపమైన ధనముతోకూడుకొన్నట్టియు, మధుమతీభిః =మాధుర్యముకలిగినట్టియు, సంసృజ్యధ్వం=పిష్టరూపమైన ఓషధులతో కలుసుకొనుడు.

వినయోగము॥ ఈమంత్రము చెప్పిపిష్టమందుప్రణీతోదకము నుంచ వలయును

వివరణము॥ ఈమంత్రము బ్రాహ్మణమనుసరించి రెండుభాగములుగ చేయంబడినది. (౧) ‟సమాపో అద్భిరగ్మతసమోషధయోరసేనేత్యాహ । అపోవాఓషధీర్జిన్వంతి+ఓషధయోపోజిన్వంతి అన్యానా ఏతాసామాన్యాజిన్వంతి । తస్మాదేవమాహ'' (౨) ‟సగ్ంరేవతీర్జగతీభిః మధుమతీర్మధుమతీభిః సృజ్యధ్వమిత్యాహ । ఆపోవై రేవతీః । పశవోజగతీః । ఓషధయోమధుమతీః । అపఓషధీఃపశూన్ । తానేవాస్మా ఏకధాసగ్ంసృజ్య । మధుమతఃకరోతి'' (తై. బ్రా. 3-౨-౮)

ఆపః=నిత్యప్రథమాబహువచనము ‘అపః' అనేశబ్దము ద్వితీయాబహువచనముగను ప్రథమా బహువచనముగను వేదమందు వాడబడుచున్నది. ప్రథమా బహువచనమగునపుడు ఆద్యుదాత్తమగును. ద్వితీయాబహువచనమగునపుడు అంతోదాత్తమగును. ఓషధియను శబ్దము ఓషంధయంతీతి ‟వౌషత్యేనాధయంతీతి వాదోషంధయంతీతి తాసామేషాభవతీతి'' అనినిరుక్తమందు చెప్పబడినది (౯-౨౦) రేవతీయనునది ఇచటప్రథమాబహువచనము రేవత్యః యని లోకమందు వాడబడుచున్నది. రేవతీః యనునది సామాన్యముగ ద్వితీయాబహువచనము.

రేవతీ శబ్దమునుగూర్చి భట్టభాస్కరమందు ధనవత్యః అనిన్ని. విద్యారణ్యభాష్యమునందు ‟రేశబ్దాత్ మతుపః ఉదాత్తత్వంవక్తవ్యం'' అనిన్ని చెప్పంబడినది.

అనగ "రైకలదిరేవతీ" రేవతీ అనగ ఉదకములనిన్ని జగతి అనగ పశువులనిన్ని మధుమతి అనగ ఓషధులనన్ని బ్రాహ్మణమందు చెప్పుటవలన ఈ అర్థము జ్ఞానార్థమందు వ్రాయబడినది.

ఇందుకు వినియోగసూత్రము "స్రువేణప్రణీతాభ్యః ఆదాయవేదేనోపయమ్య సమాపోద్భిరగ్మతేతి పిష్టేష్వానీయ" (ఆపస్తంబశ్రౌత. ౧.౨౪.౫)

## 3. అద్భ్యః పరి ప్రజాతాః స్థ సమ్ అద్భిః పృచాధ్వం

జ్ఞానార్థము.

టీ ॥ అద్భ్యః=ఉదకమువలన, పరిప్రజాతాః=లెస్సగాపుట్టినవారు, స్థ=అవుచున్నారు, అద్భిః=ఉదకములతో, సమ్= ఏకీభావమగునటుల, పృచ్యధ్వం =కలుసుకొనండి.

తా ॥ ఓషధిమొదలగు అచేతనపదార్థములన్నియు ఉదకమువలన పుట్టుచున్నవిగనుక తిరిగిఉదకరూపమగుచున్నవి

కర్మార్థము.

టీ ॥ అద్భ్యః=(పిష్టరూపమైన ఓషధులారా మీరు పూర్వమందు)ఉదకమువలన,పరిప్రజాతాః=లెస్సగపుట్టినవారుగ, స్థ=అవుచున్నారు, అద్భిః=ఉదకములతో, సంపృచ్యధ్వం = కలుసుకొనండి.

వినియోగము ॥ ఈ మంత్రముచెప్పి ఉష్ణోదకమునుంచవలయును.

వి ॥ ఇందుకు బ్రాహ్మణము "అద్భ్యః పరిప్రజాతాస్థ సమద్భిః పృచ్యధ్వమితిపర్యాప్లావయతి యధాసువ్వష్టమిమామనువిసృత్య ఆపఃఓషధర్మహయంతి తాదృగవతత్" (తై. బ్రా. కా-3 ప్ర-౨ అ-౮) అనగ ఏప్రకారము వర్షము భూమియందుపడి సస్యములనువృద్ధిపొందించుచున్నదో ఆప్రకారముగనే ఓషధులనువృద్ధిపొందించుచున్నది. మంత్రపుష్పమందు "యోపాంఆయతనంవేదా" అనుమంత్రమున్ను ఉదకములే సమస్తమయిన వాటికి అధారమయినదని చెప్పుచున్నది.

ఇందుకు వినియోగము "అద్భిః పరిప్రజాతా ఇతితప్తాభిరను పరిప్లావ్య" ఆపస్తంబశ్రౌతమందు (౧౦ - ౨౪ - ౫)

## ౪. జనయత్యై త్వా సం యౌమి.

జ్ఞానార్థము.

టీ ॥ త్వా=(ఓపిండమా) నిన్ను,జనయత్యై=సంతానముకొరకు, సంయౌమి =కలుపుచున్నాను.

కర్మార్థము.

టీ ॥ త్వా= (ఓతడపబడినపిష్టమా) నిన్ను, జనయత్యై [యజమానునికి] శుక్లశోణిత మిశ్రమముచేతను, సంతానోత్పత్తికొరకు, సంయౌమి = ఉదక

తా ॥ ప్రజావృద్ధికొరకు నిన్నుకలుపుచున్నాను.

ములతో చేతివ్రేళ్లమర్దన(చేత) బాగుగ కలుపుచున్నాను.

వినియోగము ॥ ఈమంత్రము చెప్పి పిష్టమును ఉదకములతో బాగుగకలుప వలయును.

వి ॥ ఈ మంత్రమును గూర్చి విద్యారణ్య భాష్యమందు చెప్పినదేమనగ ‹‹హోపరిప్లావితపిష్టత్వాం హస్తాంగులిమర్దనేన సమ్యక్ మిశ్రీకరోతి ఏతస్యయజమానస్య శుక్లశోణితమిశ్రణేన ప్రయోత్పత్తయే సంపద్యతే (పుట ౧౧౫)

ఇందుకు బ్రాహ్మణము ‹‹జనయత్యైత్వా సంయౌమిత్యాహ ప్రజా ఏవ ఏతే నదాధార›› (తై. బ్రా. కాం-3 ప్ర-౨ అ-౮) అనగ దీని చేతను సంతానము ధరించును.

ఇందుకు వినియోగసూత్రము. ‹‹జనయత్యైత్వా సంయౌమీతి సంయుత్య›› (ఆపస్తంబశ్రౌ ౧ - ౨౪ - ౫).

## ౫. అగ్నయేత్వా.

జ్ఞానార్థము.

టీ ॥ త్వా=నిన్ను, అగ్నయే=భగవంతునికొరకు. (సమర్పించుచున్నాను)

తా ॥ నిన్ను భగవంతునికి సమర్పించుచున్నాను.

కర్మార్థము.

టీ ॥ త్వా = [ఓపిష్టమా]నిన్ను, అగ్నయే = అగ్నిదేవతకొరకు [స్పృశించుచున్నాను]

వినియోగము ॥ ఈమంత్రము చెప్పి అగ్నిదేవతకు అనిస్పృశించవలయును.

వి ॥ అగ్నిశబ్దము భగవత్పరము ప్రసిద్ధము. ఈమంత్రమునకున్ను ౬-వ మంత్రమునకున్ను బ్రాహ్మణము ఏకము.

ఇందుకు వినియోగము ‹‹మఖస్యశిరోసియను›› ౭ - మంత్రముయొక్క వినియోగమయినతరువాత ఈమంత్రముయొక్క వినియోగము వ్రాయబడినది. ‹‹యథాభాగంవ్యావర్తేథామితి విభజ్యసమాపిండౌ కృత్వాయథాదేవత మభిమృశతీద మగ్నేరిత్యాగ్నేయం›› (ఆపస్తంబశ్రౌత ౧ - ౨౪ - ౫) అయితే ఈమంత్రముయొక్క వినియోగము విద్యారణ్య భాష్యమందు కొంచముభిన్నముగ చెప్పబడినది. అదియెట్లన్నను ‹‹ సంయుత్యవ్యూహ్యాభి మృశతి అగ్నయేత్వాగ్నీ షోమాభ్యామాముష్మాముష్మా ఇతియథాదేవత›› (పుట ౧౧౫).

## ౬. అగ్నీషోమాభ్యాం

**జ్ఞానార్థము.**

టీ ॥ అగ్నీషోమాభ్యాం = అగ్నిసోముడని పేరుగలిగిన భగవంతునికొరకు (సమర్పించుచున్నాను).

తా ॥ అగ్నిసోముడని పేరుగలిగిన భగవంతునికి సమర్పించు చున్నాను.

**కర్మార్థము.**

టీ ॥ అగ్నీషోమాభ్యాం = అగ్నీషోమదేవతులకొరకు [పిష్టమానిన్ను స్పృశించుచున్నాను].

వినియోగము ॥ ఈమంత్రము చెప్పి అగ్నీషోమదేవతులకు అనిపిష్టమును స్పృశించవలయును.

వి॥ ౪-అనువాకముయొక్క ౧౦-మంత్రము చూడుము. ౫ - ౬ మంత్రముల యొక్క బ్రాహ్మణము అగ్నీషోమాభ్యా మిత్యాహవ్యావృత్త్యై (తై. బ్రా. ౩-౨-౮) ఇందుకు వినియోగసూత్రము ఇదమగ్నీ షోమయోరత్యగ్నీషోమీయం (ఆపస్తంబశ్రౌత, ౧ - ౨౪ - ౫).

## ౭. మఖస్య శిరః అసి.

**జ్ఞానార్థము.**

మఖస్య=యజ్ఞమునకు, శిరః= శిరస్సు, అసి=అగుచున్నాను.

తా ॥ దేవపూజకు నీవు ముఖ్యమయినదానవు.

**కర్మార్థము.**

టీ॥ మఖస్య=[పురోడాశమానీవు] యాగమునకు, శిరః=శిరస్సుగా, అసి= అగుచున్నావు.

వినియోగము ॥ ఈ మంత్రము చెప్పి పిండమును చేయవలయును.

ఇందుకు బ్రాహ్మణము "మఖస్యశిరోఽసీత్యాహ । యజ్ఞోవైమఖః।తస్యైతచ్ఛిరః । యత్పురోడాశః । తస్మాదేవమాహ" (తై-బ్రా- ౩- ౨- ౮) అనగ మఖమే యజ్ఞము ఏదిపురోడాశమో అదియె శిరస్సు.

ఇందుకు వినియోగసూత్రము "మఖస్యశిరోఽసీతి పిండంకృత్వా" ఆపస్తంబ శ్రౌతం (౧ - ౨౪ - ౫).

## ౮. ఘర్మః అసి విశ్వాయుః.

**జ్ఞానార్థము.**

టీ॥ ఘర్మః=(ఓపిండమానీవు) ప్రకాశించుదానవు, అసి=అగుచున్నావు, వి

**కర్మార్థము.**

టీ॥ విశ్వాయుః=సమస్తమైన ఆయస్సునిచ్చేదానవున్ను, ఘర్మః=[ఓపురో

స్తారమయిన ఆయస్సును ఇచ్చుదానవు.

తా ॥ ఓజీవాత్మా నీకు తపస్సు చేతదీప్తిన్ని విస్తారమయిన ఆయుస్సున్ను కలుగును.

డాశమానీవు] తప్తకపాలములోనుండు టచేత ప్రకాశించు దానవు, అసి = అగుచున్నావు.

వినియోగము॥ ఈమంత్రముచెప్పిపురోడాశమును కపాలములయం దుంచవలయును.

వి ॥ ఈమంత్రమునకు విద్యారణ్యభాష్యమందు చెప్పబడినదేమనగ "హే పురోడాశ త్వం తప్తకపాలస్థానేన దీప్తోదేవతా యోగ్యత్వేనకృతాస్యయుర్ప్రద శ్చాసి" (పుట౧౨౦). "బహుర్విహౌవిశ్వంసంజ్ఞాయామితిపూర్వపదాంతోదాత్తత్వమితి" భట్టభాస్కరమందు చెప్పబడినది. ఇందుకు బ్రాహ్మణము "ఘర్మోసివిశ్వాయురిత్యాహ విశ్వమేవాయుర్యజమానేదధాతి" (3-౨-౮)

ఇందుకు వినియోగం "ఘర్మోసివిశ్వాయురి త్యాగ్నేయం పురోడాశమష్టాసు కపాలేష్వధిశ్రయతి ఏవముత్తరముత్తరేషు" (ఆపస్తంబశ్రౌత ౧-౨౪ - ౬ - ౭).

## ౯. ఉరు ప్రథస్వ ఉరు తె యజ్ఞపతిః ప్రథతాం.

జ్ఞానార్థము.

టీ॥ఉరు = (ఓపిండమానీవు)విస్తారముగ, ప్రథస్వ= వృద్ధికమ్ము, తే=నీయొక్క, యజ్ఞపతిః = యజమానుడు, ఉరు = విస్తారముగను, ప్రథతాం = వృద్ధిపొందును గాక.

తా॥ ఓయజమానుడా నీవు వృద్ధిపొందుదువుగాక.

కర్మార్థము.

టీ॥ ఉరు=[ఓపురోడాశమాన్నవు] గొప్పదిగ, ప్రథస్వ=వృద్ధిపొందుము, తే = నీయొక్క, యజ్ఞపతిః = యజమానుడు, ఉరు = గొప్పవాడుగ, ప్రథతాం=వృద్ధినొందుగాక.

వినియోగము ॥ ఈమంత్రముచెప్పి పురోడాశమును సర్వకపాలముల యందునచికూర్మాకారముగ చేయవలయును.

వి॥ఇందుకు బ్రాహ్మణము "ఉరుప్రథస్వోరుతే యజ్ఞపతిః ప్రథతామిత్యాహ యజమానమేవ ప్రజయాపశుభిః ప్రథయతి" (తై-బ్రా-3-౨-౮౫)

ఇందుకు వినియోగము "ఉరుప్రథస్వ ఉరుతేయజ్ఞపతిః ప్రథతామితి పురోడాశంప్రథయన్ సర్వాణికపాలాని అభి ప్రథయతి అతుజ్ఞమన పూపాకృతిం కూర్మస్యేవ ప్రతికృతి మశ్వశఫ మాంత్రంకరోతి" (ఆపస్తంబశ్రౌత. ౧ -౨౫-3-)

## ౧౦. త్వచం గృహ్ణీష్వ.

జ్ఞానార్థము.

టీ ॥ త్వచం = (ఓ పిండమా నీవు) చర్మమును, గృహ్ణీష్వ = గ్రహించుము.

తా ॥ ఓ పిండమా నీకు చుట్టుచర్మము గలుగును గాక.

కర్మార్థము.

టీ ॥ త్వచం = [ఓ పురోడాశమా నీవు] ఉదకముచేత మృదువైన త్వక్కును, గృహ్ణీష్వ = స్వీకరించుము.

వినియోగము ॥ ఈమంత్రము చెప్పి యుదకముచేత పురోడాశమును పెచ్చు తగ్గులేకుండ సవరించవలయును.

వి॥ ఇంతవరకు పిండముయొక్క సంగతి చెప్ప బడినది. పిండముయొక్క చర్మమునుగూర్చి యీమంత్రము చెప్పుచున్నది. మాంసము చర్మముచే కలుగుతుందని బ్రాహ్మణమందు చెప్పుటచేత ఈ అనువాకము మనుష్యునియొక్క పిండము మెదడులను గూర్చి చెప్పుచున్నట్టున్ను కర్మయందుఉపయోగించుపురోడాశము సాదృశ్యమయిన ట్టున్ను ఎంచతగును.

ఇందుకు బ్రాహ్మణము. "త్వచంగృహ్ణీష్వేత్యాహ సర్వమేవైనగ్ం సతనుం కరోతి అథాప ఆనీయ పరిమార్ష్టి మాగ్ంసమేవ తత్త్వచందధాతి తస్మాత్త్వచా మాగ్ంసంఛన్నం." (తై. బ్రా. ౩-౨-౮) ఉదకముతో తడిపి మాంసమును చర్మమునకు కలగచేయుచున్నాడు. అందువల్లచర్మముచేత మాంసము కలుపుచున్నాడు. అనగ దీన్నియంతటనున్ను శరీరముగలదానినిగా చేయుచున్నాడు.

ఇందుకు వినియోగము "త్వచంగృహ్ణీష్వేత్యద్భిఃశ్లక్ష్ణీ కరోతి" (ఆపస్తంబ శ్రౌతం౧-౨౫-౨)

## ౧౧. అంతరితగ్ం రక్షః అన్తరితా అరాతయః

జ్ఞానార్థము.

టీ॥ రక్షః= ప్రతిబంధకము, అంతరితం=దూరమవుగాక, అరాతయః= శత్రువులను విఘ్నములు, అంతరితా = దూరమవుగాక.

తా ॥ మేముచేయబోవు తపస్సునకు ప్రతిబంధకము నశించియవిఘ్నమగు గాక.

కర్మార్థము.

టీ ॥ రక్షః=రాక్షసజాతి, అంతరితం = దూరములోనుండినవారగుగాక, అరాతయః= శత్రువులు, అంతరితా = దూరములోనుండినవారగుదురుగాక.

వినియోగము ॥ ఈ మంత్రముచెప్పి పురోడాశమునకు చుట్టును దర్భను కాల్చిమూడుసార్లు త్రిప్పవలయును.

వి ॥ అంతరితమనగ 'తిరోహిత' మని భట్టభాస్కరమందును "వ్యవహితా" అనివిద్యారణ్యభాష్యమందును. చెప్పబడినది. 'ప్రత్యుష్టగ్ంరక్షః' "అవధూతగ్ంరక్షః" "పరాపూతగ్ంరక్షః" "నిర్దగ్ధగ్ంరక్షః" "అంతరితగ్ంరక్షః" ఈమంత్రములు అన్నియు ఏకార్థమును బోధించును.

ఇందుకు బ్రాహ్మణము "ఘర్మోవాఏషోశాన్తః అర్ధమాసేర్ధమాసె ప్రవృజ్యతే యత్పురోడాశః స ఈశ్వరోయజమానగ్ం శుచాప్రదహః. పర్యగ్నికరోతి పశుమేవైనమకః శాంత్యా అప్రదాహాయత్రిఃపర్యగ్నికరోతి. త్ర్యావృద్ధియజ్ఞః అథో రక్షసామ పహత్యై అంతరితగ్ం రక్షోన్తరితా అరాతయఇత్యాహ రక్షసామంతర్హిత్యై (౩ - ౨ - ౮)

ఇందుకు వినియోగము "అంతరితం రక్షోంతరితా అరాతయ ఇతిసర్వాణి హవీంషిత్రిః పర్యగ్నికృత్వా". (ఆప-శ్రౌ. ౧-౨౫-౮)

## ౧౨. దేవః త్వా సవితా శ్రపయతు వర్షిష్ఠే అధినాకె.

| జ్ఞానార్థము. | కర్మార్థము. |
|---|---|
| టీ ॥ త్వా = (ఓజీవాత్మా) నిన్ను సవితా = ప్రేరకుడైన, దేవః=పరమేశ్వరుడు, వర్షిష్ఠే=గొప్పదైన, నాకె = స్వర్గమందు, అధి=ఉంచి, శ్రపయతు= పవిత్రముచేయుగాక. | టీ॥ త్వా=పురోడాశమానిన్ను, సవితా=ప్రేరకుడైన, దేవః=పరమేశ్వరుడు, వరిష్ఠే=గొప్పదైన, నాకె = నాకమనుపేరుగలఅగ్నియందు, అధి=ఉంచి, శ్రపయతు=పవిత్రముచేయుగాక. |
| తా ॥ తపస్సుచేయు జీవాత్మనుభగనంతుడు స్వర్గమును పొందించును. | వినియోగము ॥ ఈ మంత్రముచెప్పి పురోడాశమును నిప్పు కణికలచేత కాల్చవలయును. |

వి ॥ అధి అనేశబ్దమునుగూర్చి అధీత్యు పరిభావమైశ్వర్యమని నిరుక్తమందు చెప్పబడినది (కలకత్తాకూర్పు వాలమొకటి పుట ౪౧- పఙ్క్తి ౨౧).

ఇందుకు వినియోగము "దేవస్త్వా సవితాశ్రపయత్విత్యుల్ముకైః పరితపతి" ఆపస్తంబశ్రౌత(౨-౨౫-౯.)

## ౧౩. (౧) అగ్నిః తె తనువం మా అతి ధాక్
## (౨) అగ్నే హవ్యం రక్షస్వ

| జ్ఞానార్థము | కర్మార్థము. |
|---|---|
| టీ ॥ తే = నీయొక్క, తనువం = | టీ॥ తే=(ఓపురోడాశమా) నీయొక్క |

శరీరమును, అగ్నిః= భగవంతుడు, అతి =విస్తారముగ, మాధాక్ = దహించక పోవుగాక. (౨) అగ్నే = ఓభగవంతుడా, హవ్యం=హవిస్సును, రక్షస్వ= రక్షించుము.

తా ॥ జీవాత్మను భగవంతుడు విస్తారముగా దహించకరక్షించుగాక.

తనువం=దేహమును, అగ్నిః = అగ్ని, మాతిదాక్=మిక్కిలిదహించకపోవుగాక, అగ్నే=గార్హపత్యాగ్ని (నీవు), హవ్యం=(పురోడాశరూపమైన) హవిస్సును, రక్షస్వ=రక్షించుము.

వినియోగము ॥ ఈమంత్రము చెప్పిపురోడాశములను దర్భలచేత జ్వాలింపజేయవలయును.

వి ॥ బ్రాహ్మణమను సరించి యీమంత్రము రెండుభాగములుగచేయబడినది.

౧. భాగమునకు బ్రాహ్మణము "అగ్నిస్తెతనువం మాతిధాగిత్యాహ అనతిదాహాయ"

౨. భాగమునకుబ్రాహ్మణము "అగ్నేహవ్యగ్ంరక్షస్వేత్యాహ గుప్త్యై" (తై. బ్రా. 3 ౨-౮.)

జీవుడు ఎటువంటివాడైనను పాపుడుగనుక తనకు బాధకలగకుండ చేయవలెనని భగవత్ప్రార్థన.

ఇందుకువినియోగసూత్రము "అగ్నిస్తేతను వంమాతిధాగితి దర్భైరభిజ్వాలయతి జ్వాతైర్వా. (ఆపస్తంభశ్రౌత. ౧-౨౫-౯.).

## ౧౪. సమ్ బ్రహ్మణా పృచ్యస్వ.

జ్ఞానార్థము.

టీ॥ బ్రహ్మణా=(ఓజీవాత్మానీవు) బ్రహ్మతో, సమ్=ఏకీభావమగునటుల, పృచ్యస్వ=కలుసుకొనుము.

తా ॥ ఓజీవాత్మా బ్రహ్మతో కలుసుకొనుము.

కర్మార్థము.

టీ ॥ సంబ్రహ్మణా = (ఓపురోడాశమానీవు) మంత్రముతో, సంపృచ్యస్వ= కలుసుకొనుదానవగుము.

వినియోగము ॥ ఈ మంత్రముచెప్పి పురోడాశములయందు అంగార ములతోకూడినభస్మమునుంచ వలయును.

వి ॥ మంత్రభాగమునకు కర్మార్థమేగాని కర్మకు భావార్థము లేదనెడువారు ఈమంత్రమునకు సంబంధించిన బ్రాహ్మణమున్ను, అందుకు విద్యారణ్యభాష్యమున్ను ముఖ్యముగ చూడవలయును. గ్రంథబాహుళ్యమయినను అత్యావశ్యకముచెదానిన్నిచ్చట వ్రాయుచున్నాడను. "మస్తిష్కోవై పురోడాశః తంయన్నాభివాసయేత్ ఆవిర్మస్తిష్కస్స్యాత్ అభివాసయతి తస్మాద్గుహామస్తిష్కః"(తైబ్రా. 3-౨-౮).

ఇందుకుభాష్యము ‘‘మస్తిష్కః శిరస్యవస్థితో మేధసః స్వాండో గుహాగూఢః ఆచ్ఛాదిత ఇత్యర్థః’’ అనగ మస్తిష్కము శిరస్సుయందు ఉండినట్టిన్ని అతిగూఢమైన గుహ యందు అచ్ఛాదితమైన మెద ఆచ్ఛాదనయోగ్యమయిన ద్రవ్యమనగ భస్మనా అభి వాసయతి. ‘‘తస్మాత్ మాంసేనా స్తిఛన్నం’’ తై (బ్రా. ౩-౨-౮) ఇందుకు భాష్యం ‘‘య స్మాన్మేధస్థానీయః పురోడాశో మాంసస్థానీయేన భస్మనాచ్ఛాదితః తస్మాత్ లోకే అప్య స్తిసంశ్లిష్టం మేదోమాంసేన ఛన్నం భవతి’’ అనగ మెదడుకు బదులుగ భస్మమునుం చబడినది. పురోడాశము మాంసమునకు బదులుగ నుంచబడినది. భస్మము చేత నాచ్ఛాదిత మయినది. ఆ కారణము వలన లోక మందును ఎముకలతో కూడుకొనిన మెదడు మాంసము చేత కప్పబడుచున్నది. పురోడాశమునకు ఉపరిభాగమందు ఉండినభస్మమును తుడిచివేయు పదార్థమును చెప్పుచున్నా డు ‘‘వేదేనాభివాసయతి తస్మాత్ కేశైశ్చిరచ్ఛన్నం’’ (బ్రా. ౩-౨-౮) ఇందుకుభా ష్యము ‘‘దర్భముష్టినిర్మితో వేదీ సమ్మార్జనహేతుర్వేదః అస్తిహిదర్భాణాం కేశైస్సా మ్యం’’ అనగ పిడికటిదర్భతో చేయబడినటువంటిన్ని వేదిని తుడుచుటకు హేతు వైనటువంటిన్ని చీపురకట్టకు వేదమని పేరు దర్భలకు వెంట్రుకలతో సామ్యము చెప్పుట ప్రసిద్ధి. ‘‘లోమానిబర్హిః’’ అని నారాయణోప నిషత్తుయందు స్పష్టముగ నున్నది ‘‘బ్రహ్మపురోడాశసంపర్కేణ ప్రార్థ్యతే’’ అని బ్రాహ్మణముయొక్క భట్టభాస్కరభాష్యమందు చెప్పబడినది. దీనియొక్క ప్రశంసను చెప్పుచున్నాడు. ‘‘అఖలతిభావుకో భవతి యఏవంవేద’’(బ్రా. ౩-౨-౮) ఇందుకుభాష్యము ‘‘కేశరహిత శిరోయుక్తః ఖలతితద్భవనశీలోనభవతి’’ అనగ వెంట్రుకలులేని శిరస్సుకలవాడు భవనశీలుడుకాడు. పైసంగతులవలన కర్మయజ్ఞమందు ఉపయోగింపంబడు పురో డాశము మస్తిష్కమును భస్మముమాంసమునుదర్భ వెంట్రుకలను తెలియచేయుచున్న వి. ఇదియేజ్ఞానయజ్ఞము.

ఇందుకువినియోగము ‘‘సంబ్రహ్మణాపృచ్యస్వేతి వేదేన పురోడాశే సాంగా రంభస్మాద్యూహతి’’ (అపస్తంబశ్రౌ ౧-ప్ర ౨౫-కా ౧౨-సూ)

## ౧౫. ఏకతాయ స్వాహా,

**జ్ఞానార్థము.**

టీ॥ ఏకతాయ = ఏకతకు, స్వాహా = సమర్పించుచున్నాను,

వి॥ ౧౭-వ మంత్రము చూడుము.

**కర్మార్థము.**

టీ॥ ఏకతాయ = [అంగుళిప్రక్షాళనోదకమున్ను పాదప్రక్షాళనోదకమున్ను) ఏకతఅనే పేరుగలదేవతకొరకు, స్వాహా=హోమము చేయబడినదియాగాక.

## ౧౬. ద్వితాయ స్వాహా

**జ్ఞానార్థము.**

టీ ॥ ద్వితాయ = ద్వితకు, స్వాహా = సమర్పించుచున్నాను,

**కర్మార్థము.**

టీ ॥ ద్వితాయ = ద్వితా అనే దేవత కొరకు, స్వాహా = హోమము చేయబడినదియగుగాక.

వి॥ ౧౭-వ మంత్రము చూడుము.

## ౧౭. త్రితాయ స్వాహా.

**జ్ఞానార్థము.**

టీ ॥ త్రితాయ = త్రితకు, స్వాహా = సమర్పించున్నాను,

**కర్మార్థము.**

టీ ॥ త్రితాయ = త్రితా అనే దేవత కొరకు, స్వాహా = హోమము చేయబడినదియగుగాక.

వినియోగము ॥ ఈమంత్రము చెప్పి అంగుళి ప్రక్షాళనోదకమును, పాత్రప్రక్షాళనోదకమున్ను, అంతర్వేదియందు రేఖాత్రియములయందుంచ వలయును.

వి ॥ ఈ (౧౫) (౧౬) (౧౭) మంత్రములకు ఏకబ్రాహ్మణము. "దేవావై హవిర్భృత్వాబ్రువన్ కస్మిన్నిదం ప్రక్ష్యామహా ఇతి. సోఽగ్నిరబ్రవీత్. మయితనూస్సన్నిదధ్వం అహంవస్తంజనయిష్యామి యస్మిన్ ప్రక్ష్యధ్వ ఇతి. తేదేవా అగ్నౌతనూస్సన్న్యదధత తస్మాదాహుః అగ్నిస్సర్వాదేవతా ఇతి సోఽంగారేణాపః అభ్యపాతయత్ తతఏకతోఽజాయత సద్వితీయమభ్యపాతయత్ తతోద్వితోఽజాయత సతృతీయ మభ్యపాతయత్. తతస్త్రితోఽజాయత. యదద్భ్యోజాయంత తదాప్త్యానామాప్త్యత్వం". తై. బ్రా. ౩.౨-౮)

ఇందుకు భట్టభాస్కరభాష్యము. "దేవావాఇత్యాది హవిస్తంభరణానంతరమబ్రువన్ ఇదంహవిస్సంభరణ ప్రభవంహిపాపాదికం కస్మిన్ రక్ష్యామహేశోధయామఇతి. అథతద్భృతవాన్ అగ్నిరబ్రవీత్ దేవాన్ యుష్మాకం తనూర్మయి సంనియచ్ఛధ్వం సహానిక్షి పతతతోఽహంతా దృశంయుష్మాకంజనయిష్యామి యస్మిన్నిదం పాదం మృక్ష్యధ్వమితి తేదేవాఇత్యాదిగతం అథసర్వదేవతాత్మా సోఽగ్నిరంగారేణ అంగారరూపేణ వర్తమానః అపోభి అపోభిలక్ష్య ఆత్మానమపాతయత్. తతఏకతో నామాప్త్యో విశేషోజాయత. సఏకస్మాదభిపాతాత్ జాతః ఏకతః తసలంతాచ్ఛాందసో ఽకారప్రత్యయః ఏతేనద్వితత్రితౌ అప్త్యానామితిఛాన్దసోఽణః ఆత్మ్యానామితి

ఛాందసోయః తదేవాఇత్యాది ఏకతాయస్వాహేత్యాది భిర్మంత్రైః స్థ. ‘‘ఏకతాదయస్సంజ్ఞాశబ్దాః’’ అని సంహితాభాష్యమందు భట్టభాస్కరునిచేత చెప్పబడినది.

మహాభారతము శాంతి పర్వతము (౩౩౮ అధ్యాయము ౬-వ శ్లోకమందు చెప్పబడినది ఏమనగా ‘‘ప్రజాపతిసుతాశ్చాత్ర సదస్యాభవన్ త్రయః ఏకతశ్చద్వితశ్చైవ త్రితశ్చైవమహర్షయః’’

ఏకతాయయనుపదము ఋగ్వేద సామవేదములయందు మృగ్యము.

ద్వితాయ యనగ ‘‘ద్వితపుత్రాయ అగ్ని’’ అని ఋగ్వేద భాష్యమందు చెప్పంబడినది. (౫-౧౮-౨.)

త్రితాయద్వితాయ ‘‘హేఉషాదెవీ’’ అని మరియొక స్థలమందు చెప్పబడినది. (ఋ-౮-౪౭-౧౬) ఈ మూడు మంత్రములు త్రితాయత్వా’’ ‘‘ద్వితాయత్వా’’ ‘‘ఏకతాయత్వా’’ అని శుక్లయజుర్వేదమందు పఠించబడుచున్నది. (౧-౨౬.)

———:(o):———

## ఎనిమిదవ అనువాక సామాన్యవిషయములు.

:○:o:○:

౧. ఈ అనువాకము కర్మరీత్యా పురోడాశశ్రపణమని చెప్పబడుచున్నది. జ్ఞానరీత్యామనోతపమని చెప్పందగును.

౨. ప్రాతిశాఖ్య—ఈ అనువాకములోని యేయేమంత్రములు తైత్తిరీయప్రాతిశాఖ్య సూత్రములయొక్క భాష్యమందుదహరింపబడినవో ఆయా సూత్రములను మంత్రములను వివరించుచున్నాము.

(౧) "రాసఃసప్తేఅగ్నిః నివిదుమేఃడుః పాయుభిర్వేః సుమతిర్మాకిరీయు రాయురాభిస్స ధిర్నకిస్తకారపరోనిత్యం" (౬-అ. ౫-సూ) ఈసూత్రమునుబట్టి (౧౩) మంత్రమందుండిన అగ్నిఃఅనెడి పదమునకు తకారము పరమయినను రాసః అనునదిగాని సప్తః అనునదిగాని పూర్వమందు లేకపోవుటవలన సకారమునకు షకారము సంభవించలేదు. కావున "అగ్నిస్తేతనువం" అని యైనది.

(౨) "దీర్ఘగ్ంసమానాక్షరే సవర్ణేపరే" (౧౦-అ.౨-సూ) ఈసూత్రమును బట్టి (౧౦) మంత్రమందు అంత్యాకారమునకును (౧౧) మంత్రమందు ఆద్యకారమునకును దీర్ఘముకలిగి "గృహ్ణీష్వ+అంతరితం"="గృహ్ణీష్వాంతరితం."అయినది.

(౩) "ఏకారైకారపరఏకారం" (౧౦-అ ౬-సూ) ఈసూత్రమునుబట్టి (౧౪) మంత్రమందుండు అంత్యాకారమునకు (౧౫) మంత్రమందుండు ఏకారము పరమగుటవలన ఐకారము సంభవించుచున్నది. కావున "పృచ్యస్వ+ఏకతాయ" ="పృచ్యస్వైకతాయ" అయినది.

(౪) "ఆపఃపూర్వో ద్భిరపాన్నపాదస్మాత్" (౧౧-అ ౮-సూ) ఈసూత్రమునుబట్టి (౨) మంత్రమందుండు అద్భిఃఅనె శబ్దమునకు పూర్వమందు ఆపః ఉండుటవలన అకారములోపించలేదు. కావున "ఆపః+అద్భిః"="ఆపోఅద్భిః"అని అయినది.

(౫) "ధీరాసోదధ్యా సఏకాదశాస ఋషీణాంపుత్రః శార్యాతేషాఢఃపితారః పృథివీయజ్ఞ ఆసతేయేగృహ్ణామ్యగ్రేవాగ్ం ఏషజజ్ఞేసగ్ం స్యానోయువయోర్యః పృష్ఠేపతిర్యో గోశుష్మః పువః సమిద్ధఋషభః పాథోవచోవర్షిష్ఠే జుషాణోయోరుద్రోవృష్ణఃపూర్వః" (౧౧-అ ౧౬-సూ) ఈసూత్రమునుబట్టి ౧౨-మంత్రమునందు వరిషిష్టే అనుపదముపూర్వమందుండుటవలన 'అధినాకే'అనుపదమందుండు.అకారములోపించలేదు. కావున "వర్షిష్ఠే అధినాకే"="వర్షిష్ఠేఅధినాకే" అయినది.

(౬) "స్వరపూర్వంవ్యంజనం ద్వివర్ణంవ్యంజనపరం" (౧౪-అ ౧-సూ) ఈసూత్రమునుబట్టి అచ్చుకుపరమందును హల్లుకు పూర్వమందును ఉండెడి హ

ల్లుద్విత్వమవును(౯)మంత్రమందు ‘‘ప్ర’’ యందుంషువర్ణమునకును ‘‘స్వా’’యందుం డుసవర్ణమునకును ద్విత్వముసంభవించుచున్నది కావున ‘‘ఉరు+ప్రథస్వ’’=‘‘ఉరుష్ప్రథస్స్వ’’ ఈసూత్రము వేదము క్రమముగ నుచ్చరించుటకావశ్యకము రవిసర్జనీయ, జిహ్వామూలీయ, ఉపధ్మానీయ అక్షరములకుతప్ప సాధారణముగ రెండుహల్లులుకలసినపుడు మొదటిహల్లు ద్విత్వముగ నుచ్చరించవలయును. విశేషసూత్రములచటనచట నుదహరింపంబడును ‘‘ఇషేత్వా’’అనుప్రథమ మంత్రమునందు‘‘త్వా’’ అనునది ‘‘త్త్వా’’ అని ద్విత్వముగనుచ్చరించవలయును. ఈప్రకారముగనే శేషము గ్రహించవలయును.

౩. ఛన్దస్సు ‘‘బృహతీజాగతః త్రయశ్చగాయత్రాః’’ అనిబృహతీఛన్దస్సుకు లక్షణము. (పింగళఛన్ద ౩-అ, ౨౬-సూ)అనగ నొకపాదము జగతి మూడుపాదములు గాయత్రిగలది బృహతీఛన్దస్సు అనబడును.

‘‘సమాపోద్భిః అను రెండవమంత్రము ‘‘ఉపరిష్టాత్ బృహతీ’’ ‘‘ఉపరిష్టాత్ బృహత్యంతే’’ అని ఈఛన్దస్సుకు లక్షణము (పింగళఛన్ద - ౩ అ - ౩౧ - సూ) ఇందుకు భాష్యము యథాజాగతః పాదో న్త్యభవతి శేషాశ్చగాయత్రాఃతథా ఉపరిష్టాత్ బృహతీనామభవతి’ అనగ ప్రథమ ద్వితీయ తృతీయపాదములుగాయత్రీ ౮-అక్షరములుగలది చతుర్థ పాదము జగతీ. అనగ పండ్రెండు అక్షరములు గలది. ఈమంత్రమును పాదములుగ విభజించి వ్రాయుచున్నారము.

౧. సమాపో అద్భిరగ్మత.

౨. సమోషధయోరసేన.

౩. సగ్ంరేవతీర్జగతీభిః.

౪. మధుమతీర్మధుమతీభిస్సృజ్యధ్వాం.

అద్భ్యః పరిప్రజా తాస్థ అనే మూడవ మంత్రము ఏక పదాగాయత్రీ.

గాయత్రీఛన్దస్సు ‘‘ఆర్షీ - దైవీ - ఆసురీ - ప్రాజాపత్యా - యాజుషీ - సామ్నీ - ఆర్చీ - బ్రాహ్మీ అని ౮-విధములు. ప్రాజాపత్యాష్టౌ (౨-అ, ౫-సూ), యజుషాంషట్ (౨-అ, ౬-సూ)అను లక్షణమునుబట్టి (౮) అక్షరములుగల గాయత్రీప్రాజాపత్య మనిన్ని(౬) అక్షరములుగల గాయత్రీయాజుషీ అనిన్ని చెప్పబడుచున్నది.

౧. అద్భ్యః పరిప్రజాతాస్థ.

౨. సమద్భిః పృచ్యధ్వాం.

ఈ రెండు భాగములలోను మొదటిద్ది ‘‘ ఏకపదాప్రాజాపత్యాగాయత్రీ’’ రెండవది ‘‘ఏకపదాయాజుషీగాయత్రీ’’

అంతరితగ్ంరక్షః అను (౧౧)వ- మంత్రము ఏకపదాగాయత్రీ.

౧. అంతరితగ్ంరక్షః.

౨. అంతరితా అరాతయః.

ఈ రెండు భాగములలో మొదటిది ౬- అక్షరములు గలిగియుండుట వలన యాజుషీగాయత్రీయనియు, రెండవది (౮) అక్షరములు కలిగియుండుటవలన ప్రా

జాపత్యాగాయత్రీ యనియు చెప్పంబడును కావుననే అంతరితమితి "యజూరాదికైక పదయా గాయత్రీ" అని భట్టభాస్కరమందు చెప్పంబడినది. (౧-౧-౮)

౪. పతంజలయోగము. ఈఅనువాకమునందు (౧) "సంవపామి" అను మంత్రమునుబట్టియు(౧౪) "సం బ్రహ్మణా పృచ్యస్వ" అను మంత్రమునుబట్టియు సర్వము భగవంతునికి సమర్పించి మనచిత్తమును ఈశ్వరునియందు ఏకీభావము చేయవలెనని చెప్పుచున్నది. ఈఅర్థమునే "ఈశ్వరప్రణిధానాద్వా" అని. పాతంజల యోగమందుచెప్పబడినది.(౧-అ-౧-పాద ౨౩-సూ)ఇందుకుభాష్యం"ఈశ్వరస్యప్రణీధానాత్ సమాధిలాభఇత్యుక్తం అనగ భగవంతునికి ప్రణీధానము వలన సమాధి ప్రాప్తమవును. ప్రణిధానమనగ విశిష్టముపాసనం సర్వక్రియాణామపి తత్రార్పణం విషయసుఖాది కఫలమిచ్ఛన్ సర్వాః క్రియాః తస్మిన్ పరమగురావర్పయతి తత్ ప్రణిధానం" అని రాజమార్తాండాఖ్య వృత్తియందు చెప్పబడినది. అనగ భగవంతునియందు భక్తియుంచుటవలన ఏకీభావమవునని తాత్పర్యము. సంపూర్ణఉపాసనయున్ను సమస్త కార్యములయొక్క అర్పణయున్ను విషయ ఫలములను ఇచ్ఛయించక సమస్తమున్ను పరమగురువైన భగవంతునియందు సమర్పించుట ప్రణిధానమని చెప్పబడును. ఈఅర్థమునే పురాణమందును చెప్పుచున్నది. "యత్కరోషియదశ్నాసి యజ్జుహోషి దధాసియత్ యత్తపస్యసికౌంతేయతత్కురుష్వమదర్పణం" (భగవద్గీత ౯ అధ్యా ౨౭ శ్లో) ఏమిచేసినను తత్సర్వం భగవదర్పణము చేయవలసినదని తాత్పర్యము.

౫. శాణ్డిల్యం భక్తిఅనగ "సాపరానురక్తిరీశ్వరే" (౧ - అ. ౨ - సూ) అని శాణ్డిల్యసూత్రమందు చెప్పంబడినది. అనగభగవంతునియందు అత్యంతకోరికయే భక్తియనబడును. గనుకనే మనయొక్కయావత్తుబుద్ధి మనస్సుచిత్తముకోరికలు సర్వము పరబ్రహ్మయందే యుంచవలయునని ఈ అనువాకము తెలియచేయుచున్నది.

౬. ఈఅనువాకముతో సంబంధించినయితరశాఖలు, బ్రాహ్మణము, కల్పము.

శాఖలు.

| | |
|---|---|
| కాఠకసంహిత. | ౧. ౮. |
| కపిష్ఠలకఠసంహిత. | ౧. ౮. |
| మైత్రాయణీసంహిత. | ౧. ౧. ౯. |
| వాజసనేయసంహిత. | ౧. ౨౧.౨౩. |

బ్రాహ్మణము.

| | |
|---|---|
| కాఠకబ్రాహ్మణము. | ౩౧. ౭. |
| మైత్రాయణీబ్రాహ్మణము. | ౪. ౧. ౯. |
| శతపథబ్రాహ్మణము. | ౧. ౨. ౨. ౧- ౫. |
| తైత్తిరీయబ్రాహ్మణము. | ౩. ౨. ౮. ౧- ౮. |

కల్పము.

| | |
|---|---|
| మానవశ్రౌతం. | ౧. ౨. ౩. |
| కాటీయశ్రౌతం. | ౨. ౫. ౧౦- ౨౬. |
| ఆపస్తంబశ్రౌతం | ౧. ౨౪. ౧- ౮.<br>౧. ౨౫. ౧- ౧౬. |

అష్టమోఽనువాకము

సంపూర్ణము.



ఓమ్

శ్రీపరబ్రహ్మణేనమః.

కృష్ణయజుర్వేద

# తైత్తిరీయసంహితా మంత్రభాగస్య

## నవమోఽనువాకః.

కాండఋషి ప్రజాపతిః.



### ౧. ఆదదే.

జ్ఞానార్థము.

టీ॥ ఆ+దదే=(ఓ వజ్రాయుధమా నిన్ను) గ్రహించుచున్నాను.

తా॥ అజ్ఞానమును భేదించెడియాయుధమును గ్రహించుచున్నాను.

కర్మార్థము.

టీ॥ ఆదదే = [ఓస్ఫ్యమా అనగా కత్తివలెనుండుఓకొయ్యపని ముట్టా నిన్ను] గ్రహించుచున్నాను.

వినియోగము॥ ఈమంత్రము మరికొంత మంత్రమునచెప్పి కత్తినెత్తవలయును.

వి॥ ఈ అనువాకముయొక్క భావార్థమును గ్రహించుట కఠినము. ఛాన్దోగ్యోపనిషత్తుయందును,బృహదారణ్యకమునందును,ఇతరశ్రుతులయందును దేవాసురులకనగ సద్వృత్తులకునుదుర్వృత్తులకునునుండెడి కలహవివరణచూచినయడల నీయనువాకార్థము దెలుసుకొనవచ్చును. హిందూసిద్ధాంతము జ్ఞానమును సంపాదించి యాజ్ఞానసహాయమువలన తనకు విధియైనధర్మము చేయవలయునని బోధించుచున్నది. ఎనిమిదవ యనువాకమునందు బ్రహ్మజ్ఞానమును సంపాదించుటనుగూర్చి చెప్పంబడినది. ఈ అనువాకమునందు మనుజుడు చేయు ధర్మములు కొంతవరకు చెప్పంబడుచున్నవి. ఆప్రకారము చేయుటకు జ్ఞానమునుగ్రహించి యాజ్ఞానముచే దుర్వృత్తులనెడి అసురులను భేదించవలయును. అజ్ఞానమే వజ్రాయుధము. ఆవజ్రాయుధముచేత వృత్రాసురుడను అంధకారమును ఇంద్రుడు భేదించెను. దానికుపలక్షణ యాస్ఫ్య అను ఖడ్గమును కర్మయందుపయోగించుచున్నారు. కావుననే ఈమంత్రముయొక్క బ్రాహ్మణమునందు "వజ్రోవైస్ఫ్యః" అని చెప్పబడినది. (౩-కాం, ౨-ప్ర, ౧౦-అ, ౧-ప) దీనింగూర్చి శతపథశ్రుతియందు చెప్పబడినదేమనగ "ఇం

ద్రోహాయత్రవృత్రాయ వజ్రంప్రజహారసప్రహృత శ్చతుర్ధాభవత్తస్య స్ఫ్యస్తృతీయం వాయూపద్వాయూపస్తృతీయం వాయాపద్వారథస్తృతియంవా యూపద్వాథయత్ర ప్రాహరత్ తచ్ఛకలోసీర్యతసపతిత్వా శరోభవత్ తస్మాచ్ఛరోనామయ దశీర్య తౌవము సచతుర్థావజ్ఞోభవత్'' (౧-కా,౨-అ, ౪-బ్రా,౪-ఖం) అనగనింద్రుడువృత్రునిమీద వజ్రాయుధమునువేసినపుడదినాలుగుభాగములాయెను.ఒకభాగముస్ఫ్య, రెండవభాగము యూపం,మూడవభాగము రథము,నాలుగవభాగము శరమాయెను. అందువలనస్ఫ్యమును గ్రహించియింద్రుడువృత్రాసురునిజయించినరీతిగమనముజయించవలయును. ఈమంత్రమునుగూర్చి విద్యారణ్యభాష్యమందు చెప్పబడినదేమనగ ,,ఆదదఇత్యామ్నాతస్య మంత్రస్యశేషం పూరయిత్వా వినియోగః కల్పేదర్శితః'' చెన్నపట్టణంకూర్పుపుట (౧౨౭) ఈమంత్రమునకు ప్రత్యేకము అర్థము వ్రాయబడియుండలేదు. దదె అనునది దాదానే అను ధాతువవలన నిష్పన్నమైనది. అనగ గృహ్ణామి అని శుక్లయజుర్వేదమందు చెప్పబడినది. (కలకత్తాకూర్పు ౧౬)

ఈమంత్రము ౨-వమంత్రముతోగలసి బ్రాహ్మణమందు వ్యాఖ్యానము చేయబడినది. ,, ఆదదఇంద్రస్య బాహురసి దక్షిణఇత్యాహ ఇంద్రియమేవ యజమానే దధాతి (తై. బ్రా. ౩-కాం, ౨-ప్ర, ౧౦-అ, ౧-ప) ఈమంత్రమునకు ప్రత్యేకము వినయోగము చెప్పియుండలేదుగాని యితరమంత్రముతోగూర్చివినియోగము చెప్పంబడినది. ,, దేవస్యత్వాసవితుః ప్రసవఇతిస్ఫ్యమదాయ'' (ఆపస్తంబశ్రౌత ౨-ప్ర, ౧-కం, ౧-సూ) ఈమంత్రము పూర్తిగ మైత్రాయణీసంహితయందు పఠించబడుచున్నది. '' దేవస్యత్వాసవితుఃప్రసవేఅశ్వినోర్బాహుభ్యాంపూష్ణో హస్తాభ్యామాదదే'' (౧-ప్ర, ౧-కం, ౩-అ) ఆపస్తంబమందు చెప్పినవినియోగమునకును, విద్యారణ్యమందు చెప్పినదానికింకొంచెముభేదముగలదు. ,, అథజఘనేనవేద్యా స్తిష్ఠన్ స్ఫ్యమాథత్తే దేవస్యత్వాసవితుఃప్రసవే అశ్వినోర్బాహుభ్యాం పూష్ణో హస్తాభ్యామాదదే'' (చెన్నపట్టణంకూర్పు ౧౨౭) ''స్ఫ్య'' అనగ బదరికాష్ఠనిర్మిత అరత్నిపరిమితోదీర్ఘశ్చతురంగులపరిమిత విస్తారఆకారేణ ఖడ్గసదృశః స్ఫ్య ఇత్యుచ్యతే'' (శ్రౌతపదార్థనిర్వచనం ౭పుట)

---

౨. (౧) ఇంద్రస్య బాహుః అసి దక్షిణః

(౨) సహస్రభృష్టిః శతతేజాః

(౩) వాయుః అసి తిగ్మతేజాః

| జ్ఞానార్థము. | కర్మార్థము. |
|---|---|
| టీ ॥ (౧) ఇంద్రస్య= ఇంద్రునియొ | టీ ॥ ఇందస్య = [ఓస్ఫ్యమానీవు] |

క్క, దక్షిణః=కుడిదైన, బాహుః=భుజము, అసి=అగుచున్నావు. (౨). సహస్రభృష్టిః = వేలకొలది శత్రువులనుజంపునట్టియు, శతతేజాః=వందలకొలదితేజస్సులుగలిగినట్టియు, (బాహువువంటిదానవు) (3) తిగ్మతేజాః= తీక్ష్ణమైన జ్వాలలుగలుగజేసెడి, వాయుః = వాయువువంటిదానవును, అసి = అగుచున్నావు.

తా ॥ ఓ వజ్రాయుధమా నీవు అనేక పాపులను హింసించెడి యింద్రునియొక్క బాహువువంటిదానవు. వాయువువలె జ్వాలలను ప్రకాశింపచేయుదానవు.

ఇంద్రునియొక్క, దక్షిణః=కుడిదైనట్టియు, సహస్రభృష్టిః=వేలకొలది[శత్రువులను]జంపునట్టియు, శతతేజాః=వందలకొలదితేజోయుక్తమైనవాడిగల, [ఆయుధములు] కలిగినట్టియు, బాహుః= భుజమువలె సమర్థమైనదానవు, అసి= అగుచున్నావు, తిగ్మతేజాః= తీక్ష్ణమైన అగ్నిజ్వాలలుకలుగజేసెడి, వాయుః = వాయువంటి దానవును, అసి = అగుచున్నావు.

వినియోగము ॥ ఈమంత్రముచెప్పి స్ఫ్యమును అభిమంత్రించవలయును.

వి॥ ఈమంత్రము బ్రాహ్మణము ననుసరించి మూడుభాగములుగచేయబడినది. (౧) "ఆదద ఇంద్రస్య బాహురసి దక్షిణ ఇత్యాహ ఇంద్రియమేవ యజమానేద ధాతి" (౨)"సహస్రభృష్టిః శతతేజా ఇత్యాహ । రూపమేవ అస్యైతన్మహిమానః వ్యాచష్టే. (3) వాయురసితిగ్మతేజాః ఇత్యాహ తేజోవై వాయుః తేజఏవఅస్మిన్ దధాతి" (తై-బ్రా. 3కాం, ౨ప్ర, ౯అను) అనగ యజమానునికి వీర్యమును, కాంతినిని, భగవంతుడు గలుగుజేయుచున్నాడు. ఈ మంత్రమునకు విద్యారణ్యభాష్యము "హేస్ఫ్యత్వం ఇంద్రస్యదక్షిణతో బాహురివసమర్థోసికీదృశో బాహుః సహస్రసంఖ్యానాంశత్రూణాం భృష్టిః పునః కీదృశః శతసంఖ్యాకాన్యాయుధాని తేజోయుక్తానియస్యాసౌశతతేజాః నకేవలం ఇంద్రస్యబాహుసదృశః కింతువాయుసదృశోప్యసియథా వాయుస్తీక్ష్ణామగ్నిజ్వాలాముత్పాదయం_స్తిగ్మతేజాః తథాస్ఫ్యోపి వక్ష్యమాణ స్తమ్బచ్ఛేద.రూపంతీవ్రం కర్మకుర్వం_స్తిగ్మతేజాః ఇత్యుచ్యతే" ౧౨౭- ఇందుకువినియోగము "ఇంద్రస్య బాహురసిదక్షిణ ఇత్యభిమంత్ర్య" (ఆప.శ్రౌ.౨ ప్ర, ౧౪, ౧సూ)

## 3. (౧) పృథివి దేవయజని, (౨) ఓషధ్యాః తే మూలం మా హింగ్ంసిషం.

జ్ఞానార్థము.

టీ ॥ దేవయజని=దేవయాగమునకు

కర్మార్థము.

టీ ॥ దేవయజని= దేవయాగాశ్రయ

ఆశ్రయమైన, పృథివి = ఓశరీరమా, ఓషధ్యాః=ఓషధిరూపమైన, తే= నీయొక్క, మూలం = వృద్ధిహేతువైనదానిని, మా+హిగ్ంసిషం=హింసించను.

తా ॥ భగవదర్చనకు అరహమైనట్టియు ఓషధసంబంధమైన యీశరీరమందుండు దుర్వృత్తులనుపోగొట్టి శుద్ధసత్వమైనమూలమును వృద్ధిచేసెదను.

మైన, పృథివి=ఓభూమి, తే నీసంబంధమైన ఓషధ్యాః = ఓషధియొక్క, మూలం=వేరును, మా+హిగంసిషం= హింసించను.

వినియోగము ॥ ఈ మంత్రముచెప్పి స్ఫ్యముచేత కోయవలయును.

వి ॥ మనశరీరమందు సద్వృత్తులు, దుర్వృత్తులు రెండును కలవు- ఇందునుగూర్చి ౧౯,౧౦పుటలుచూడుము. శరీరమును వృక్షముతోపోల్చుటనుగూర్చి ౧౪-వ పుటచూడుము. వృక్షమను శరీరముయొక్క దుర్గుణములను కొట్టివేయవలయునుగాని మూలచ్ఛేదము చేయకూడదని మంత్రము తెలియజేయుచున్నది- పృథివి శరీరమని ‘‘పార్థివంగుణాంతరోపలబ్ధేః’’ అని గౌతమన్యాయసూత్రము (3అ,౧ఆ, ౨౭ సూ) లోచెప్పబడియున్నది. ఇందుకు బ్రాహ్మణము ‘‘పృథివీదేవ యజన్యౌత్యాహ మేధ్యామేవైనాం దేవయజనీంకరోతి’’ అనగ మేధయైనదానిని దేవపూజకు అర్హమైనదిగచేయవలయును. ‘‘ఓషధ్యాస్తేమూలంమాహిగ్ంసిషమిత్యాహ ఓషధీనామాహిగ్ంసాయై’’ (తై.బ్రా-3-కా, ౨-ప్ర, 3-అ) ఇందుకు వినియోగము ‘‘పృథివిదేవయజనీతి తస్మిన్స్ఫ్యేన ప్రహృత్య’’ ఆపస్త-శ్రౌ-౨-ప్ర, ౧-అ, ౫-సూ.)

## ౪. అప హతః అరరుః పృథివ్యై.

జ్ఞానార్థము.

టీ ॥ పృథివ్యై=శరీరమునుంచి, అరరుః=అంతఃశత్రువు, అప+హతః=కొట్టబడినవాడౌగాక.

తా ॥ శరీరమందుండు కామక్రోధలోభ మోహ మదమాత్సర్యములనెడి శత్రువులు నశించుదురుగాక.

కర్మార్థము.

టీ॥ అరరుః=అరరుడనురాక్షసుడు, పృథివ్యై=పృథివిలోనుంచి ధూళిపోగొట్టడముచేత,అపహతః=కొట్టబడినవాడౌగాక.

వినియోగము॥ ఈమంత్రముచెప్పిస్ఫ్యనతోకోసిన తృణములతోకూడినధూళిని యెత్తవలయును.

వి॥ ఈమంత్రమునకు ఎనిమిదవమంత్రమునకు బ్రాహ్మణముకలిపి చెప్పంబడినది. అరరుః అనెడిది ఋగతౌ అనుధాతువునకు ‘‘ అరరున్’’ ప్రత్యయమువలన నిష్పన్నమైనది. ఇందుకు సూత్రము ‘‘ అర్తైఅరరుః’’ ‘‘ ఉపద్రవకర్తృమాగతేశ

త్రా'' (తారానాథవాచస్పతి ౩౫౭-పుట) ఇందుకు వినియోగము "అపహతోర రక్షః పృధివ్యాఇతి స్ఫ్యేనసత్రుణాణ్ పాంసూణ్ అపాదాయ'' (ఆపస్తంబశ్రౌత ౨-ప్ర, ౧-అ, ౫-సూ)

## ౫. వ్రజం గచ్ఛ గోస్థానం.

**జ్ఞానార్థము.**

టీ॥ గోస్థానం=మంత్రములచేత పొందించబడు స్థానమైన, వ్రజం=మేఘమును, గచ్ఛ=(అజ్ఞానమానీవు) పొందుము.

తా॥ అజ్ఞానమానీవు మంత్రోచ్చారణ సామర్థ్యముచే నంధకార స్వరూపమైన మేఘముతోగలసుకొమ్ముఅనగనశించుము.

**కర్మార్థము.**

టీ ॥ గోస్థానం=[ఓతృణసహితమైన ధూళీనీవు] అస్మ్రైతౌషడిత్యేవాక్యాకు స్థానమైన, వ్రజం=ఉత్కరప్రదేశమును అనగా ఆహవనాగ్ని కుత్తరభాగమును, గచ్ఛ=పొందుము.

వినియోగము॥ దర్భతృణములతోకూడయెత్తిన ధూళిని ఈమంత్రము చెప్పి(ఉత్కర ప్రదేశమునకు) తినుకొని పోవలయును.

వి॥ వ్రజం అనగ మేఘమని వేదనిఘంటువునందు చెప్పంబడినది. (౧-అ,౧౦-క)

గోస్థానం ఈశబ్దమునుగూర్చి విద్యారణ్యభాష్యమందు చెప్పబడినదేమనగ. "గాయత్ర్యాదీనిఛన్దాం స్యేవగోశబ్దాభిధేయానాం వాచామవస్థానయోగ్యో వ్రజశబ్దాభిధేయో దేశవిశేషః'' (పుట ౧౩౦) అనగ గాయత్ర్యాదిమంత్రములచేతనుపొందుటకు యోగ్యముగచేయబడిన స్థానవిశేషము. ఇందుకు కర్మయందు ఉత్కరదేశము ఉపమానముగ నుపయోగింపబడుచున్నది. ఉత్కరదేశమనగ యజ్ఞమందు ధూళిమొదలగునవి యుంచుస్థానము. ఉత్కీర్యమాణోధూళ్యాదౌ అని ఉత్కరశబ్దమునకు తారానాథవాచస్పత్యమందు ౧౦౭౬ పుటలో నర్థము వ్రాయబడినది.

ఇందుకుబ్రాహ్మణము "వ్రజంగచ్ఛగోస్థానమిత్యాహ ఛన్దాగ్ంసివైవ్రజోగోస్థానః । ఛన్దాగ్ంస్యేవ అస్మైవ్రజంగోస్థానంకరోతి'' (తై-బ్రా. ౩-కా, ౨-ప్ర, ౯-అ, ౩-ప) అనగ మంత్రములే యీస్థానమును చేయుచున్నవి.

ఇందుకు వినియోగము "వ్రజంగచ్ఛగోస్థానమితిహరతి'' (ఆపస్తంబశ్రౌత ౨-ప, ౧-అ, ౫-సూ)

## ౬. వర్షతు తే ద్యౌః.

**జ్ఞానార్థము.**

తే = నీసంబంధమైన అనగ నీవు పొందిన, ద్యౌః = మేఘము, వర్షతు= వర్షించుగాక.

తా ॥ అజ్ఞానమగుఅరరుడు మేఘము ను పొందుటచే వర్షమునకు ప్రతిబంధక ము లేకపోవుగాక,

**కర్మార్థము.**

టీ ॥ తే = [యాగవేది] నీయొక్క-యాహ్వానముకొరకు, ద్యౌః = ద్యులోకసంబంధమైన మేఘుడు, వర్షతు= వర్షించుగాక.

వినియోగము ॥ ఈమంత్రము చెప్పి యాగవేదికన జూడవలయును.

---

వి॥ ద్యౌః అనగనిచ్చట వృష్టి యని బ్రాహ్మణమునందు వృష్టిర్వైద్యౌః అని చెప్పబడినది. ఈపదమును గూర్చి విద్యారణ్యులవారు వ్రాసినదేమనగ ‹‹ వర్షతీతి వృష్టిః పర్జన్యః'' (౧౩౧ పుట)ఇచ్చట‹‹ తె'' అనుపదము అనుదాత్తమగుటచే ష ష్ఠ్యర్థము చెప్పబడినది. ఉదాత్తమైనయడల నుదాత్తమవును. ఈమంత్రము ‹‹వర్షతు తే పర్జన్యః'' అనిమైత్రాయణులు పఠించుచున్నారు. ఇందుకు బ్రాహ్మణము ‹‹వర్షతుతేద్యౌరిత్యాహ వృష్టిర్వైద్యౌః వృష్టిమేవావరుంధే'' (తై. బ్రా· ౩-కా, ౨-ప్ర, ౯-అ, ౩-ప)అవరుంథె అనగనడ్డపరచుట.

---

## ౭. (౧) బధాన దేవ సవితః పరమస్యాం పరావతి శతేన పాశైః (౨) యః అస్మాన్ ద్వేష్టి యం చ వయం ద్విష్మః తం అతః మా మౌక్.

**జ్ఞానార్థము.**

టీ॥ (౧) సవితః=ప్రేరకుడైన, దేవ=ఓపరమేశ్వరుడా, (ఆరాతుసుని)పరమస్యాం=అత్యంతమైన, పరావతి= దూరదేశమునందు. శతేన=వేలకొలది, పాశైః=పాశములచేత, బధాన=కట్టుము. (౨) యః=ఏవడు, అస్మాన్=మమ్ములను, ద్వేష్టి=ద్వేషించుచున్నాడో చ=మరియు, యం=ఎవనిని, వయం= మేము, ద్విష్మ= ద్వేషించుచున్నామో, తం=వానిని, అతః = ఈబంధనవలన, మా+మౌక్=విడువకుము.

**కర్మార్థము.**

టీ॥ సవితః=ప్రేరకుడైన, దేవ=ఓపరమేశ్వరుడా, యః=ఎవడు, అస్మాన్ =మమ్ములను, ద్వేష్టి=ద్వేషించుచున్నాడో, వయం=మేము, యంచ=ఎవరిని, ద్విష్మః=ద్వేషించుచున్నామో, తం= వారిద్దరిని, పరమస్యాం=అత్యంతమైన, పరావతి = దూరదేశమందు, శతేన= నూరులకొలది, పాశైః=పాశములచేతను, బధాన=కట్టుము, అతః=(ఆకట్టబడినవారిని,)-ఈకట్టువలనుంచి, మామౌక్ =విడవకుము.

తా॥ ఏదుర్మార్గ గుణములు మమ్ము బాధించుచున్నవో యట్టివానిని పాశములచే గట్టి మాయొద్దకు రాకుండ చేయవలయు ననిభగవత్ప్రార్థన.

వినియోగము ॥ ఈమంత్రము చెప్పి ఉత్కరములో దర్భసహిత దుమ్మునువే యవలయును.

వి ॥ ఈమంత్రము బ్రాహ్మణమనుసరించి రెండుభాగములుగ చేయబడినది. మొదటి భాగమునకు బ్రాహ్మణము "బధానదేవసవితః పరమస్యాం పరావతీత్యాహ । ద్వౌవావపురుషౌ, యంచైవద్వేష్టి, యశ్చైనంద్వేష్టిః, తావుభౌబధ్నాతి పరమస్యాంపరావతి శతేనపాశైః" రెండవ భాగమునకు బ్రాహ్మణము "యోస్మాన్ద్వేష్టియంచవయం ద్విష్మః తమతోమామౌగిత్యాహ నిర్దిష్ట్యై" (తై. బ్రా 3 కాండ, ౨ - ప్ర, 3 - అ,) పరమస్యామ మనునది సప్తమ్యేకవచనము. ఇందుకు ప్రథమ "పరమా" పరమస్యామనుశబ్దముయొక్క నిష్పత్తినిగూర్చి "ఛాన్దసిస్యాడాగమః" అని భట్టభాస్కరమందు చెప్పబడినది. (౧-౧-౯,) "పరమ్ అస్యామ్" అనిభిన్న పదములుగ శుక్లయజుర్వేదమందు చెప్పంబడినది. (బొంబాయికూర్పు ౧ - ౨౬,) ఈశబ్దమును గూర్చి తారానాథ వాచస్పత్యమందు చెప్పంబడిన దేమనగ "పరం, పరత్వం, మాతి" అని (పుట - ౪౨౩౭,)పరశబ్దము అత్యంతార్థమందు పరమయిన దని విలియమ్ నిఘంటువులో చెప్పబడియున్నది.

పరావతియొక్క శబ్దనిష్పత్తినిగూర్చి భట్ట భాస్కరమునందు "ఉపసర్గాచ్ఛన్దసిధాత్వర్థ ఇతివతిప్రత్యయః" (౧ - ౧ - ౯,)పరావతి సప్తమి. ఇందుకు ప్రథమ "పరావత్"ప రావతః అనురూపముగలదు. ఈశబ్దమునకు దూరమనియర్థము. ఇందుకు ప్రమాణము. "ఆకే । పరాకే । పరాచైః । ఆరే । పరావతః।" ఇతి పంచదూర నామాని (వేదనిఘంటువు 3 - అధ్యాయం ౨౬ ఖం)దేవాసురుల యుద్ధమనగ మనుష్యుని యందుండు సద్గుణదుర్గుణములకుకలహమని ఇదివరకువ్రాసియున్నాము. ఆ సంగతిని యనువాకమందు కూడ జెప్పంబడుచున్నది. కర్మయందు పెంటధూళిమొదలగునవితీసివేయబడుచున్నవి. అట్లుతీసివేయుటకు అంతశ్శత్రువులనశింయుట భావమని విద్యారణ్య భాష్యమందు చెప్పంబడినది. "యజ్ఞవిఘాతాయ గూఢరూపేణ భూమావాశయానత్వాత్ । అతఏవాయం భ్రాతృవ్యశ్శత్రుః తంచదేవాః తన్మంత్రోచ్చారణపూర్వకేణసత్రుణానాం పాంసూనాం అపనయనేన అపహన్తి" (పుట -౧౩౧)అనగయజ్ఞ విఘాతముకొరకు గూఢరూపముగ భూమియందుండుటవలన యితడేశత్రువు అతనిని విబుధులు మంత్రోచ్చారణ పూర్వకముగ గడ్డితోకూడుకొనిన ధూళిని తీసివేయుటచే నశింపచేయుచున్నారు.

ఇందుకు వినియోగసూత్రము. బధాన దేవసవిత రిత్యుత్తరితః పురస్తాత్ ద్వి తృతీయదేశ ఉదగ్ద్విపదే అపరిమితేవావేదేర్ని ర్వపతిస ఉత్తరః" (ఆపస్తంబశ్రౌత ౨-౧-౬) ఈమంత్రమునకు విద్యారణ్యభాష్యమందు చెప్పంబడినదేమనగా "వ్రాత్యోత్కరే నివపతి బధాన దేవసవితః పరమస్యాం పరావతిశతేన పాశై". (పుట ౧౩౧)

## ౮. అప × హతః అరరుః పృథివ్యై దేవయజన్యై.

**జ్ఞానార్థము.**

ఇందును గురించి ఈఅనువాకముయొక్క ౪ - మంత్రము చూడుము.

**కర్మార్థము.**

టీ॥ దేవయజన్యై = దేవయాగమునకు స్థానమైన, పృథివ్యై = భూమివలనుంచి అరరుః = అరరుడను పేరుగలరాక్షసుడు అపహతః = పోగొట్టుబడుగాక.

వినియోగము॥ ఈమంత్రము చెప్పిధూళిని రెండవసారి యెత్తవలయును.

ఇందుకు వినియోగము "అపహతో అరరుః పృథివ్యై దేవయజన్యాఇతి ద్వితీయో"(ఆప ౨౨-౨-౧)

## ౯. వ్రజం గచ్ఛ గోస్థానం.

**జ్ఞానార్థము.**

ఇందునుగురించి ఈఅనువాకముయొక్క ౫-మంత్రము చూడుము.

**కర్మార్థము.**

టీ॥ ౫ - వ మంత్రము చూడుము.

వినియోగము॥ రెండవసారి దర్భతృణములతో కూడయెత్తిన ధూళిని ఈమంత్రము చెప్పి ఉత్కర ప్రదేశమునకు తీసికొనిపోవలయును.

## ౧౦. వర్షతు తే ద్యౌః.

**జ్ఞానార్థము.**

ఇందునుగురించి ఈఅనువాకముయొక్క ౬ - వ మంత్రము చూడుము.

**కర్మార్థము.**

టీ॥ ౬-వ మంత్రము చూడుము

వినియోగము ॥ ఈమంత్రము చెప్పి యాగవేదికను రెండవసారి జాడవలయును.

౧౧. బధాన దేవ సవితః పరమస్యాం పరావతి శతేన పాశైః యః అస్మాన్ ద్వేష్టి యం చ వయం ద్విష్మః తం అతః మా మౌక్.

| జ్ఞానార్థము. | కర్మార్థము. |
| --- | --- |
| ఇందునగురించి ఈఅనువాక మందుం దుండు ౭-వ మంత్రము చూడుము. | టీ॥ ౭-వ మంత్రముచూడుము. వినియోగము॥ ఈమంత్రము చెప్పిఉత్కరములోదర్భసహితమగు దుమ్మును రెండవసారి వేయవలయును. |

౧౨. అపహతః అరరుః పృథివ్యా అ దేవ యజనః.

| జ్ఞానార్థము. | కర్మార్థము. |
| --- | --- |
| ఇందునుగురించి ఈఅనువాకమందుండు ౮-వ మంత్రముచూడుము. | టీ॥ ౮-వ మంత్రముచూడుము. వినియోగము॥ ఈమంత్రముచెప్పి పృథివియందుబడిన దర్భ తృణములతోకూడినధూళినిమూడవసారి యెత్తవలయును. |

౧౩. వ్రజం గచ్ఛ గోస్థానం.

| జ్ఞానార్థము. | కర్మార్థము. |
| --- | --- |
| ఇందునుగురించి ౫-వ మంత్రముచూడుము. | టీ। ౫-వ మంత్రముచూడుము. వినియోగము ॥ ఈమంత్రము చెప్పి మూడవసారి దర్భ తృణములతో కూడ యెత్తినధూళిని ఉత్కరమను ప్రదేశమునకు ఎత్తుకొనిపోవలయును. |

౧౪. వర్షతు తే ద్యౌః.

| జ్ఞానార్థము. | కర్మార్థము. |
| --- | --- |
| ఇందునుగురించి ఈఅనువాకమందుండెడి ౬-వ మంత్రముచూడుము. | టీ॥ ౬-వ మంత్రముచూడుము. వినియోగము॥ ఈమంత్రముచెప్పిమూడవసారి యాగవేదిని చూడవలయును. |

౧౫. బధాన దేవ సవితః పరమస్యాం పరావతి శతేన పాశైః యః అస్మాన్ ద్వేష్టి యం చ వ యం ద్విష్మః తం అతః మా మౌక్.

| జ్ఞానార్థము. | కర్మార్థము. |
| --- | --- |
| ఇందునుగురించి ఈఅనువాకమందుం డెడి ౭-వ మంత్రముచూడుము. | టీ॥ ౭-వ మంత్రముచూడుము. వినియోగము ॥ ఈమంత్రము చెప్పి ఉత్కరములో మూడవసారి దర్భ సహితమగు దుమ్మును వేయవలయును. |

## ౧౯. అరరుః తె దివం మాస్కాన్.

| జ్ఞానార్థము. | కర్మార్థము. |
| --- | --- |
| టీ ॥ తె=నీయొక్క, అరరుః=అంతశ్శత్రువు, దివం = స్వర్గమును, మా+స్కాన్=పొందకపోవుగాక. తా ॥ స్వర్గమందు అంతశ్శత్రువులు లేకపోవు గాక. | తే=(ఓపాంసు సమూహ రూపమైన ఉత్కరప్రదేశమా ) నీ సంబంధమైన, అరరుః = అరరుడనురాక్షసుడు, దివం =స్వర్గమును, మాస్కాన్ = పొందకపోవుగాక. వినియోగము ॥ ఈ మంత్రముచెప్పి ఉత్కర మందుంచిన దర్భ తృణముతో గూడుకొన్న ధూళిచేతిలో నెత్తవలయును. |

వి ॥ ‟మాస్కాన్ మాగాత్'' అని భట్టభాస్కరమునందు చెప్పంబడినది. (౧ - ౧ - ౯)

ఇందుకు బ్రాహ్మణము ‟అరరుస్తెదివంమాస్కానితియదాహ । భ్రాతృవ్యమేవ దివఃపరిబాధతే'' (తై - బ్రా - 3 - ౨ - ౯)

ఇందుకు వినియోగము. ‟అరరుస్తెదివం మాస్కానితిస్యస్తమాగ్నీధ్రో అంజలినా అభిగృహ్ణాతి'' (అపస్తంబశ్రౌ, ౨-౧-౯)·

## ౧౭. వసవః త్వా పరిగృహ్ణన్తు గాయత్రేణ ఛన్దసా.

| జ్ఞానార్థము | కర్మార్థము |
| --- | --- |
| టీ॥ వసవః=వసువులనెడివిబుధులు, త్వా=(ఓసద్వ్యక్తి)నిన్ను. గాయత్రేణ=గాయత్రీయనెడి, ఛన్దసా=ःమంత్రముచేతను, పరిగృహ్ణాంతు=గ్రహింతురు గాక. | టీ॥ త్వా=(ఓవేదిప్రదేశమా)నిన్ను వసవః=వసువులు, గాయత్రేణ=గాయత్రీఅనే, ఛందసా = ఛందోరూపమైన సఖ్యము చేతను, పరిగృహ్ణాంతు=(దక్షిణ భాగమందు) పరిగ్రహించుదురుగాక. |

తా॥ విబుధులు గాయత్రీ ఛన్దస్సు కలిగిన మంత్ర మనుష్ఠించుటచేత శరీర మందలి దుర్గుణములకు దూరులై సన్మార్గ లగుచున్నారు.

వినియోగము॥ ఈమంత్రము చెప్పి వేదికయొక్క దక్షిణభాగము నేర్పరచవలయును.

వి॥ వసుశబ్దము ఎనిమిదను సంఖ్యకు సంజ్ఞ. ఎనిమిదక్షరములుగల ఛన్దస్సు గాయత్రీయనబడును. "గాయత్ర్యాఃవసవః" (పింగళఛన్దస్సు 3-అధ్యాయము 3-సూత్రం) ఈమంత్రముయొక్క ముఖ్యతాత్పర్యము గాయత్రీఛన్దస్సుగల మంత్రానుష్ఠానమువలన దుర్గుణములను జయించి జ్ఞానమును సంపాదించుట. అన్యశాఖయందు "గాయత్రేణత్వా ఛన్దసా పరిగృహ్ణామి" అనిచెప్పంబడినది. (వాజసనేయసంహిత ౧-౨-౭) ఈమంత్రమును ౧౭-౧౯-మంత్రములకును విద్యారణ్యమందుభాష్యమేకముగ వ్రాయబడినది "ఆహవనీయగార్హపత్యయోర్మధ్యే వేదింజనయితుం వేదినామ్నో అవబోధాయ వేదిమానాయస్ఫ్యనదిక్త్రయే రేఖాత్రయంకర్తవ్యంసోయం వేదేః పరిగ్రాహః పరిగ్రహీతాధ్వర్యుః దిక్త్రయేక్రమేణ భావనయావస్వాదిరూపః పరిగ్రహణసాధనభూతః స్ఫ్యశ్చఛన్దస్త్రయరూపః" (పుట ౧3౨)

"త్వా" అను శబ్దార్థమునుగురించి "పరమాత్మానం, యజ్ఞంవా" అని శుక్ల యజుర్వేదభాష్యమందుచెప్పంబడినది" (బొంబాయికూర్పు. పుట - ౮౨) ఇందువలన గాయత్రీమంత్రముచే భగవంతుని గ్రహించుచున్నానని చెప్పవచ్చును . సద్వృత్తులకు దుర్వృత్తులకు కలహము సంభవించినపుడు వేద మంత్రములు రక్షణగ సద్వృత్తులుపొందినటుల ఛాన్దోగ్యోపనిషత్తుయందు చెప్పంబడినది:

ఛాన్దోగ్యోపనిషత్తుయందు చెప్పినదేమనగ "దేవాసురాహవై యత్రసంయేతిరే ఉభయే ప్రాజాపత్యాస్తద్ధదేవా ఉద్గథమాజహ్రురనేనైనానభిభవిష్యామ ఇతి" (౧-ప్ర-౨-ఖం-౧-వాక్యం) ఈవాక్యార్థమును గూర్చి ౯౦-పుట చూడుము.

"దేవావైమృత్యోర్బిభ్యతస్త్రయీంవిద్యాంప్రావిశం స్తేఛన్దోభిరచ్ఛాదయన్యదేభిరచ్ఛాదయంస్తచ్ఛన్దసాం ఛన్దస్త్వం" ( ౧-ప్ర-౪-ఖ-౨-వా-ఛాన్దోగ్యోపనిషత్) అనగ దేవతలుమృత్యువునకు భయపడి త్రయీవిద్యను అనగ వేదమునుపొంది యామంత్రములచే నాచ్ఛాదించుకొనిరి. కావున మంత్రములకు ఛన్దస్సనిపేరువచ్చినది.

ఇందుకు వినియోగము "వసవస్త్వా పరిగృహ్ణంతు గాయత్రేణ ఛన్దసేతి దక్షిణతః" (ఆపస్తంబశ్రౌ-౨-౨-3)

## ౧౮. రుద్రాః త్వా పరిగృహ్ణంతు త్రైష్టుభేన ఛన్దసా.

జ్ఞానార్థము.

టీ ॥ రుద్రాః = రుద్రులనువిబుధులు; త్వా = నిన్ను, త్రైష్టుభేన = త్రైష్టుబనెడి, ఛన్దసా = ఛన్దస్సుగలిగిన మంత్రముచే, పరిగృహ్ణంతు = లెస్సగ గ్రహింతురుగాక.

తా ॥ నిన్ను త్రిష్టుప్ ఛన్దస్సుగల మంత్రముచే గ్రహించుదురుగాక.

కర్మార్థము.

టీ ॥ త్వా = [ఓ వేదిప్రదేశమా] నిన్ను, రుద్రాః= రుద్రులు, త్రైష్టుభేనఛన్దసా=త్రిష్టుప్ఛందోరూపమైనస్ఫ్యముచేతను, పరిగృహ్ణంతు = [పడమర భాగమందు] పరి గ్రహించెదరుగాక.

వినియోగము ॥ ఈమంత్రముచెప్పి వేదికయొక్క పడమరభాగము నేర్పరచవలయును.

వి ॥ రుద్రాఃఅనగ పదునొకసంఖ్యకు సంజ్ఞ. పదునొకక్షరముగల ఛన్దస్సు త్రిష్టుప్ అనబడును. 'త్రైష్టుప్ రుద్రాః' (పింగళఛన్దస్సు 3-అ, ౬-సూ) ఈమంత్రముయొక్క ముఖ్యతాత్పర్యము త్రైష్టుబ్ మంత్రానుష్ఠానము వలన దుర్గుణముల నుజయించి జ్ఞానమును సంపాదించుటయే. ఈమంత్రము 'త్రైష్టుభేనత్వా ఛన్దసా పరిగృహ్ణామి' అనిపాఠభేదముగ వాజసనేయ సంహితయందు పఠించంబడినది. (౧-౨-౭) ఈమంత్రముయొక్క విద్యారణ్యభాష్యమును గురించి ౧౬ - మంత్రవివరణ చూడుము.

ఇందుకువినియోగము. 'రుద్రాఇతి పశ్చాత్' ఆపస్తంబశ్రౌతము (౨-౨-3)

## ౧౯. ఆదిత్యాః త్వా పరిగృహ్ణంతు జాగతేన ఛన్దసా.

జ్ఞానార్థము.

టీ ॥ ఆదిత్యాః = ఆదిత్యులనెడి విబుధులు, త్వా = నిన్ను, జాగతేన = జాగతియనెడి, ఛన్దసా = ఛన్దస్సుకలిగినమంత్రముచేత, పరి+గృహ్ణంతు, లెస్సగ గ్రహించుదురుగాక.

తా ॥ నిన్ను జాగతీఛన్దస్సుగల మంత్రముచే గ్రహించుదురుగాక.

కర్మార్థము.

టీ ॥ త్వా = [ఓ వేదిప్రదేశమా] నిన్ను, ఆదిత్యాః = ఆదిత్యులు, జాగతేన=జగతిఅనే, ఛన్దసా= ఛందోరూపమైన[స్ఫ్యముచేతను], పరిగృహ్ణంతు= ఉత్తరభాగమందుపరిహరించెదరుగాక.

వినియోగము ॥ ఈమంత్రముచెప్పి వేదియొక్క వుత్తరభాగమందు నేర్పరచవలయును.

వి ॥ జాగతీశబ్దము పంద్రెండు అనుసంఖ్యకు సంజ్ఞ. కాబట్టి పంద్రెండక్షరములుగల ఛన్దస్సుకు జాగతీయనబడును. 'జగత్యాఆదిత్యాః' పింగళఛన్దస్సు (3-అ

౩-సూ) ఈమంత్రముయొక్క ముఖ్యతాత్పర్యము జాగతిఛన్దస్సుగల మంత్రానుష్ఠానము వలన దుర్గుణములను జయించిజ్ఞానము సంపాదించుటయె. ఈమంత్రము ‚‚జాగతేనత్వా ఛన్దసా పరిగృహ్ణామి'' అనిపాఠభేదముగ వాజసనేయులు పఠించుచున్నారు. (౧ - ౨ - ౪) ఈమంత్రముయొక్క విద్యారణ్యభాష్యమును గూర్చి ౧౬-మంత్రవివరణ చూడుము.

ఇందుకువినియోగము ‚‚ఆదిత్యాఇత్యుత్తరతః' (ఆపస్తంబశ్రౌతము౨,౨,౩.)

## ౨౦. దేవస్య సవితుః సవే కర్మ కృణ్వన్తి వేదసః.

### జ్ఞానార్థము.

టీ ॥ సవితుః = ప్రేరకుడైన. దేవస్య = భగవంతునియొక్క, సవే = ప్రేరణకలుగుచుండగ, వేధసః = జ్ఞానులు, కర్మ=సత్కర్మ, కృణ్వన్తి = చేయుచున్నారు.

తా ॥ ప్రేరకుడైన భగవంతునియొక్క ప్రేరణవల్ల జ్ఞానులుసత్కర్మచేయుచున్నారు.

### కర్మార్థము.

టీ ॥ సవితుః = ప్రేరకుడైన, దేవస్య = పరమేశ్వరునియొక్క, సవే= ప్రేరణ గలుగుచుండగా, వేధసః = బ్రహ్మసమానులైన అధ్వర్యులు, కర్మ = [త్రవ్వే రూపమైన] వ్యాపారమును, కృణ్వంతి = చేయుచున్నారు.

వినియోగము ॥ ఈమంత్రముచెప్పి అగ్నీధ్రుడు వేదిప్రదేశమును త్రవ్వవలయును.

వి ॥ వేధసఃఅనుశబ్దమును గూర్చి యీగ్రంథముయొక్క ౧౧౪-పుటచూడుము. ఇందుకు విద్యారణ్యభాష్యము ''పరమేశ్వరస్య అనుజ్ఞాయాంసత్యాం వేధసః సమానా అధ్వర్యవ ఇదముద్ధన నరూపంకర్మకుర్వన్తి'' (పుట ౧౩౩).

ఇందుకు బ్రాహ్మణము ‚‚దేవస్యసవితుస్సవ ఇత్యాహప్రసూత్యై । కర్మకృణ్వన్తివేధసఇత్యాహ । ఇషితంహికర్మక్రియతె'' (తై. బ్రా॰ ౩-కా, ౨-ప్ర, ౯-అను,) ఇందుకుబ్రాహ్మణ భట్టభాస్కరమందు చెప్పంబడిన దేమనగ ‚‚ఏహివేధసోవిధాయకాః తైరిష్టంకర్తవ్యం తస్మాదహమపిఖనామి'' అని (౧-౧-౯)

ఇందుకువినియోగము ''దేవస్యసవితుస్సవ ఇతిఖనతి'' (ఆపస్తంబశ్రౌతము ౨-పు, ౧-క, ౪-సూ) ఇందుకుబోధాయనులు చెప్పినవినియోగమేమనగ ‚‚అథప్రాచీంస్ఫ్యేనవేదముద్ధన్తి'' (విద్యారణ్యభాష్యము పుట ౧౩౩)

## ౨౧. ఋతమ్ అసి.

### జ్ఞానార్థము.

టీ ॥ (ఓభగవంతుడా నీవు) ఋతం

### కర్మార్థము.

టీ ॥ ఋతం = [ఓవేదికా నీవు]

= సత్యస్వరూపుడవు, అసి = అగుచున్నావు.

తా॥ భగవంతుడు సత్యస్వరూపుడు.

యాగఫలమునిచ్చుటయందు సత్యమైన దానవు, అసి = అగుచున్నావు.

వినియోగము ॥ ఈమంత్రముచెప్పి వేదికయొక్క దక్షిణభాగము నేర్పరచవలయును.

వి॥ భగవంతుడు సత్యస్వరూపుడగునట్లు ప్రసిద్ధి "ఓంతత్సత్యం" (మంత్రపుష్పంపుట ౨౫) విద్యారణ్యభాష్యమునందు చెప్పంబడిన దేమనగ "ఋతంసత్యం తచ్చసత్యత్వం త్రివ్వస్తి వేద్యాహవిషిఫలేచ। అసురదానాత్ పూర్వమాసీన్నోదేవో యావన్తంభూదేశం పశ్యతి తస్యదేవయజనత్వంనియతం తతోన్యతత్వం వేదేరదత్తత్వాత్ తన్నపరావర్తత ఇత్యృతత్వం। తతోహవేదేత్వం ఋతమసి। హవిషః ఫలహేతుత్వంన కదాచిద్వ్యభిచరతి ఇత్యస్తిసత్యత్వం తచ్చసత్యంహవిరస్యాం వేద్యాంసీదతి" (పుట ౧౩౫)

ఇందుకు బ్రాహ్మణము ఈమంత్రమునకును ౨౨ - ౨౩ - మంత్రములకును ఏకబ్రాహ్మణము "ఋతమస్యృతసదన మస్యృత శ్రీరసీత్యాహ।యథాయజుర్వైతత్" (తై బ్రా-౩ కా-౨ పు-౯ అను)

ఇందుకువినియోగము "ఋతమసీతిదక్షిణతః" ఆపస్తంబశ్రౌతం(౨-౩-౭)

## ౨౨. ఋతసదనం అసి.

జ్ఞానార్థము.

టీ॥ ఋతసదనం = సత్యస్థానము, అసి = అగుచున్నావు.

తా॥ నీవుసత్యమున కాధారుడవు.

కర్మార్థము.

టీ॥ ఋతసదనం = [ఓవేదికా నీవు] సత్యమైన హవిస్సుకు స్థానముగ, అసి = అగుచున్నావు.

వినియోగము ॥ ఈమంత్రముచెప్పి వేదికయొక్క పడమరభాగమును నేర్పరచవలయును.

వి॥ "సదనంగృహమ్" అనిభట్టభాస్కరులు చెప్పియున్నారు. (౧-౧-౯) ఇందుకువిద్యారణ్యభాష్యము "తతోహవేదేత్వం ఋతసదనమసి। ఫలస్యావశ్యంభావిత్వాత్ అస్తిఋతత్వం।తచ్చఫలంహవిర్ద్వారేణ వేద్యాంశ్రయతే"(పుట౧౩౫)

ఇందుకుబ్రాహ్మణము ౨౧ - మంత్రముచూడుము.

ఇందుకువినియోగము "ఋతసదనమసీతి పశ్చాత్" (ఆపస్తంబశ్రౌతము ౨ - ౩ - ౭).

## ౨౩. ఋతశ్రీః అసి.

**జ్ఞానార్థము.**

టీ ॥ ఋతశ్రీః = సత్యమునుపొందువాడవు, అసి = అగుచున్నావు.

తా ॥ ఓభగవంతుడానీవు సత్యమును పొందువాడవు.

**కర్మార్థము.**

టీ ॥ ఋతశ్రీః = [ఓవేదిప్రదేశమా నీవు] సత్యమునుపొందుదానవు, అసి= అగుచున్నావు.

వినియోగము ॥ ఈమంత్రముచెప్పి వేదికయొక్క యుత్తరభాగమునేర్పరచవలయును.

వి ॥ విద్యారణ్యభాష్యము. ‹తతోహ వేదేత్వం ఋత శ్రీరసి’ అని చెప్పంబడినది. (పుట-౧౩౫) ఇందునుగూర్చి భట్టభాస్కరమందు చెప్పంబడిన దేమనగ ‹‹ఋతం శ్రయతిసాధనత్వేనేతి ఋతశ్రీః’’ (౧-౧-౯)

ఇందుకు బ్రాహ్మణము. ౨౧-వ మంత్రము చూడుము. ఇందుకు వినియోగము. ‹‹ఋతశ్రీరసీత్యుత్తరః’’ (అపస్తంబశ్రౌతం. ౨-౩-౭)

## ౨౪. (౧) ధాః అసి (౨) స్వధా అసి (౩) ఉర్వీ చ అసి (౪) వస్వీచ అసి (౫) పురా క్రూరస్య విసృపః విరప్శిన్

**జ్ఞానార్థము.**

టీ ॥ (నీవు) ధాః=ధరించువాడవు, అసి=అగుచున్నావు, (౧) స్వధా= అమృతముధరించువాడవు, అసి= అగుచున్నావు, (౨) చ=మరియు, ఉర్వీ=మహత్తుగలవాడవు, అసి=అగుచున్నావు, (౩) చ=మరియు, వస్వీ=వసించుటకు ఆధారభూతుడవు,అసి=అగుచున్నావు, (౪)విరప్శిన్=ఓపరమేశ్వరుడా(నీవు) క్రూరస్య=(జ్ఞానాజ్ఞాన)వైషమ్యముయొక్క, విసృపః=సంభవించుటకు, పురా =పూర్వమందె,(మమ్ములనురక్షించుము)

తా ॥ ఓభగవంతుడా నీవు సమస్తమునుధరించినవాడవు. అమృతమునుధరించినవాడవు, మహిమగలవాడవు, అంద

**కర్మార్థము.**

టీ ॥ విరప్శిన్= (ఓవేదిప్రదేశమా నీవు), వివిధమంత్రోచ్చారణము జేసెడి ఋత్విక్కులుగల, పురా= పూర్వమందు, క్రూరస్య=క్రూరుడైన ఉత్కరమందు పాశబద్ధ అరరుడను రాక్షసుని, విసృపః=పోగొట్టుటవలన, ధాః=దేవహవిస్సులనుధరించుదానవు, అసి=అగుచున్నావు, స్వధా=పితృదేవతాహవిస్సులతోకూడుకొన్నదానవు, అసి= అగుచున్నావు, ఉర్వీచ=(ద్వివిధహవిస్సులను ధరించే) విశాలముగలదానవు, అసి=అగుచున్నావు, వస్వీచ=పురోడాశాదిరూపద్రవ్యముగలదానవు, అసి = అగుచున్నావు.

రుసీయందు నివసించుచున్నారు. నీవుపా పసంహారమందు పడకుండునటుల మమ్ము లరక్షించుము.

వినియోగము ॥ ఈ మంత్రముచెప్పి స్ఫ్యముచేత వేదికను బాగుగ చేయవలయును.

వి ॥ స్వధా అను శబ్దవ్యుత్పత్తినిగురించి ‘‘స్వంధనం దధాతీతి’’ స్వధాఅని వేదనిఘంటువునందు చెప్పంబడినది. (పుట - ౧౭౯)

ఉర్వీశబ్దమునుగూర్చియు వస్వీశబ్దమునుగూర్చియు భట్టభాస్కర భాష్యము నందు ‘‘ ఉర్వీమహతీచాసి’’ అనియును ‘‘ వస్వీవాసహేతుశ్చాసి ’’ అనియును చెప్పంబడినది. (౧-౧-౯) క్రూరస్య అనుశబ్దమునకు శుక్లయజుర్వేద మహీధరభాష్యమునందు చెప్పంబడినది. ‘‘ క్రూరశబ్దో అత్రసంఘాతవాచీ సంగ్రామోవైక్రూర ఇతిశ్రుతేః’’ (౧-౨౮)

విస్పృపః అనుశబ్దముగూర్చి ఆభాష్యమందు ‘‘ వివిధంసర్పంతియోధాః య స్మిన్ ఇతి విస్పృప్ తస్యేతి క్రూరవిశేషణం పంచమ్యర్థేషష్ఠీ’’ అని చెప్పంబడినది. (౧-౨౮) ఈశబ్దమునుగూర్చి భట్టభాస్కరమునందు చెప్పంబడినదేమనగ ‘‘విస్పృపః విసర్పణాత్’’ అనియు (౧ - ౧ - ౯)

విరప్శిన్ అను శబ్దమునుగూర్చి ‘‘విరప్శితిమహన్నామ వివిధంరపతివేదత్రయరూపేణ శబ్దంకరోతీతి విరప్శీ యజ్ఞోవేదిత్వం ప్రాప్తోవిష్ణుస్సంబోధ్యతే హేవిరప్శిన్ విష్ణాపరమేశ్వరత్వంశ్రుణు అనుగృహాణేతి’’ అని మహీధరభాష్యమునందు చెప్పంబడినది. (౧-౨౮) ‘‘విరప్శిన్’’ అను పదమునుగూర్చి వేద నిఘంటువునందు చెప్పంబడినదేమనగ. ‘‘వివిధంరపతీతి విరప్శాః స్తోతారః’’ అని (పుట. ౩౦౫) ఈమంత్రమునకు విద్యారణ్యభాష్యము ‘‘ వివిధం ఉరణంశబ్దముచ్చైరు పాంశుత్వాదిభేదేన మంత్రోచ్చారణం విరప్శి తద్వంతః ఋత్విజోవిరప్శాః లోమశశబ్దవత్ ద్రష్టవ్యం ॥ తే విరప్శాః ఋత్విజోయస్యాంవేద్యాం సావేదిఃవిరప్శినీ తత్సంబోధనంఘాన్దసంవిరప్శిన్నితి । హేవేదే క్రూరస్య ఉత్కరేపాంశైర్బద్ధస్య అరరోర్విసర్పణాత్ నిర్గమనాత్ పురాత్వం దైవికహవిషాం ధారయత్ర్యసి । స్వధాశబ్దేన ఏతత్త్రేత తయేచత్వామన్విత్యాదినోక్తం పైతృకపిండాదిక ముపలక్ష్యతే । తేనాపి యుక్తాసి । అత ఏవకృత్స్నధారణాద్విస్తీర్ణాచాసి పురోడాశాదిరూపధనవత్వాద్వస్వీచాసి ద్రవ్యవత్యసి’’ (పుట. ౧౩౬)

ఇందుకు బ్రాహ్మణము. ‘‘ధా అసి స్వధా అసీ తి యోయుః పృతేశాంత్యై ఉర్వీచాసి వస్వీచా సీత్యాహ ఉర్వీమేవైనాం విస్వీంకరోతి పురాక్రూరస్య విస్పృపోవిరప్శిన్నిత్యాహ మేధ్యత్వాయ’’ (తై. బ్రా. ౩-కా. ౨-ప్ర. ౯-అ.)

ఇందుకు వినియోగము. "ధా అ సి స్వ ధా అసీతి ప్రతీచీం వేదింస్ఫ్యే న యోయుజ్యతే" (ఆపస్తంబశ్రౌత. ౨-౩-౯)

౨౫. ఉత్ ఆదాయ పృథివీం జీరదానుః యాం ఐరయన్ చన్ద్రమసి స్వధాభిః తాం ధీరాసః అనుదృశ్య యజంతే.

జ్ఞానార్థము.

టీ॥ జీరదానుః=పూర్వీకులు, యాం= ఏ, పృథివీం = శరీరమును, ఉదాదాయ = అజ్ఞానమువలనతీసి, చన్ద్రమసి = భగవంతునియందు, స్వధాభిః = అమృత కిరణములతో, ఐరయన్ = స్థాపించిరో, తాం = దానిని, ధీరాసః = బుద్ధిమంతులు, అనుదృశ్య =మనుస్సుచేత చింతించి, యజంతె = పూజించుచున్నారు.

తా॥ పూర్వీకులు ఏ శరీరమును అజ్ఞానమునుంచిపైకిదీసి భగవంతునియందు అమృతముతోనుంచిరో దానిని బుద్ధిమంతులు మనసా ఆలోచించి భగవత్పూజ చేయుచున్నారు.

కర్మార్థము.

టీ॥ జీరదానుః = వృద్ధులైనట్టి (హవిఃప్రదాతులైన యజమానులు) యాం= ఏ, పృథివీం = భూమిని, ఉదాదాయ = రాక్షసులవలన పైకితీసుకొనివచ్చి, చంద్రమసి = చద్రునియందు, స్వధాభిః = అమృత కిరణములతో కూడ, ఐరయన్=స్థాపించిరో, తాం= వేదిరూపమైనఆభూమిని, ధీరాసః=(ఇప్పటి)బుద్ధిమంతుల, అనుదృశ్య=మనుస్సుచేతచింతించి, యజంతే = యాగముచేయుచున్నారు.

వినియోగము ఈ మంత్రముచెప్పి వేదినిచూడవలయును.

వి॥ ఈ మంత్రమునకు విద్యారణ్యభాష్యము "జరాజీవనశీలాదానవా హవిషాందాతారో యావజ్జీవాదిశాస్త్రప్రేరితా యజమానాయస్యాంపృధివ్యాం సాపృథివీ జీరదానుః ద్వితీయార్థె ప్రథమాయద్వాజరాశ్చతేదానవశ్చ ఛాన్దసోవచన వ్యత్యయః। తాదృశాఃపూర్వేయజమానా వెదిరూపత్వేనా నీయయాంపృథివీంకృత్స్నా, భూమెరానూర్యాదెస్సకాశాత్ ఊర్ధ్వమాదాయ చన్ద్రమస్యమృత కిరణైస్సార్థం స్థాపితవంతః॥ ఇదానీంతీనాస్తుధీ మంతస్తామిమాంవెదిం మనసావిచిన్త్య తస్యాంయజంతె" (పుట.౧౩౭)

"చన్ద్రమసి" అనుశబ్దమునకు "ఇంద్రె" అనియు "స్వధాభిః" అనుశబ్దమునకు "స్వధాశబ్దోయ ద్యప్యన్నవాచీ తథా ప్యత్ర అన్నహేతుభూతా వెదత్రయీకథ్యతె యాంచన్ద్రమసి బ్రహ్మణాదధురి తిశ్రుతెః బ్రహ్మణావెదెనసహేత్యర్థః" అనియుచెప్పంబడినది. (శుక్లయజుర్వేద మహీధరభాష్యం. ౧-౨౮) "వేధసః" అనునది బహువచనము. ఇందుకు ఏకవచనము వెధాః అని ఈ శబ్దార్థమును గురించి ౧౧౫ పుట

చూడుము. చన్ద్రమసి అనునది సప్తమి ఇందుకు ప్రథమచన్ద్రమాః అని యీశబ్దము నకు వ్యుత్పత్తివేదనిఘంటు నిర్వచనమునందు చెప్పంబడినది. ‘‘చారుశోభనంద్రవతి గచ్ఛతి’’ అని (పుట ౪౦-౪) జీరదానుః అనునది ప్రథమైకవచనము, ద్వితీయైకవ చనమైనపుడు యజమానులు గలది యనియర్థము. పృథివీం అను పదమునకు విశేష ణమగును. ఈయర్థమునుగూర్చి భట్టభాస్కరమునందుచెప్పంబడినది ఏమనగ ‘‘దా నవోదాతారః హవిషాం యజమానః జీరదానవో యస్యామితి బహువ్రీహౌ పూ ర్వపద ప్రకృతి స్వరత్వం ఈదృశీంయాంత్వాం’’ (౧-౧-౯) ప్రథమవిభక్తి రూప మునుగూర్చి భట్టభాస్కరమునందు చెప్పినది ఏమనగ ‘‘జీరోఅగ్నిర్బుద్ధిర్వా, జూఇ తి సౌత్రోధాతుః తస్మాత్ జరిచెతిరత్ప్రత్యయః జీరస్యదానుః ధాత్రీ జీరధానుః దాదాభ్యాంనురితినుప్రత్యయః అంతోదాత్తప్రకరణె మరుద్వృదాదీనాంఛన్దస్యుప సంఖ్యానమితి పూర్వపదాంతోదాత్తత్వం వ్యత్యయెనప్రథమా. (౧.౧-౯) ఈ శబ్దము జీవదాను అని వాజసనేయులు పఠించుచున్నారు.

పురాక్రూరస్యమొదలుయజంతెవరకు నాలుగుపాదములుగలిగినఋక్కు. ఇందు కు భట్టభాస్కరమందు చెప్పంబడినదేమనగ ‘‘ హవిరప్శిన్ వెద్యాస్సంబోధనం రవణం శబ్దనం విరప్ ఉచ్చోపాంశుత్వాదిభెదెన మంత్రాణాముచ్చారణం తద్వాం తో విరప్శాః ఋత్విజః ఉచ్చైస్తైలో మాదిత్వాచ్ఛః తద్వత్ విరప్శిన్ఛాన్దస స్త్రీప్రత్యయాభావః తాంతాదృశీంత్వాంచన్ద్రమసి స్థాపితాందెవ యజనభూతాం అనుదృశ్య అన్వఖ్యాసైవె యమస్మాభిస్సంస్కృతా వేదిరితివి జ్ఞాయధీరాసః ప్రజ్ఞావం తః యజమానాయజంతె’’ (౧-౧-౯.)

ఇందుకు బ్రాహ్మణము. ‘‘పురాక్రూరస్య విసృపోవిరప్శిన్ ఇత్యాహ మెధ్య త్వాయ । ఉదాదాయ పృథివీం జీరదానుర్యామై రయంచన్ద్రమసి స్వధాభిరిత్యా హ’’ (తై.బ్రా. 3-కా, ౨-ప్ర, ౧౦-అను.)

ఇందుకు వినియోగము ‘‘ఉదాదాయపృథివీం జీరదానురితి వెదిమనువెక్షతె’’ (ఆపస్తంబశ్రౌ ౨-3-౧౦.)



## తొమ్మిదవయనువాక సామాన్యవిషయములు.

౧. శిక్షః.—ఈయనువాకమందు నేయేమంత్రములు త్రిభాష్యరత్నమందు దాహరణములుగ నివ్వబడినవో యానూత్రములు, మంత్రములు నిచ్చట వ్రాయంబడును. « సవస్థానం'' (౬-అ, ౧౦-నూ) ఈనూత్రమువలన గోష్ఠానమనెడి పదమందు షత్వము లేకపోవుటచే గో+స్థానం=గోష్ఠానమైనది.

« ధళ్ఛతం'' (౭-అ, ౧౪-నూ) ఈసూత్రమువలన గోష్+తం టకారము వచ్చుటచే గోష్టమనియైనది. « వ్యత్పూర్వ ఆనసుదాత్తో నూష్మవత్య నూష్మవతి'' (౩-అ, ౧౫-నూ) ఈనూత్రమువలన « ఉదానాయ''యనుపదము వెష్టనయందు « ఉత్+అనాయ'' అగుచున్నది. అకారపరమందు నకారేతర హల్లుండెనేని యీనూత్రము ప్రవృత్తించదు. కావున నీయనువాకమునందుండెడి ౨౫-వమంత్రములోనుండెడి ''ఉదాదాయ''అనుపదము « ఉత్+ఆదాయ'' అని యగుచున్నది. ''యథాయుక్తాద్విధిః సాప్రకృతిః'' (౫-అ, ౨-నూ) ఈనూత్రమువలన పదపాఠమునందువిధించినివిధి సంహితయందు కనబడుచున్నది. కావుననే « స్వధా+అసి'' స్వధాసియైనది ''నాయనై ఽరయన్నాథ్నువణ్ అనడ్వాణ్ ఘ్నణీవాణ్ వారుణానేవఅస్మిణ్ (౫·అ, ౨౧-నూ) ఈసూత్రమువలన నకారము శకారము కాకపోవుటచే ''ఐరయణ్+చన్ద్రమసి=ఐరయన్చంద్రమసియైనది.

''నథామాపాఅసి పరోబుధ్నియాజ్యా పూషామినన్త్వై'' (౧౦-అ, ౧౩-నూ) ఈనూత్రమువలన ద్యా,మా, పా, అనువాటికి అసిపరమగునపుడు యందుండు అకారమునకు ఏకాదేశమురాదు. కావున ''స్వధా+అసి=స్వధాఅసి యైనది.

«ధీరాసః । అదబ్ధాసః । ఏకాదశాసః। ఋషీణాం పుత్రః । శార్యాతే । అషాఢః । పితారః । పృథివీయజ్ఞై । ఆసతెయె । గృష్టో మ్యగ్రె ।వామ్ఏవః । జజ్ఞై। సంస్ఫానః। యువ యోర్యః । పృష్ఠై । పతిర్వః। గో । శుష్మః । పువః । సమిద్ధః । ఋషభః । పాథః । వచః । వర్షిష్ఠై । ఋషాణః । యోరుద్రః । వృష్ణః । పూర్వః'' (౧౧-అ, ౧౬-నూ) ఈనూత్రమువలన ధీరాసః అను పదముకంటె పరమైన అనుదృశ్యతె అనుపదమందుండు ఆద్యకారము లోపించలేదు. ''ధీరాసో +అనుదృశ్యయజంతె।ధీరాసో అనుదృశ్యయజంతెయైనది.

« ప్రథమఊష్మ పరోద్వితీయం'' (౧౪-అ, ౧౨-నూ) ఈ నూత్రమువలన « విరప్'' అనుపదమునకు « శిన్'' అనెడి పదముపరమౌనపుడు « విరఫ్'' అనుపదమందు అంత్యపకారమునకు ఫకారమువచ్చును, కావున ''విరప్+శిన్=విరఫ్శిణ్అని యైనది,

౨. కల్పః—ఈయనువాకమందు వేదనిర్మాణము చెప్పంబడినది. వేదియొక్క లక్షణము శ్రౌతపదార్థనిర్వచనమందు చెప్పబడినదేమనగ « అనయారీత్యాదక్షిణోత్తరపార్శ్వయుక్తా దక్షిణోత్తరశ్రోణిసహితా దక్షిణోత్తరాంసయుక్తా ఉరోదరశరీరావయవత్వేన ఉపనిషద్యుక్తా యాగకాలే దర్భైరాచ్ఛాదితా ఆజ్యచ పురోడాశాదిరూప హవిరాసాదనాశ్రయభూతా వేదిరిత్యుచ్యతే. తస్యాః బాహ్యతః ప్రథమా మేఖలా చతురంగులోన్నేధా చతురంగులాయాం మామృత్తికానిర్మితాభవతితస్యాః మేఖలాయ ఉపరిద్వ్యఙ్గులో న్నేధాద్వ్యంగులాయా మాత్రైవ ద్వితీయా మేఖలాభవతి’’ (పుట. 2, వా 33)

వేదియొక్క స్వరూపపరిమాణము శతపథశ్రుతియందుకూడ చెప్పంబడినది. అదెట్లనగ «అభితో అగ్నిమాంసా ఉన్నయతి యోషావై వేదిర్వృషాగ్నిః పరిగృహ్య వై యోషావృషాణాం శేతేమిథునమేవైతత్ ప్రజననంక్రియతే తస్మాదభితో అగ్నిమాంసా ఉన్నయతి సావైపశ్చాత్ గరీయసీస్యాత్ మధ్యేసాహ్వరితా పునఃపురస్తాత్ ద్రవ్యేవమివహియేషాం ప్రశంసన్తి పృథుశ్రోణి విమృష్టాంతరాం సామధ్యేసంగ్రాహ్యేతిజుష్టాం మేవైనామేతద్దేవేభ్యః కరోతి’’ (౧-కా, ౨-అ, ౫-బ్రా)

3. వ్యాకరణం—ఉర్వ్యాసి, వస్వ్యాసి, అను మంత్రములలో విశేషనూత్రములచే ప్రథమ మంత్రమునందుండెడి «అసి’’అను పదమునకు నిఘాత అనగ, సర్వానుదాత్తము సంభవించుటలేదు.

౪. నిరుక్తం—వేదనిఘంటువునుంచి మంత్రములయందుండు శబ్దములకర్థము వ్రాయబడుచున్నది. ఆ నిఘంటునుగూర్చి నిరుక్తమందు చెప్పినదేమనగ «సమామ్నాయ స్సమాఖ్యాతః సవ్యాఖ్యాతవ్యః తమిమంసమామ్నాయం నిఘంటవ ఇత్యాచక్షతే’’ (౧-అ, ౧-పా, ౧-ఖం) అనగ సమామ్నాయమునకు వ్యాఖ్యానముచేయతగినది, దానిపేరు నిఘంటువనంబడును.

ఇందుకు దుర్గాచార్యవృత్తి «సమామ్నాయః’’ సచఋషిభిర్మంత్రార్థపరిజ్ఞానాయోదాహరణభూతః పంచమాధ్యాయీ శాస్త్రసంగ్రహభావేన ఏకస్మిన్నామ్నాయె గ్రంథీకృత ఇత్యర్థః’’ (వాల్యం ౧. ౭-పుట) అనగ మంత్రార్థములను తెలియజేయుటకు ఋషులచే నైదు అధ్యాయములుగ సామ్నాయము చేయబడినది.

౫. ఛన్దస్సు—పురాక్రూరస్య విసృపో విరప్శిన్ ఉదాదాయ పృథివీంజీరదానుః యామైరయఞ్చన్ద్రమసి స్వధాభిః తాంధీరాసో అనుదృశ్య యజన్తె ఈ ఋక్కు ౪-పాదముగల త్రిష్టుప్. «పురాక్రూరస్యేతిత్రిష్టుప్’’ అని మహీధరభాష్యమునందు చెప్పంబడినది. (కలకత్తా కూర్పు పత్రం ౧౯)

౪- పాదములు గలిపియే భట్టభాస్కర భాష్యమునందర్థము చెప్పంబడినది బోధాయనసూత్రమునందు గలిపియే వినియోగము చెప్పంబడినది. ఆపస్తంబసూత్ర మునందు ప్రథమపాదమును పూర్వమంత్రముతో గలపి యొకవినియోగమును ౨, ౩, ౪, పాదములుగలపి మరియొక వినియోగముగను చెప్పంబడినది. ఈ వినియో గమునను సరించి విద్యారణ్యులవారిచే ప్రథమపాదమును "ఏకపదాత్రిష్టుప్" అనియు ౨-౩-౪-పాదములు గలసినదానిని "త్రిపదాత్రిష్టుప్" అనియు చెప్పంబడినది. చెన్నపట్టణంకూర్పు (౨౧౭ పుట) "త్రిష్టుబ్రుద్రాః" అని పింగళఛన్దస్సునందు చెప్పంబడినది. (౩-అ, ౫-సూ) అనగ పాదమునకు ౧౧-అక్షరములుగలది. ఈ మంత్రము ౪-పాదములుగలపి యేకఋక్కుగ మైత్రాయణులచే కొన్ని పదవ్యత్యయ ములుగ పఠించబడుచున్నది అదియెట్లన్న.—

"పురాక్రూరస్యవిసృపోవిరప్శిన్నుదాదాయపృథివీంజీరదానుం ।
తామైరయన్చద్రమసిస్వధాభిస్తాంధీరాసఃకవయోఅనుదిశ్యాయజంతే"

(మైత్రాయణీసంహిత ౧-కా, ౧-ప్ర, ౧౦-అ) ఈమంత్రమునే వాజసనేయులుపఠిం చునదెట్లనగ.—

"పురాక్రూరస్యవిసృపోవిరప్శిన్నుదాదాయపృథివీంజీవదానుం ।
యామైరయన్చద్రమసిస్వధాభిస్తాముధీరాసోఅనుదిశ్యయజంతే"

శుక్లయజుర్వేదమందును చెప్పంబడ్డది (౧-అధ్యా, ౨౮-కం)

౮. "మీమాంస".—విద్యారణ్య భాష్యమందు ఈ యనువాకాంతమున మీమాంసనుగూర్చి కొన్ని సంగతులు చెప్పియున్నారు. ప్రోక్షణశబ్దము యౌగికమ నిచెప్పి తమచేచేయంబడిన న్యాయమాలయందు వ్రాసినప్రమాణము "ప్రోక్షణీసం స్కృతిర్జాతిర్యోగోవా సర్వభూమిషు తథోక్తేస్సంకృతెర్జాతిస్యాద్రూఢేః ప్రబలత్వ తః" అన్యోన్యాశ్రయతోనాన్యోనజాతిః క్లుప్తశక్తితః।యోగస్యా క్లుప్తశక్తిత్వాత్ క్లుప్తిర్వ్యాకరణాద్భవేత్" (౧-అ, ౪-పా, ౨౬-౨౭-శ్లో) ఇందుకు ఆధారమైన జైమినిసూత్రమందెట్లనగ "ప్రోక్షణీష్వర్థసంయోగాత్" (౩-అధ్యా, ౪-పా, ౧౧-సూ) అనగ ప్రోక్షణాదిశబ్దములు యౌగికములు. మరియు నిగదవిషయమై వి ద్యారణ్యుల వారు తమచే చేయంబడిన న్యాయమాలయందు చెప్పిన దేమనగా, "ప్రోక్షణీరాసాదయేతి నిగదస్త్రీవిధాద్బహిః । యజుర్వోచ్చైస్త్వ ధర్మస్యభేదా దస్య చతుర్థతా ॥ పరప్రత్యాయనార్థత్వాదుచ్చైస్త్వం యజురేవసః । తల్లక్షణేన యుక్తత్వాత్ త్రైవిధ్యంతేనసుస్థితం" (౨-అ, ౧-పా, ౨౮-౨౯ శ్లోకములు.) ఇం దుకు జైమినిమూల సూత్రము "నిగదో వాచతుర్థస్స్యాత్ ధర్మవిశేషాత్" (౨-అ, ౧-పా, ౩౮-సూ.) "యజూంషివా తద్రూపత్వాత్" (౨-అ, ౧-పా, ౪౦-సూ.)

అనగ నిగదలు ఒక విధమైన యజస్సులు. ఆయజస్సులనగ "నిగదానాం యజుర్లక్షణోపేతత్వేన యజుషా మేవసతాంపర పుత్రాయన నిమిత్త ఉచ్యత్వ ధర్మః" అని (పుట ౧౪౨).

౯ 'పురాణము' శరీరము వృక్షమువంటి దనుటకును మూలము సత్వగుణ మనుటకును భాగవతమునందు చెప్పబడిన. శ్లో॥ "ఏకాయనో సౌద్విఫల(స్త్రీ) మూలశ్చతూరసః పంచశిఘష్షడాత్మా। సప్తత్వగష్ట విటపోనవాక్షో దశఛదోద్విఖగోహ్యాదివృక్షః" (౭౧౭ పుట).

౧౦. కాండానుక్రమణికను బట్టి యీయనువాకమునకు కర్మరీత్యా వేదియను పేరు జ్ఞానరీత్యా ఉరుఅను పేరు.

ఇందుకు ప్రమాణము "ఉరోవేదిః" (నారాయణోపనిషత్తు చతుర్థప్రశ్న ౮- అ)

౧౧. ఈయనువాకమునకు సంబంధించిన శాఖలు, బ్రాహ్మణము, కల్పము.

శాఖలు.

| | |
|---|---|
| కాఠకసంహిత | ౧. ౯ |
| మైత్రాయణీసంహిత | ౧. ౧౦ |
| కపిష్ఠలకఠసంహిత | ౧. ౯ |
| వాజసనేయసంహిత | ౧. ౨౪-౨౮ |
| తైత్తిరీయసంహిత | ౨. ౬. ౪. ౧- ౪ |

బ్రాహ్మణము.

| | |
|---|---|
| కాఠకబ్రాహ్మణము | ౩౧. ౮ |
| మైత్రాయణీబ్రాహ్మణము | ౪. ౧. ౧౦ |
| తైత్తిరీయబ్రాహ్మణము | ౩. ౨. ౯ |
| శతపథబ్రాహ్మణము | ౧.౨.౪. ౪-౫.౧౯ |

కల్పము.

| | |
|---|---|
| మానవశ్రౌతం | ౧. ౨. ౪ |
| కాతీయశ్రౌతము | ౨. ౬. ౧౩—౩౨ |
| ఆపస్తంబశ్రౌతము | ౨. ౧ ౧-౨.౩.౧౦ |

నవమోఽనువాకము

సంపూర్ణము.



ఓమ్
శ్రీపరబ్రహ్మణేనమః.

కృష్ణయజుర్వేద

# తైత్తిరీయసంహితా మంత్రభాగస్య

దశమోఽనువాకః.

కాండఋషి ప్రజాపతిః.



## ౧. ప్రత్యుష్టగ్ం రక్షః ప్రత్యుష్టా అరాతయః.

జ్ఞానార్థము.

౧౫-పుట చూడుము.

కర్మార్థము.

టీ॥ రక్షః=[స్రుక్కులోననగ హోమముచేసే పాత్రలలో నంతర్భూతముగ నుండెడి] రాక్షసుడు, ప్రత్యుష్టం = మిక్కిలిదహించబడినవాడుగా [అగుగాక] అరాతయః = ఆపాత్రములలో అంతర్భూతముగనుండెడి] శత్రువులు, ప్రత్యుష్టాః = మిక్కిలిదహించబడినవారుగ [అగుగాక].

వినియోగము ॥ ఈమంత్రముచెప్పి హోమముచేసె పాత్రలను గార్హపత్యాగ్నియందు కాచవలయును.

---

## ౨. అగ్నేః వః తేజిష్ఠేన తేజసా నిః తపామి.

జ్ఞానార్థము.

టీ ॥ (ఓ ఇంద్రియములారా) వః = మిమ్ములను, అగ్నేః = భగవంతునియొక్క, తేజిష్ఠేన = మిక్కిలితీక్ష్ణమైన, తేజసా = తేజస్సుచేత, నిః+తపామి = బాగుగతపింప చేయుచున్నాను.

కర్మార్థము.

టీ ॥ వః = [హోమముచేసేపాత్రములా] మిమ్మును, అగ్నేః = అగ్నియొక్క, తేజిష్ఠేన = మిక్కిలితీక్ష్ణమైన, తేజసా = తేజస్సుచేత, నిష్టపామి = బాగుగకాచుచున్నాను.

తా ॥ ఓయింద్రియములారా మిమ్ము లను భగవత్తేజస్సుచే బాగుగ శుద్ధిపరుచుచున్నాను.

వినియోగము ॥ ఈమంత్రముచెప్పి హోమముచేసె పాత్రములను తిరిగికాచవలయును.

వి ॥ ౧ - అనువాకము మొదలు. ౯ - అనువాకమువరకును యజమానుడు బ్రహ్మవిద్యను సంపాదించితనశరీరమునుసత్కర్మాచరణమునం దుపయోగించవలయునని చెప్పబడియున్నది. మనుజుడు గృహస్థాశ్రమమునందు ప్రవేశించి దంపతులిద్దరు భగవంతునిసేవచేయుచు సత్కర్మముల నాచరించుచుండవలయును. వివాహము చేసుకొనుట యావశ్యకమని ఈయనువాకముయొక్క బ్రాహ్మణమొక్కాణించుచున్నది. ''అయజ్ఞోవాఏషః।యోఅపత్నీకః'' (తై. బ్రా. 3-కా, 3ప్ర, 3-అను.) వివాహము యొక్క ప్రయోజనము సుపుత్రునిపొంది యతనిని భగవత్కైంకర్యమునందు ప్రవేశపెట్టుట.

యోగ్యురాలైన స్త్రీని వివాహము చేసుకొనుటయు, ఆస్త్రీయందు ప్రకాశమానంబగు పుత్రునివడశి యతనిని బ్రహ్మజ్ఞానమునందు ప్రవేశపెట్టుటయు నీయనువాకము జెప్పుచున్నది.

ఇందుకువిద్యారణ్య భాష్యము. ''హేస్రుచోయుష్మానతి తీక్ష్ణేన అగ్నేస్తేజసానిశ్శేషేణతపామి । అనిష్టపరిహారాయేష్టసిద్ధయే చోభౌమంత్రౌ విత్యాహప్రత్యుష్టగ్ంరక్షః ప్రత్యుష్టాఅరాతయఇత్యాహరక్షసామపహత్యై అగ్నేర్వస్తేజిష్ఠేనతేజసానిష్టపామీత్యాహ మేధ్యత్వాయ'' (చెన్నపట్టణంకూర్పుపుట ౧౪౫).

ఈమంత్రమునకు బ్రాహ్మణము''అగ్నేర్వస్తేజిష్ఠేన తేజసానిష్టపామీత్యాహ। మేధ్యత్వాయ'' (తై. బ్రా. 3-కాం, 3-ప్ర, ౧-అను)

ఇందుకువినియోగము ''అగ్నేర్వస్తేజిష్ఠేన తేజసానిష్టపామీతి పునఃప్రతితప్య'' (౨-౪-౧౦)

## 3. (౧) గోష్ఠం మా నిః మృక్షం (౨) వాజినం త్వా సపత్నసాహగ్ం సమ్ మార్జ్మి.

జ్ఞానార్థము.

టీ ॥ (౧) గోష్ఠం=ఇంద్రియములకు ఆధారమైననిన్ను, మా+నిః+మృక్షం=నశింపచేయను. (౨) సపత్నసాహగ్ం=దుర్గుణములనెడి శత్రువులను తిరస్కరించునట్లుగను, వాజినం=జ్ఞానము కలు

కర్మార్థము.

టీ॥ గోష్ఠం=(ఓస్రువమా అనగా ఆజ్యపాత్రములోనుంచి హోమముచేసెపాత్రములయం దాజ్యమునుంచెడిపాత్రమా) గోస్థానమును మానిఃమృక్షం=నశింపజేయను, సపత్నసాహసం= శత్రువులను

గునట్లుగను, త్వా=నిన్ను, సం + మార్జ్మి=పవిత్రము చేయుచున్నాను.

తా ॥ ఏయింద్రియములను నశింప చేయను. వాటినిపవిత్రముగ నుపయోగించుచున్నాడను.

తిరస్కరించునట్టియు, వాజినం=అన్నముకలుగజేయునట్టియు, త్వా=నిన్ను, సమ్మార్జ్మి=బాగుగ తుడుచు చున్నాను.

వినియోగము॥ ఈమంత్రము చెప్పిస్రువమును దర్భలచే తుడువవలయును.

వి ॥ గోష్ఠమనగ ‘‘గవాంస్థానం’’ గోశబ్దమునకు వాక్, ఇంద్రియమిత్యాద నేకార్థములుగలవు. (తారానాథవాచస్పతి పుట. ౨౩౪౧) ‘‘సపత్నసాహగ్ం’’ అను పదమునుగూర్చి ‘‘సపత్నాన్ సహతఇతి సపత్నసాహ’’ అని విద్యారణ్యాభాష్యమునందు చెప్పంబడినది (పుట. ౧౬౫) అనగ సపత్నులనుగొట్టునది. సపత్నయనగ వెంబడించెడి శత్రువులు. ‘‘సపత్న’’ శబ్దమునకు వ్యుత్పత్తి ‘‘సహ ఏకార్థేపతతియత తేపతన, సహాస్యసహాశత్రౌ’’ అని తారానాథవాచస్పత్యమందు చెప్పంబడినది. (పుట. ౫౨౨౦) ‘‘సపత్న’’శబ్దమునకు గురుబాల ప్రబోధికయందు చెప్పంబడినదేమనగ ‘‘సపత్నవద్దుఃఖహేతుత్వాత్ సపత్నః’’ సవతివలె దుఃఖహేతువైనవాడు. ‘‘సమానపతిత్వాద్వాసపత్నః’’ సమాన పతిత్వముగలవాడు (పుట ౨౨౧) ప్రతియింద్రియమునందు సద్గుణ దుర్గుణములుసపత్నులవలె గలసి యుండును. వానిలో సద్గుణములను, సద్వృత్తులయందు ప్రవర్తించునటుల చేయవలయుననియు, వాని తోడుగనుండు దుర్గుణములను నశింపచేయవలయుననియు చెప్పుటయేగాక నీరెండుగుణము లెప్పుడు గలసియుండునని సపత్న శబ్దము బోధించుచున్నది. దుర్గుణములు కలసియుండు హేతువుసబట్టి మనలో నేయింద్రియములనునశింపచేయక వానియందుండు దుర్గుణమునుమాత్రమే నశింపచేయవలయునని ఈయనువాకము బోధించుచున్నది.

‘‘వాజినం’’ ద్వితీయావిభక్తి, వాజంకలది ‘‘వాజీ’’ ‘‘వాజోస్యాస్తీతివాజీ’’ అని వేదనిఘంటు నిర్వచనమునందు చెప్పంబడినది (పుట ౧౪౫). వాజశబ్దమునకనేకార్థములు గలవు. ‘‘వాజం’’ అనగ ‘‘ఘృతం ౧, యజ్ఞః ౨, అన్నం ౩, వారి ౪’’ అని సర్వశబ్దసంబోధినియందు చెప్పంబడినది. (పుట ౭౨౫). ఈశబ్దమునుగూర్చి యనేకవ్యుత్పత్తులు వేదనిఘంటు నిర్వచనమునందు చెప్పంబడినవి. ‘‘గత్యర్థాఃబుధ్యర్థాః’’ (వేదనిఘంటు నిర్వచనంపుట ౨౦౪). కావున వాజినమనగ బుద్ధి, లేక జ్ఞానము, కలదియని యర్థము చెప్పంబడినది. ‘‘వాజినం’’ శబ్దమునకు ఇట్టియర్థమె శ్రీమధ్వభాష్యమునందు చెప్పంబడినది. ‘‘అస్యపీత్వాశతక్రతో ఘనోవృత్రాణామభవః । ప్రావోవాజేషువాజినం’’ ఋగ్వేదము (౧-మం, ౪-సూ, ౭- ఋ)

ఇందుకు ఋగ్వేద మధ్వభాష్యము ‘‘ఏనంపీత్వాబహుజ్ఞానాః సూక్తమోభిర నావృతః । ప్రసాదాదేవముక్తేషు। తమోసంహ్యతయాఘనః ఆవృతీరేవవృత్రాణి అజ్ఞానాస్యనదంనరం । ప్రాప్నోయుద్ధేషుయోద్ధారం భక్తంజ్ఞానినమేవచ’’

ఇందుకు విద్యారణ్యభాష్యము ‘‘హేస్రువగవాంస్థానం మావినాశయామిత్యభిప్రేత్య అన్నవన్తంవైరిణా మభిభవితారం త్వాంసమ్యక్ శోధయామి’’ (పుట ౧౪౫). కర్మయందు స్రువమని యుపయోగింపబడుచున్నది. ఇది ప్రాణమునకు సాదృశ్యము. ఇందుకు ప్రమాణం ‘‘ప్రాణోవైస్రువః’’ (తై. బ్రా. 3-కా, 3-ప్ర ౧-అ, ౫-ప) ‘‘మార్జ్మి’’ అనునది ‘‘మృజూశుద్ధౌ’’ అను ధాతువువలన నిష్పన్నమైనది. ఈమొదలగు ౧౨౨ ధాతువులుగల కర్మార్థమందు వేద నిఘంటువులో జెప్పంబడినది. (పుట ౨౩౮)

ఇందుకు వినియోగము ‘‘గోష్ఠంమానిర్మృతిం స్రువమగ్రైరంతరతో అభ్యాకారం సర్వతోబలమభి సమాహారం మూలైర్దణ్డం’’ (ఆపస్తంబశ్రౌత. ౨-౪-౪) విద్యారణ్యభాష్యమునందు చెప్పంబడిన వినియోగము ఇందుకు కొంచము భిన్నముగనున్నది. ‘‘అథస్రువంసంమార్ష్టి గోష్ఠంమానిర్మృతిం వాజినంత్వా సపత్నసాహగ్ంసమ్మార్జ్మి’’ (పుట. ౧౪౫)

౪. (౧) వాచం. (౨) ప్రాణం.

జ్ఞానార్థము.

(౧) టీ॥ వాచం = వాక్కును (నశింపచేయను, దుర్గుణములనెడిశత్రువులను తిరస్కరించునట్లుగను, జ్ఞానముగలుగునట్లుగను, నిన్నుపవిత్రము చేయుచున్నాను).

(౨) ప్రాణం = ప్రాణమును (నశింపచేయను, దుర్గుణములనెడి శత్రువులను తిరస్కరించునట్లుగను, జ్ఞానముగలుగునట్లుగను పవిత్రముచేయుచున్నాను).

తా॥ వాక్కును ప్రాణమును నశింప చేయను పవిత్రముచేయుచున్నాను.

కర్మార్థము.

టీ॥ వాచం = [ఓ జుహువా అనగ జుహువనెడి హోమముచేసే పాత్రమా యజమానునియొక్క] వాక్కును, ప్రాణం = ప్రాణమును [నశింపచేయను, నిన్ను బాగుగతుడుచుచున్నాను.]

వినియోగము ॥ ఈమంత్రముచెప్పి జుహువనెడి హోమముచేసె పాత్రమును దర్భలచే దుడువవలయును.

వి ॥ జుహువుఅనుపాత్ర కర్మయందుపయోగింప బడుచున్నది. ఇదియెడమహస్తమునకు సాదృశ్యమౌనటుల బ్రాహ్మణమునందు చెప్పంబడినది. ‘‘జుహూర్దక్షిణోహస్తః’’ (తై. బ్రా-3 - కాం, 3-ప్ర, ౧-అ, ౫-ప,)

ఇందుకువినియోగము "వాచంప్రాణమితి జుహూమగ్రైరంతరతో అభ్యాకారంప్రాచీంమధ్యైర్బాహ్యతః ప్రతీచీం మూలైర్దండం" (౨, ౪, ౫) ఈవినియోగమునకును, విద్యారణ్యమునందు చెప్పంబడిన వినియోగమునకును, కొంచముభేదముగలదు. "వాచంప్రాణంమా నిర్మృక్షం వాజినీంత్వా సపత్నసాహిగ్ం సమ్మార్జ్మి" (చెన్నపట్టణంకూర్పు పుట. ౧౪౫)

## ౫. (౧) చక్షుః (౨) శ్రోత్రం.

జ్ఞానార్థము.

(౧) టీ॥ చక్షుః = నేత్రమును(నశింపచేయను, దుర్గుణములనెడి శత్రువులను తిరస్కరించునట్లుగను, జ్ఞానముగలుగునట్లుగను, నిన్నుపవిత్రము చేయుచున్నాను.) (౨) శ్రోత్రం=శ్రోత్రమును(నశింపచేయను, దుర్గుణములనెడిశత్రువులనుతిరస్కరించునట్లుగను, జ్ఞానముగలుగునట్లుగను, నిన్నుపవిత్రముచేయుచున్నాను).

తా॥ నేత్రమును శ్రోత్రమును నశింపచేయక సత్కర్మయందుపయోగింపుచున్నాను.

కర్మార్థము.

టీ॥ చక్షుః = [ఉపభృత్తా అనగ ఉపభృత్తనెడి హోమముచేసేపాత్రమా యజమానునియొక్క] చక్షుస్సును, శ్రోత్రం = శ్రోత్రమును [నశింపజేయను, నిన్నుబాగుగతుడుచుచున్నాను].

వినియోగము॥ ఈమంత్రముచెప్పిఉపభృత్తనెడి హోమముచేసే పాత్రమును దర్భలచే దుడువవలయును.

వి॥ కర్మయందు "ఉపభృత్" అనుపాత్ర యుపయోగింపంబడుచున్నది. ఇదికుడిహస్తమునకు సాదృశ్యమని బ్రాహ్మణమునందు చెప్పబడినది. "ఉపభృత్సవ్యః" తై. బ్రా. 3-కా, 3-ప్ర, ౧-అ, ౫-ప,).

ఇందుకు వినియోగము "చక్షుశ్శ్రోత్రమిత్యుపభృతముదీచీం మగ్రైరంతరతో అభ్యాకారంప్రతీచీం మధ్యైర్బాహ్యతగ్ంప్రాచీం మూలైర్దండం" ఆపస్తంబశ్రౌతము (౨ - ౪ - ౬).

## ౬. (౧) ప్రజాం (౨) యోనిం మా నిః మృక్షం (3) వాజినీం త్వా సపత్నసాహిగ్ం సమ్ మార్జ్మి.

జ్ఞానార్థము.

(౧) ప్రజాం = సంతానస్థానమును (నశింపచేయను, దుర్గుణములనెడి శత్రు

కర్మార్థము.

టీ॥ ప్రజాం= [ధ్రువ అనగాధ్రువయనెడి హోమముచేసేపాత్రమా] య

వులను తిరస్కరించునట్లుగను, జ్ఞానము గలుగునట్లుగను నిన్ను పవిత్రము చేయుచున్నాను) (౨) యోనిం = యోనిస్థానమును, మా + నిః + మృక్షం = నశింపచేయను. (౩) వాజినీం = జ్ఞానము కలుగునట్లును, సపత్నసాహిం = అంతశ్శత్రువులను తిరస్కరించు నట్లును, త్వా = నిన్ను, సమ్మార్జ్మి = పవిత్రము చేయుచున్నాను.

తా ॥ సంతానస్థానమును యోనిస్థానమును నశింపచేయక సత్కర్మయందుపయోగింపుచున్నాను.

జమానునియొక్క సంతానమునున్ను, యోనిం = భార్యనున్ను, మానిఃమృక్షం = నశింపజేయను, వాజినీం = అన్నముగలుగజేసునట్టియు, సపత్నసాహం = శత్రువులను తిరస్కరించు నట్టియు, త్వా = నిన్ను, సమ్మార్జ్మి = బాగుగ తుడుచుచున్నాను.

వినియోగము ॥ ఈమంత్రముచెప్పి ధృవయనెడిహోముచేసే పాత్రమునుదర్భలచే దుడువవలయును.

వి ॥ కర్మయందు ధ్రువమను పాత్ర యుపయోగింపంబడుచున్నది. ఇది ఆత్మకు సాదృశ్యమని బ్రాహ్మణమునందు చెప్పంబడినది. "ఆత్మా ధ్రువా । అన్నగ్ంసమ్మార్జనాని । ముఖతోవై ప్రాణోపానో భూత్వా । ఆత్మానమన్నం ప్రవిశ్య । బాహ్యతస్తనువంశుభయతి । తస్మాద్ధ్రువమేవాగ్రే సమార్ష్టి । ముఖతోహి ప్రాణోపానో భూత్వా । ఆత్మానమన్నమావిశతి" (తై. బ్రా. ౩-కా, ౩-ప్ర, ౧-అ) ఈ బ్రాహ్మణమునకు విద్యారణ్యభాష్యము "ఆత్మాహస్తయోర్మధ్యవర్తి శరీరం । ముఖసఞ్చారిణో వాయోః । ప్రాణాపానాభిదే ద్వేవృత్తీ । ఉచ్ఛ్వాసరూపేణ బహిర్నిర్గచ్ఛన్తీ ప్రాణవృత్తిః, నిశ్వాసరూపేణ అంతః ప్రవిశంత్యపానవృత్తిః । తత్ర ప్రాణరూపోవాయుః ప్రాణతాం పరిత్యజ్యస్వయమపానోభూత్వా ముఖేప్రక్షిప్తమన్నగ్రాసం మధ్యశరీరే ప్రవేశ్యహస్తాదిరూపం శరీరం పుష్ట్వాశోభితంకరోతి । తస్మాదన్నరూపై ర్వేదాగ్రైః ప్రాణరూపస్యస్రువస్యాదౌ సమ్మార్జనంకర్తవ్యం ॥ తథాకృతేసతి ప్రథమతో అన్నప్రవేశః పశ్చాద్బాహ్యహస్తరూపస్య జుహ్వాదేఃశోభేత్యేతదుపపన్నం"(పుట ౧౪౩). యోనియనగ పురుషస్త్రీలయొక్క రహస్యస్థానము. భగవంతుడు మనయేయింద్రియములు నశింపచేయగూడదనియు, వానిని యక్రమ ప్రవర్తనయందు పోనివ్వక, సుకర్మలయందు ప్రవేశపెట్టవలయును గావున. వివాహముజేసుకొనుట యావశ్యకమని యీమంత్రము జెప్పుచుండుటయేగాక తరువాతమంత్రమున్ను, వివాహమునుగురించి వివరించుచున్నదై యున్నయది. ఇంకవివాహమావశ్యకమైనందుకు, అనేక గ్రంథములుచెప్పుచున్నను, వానినిచ్చటవిస్తరించుట యనావశ్యకంబయినను బృహదారణ్యకోపనిషత్తుయందు చెప్పంబడిన యంశమును దెలుసుగొనదగినదగుటంజేసి దానినిసామాన్య విషయములందు వివరించనగును.

ఇందుకు వినియోగము. "ప్రజాంయోనిమితి యథాస్రువమేవంధ్రువాం। రూపంవర్ణం పశూనాంమానిర్మృత్యుం వాజిత్వాసపత్నసాహాంసమ్మార్జీతిప్రాశిత్రహరణం తూష్ణీంవా । నసంమృష్ట అన్యసంమృష్టైస్సంస్పర్శయతి" (ఆపస్తంబశ్రౌత. ౨-౪-౨-౮-౯ సూత్రములు). ఈవినియోగమునకు విద్యారణ్యమునందు చెప్పంబడిన వినియోగము కొంచము భేదముగనున్నది. "అథధ్రువాంసమ్మార్ష్టి ప్రజాంయోనిం మానిర్మృత్యుం వాజినీంత్వా సపత్నసాహీగ్ం సమ్మార్జ్మి" (చెన్నపట్టణం కూర్పు. పుట. ౧౪౫)

౨. (౧) ఆశాసానా సౌమనసం ప్రజాం సౌభాగ్యం తనూం.
(౨) అగ్నేః అనువ్రతా భూత్వా సమ్ నహ్యే సుకృతాయ కం.

జ్ఞానార్థము.

టీ॥ (౧) సౌమనసం=(ఈచిన్నది) మంచిమనస్సునున్ను, ప్రజాం=(మంచి) సంతానమునున్ను, సౌభాగ్యం=సువాసినిత్యమునున్ను, తనూం=(నాశనరహితమైనటువంటి) శరీరమునున్ను, ఆశాసానా=కోరుచున్నది. (౨) అగ్నేః= భగవంతునికి, అనువ్రత=పరిచరణచేయునట్టిది, భూత్వా=ఐ, సుకృతాయ=మంచికర్మకొరకు, కం=సుఖమానట్లుగ, సమ్+నహ్యే=(ఆచిన్నదానిని) కట్టుచున్నాను, (అనగవివాహముచేసుకొనుచున్నాను.

తా॥ యజమానునిభార్య మంచిమనస్సును, సంతానమును, నాశనరహితమైన సువాసినిత్వమును, దివ్యమంగళ శరీరమును కోరుచున్నది. భగవంతునికి పరిచరణచేయునటుల మంచికర్మకొరకు భార్యను చేసుకొనుచున్నాను.

కర్మార్థము.

టీ॥ అగ్నేః=అగ్నికి, అనువ్రతా= యజమానుని యొక్క భార్య శుశ్రూషచేయుచున్నది, భూత్వా=అయి, సౌమనసం= మంచిమనస్సునున్ను, ప్రజాం= సంతానమునున్ను, సౌభాగ్యం= సువాసినిత్యమునున్ను, తనూం=(మంచి) రూపమునున్ను, ఆశాసానా=కోరుచున్నది, సుకృతాయ=మంచిపనులనిమిత్తము, కం = సుఖముకలుగునట్లుగా, సన్నహ్యే = (తాడుచేత) కట్టుచున్నాను.

వినియోగము॥ ఈమంత్రముచెప్పి యజమానునిభార్యయొక్క నడుము నందు యోక్త్రమను తాడుచేత గట్టవలయును.

వి ॥ మంచి కర్మలుచేయుటకు భార్యయావశ్యకమని బ్రాహ్మణము చెప్పుచున్నది. ఇందువలనగృహస్థాశ్రమమువిధియైయున్నట్టు కనుబడుచున్నది. "అయజ్ఞోవా

ఏషః । యోఽపత్నీకః '' (తై.బ్రా. 3-3-3) అనగ భార్యలేనికర్త యజ్ఞముకాదు ఈమంత్రము బ్రాహ్మణమననుసరించి రెండు భాగములుగ చేయబడినది. మొదటి భాగమునకు బ్రాహ్మణము ''ఆశాసానా సౌమనసమిత్యాహ । మేధ్యామేవైనాంకేవ లీంకృత్వా । ఆశిషాసమర్ధయతి'' రెండవ భాగమునకు బ్రాహ్మణము ''అగ్నేర నువ్రతాభూత్వా సన్నహ్యేసుకృతాయక మిత్యాహ'' (తై. బ్రా. 3 - 3 - ౪) అనగ పరిశుద్ధమైన కర్మయందు నిన్ను ప్రవేశ పెట్టుచున్నాను. ఇదియేస్త్రీకు ఉప నయనము. స్త్రీకి వివాహమె ఉపనయనమనిస్మృతిప్రసిద్ధము. బ్రహ్మసూత్రమధ్వభా ష్యముయొక్క అపశూద్రాధికరణమునందు చెప్పంబడినదేమనగ ''స్త్రీణాంప్రధా నకర్మైవ యథోపనయనం తథైవస్మృతేః '' (౧-అ, 3-పా, 3౬-సూ)

''ఆశాసానా'' అనగ 'ప్రార్థయామాస' అని భట్టభాస్కరమునందు చెప్పం బడినది. 'సౌమనసం' అనగ మంచిమనస్సు ''సౌమనసంప్రజ్ఞా'' అనియు, 'తనూం' అనగ 'శరీరమవినాశం' అనియు ఆభాష్యమందు చెప్పంబడినది. (౧ - ౧ - ౧౦) అనగనిహలోకసంబంధమైన శరీరమునశించును గనుక శాశ్వతమైన దివ్యశరీరము గలుగచేయుమని భార్యకోరుచున్నది.

వ్రతమనగ కర్మయని వేదనిఘంటువునందు చెప్పంబడినది. (౨-అ, ౭-ఖం.) ఈశబ్దముయొక్క వ్యుత్పత్తినిగురించి భిన్నాభిప్రాయములు గలవు. వ్రణోతేర్ధా తోః వృషిరంజిభ్యాంకిదితి విధీయమానో అత్రవృత్యయోబాహుళకాత్ భవదితి' అనివేదనిఘంటు నిర్వచనమందు చెప్పంబడినది. (పుట ౧౬౭) 'సహ్యే' అనునది 'నహబన్ధనే' అనుధాతువువలన నిష్పన్నమైనది. ఇందుకువిద్యారణ్యభాష్యము. 'యా పత్నీవహ్నేరను సరణీభూత్వాసౌమనస్యాది ఫలాన్యాశాసానాసావ గ్నతే తామేతాం శోభనకర్మణేసుఖంభవతి తథాబధ్నామి' (పుట ౧౫౧) ఈమంత్రము మంత్రపన్న ములయొక్క ౧-వ ప్రశ్న, ౨-ఖం, ౧౭-వ మంత్రముగనున్నది.

ఈమంత్రమునుగూర్చి హరదత్తభాష్యమునందు చెప్పంబడినదేమనగ. ''సు కృతాయ వివాహసౌభాగ్యాయ పుణ్యాయకర్మణే కమిత్యర్థః । కంసుఖంయథాభవ తి తథాబధ్నామీతివా'.

అని ఇందుకువినియోగము. ''ఆశాసాసౌమనస మిత్య పరేణగార్హపత్య మూర్ధ్వజ్ఞుమాసీనాం పత్నీంసంహ్యాతితిష్ఠంతీంవా । వాచయతీత్యేకే'' (ఆపస్తం బశ్రౌత ౨,౫,౨,3, సూత్రములు) ఇందుకు విద్యారణ్య భాష్యమునందు చె ప్పంబడిన వినియోగమునకును, కొంచముభేదము కనుబడుచున్నది. ''అథైనాంప త్నీమంతరేణ వేద్యుత్కరౌప్రసాద్య జఘనేనదక్షిణేన గార్హపత్యముదీచీ ముపవే శ్యయోక్త్రేణసంనహ్యతి, ఆశాసానా సౌమనసంప్రజాం సౌభాగ్యంతనూం అగ్నే రనువ్రతా భూత్వాసన్న్యసుకృహేతాయకం'' (పుట: ౧౫౧)

౮. సుప్రజసః త్వా వయం సుపత్నీః ఉప సేదిమ
అగ్నే సపత్నదమ్భనం అదబ్ధాసః అదాభ్యం.

జ్ఞానార్థము.

అగ్నే = ఓభగవంతుడా, సపత్నదమ్భనం= శత్రువులను నశింపచేయునట్టియు, అదాభ్యం = (అన్యులచే) తిరస్కరింపబడదగనట్టియు, త్వా=నిన్ను, సుప్రజసః=శోభనమైన సంతానము కలుగునట్లుగ, సుపత్నీః=మంచిభర్తకలుగునట్లుగ, అదబ్ధాసః=ఎవరిచేతనున్ను తిరస్కరింపబడనట్లుగ, వయం = మేము (నేను) ఉప + సేదిమ = సేవించుచున్నాను.

తా ॥ ఓభగవంతుడా శత్రువులనునశింపచేయునట్టియు, తిరస్కరింపబడదగనట్టియునిన్ను, మంచిసంతానము కలుగునట్లుగను, ఏవరిచేత తిరస్కరింపబడనట్లుగను, మంచి భర్తకలుగునట్లుగను, నేనుసేవించుచున్నాను అని యాచిన్నది చెప్పుమన్నది.

కర్మార్థము.

టీ ॥ అగ్నే=ఓయగ్నీ, సపత్నదంభనం = శత్రువులనునశింపజేయునట్టియు, అదాభ్యం=[అన్యులచే] తిరస్కరింపబడదగనట్టియు, త్వా= నిన్ను, సుప్రజసః= శోభనమైన సంతానము గలిగినట్టియు, అదబ్ధాసః=ఎవరిచేతనున్ను తిరస్కరింపబడని, సుపత్నీః = మంచిపెనిమిటి కలిగినట్టియు, వయం= మేము, ఉపసేదిమ=పొందుచున్నాము (సేవించుచున్నాము)

వినియోగము ॥ ఈమంత్రమును యజమానుని భార్యజపించవలయును.

ఇందుకు విద్యారణ్యభాష్యము. “హే అగ్నే వయంత్వాం ఉపసీదామః। కీదృశావయం। సుప్రజసః శోభనప్రజోపేతాః। శోభనః పతిర్యాసాంతాః సుపత్న్యః। తత్ప్రసాదాత్ అదబ్ధాసః కేనాప్యతిరస్కృతాః। కీదృశంత్వాం సపత్నదమ్భనం వైరివినాశనం, అదాభ్యంకెనా ప్యతిరస్కార్యం” (చెన్నపట్టణంకూర్పు పుట ౧౫౩).

ఈమంత్రము సంహిత ౩-కాం, ౫-ప్ర, ౬-అనువాకముయొక్క ౪-వ వినియోగ మంత్రముగనున్నది. అచ్చట భాష్యము కొంచముభిన్నముగ నుండుటవలన దాని నిచ్చటవ్రాయుచున్నారము. “హే అగ్నే సుప్రజసః (శోభనాపత్యాః) సుపత్నీః (ధర్మపత్న్యః) వయం, అదబ్ధాసః (కేనాప్యతిరస్కృతాః) సత్యః త్వాం ఉపసేదిమ (తవసమీపే ఉపవిష్టాస్మః) కీదృశంత్వాం సపత్నదమ్భనం’ (వైరినాశకం) “అదాభ్యం, కేనాప్యతిరస్కార్యం)” (కలకత్తాకూర్పుపుట ౩౪౨).

ఇందుకు బ్రాహ్మణము ‘‘సుప్రజసస్త్వావయగ్ం సుపత్నీరుపసేదిమేత్యాహ। యజ్ఞమేవ తన్మిథునీకరోతి। ఊనేతిరిక్తంధీయాతాఇతి ప్రజాత్యై’’(తై బ్రా. 3-కా, 3-ప్ర, 3-అ),

ఇందుకు వినియోగము ‘‘సుప్రజసస్త్వా వయమితిదక్షిణతః ఉదీచ్యుపవిశతి’’ (ఆపస్తంబశ్రౌతం ౨-౫-౯)

౯. (౧) ఇమం విష్యామి వరుణస్య పాశం యం అబధ్నీత సవితా సుకేతః. (౨) ధాతుః చ యోనౌ సుకృతస్య లోకే స్యోనం మే సహ పత్యా కరోమి.

జ్ఞానార్థము.

(౧) టీ॥ సుకేతః=జ్ఞానస్వరూపుడైన, సవితా = సృష్టికర్తయైన భగవంతుడు, యం = ఏ, వరుణస్య = వరుణసంబంధమైన, పాశం = పాశమును అబధ్నీత = కట్టెనో, ఇమం = దానిని, విష్యామి = విప్పుచున్నాను.

(౧) సుకృతస్య = ఉత్తమమైన, లోకే= లోకమునందు అనగ, ధాతుః చ = పరమేశ్వరునియొక్క, యోనౌ = స్థానమునందు, పత్న్యై + సహ = భర్తతోకూడ, మె = నాకు, స్యోనం= సుఖమును, కరోమి= చేయుచున్నాను.

తా ॥ కౌమారిత్వ బన్ధనను ఇప్పుడు నీనిమిత్తము విప్పుచున్నానని భార్యభర్తతో చెప్పుచున్నది.

కర్మార్థము.

టీ ॥ సుకేతః = మంచిజ్ఞానవంతుడైన, సవితా = ప్రేరకుడైన పరమేశ్వరుడు, యం = ఏ, పాశం = తాడును, అబధ్నీత = కట్టెనో, వరుణస్య = వరుణసంబంధమైన, ఇమం=ఆతాడును, విష్యామి=విప్పుచున్నాను,ధాతుః చ=బ్రహ్మదేవునికి, యోనౌ=స్థానమైన, సుకృతస్య = పుణ్యమునకు [ఫలమయిన], లోకే=లోకమందు, పత్యా=పెనిమిటితో, సహ=కూడా, మే=నాకు, స్యోనం=సుఖమును, కరోమి=కలుగజేసికొనుచున్నాను.

వినియోగము॥ ఈమంత్రముచెప్పియజమానుని భార్యతననడుమునందు గట్టిన యోక్త్రతాడును విప్పవలయును.

వి॥ ఈమంత్రము ఈసంహిత 3.కాం, ౫-ప్ర, ౬-అ, మనందునుచెప్పంబడినది. అచ్చట భాష్యము కొంచముభిన్నముగ నుండుటచే నిచ్చట వ్రాయబడుచున్నది.

‘‘సుకేతః’’(శోభనజ్ఞానయుక్తః)సవితా(ప్రేరకోఅన్తర్యామి)యోక్త్రరూపం వరుణస్యపాశంపూర్వం అబధ్నీత। తమ్ ఇమంవిష్యామి (విముఞ్చామి) తతః సుకృ

తస్యఫలభూతే ఉత్తమెలోకె ధాతుశ్చ (పరమేశ్వరస్య) యోనౌ(స్థానే) పత్యాస హమేస్యోనం(సుఖం) కరోమి'' (కలకత్తాకూర్పు పుట 343). ఈమంత్రముకొంచము భిన్నముగ ఋగ్వేదమందును, మంత్రపన్నములయందును, చెప్పంబడినది.అందుమంత్రపన్నలయందున్న విధము.''ప్రత్వాముంచామివరుణస్యపాశాద్యేనత్వాబధ్నాత్సవితా సుకేతః। ధాతుశ్చ యోనౌసుకృతస్యలోకె స్యోనంమె సహపత్యా కరోమి. ఇమం విష్యామి వరుణస్యపాశం యమబధ్నీత సవితా సుశేవః, ధాతుశ్చ యోనౌ సుకృతస్య లోకె అరిష్టాంత్వాసహపత్యా కృణోమి,,(పుట ౨౧౮).

ఈమంత్రమునకును సమాయుషాయను ౧౦-వ మంత్రమునకును బ్రాహ్మణమునుగూర్చి విద్యారణ్య భాష్యమునందు చెప్పంబడినదేమనగ ''ఇమంవిష్యామిసమాయుషేతి మంత్రద్వయస్యాత్రాప్రాసంగికత్వాత్ తద్వ్యాఖ్యానముపేక్ష్య అనన్తరస్యమంత్రస్యపూర్వభాగేస్పష్టార్థతాందర్శయతి''(చెన్నపట్ణంకూర్పు పుట ౧౫౫) అయితే నీమంత్రమునకును, పదియవమంత్రమునకును, బ్రాహ్మణం 3-కా, 3-ప్ర, ౧౦ అనువాకమునందు వ్యాఖ్యానముచేయంబడినవి. ''ఇమంవిష్యామి వరుణస్యపాశమిత్యాహ। వరుణపాశా దేవైనాం ముఞ్చతి। సవితృప్రసూతో యథాదేవతాం। సదేవతాభ్య అవృశ్చ్యతే। వసీయాన్భవతిధాతుశ్చయోనౌ సుకృతస్యలోకఇత్యాహ। అగ్నిర్వైధాతా। పుణ్యంకర్మ సుకృతస్యలోకః।అగ్నిరేవైనాంధాతా। పుణ్యే కర్మణి సుకృతస్యలోకేదధాతి। స్యోనంమేసహపత్యాకరో మిత్యాహ। ఆత్మనశ్చయ జమానస్య చానార్త్యై సన్త్వాయ''ఇదితొమ్మిదవమంత్రమునకు బ్రాహ్మణము.

---

౧౦. సమ్ ఆయుషా సమ్ ప్రజయా సమ్ అగ్నే వర్చసా పునః సమ్ పత్నీ పత్యా అహం గచ్ఛే సమ్ ఆత్మా తనువా మమ.

జ్ఞానార్థము.

అగ్నే=ఓభగవంతుడా, అహం=నేను, ఆయుషా=(శాశ్వతమైన) ఆయువుతో, (సంగచ్ఛే)=వెళ్లెదను, ప్రజయా=సంతానముతో, సమ్(గచ్ఛే)=వెళ్లెదను,పునః=విశేషమైనలేకతిరిగి, వర్చసా=వర్చస్సుతో, సమ్ (గచ్ఛే)=వెళ్లెదను, పత్యా=భర్తతో, పత్నీ=భార్యగ,సంగచ్ఛే=వెళ్లెదను, తనువా=(శాశ్వతమైన)శరీరముతో,మమ = నాయొక్క, ఆ

కర్మార్థము.

టీ॥ అగ్నే = ఓయగ్నీ, అహం=నేను, సం+ఆయుషా=ఆయుస్సునుపొందుచున్నాను, సంప్రజయా=సంతానమును పొందుచున్నాను, సంవర్చసా [పాతివ్రత్యరూపమైన] వర్చస్సునుపొందుచున్నాను, పత్యా=పెనిమిటితో, పునః=తిరిగి (తిరిగి) పత్నీ=భార్యఅయి, గచ్ఛే=కలుసుకొనుచున్నాను, మమ = నాయొక్క, తనువా= శరీరముతో, సంఆత్మా

త్మా=ఆత్మరూపముగ, సం (గచ్ఛే) = వెళ్లెదను.

తా॥ ఆచిన్నది వివాహము చేసుకొని సత్కర్మ చేయుచు సంపూర్ణమైనయాయుస్సుతోనున్ను, సంతానముతోనున్ను, బ్రహ్మవర్చస్సుతోనున్ను, భర్తతోనున్ను దివ్యమంగళ శరీరముగల యాత్మతోనున్ను, స్వర్గమునకు వెళ్లునటుల భగవంతుని ప్రార్థించుచున్నది.

=జీవాత్మ [బహుకాలము] కలుసుకొనును గాక.

వినియోగము ॥ఈ మంత్రము చెప్పి యజమానుని భార్యతన నడుమునందు గట్టిగయోక్త్రమనెడు తాడును విప్పవలయును.

వి॥ "పునః" అనగ తిరిగిలేక అత్యంతమని యర్థము. "పునః, ఉపర్యుపరి" అని భట్టభాస్కరమునందు చెప్పంబడినది. (౧, ౧, ౧౦). "పునః," అనగవిశేష అనియు, "పునస్తుతౌ" అనుధాతువువలన నిష్పన్నమైనదనియు, తారానాథవాచస్పత్యమునందు చెప్పంబడినది. (౪౩౬౨). "తనూం" అనగ "అవికలేంద్రియ శరీరం" అని భట్టభాస్కరమునందు చెప్పంబడినది, (౧-౧-౧౦).

ఇందుకు విద్యారణ్యభాష్యము, "హే అగ్నే అహమాయుషా సఙ్గచ్ఛే ప్రజయా సఙ్గచ్ఛే పాతివ్రత్యలక్షణేన వర్చసా సఙ్గచ్ఛే అనేన పత్యా పునః పునః పత్నీ భూత్వా సఙ్గచ్ఛే భవియోగః కదాచిదపి మాభూదిత్యర్థః। మమ శరీరేణ జీవాత్మా చిరం సఙ్గచ్ఛతాం" చెన్నపట్టణం కూర్పు పుట ౧౫౪). ఈ మంత్రమునకు బ్రాహ్మణము—"సమాయుషా సంప్రజయేత్యాహ ఆశిషమేవైతామాశాస్తే." ౩-కా, ౩-ప్ర, ౧౦-అ)

౧౧. (౧) మహీనాం పయః అసి ఓషధీనాం రసః.
(౨) తస్య తే అక్షీయమాణస్య నిః,

జ్ఞానార్థము.

(౧) టీ॥ మహీనాం=(ఓ వీర్యమా నీవు). గోవులయొక్క, పయః=పాలవంటిదానవు, అసి=అగుచున్నావు, ఓషధీనాం=ఓషధులయొక్క, రసః=రసమువంటిదానవు. (౨) తస్య=అట్టి, అక్షీయమాణస్య=నాశన రహితమైన, తే=నీయొక్క (అనగనిన్ను) నిః+వపామి=ఉంచుచున్నాను.

కర్మార్థము.

టీ॥ మహీనాం = [ఓయాజ్యమా నీవు] గోవులయొక్క, పయః=పాలుచేత బుట్టినదానవు, ఓషధీనాం=ఓషధులయొక్క, రసః=రసరూపమైనదానవు; అక్షీయమాణస్య= నాశరహితమైన, తస్య=ఆ, తే=నిన్ను, నివపామి [పాత్రమందు] ఉంచుచున్నాను.

తా॥ మనుష్యునియొక్క ఇంద్రియము, గోవులకు క్షీరమువంటిదియు, ఓషధులకు రసమువంటిదియునై యున్నది, అట్టి వీర్యమును భార్యగర్భమందుంచుచున్నాడు.

వినియోగము ॥ ఈ మంత్రము చెప్పి ఆజ్యపాత్రయందాజ్యముంచవలయును.

వి ॥ పయస్సు, రసము, ఘృతము, వీర్యము, మొదలగునవి యేకార్థమందు దకనామములుగ వేదనిఘంటువునందు జెప్పంబడినవి. (ఇవి ౧౦౧ పదమువుటచె నిచ్చట వ్రాయలేదు). గనుకకర్మయందు ఆజ్యముపయోగింపంబడుచున్నది.ఆయాజ్యము వీర్యమునకుసాదృశ్యముగ నుపయోగింపంబడుచున్నట్టు శతపథశ్రుతియందు చెప్పంబడినది.‹‹అథ ఆజ్యమవేక్షతే।యోషావై పత్నీ రేతఆజ్యం మిథునమేవై తత్ప్రజననం క్రియతెతస్మాదాజ్యమవేక్షతే''(౧-౩-౧-౧౦) అనగతరువాతనాజ్యమును చూచుచున్నది. ఇదియేభార్య.రేతస్సు ఆజ్యము. సంతాన నిమిత్తముమిధునము చేయబడుచున్నది;కాబట్టి యాజ్యమును చూచుచున్నది.

తైత్తిరీయబ్రాహ్మణమునందు ‹‹యజమానోవా ఆజ్యం'' అని చెప్పంబడినది (౩ - ౩ - ౪) ‹‹ఆత్మావైపుత్రనామాసి'' అనియు ‹‹పురుషేహవా అయమాదితో గర్భోభవతి యదేతద్రేతః తదేతత్సర్వేభ్యో అంగేభ్యస్తేజస్సంభృత మాత్మన్యేవ ఆత్మానం బిభర్తి'' ఐతరేయోపనిషత్తు (౨-అ, ౧-ఖం) అనుప్రమాణమును బట్టి ఆవీర్యమే యజమానుడనియు, ఆవీర్యమువలనపుట్టిన పుత్రుడు తానేయనియు నెంచవలయును. ఇంతియేగాక, తైత్తిరీయబ్రాహ్మణమునందు ప్రజాసృష్టి వీటివల్లనెచేయబడుచున్నట్టుచెప్పబడ్డది. కావున నిచ్చటఘృతమనగ వీర్యమనియు,ఆవీర్యమువలన పుత్రుడుగలుగుననియు నీమంత్రముచెప్పుచున్నది.

ఇందుకు బ్రాహ్మణము ‹‹మహీనాంపయోసి ఓషధీనాంరసఇత్యాహ । రూపమేవాస్యైతన్మహిమానం వ్యాచష్టే'' (తై-బ్రా. ౩-కా, ౩-ప్ర, ౩-అ) కావుననే మనుష్యునియొక్క వీర్యముగోక్షీరములతోను, ఓషధులయొక్కరసములతోను, పోల్చబడినది. (౨) తస్యతెక్షీయమాణస్య నిర్వపామిదేవయజ్యాయైఇత్యాహ । ఆశిషమేవైతామాశాస్తే (తై-బ్రా. ౩-౩-౩) అనగ ఆవీర్యమునుధరించి గర్భము కావలయునని ప్రార్థన అక్షయమానమనెడిపదముయొక్క యభిప్రాయము ‹‹ఆశిషమేవైతామాశాస్తే'' అని విద్యారణ్యమునందు చెప్పంబడినది. (పుట-౧౫౫)

ఇందుకు విద్యారణ్యభాష్యము ‹‹హేఆజ్యత్వంమహీనాం గవాం పయోసి సాక్షాత్ తజ్జన్యత్వాదోషధీనాం రసశ్చాసి పరమ్పరయా తజ్జన్యత్వాత్ తాదృశస్యక్షయరహితస్య తవస్వరూపందేవయాగార్థం పాత్ర్యాంనిర్వపామి''. (చెన్నపట్టణముకూర్పు పుట. ౧౫౪)

ఇందుకువినియోగము "మహీనాంపయోసి ఓషధీనాంరసస్తస్యతే అక్షీయమాణస్యనిర్వపామిదేవయజ్యాయా ఇతిత్రిస్యాంపవిత్రాం తర్హి తాయామాజ్యం నిరుప్య". (ఆపస్తంబశ్రౌత ౨-౬-౧)

ఈమంత్రమునందు దేవయజ్యాయై అనుపదములేక పోయినను బ్రాహ్మణమునందు పఠింపబడుటచే సూత్రమునందును దేవయజ్యాయై అనుపదము ప్రయోగింపబడినది.

౧౨. (౧) మహీనాం పయః అసి ఓషధీనాం రసః
(౨) అదబ్ధేన త్వా చక్షుషా అవ + ఈక్షే సుప్రజాస్త్వాయ.

జ్ఞానార్థము.

(౧) టీ ॥ మహీనాం=(ఓ వీర్యమా) గోవులయొక్క, పయోసి = పాలవంటిదానవు, ఓషధీనాం=ఓషధులయొక్క, రసః=రసమువంటిదానవు,(౨)సుప్రజాస్త్వాయ=మంచిసంతానముకొరకు, త్వా =ఓవీర్యమానిన్ను, అదబ్ధేన=రోగరహితమై సుఖకరముగ నుండునటుల, చక్షుషా=నేత్రముచే అవ + ఈక్షే = చూచుచున్నాను (అనగ అనుగ్రహించుచుచున్నాను).

తా॥ వీర్యము గోక్షీరములవలెను వృక్షమువలెను సారవంతమైనది. నిన్ను నేను ప్రియమైన దృష్టితో సంతానముకొరకు గ్రహించుచున్నాను.

కర్మార్థము.

టీ॥ మహీనాం=[ఓయాజ్యమానీవు] గోవులయొక్క, పయః=పాలుచేతబుట్టినదానవు, ఓషధీనాం=ఓషధులయొక్క రసః=రసరూపమైనదానవు, అసి=అగుచున్నావు, అదబ్ధేన=సౌమ్యమైన. చక్షుసా=దృష్టిచేతను, సుప్రజాస్త్వాయ=మంచిసంతానము కలుగుటకొరకు,త్వా =నిన్ను, .అవేక్షే=చూచుచున్నాను,

వినియోగము॥ ఈమంత్రముచెప్పియజమానునిభార్య అజ్యమునుచూడ వలయును.

వి ॥ కర్మయందాజ్య ముపయోగింపబడుచున్నది. ఆయాజ్యము వీర్యమునకు సాదృశ్యమగునటుల పూర్వమంత్ర వివరణచూడుము.

అదబ్ధేనఅనగ "రోగానుపహతేనఅనివిద్యారణ్యభాష్యమునందు చెప్పబడినది (చెన్నపట్టణంకూర్పు పుట ౧౫౫) ఈమంత్రమునకు భట్టభాస్కరము అదబ్ధేనతిమిరాదిభిరను పహతేనచక్షుషా త్వామవేక్షేపశ్యామి సుప్రజాస్త్వాయ శోభనాపత్యత్వాయ (౧-౧-౧౦) అనియుః అదబ్ధేనసుఖ యుక్తేనత్వాత్వాంతం వాచక్షుషా విజ్ఞానేనప్రత్యక్ష ప్రమాణేననేత్రేణ అవక్రియార్థే అవేతివినిగ్రహార్థీయః పశ్యామిసం

ప్రేత్యే'' (శుక్లయజుర్వేదభాష్యం బొంబాయికూర్పు పుట ౯౧) ఇందువలన విజ్ఞానవేత్రముచేత చూడదగినది వీర్యమనియు, దానికి సాదృశ్యముగ ప్రత్యక్ష నేత్రముల చే చూడగిదనది యాజ్యమనియు గ్రహించదగును.

ఈమంత్రము ‹‹అదబ్ధేనత్వాచక్షూషావపశ్యామి'' అనివాజసనేయులు పఠించుచున్నారు (౧ - 30) ఇందుకు మహీధరభాష్యము ‹‹అదబ్ధేన అనుపహింసితేనచక్షుషాత్వాత్త్వామవపశ్యామి । అర్వాచీనం యథాతథా అధోముఖీసతీపశ్యామి' (పత్రం- ౧౯)

ఈమంత్రముయొక్కబ్రాహ్మణము ‹‹పత్న్యవేక్షతే మిథునత్వాయప్రజాత్యై । యద్వైపత్నీయజ్ఞస్యకరోతి । మిథునంతత్ । అథోపత్నియా ఏవైషయజ్ఞస్యాన్వారమ్భోనవచ్ఛిత్త్యై'' (తై. బ్రా. 3-3-౪)

ఈ మంత్రము యొక్క వినియోగము "అవేక్షతే మహీనాంపయోసీతి" (ఆపస్తంబశ్రౌత. ౨-౬-౨)

## ౧3. తేజః అసి

**జ్ఞానార్థము.**

టీ॥ (ఓవీర్యమానీవు) తేజః = తేజస్సు, అసి=అగుచున్నావు.

తా॥ వీర్యము తేజస్సువంటిది.

**కర్మార్థము.**

టీ॥ తేజః=ఓయాజ్యమానీవు తేజోరూపమైనదానవు, అసి=అగుచున్నావు

వినియోగము॥ ఈమంత్రముచెప్పి ఆజ్యపాత్రమును గార్హపత్యాగ్నియందుంచవలయును.

వి ॥ వీర్యము తేజస్సుయైనందుకు ప్రమాణము వేద నిఘంటువునందును ఉపనిషత్తులందును చెప్పంబడినది గావునవాటిని (౧౧-వ మంత్రవివరణచూడుము)

ఇందుకు విద్యారణ్యభాష్యము ‹‹హె ఆజ్యత్వంతేజోరూపమసి'' (చెన్నపట్టణం కూర్పు. పుట - ౧౫౬) ఈమంత్రమునకు ౧౪- వ మంత్రమునకు కలిపి బ్రాహ్మణమునందు వ్యాఖ్యానము చేయంబడినది.

ఇందుకు వినియోగము. ‹‹ తేజోసీత్యుత్తరార్థే గార్హపత్యస్య అధిశ్రయతి'' (ఆపస్తంబశ్రౌత ౨ - ౬ - 3)

## ౧౪. తేజః అను ప్ర ఇహి

**జ్ఞానార్థము.**

టీ ॥ తేజః=(ఓవీర్యమానీవు) తేజస్సును, అను+ప్ర+ ఇహి=పొందుము.

**కర్మార్థము.**

టీ॥ తేజః= (ఓయాజ్యమానీవు) తేజస్సును, అనుప్రేహి=పొందుము.

తా ॥ ఓవీర్యమానీవు తేజస్సునుపొందుము.

వినియోగము॥ ఈమంత్రము చెప్పి ఆజ్యపాత్రమును తీసికొనివెళ్లవలయును.

ఇందును విద్యారణ్యభాష్యము "తేజోరూపమాహవనీయం అనుప్రవేష్టుంగచ్ఛ" (పుట- ౧౫౬) ఇందును భట్టభాస్కరమునందు చెప్పంబడినదేమనగ "తేజోనుప్రేహి అనుక్రమేణగచ్ఛ" ౧ - ౧ - ౧౦)

ఈమంత్రమునకు బ్రాహ్మణము వెనుకమంత్రము చూడుము, ఇందును వినియోగము "తేజో అనుప్రేహీతిహరతి" (అపస్తంబశ్రౌత- ౨- ౬ - ౫)

## ౧౫. అగ్నిః తే తేజః మా వి నైత్.

జ్ఞానార్థము.

టీ॥ అగ్నిః=భగవంతుడు, తె= నీయొక్క, తెజః=తెజుస్సును, మా+వి+నైత్=నశింపచేయక పోవుగాక, అనగ వృద్ధిపొందించుగాక;

తా॥ ఓ వీర్యమానీయొక్క తేజస్సును వృద్ధిపొందించుగాక.

కర్మార్థము.

టీ॥ తే = [ఓయాజ్యమా] నీయొక్క, తేజః= తేజస్సును, అగ్నిః=అగ్ని;మావినైత్=పోగొట్టకపోవుగాక.

వినియోగము॥ ఈ మంత్రము చెప్పి ఆజ్యపాత్రము నాహవనీయాగ్నియందుంచవలయును.

వి॥ ఇందును విద్యారణ్యభాష్యము "అహం ఆహవనీయో అగ్నిః త్వదీయం తేజోరూపం మాపనయత్" (చెన్నపట్టణంకూర్పుపుట ౧౫౬.)

ఇందును బ్రాహ్మణము "అగ్నిస్తే జోమావినైదిత్యాహాహింగ్ంసాయై ।" (తై. బ్రా. 3-3-౪.)

ఇందును వినియోగము "అగ్నిస్తే తేజోమావినైదిత్యాహవనీయే అధిశ్రిత్య (అపస్తంబశ్రౌత ౨-౬-౫.)

## ౧౬. (౧) అగ్నేః, జిహ్వా అసి సుభూః దేవానాం.
## (౨) ధామ్నే ధామ్నే దేవేభ్యః యజుషేయజుషే భవ.

జ్ఞానార్థము.

టీ॥ (౧)అగ్నేః=భగవంతునుని, జిహ్వా=తెలుసుకొనుదానవు, అసి=అగుచున్నావు, (గనుక) దేవానాం = విబుధులకు, సుభూః=సుఖముకొరకుఅగుచున్నావు.(౨) దేవేభ్యః=విబుధులకొరకు,

కర్మార్థము.

టీ॥ అగ్నేః=[ఓయాజ్యమానీవు]అగ్నికి, జిహ్వా=నాలికవంటిదానవును, అసి=అగుచున్నావు, దేవానాం=దేవతులకు, సుభూః=సుఖముకొరకు అయ్యెడిదానవు,అగుచున్నావు. దేవేభ్యః=దేవ

ధామ్నే ధామ్నే = సర్వస్థానములనుధ రించుటకొరకు, (కర్మ) యజుషే యజుషే = ప్రతిమంత్రముకొరకు, భవ = కమ్ము

తా॥ ఓ వీర్యమా నీవు క్రమముగ వృద్ధిపొంది మనుష్యుడవై భగవంతుని గ్రహించి విబుధులకు సుఖకరమైన పనులను చేయుచు నుండుము.

తులకొరకు, ధామ్నే ధామ్నే = ప్రతిస్థానమునకున్ను యజుషే యజుషే = ప్రతిమంత్రమునకును, భవ = అగుము.

వినియోగము ॥ ఈమంత్రము చెప్పి ఆజ్యపాత్రమును, స్ఫ్యము అనగా కత్తివలెనుండు కొయ్యపనిముట్టుచేత గీచినగీతయందుంచవలయును.

---

వి॥ ఈమంత్రము బ్రాహ్మణమననుసరించి రెండుభాగములగ చేయంబడినది. "జిహ్వా" అనగ జిహీతే విజానాతి రసం అనయాసా । జిహ్వా" అని శుక్లయజుర్వేదమందు చెప్పంబడినది (బొంబాయిపూర్వపుట ౯౧).

ఇందుకు విద్యారణ్యభాష్యము. "హే ఆజ్యజ్వాలా రూపాయా జిహ్వాయా ఉత్పాదకత్వాత్ అగ్నేర్జిహ్వాసి దేవానాంసుఖాయ భవసీతి సుభూః" (పుట ౧౫౬).

ఈ మంత్రముయొక్క రెండవభాగమునకు విద్యారణ్యభాష్యము మృగ్యము. భట్టభాస్కరమునందు చెప్పంబడినదేమనగ. "దేవేభ్యః దేవానాంషష్ఠ్యర్థే చతుర్థీ దేవార్థంవా ధామ్నే ధామ్నే సర్వస్మైధారుణాయ అనుదాత్తంచేతి ద్వితీయస్యామ్రేడితత్వాత్ అనుదాత్తత్వం యథాయథం స్వస్వపదస్థిత యేదేవానాం ప్రభూతంభవ తదర్థం యజుషేయజుషే భవపర్యాప్తంసంభవ" (౧-౧-౧౦)

ఈమంత్రమునకు శుక్లయజుర్వేదభాష్యమునందు కలకత్తా బొంబాయి పూర్వలలో చెప్పంబడినదేమనగ "ధామ్నే ధామ్నే తత్తద్యాగ ఫలోపభోగస్థానసిధ్యర్థం భవ । యజుషేయజుషే తత్తద్యాగసిద్ధయె యోగ్యంభవేత్యర్థః" (కలకత్తా పూర్వ పత్రం ౨౦) "దేవేభ్యః విద్వద్భ్యోద్వివ్యగుణేభ్యోవా। ధామ్నే ధామ్నే దధతివస్తూనిసుఖానిచ యస్మిన్ తస్మైప్రత్యధికరణ ప్రాప్తయె । ధామాని త్రయాణిభవంతి స్థానాని నామాని జన్మానీతి అత్రవిప్సాయాంద్విత్వం (భవ) భవతివా (యజుషే యజుషే) యజంతియేనతస్మై ప్రతియజుర్వేదమంత్రం" (బొంబాయిపూర్వపుట ౯౧)

ఇందువలనను, ఈమంత్రముయొక్క బ్రాహ్మణ వ్యాఖ్యానమువలనను, పుత్రుడు ప్రతికర్మను జ్ఞానులకిష్టమగునటులజేసి సుఖముపొందవలయునని ప్రార్థన.

ఈమంత్రమునకు బ్రాహ్మణము (౧) "అగ్నేర్జిహ్వాసిసుభూర్దేవానామిత్యాహ। యథాయజురేవైతత్" (౨) "ధామ్నే ధామ్నే దేవేభ్యో యజుషేయజుషేభవేత్యాహ। ఆశిషమేవైతామాశాస్తే" (తై. బ్రా. 3-3-౪)

ఇందుకు వినియోగము "అగ్నేర్జిహ్వాసీతి స్ఫ్యస్యవర్త్మన్సాదయతి" (ఆపస్తంబశ్రౌత ౨-౬-౫) ఇందుకు బోధాయనులు కొంచము భిన్నముగ చెప్పియున్నా

రు. ‘‘అగ్నై సప్యధాహ్యతం ప్రతిపరిహృత్య ఉత్తరార్ధే వేద్యైనిధాయ అధ్వర్యురవేక్షతే అగ్నేర్జిహ్వాసి సుభూర్దేవానాం ధామ్నే ధామ్నే దేవేభ్యో యజుషేయజుషే భవ’’ విద్యారణ్యభాష్యము (పుట. ౧౫౬)

౧౭. శుక్రం అసి.

| జ్ఞానార్థము | కర్మార్థము. |
|---|---|
| శుక్రం=ఓవీర్యమానీవు, దీప్తిగలదానవు, అసి=అగుచున్నావు. | టి ॥ శుక్రం=[ఓయాజ్యమానీవు] దీప్తికలదానవు. అసి=అగుచున్నావు. |
| | వినియోగము ॥ ఈ మంత్రము చెప్పి ఆజ్యమును పవిత్రముచేత పరిశుద్ధిజేయవలయును. |
| తా॥ నీవుదీప్తిగల దానవు. | |

ఇందుకు విద్యారణ్య భాష్యము ‘‘శుక్రం దీప్తిమత్’’అని చెప్పంబడినది. (పుట ౧౫౬)

౧౭- ౧౮- ౧౯- మంత్రములకు బ్రాహ్మణమునందు ఏకవ్యాఖ్యానము‘‘శుక్రమసిజ్యోతి రసితేజో సీత్యాహ, రూపమేవాస్య ఏతన్మహిమానంవ్యాచష్టే’’ (తై బ్రా. ౩- ౩- ౪-)

ఇందుకు వినియోగము ‘‘శుక్రమసీతి ప్రథమం’’ (ఆపస్తంబశ్రౌ ౨-౭. ౧-)

౧౮. జ్యోతిః అసి.

| జ్ఞానార్థము. | కర్మార్థము. |
|---|---|
| టీ ॥ జ్యోతిః= ఓవీర్యమానీవుప్రకాశించుదానవు, అసి=అగుచున్నావు. | టీ ॥ జ్యోతిః = [ఓయాజ్యమానీవు] జ్యోతిస్స్వరూపము కలదానవు, అసి = అగుచున్నావు. |
| | వినియోగము ॥ ఈమంత్రము చెప్పి రెండవసారి ఆజ్యయమును పవిత్రముచేత పరిశుద్ధిజేయవలయును. |
| తా ॥ నీవుప్రకాశించుదానవు. | |

వి ॥ ఇందుకు విద్యారణ్యభాష్యము. వృగ్యము ఇందుకు బ్రాహ్మణమునుగూర్చి౧౭-వ మంత్రవివరణచూడుము

విందుకు వినియోగము ‘‘జ్యోతిరసీతిద్వితీయం’’ (ఆపస్తంబ ౨-౭-౧).

౧౯. తేజః అసి.

| జ్ఞానార్థము. | కర్మార్థము. |
|---|---|
| టీ॥ తేజః=ఓవీర్యమానీవు తేజస్సు | టీ ॥ తేజః = [ఓయాజ్యమానీవు] |

కలదానవు, అసి = అగుచున్నావు.

తా ॥ నీవు తేజస్సుగలదానవు.

తేజస్స్వరూపము కలదానవు. అసి=అగుచున్నావు.

వినియోగము ॥ ఈమంత్రము చెప్పి మూడవసారి ఆజ్యమును పవిత్రముచే పరిశుద్ధిచేయవలయును.

వి ॥ విద్యార్యభాష్యముప్పగ్యము. బ్రాహ్మణమునుగూర్చి ౧౬-వమంత్రవివరణ చూడుము.

ఇందుకు వినియోగము "తేజోసీతితృతీయం' (ఆపస్తంబ-౨౭-౧)

౨౦ దేవః వః సవితా ఉత్ పునాతు అచ్ఛిద్రేణ పవిత్రేణ వసోః సూర్యస్య రశ్మిభిః.

జ్ఞానార్థము.

౭౧ - ౭౨-వ పుట చూడుడు.

కర్మార్థము.

టీ ॥ సవితా=ప్రేరకుడైన, దేవః =పరమేశ్వరుడు, వః = (ఉదకములారా) మిమ్ములను, అచ్ఛిద్రేణ=ఛిద్రరహితమైన, పవిత్రేణ = పవిత్రముచేత, వసోః=కాంతికలవాడైన, సూర్యస్య = సూర్యునియొక్క,రశ్మిభిః=కిరణములచేత, ఉత్పునాతు = ఉత్పవనము అనగపరిశుద్ధిజేయుగాక.

వినియోగము ॥ ఈమంత్రముచెప్పి ప్రోక్షిణీపాత్రయందుండుదకములను పవిత్రముచేత పరిశుద్ధిచేయవలయును.

౨౧. శుక్రం త్వా శుక్రాయాం ధామ్నే ధామ్నే దేవేభ్యః యజుషేయజుషే గృహ్ణామి.

జ్ఞానార్థము.

టీ ॥ శుక్రం = కాంతిగలిగిననిన్ను, శుక్రాయాం= ప్రకాశించుదానియందు, దేవేభ్యః=దేవతలకొఱకు, ధామ్నేధామ్నే=సర్వవస్తువులను ధరించుటకొఱకు, త్వా=నిన్ను,యజుషేయజుషే=ప్ర

కర్మార్థము.

టీ ॥ శుక్రం=[ఓయాజ్యమా] ప్రకాశించుచున్న, త్వా=నిన్ను, శుక్రాయాం=ప్రకాశించుచున్న [పాత్రమందు], దేవేభ్యః=దేవతలనిమిత్తము, ధామ్నేధామ్నే=ప్రతిష్ఠానమునకును, య

తిమంత్రముకొరకు; గృహ్ణామి=గ్రహించుచున్నాను.

తా॥ ప్రకాశమైన వీర్యమా నిన్ను భగవత్పూజార్థము ఉంచుచున్నాను

జుషే యజుషే = ప్రతి మంత్రమునకు [చాలునట్లుగా], గృహ్ణామి=గ్రహించుచున్నాను.

వినియోగము ॥ ఈమంత్రము చెప్పి జుహువనెడి పాత్రమందు ఆజ్యమునుంచవలయును.

వి ॥ ఇందుకు విద్యారణ్యభాష్యము "హేఆజ్యదీప్తంత్వాం దీప్తాయాం తత్తన్మంత్రపూర్వక గ్రహణాయ తత్తద్ధామస్థానాయ పర్యాప్తంగృహ్ణామి, ఏవమితరయోర్యోజ్యం" (పుట ౧౪౮) ఇచట ధామ్నేధామ్నే అనుపదమునకు భాష్యము వ్రాసియుండుటవలన, ౧౬-వ మంత్రమునందు ఈపదమునకు వ్రాయబడలేదని యోచించం తగును.

ఇందుకు బ్రాహ్మణము. ౨౧ - ౨౨ ' ౨౩ - మంత్రములకు ఏకముగ బ్రాహ్మణము చేయంబడ్డది. "శుక్రంత్వాశుక్రాయాంజ్యోతిస్త్వాజ్యోతిష్యర్చిస్త్వార్చిషీత్యాహ సర్వత్వాయ' (తై. బ్రా, ౩-౩-౪)

ఇందుకువినియోగము "శుక్రంత్వాశుక్రాయామితి త్రిభిఃపంచానాంత్వా వాతానామితిచ ద్వాభ్యాం జుహ్వాంచతుః పంచకృత్వోవా ప్రతిమంత్రం ౮. పంచానాంత్వాదిశాం పంచానాంత్వాపంచజనానాం పంచానాంత్వాసలిలానాం ధార్త్రాయగృహ్ణామి పంచానాంత్వా పృష్ఠానాంధాత్రాయ గ్రహ్ణామి ధామాసిప్రియం దేవానాంఅనాధృష్టందేవయజనందేవవీతయేత్వాగృహ్ణామీతి చరోస్థ్వాపంచబిలస్యేతిచపంచభిరుపభృత్యష్టకృత్వో దశకృత్వో వా ప్రతిమంత్రం॥ ౯ ॥ శేషేణధ్రువాయాం చతుః పంచకృత్వోవా ప్రతిమంత్రం ॥ ౧౦ ॥ సోత్కర ఆజ్యాని సాదయతి ॥ ౧౧ ॥ ,, (ఆపస్తంబశ్రౌ ౨- ౭-౮-౧౧) ఈ వినియోగమునువిద్యారణ్యమందు చెప్పంబడిన వినియోగమునకును కొంచముభిన్నముగ నున్నయది.

## ౨౨. జ్యోతిః త్వా జ్యోతిషి.

జ్ఞానార్థము.

౨౧-వ మంత్రముచూడుము.

కర్మార్థము.

టీ ॥ జ్యోతిః=[ఓయాజ్యమా] జ్యోతి స్వరూపమైన, త్వా = నిన్ను, జ్యోతిషి = జోతిస్వరూపమైన[పాత్రమందు]దేవతులకొరకు ప్రతిష్ఠానమునకు ప్రతిమంత్రమునకు చాలునట్లుగా]ఉంచుచున్నాను.

వినియోగము. ఈ మంత్రముచెప్పి జుహువనెడి పాత్రమందు రెండవసారి ఆజ్యము నుంచవలయును.

౨౩. అర్చిః త్వా అర్చిషి ధామ్నే ధామ్నే దేవేభ్యః యజుషే యజుషే గృహ్ణామి.

జ్ఞానార్థము.

అర్చిః = (ఓవీర్యమా) జ్యోతిస్వరూపమైన, త్వా=నిన్ను, అర్చిషి=జ్యోతిస్వరూపమైనదానియందు, దేవేభ్యః=విబుధులకొరకు, ధామ్నే ధామ్నే=సర్వముధరించుటకొరకు, యజుషే యజుషే=ప్రతిమంత్రముకొరకు, గృహ్ణామి=గ్రహించుచున్నాను

తా॥ జ్యోతిస్వరూపమైనవీర్యమా నిన్ను భగవత్పూజ కొరకు ఉంచుచున్నాను.

కర్మార్థము.

టీ॥ అర్చిః = [ఓయాజ్యమా జ్యోతిస్వరూపమైన, త్వా=నిన్ను, అర్చిషి=జ్యోతిస్వరూపమైన పాత్రయందు, దేవేభ్యః= దేవతలకురకు, ధామ్నే ధామ్నే=ప్రతిష్ఠానమునకు, యజుషేయజుషే = ప్రతిమంత్రమునకు, [చాలునట్లుగ, గృహ్ణామి=గ్రహించుచున్నాను.

వినియోగము. ఈ మంత్రము చెప్పి జుహువనెడి పాత్రమందు మూడవసారి ఆజ్యమునుంచవలయును.

వి॥ ౨౧వ - మంత్రవివరణ చూడుము.

---

## పదియవ యనువాక సామాన్యవిషయములు.

౧. ఈఅనువాకము కర్మరీత్యా "ఆజ్యగ్రహణమని" చెప్పంబడుచున్నది జ్ఞానరీత్యా వీర్యనిర్వాపణమని చెప్పందగును.

౨. ప్రాతిశాఖ్య— ఈఅనువాకమందుండెడి యేయేమంత్రములు త్రిభాష్యరత్నమందేయే, సూత్రములలో, నుదహరింపంబడినవో యాసూత్రములను, మంత్రములన్నిచ్చట వ్రాయుచున్నారము.

(౧) "రాసస్సప్తె" అనుసూత్రము ౧౩౬- పుట యందువ్రాయంబడినది. ఈసూత్రమునుబట్టి ౨- వ మంత్రమునందున్న, నిః, అనుపదమునకు "త" కారముపరముందుండగ, విసర్గకుషకారము వచ్చుటచె, నిష్టపామి, అనియైనది.

(౨) "థశ్చరం" (౭అ-౧౪.సూ) ఈసూత్రమునుబట్టి ౩-వ మంత్రమునందుండెడి గోష్టమను పదమునందు, థకారమునకు షకారముపూర్వముగ నుండుటచే తకారమువచ్చి, గోష్ఠం అనియయినది.

(౩) "తత్రపూర్వం పూర్వం ప్రథమం" (౫అ- ౩సూ) ఈసూత్రమునుబట్టి ౯-వమంత్రమునందుండు "విష్యామి" అనుపదముయొక్కరూపమెటులననగ వి+స్యామి- అనిప్రకృతిరూపము. ఈసకారమునకు షకారమున్ను దానికి ద్విత్వము

న్ను సిద్ధించవలయును. షకారము, ౬అ, ౪-వ సూత్రమువలననున్ను; ద్విత్వము ౧౪-అ, ౧సూత్రమువలననున్ను సంభవించవలయును. వీటిలో ముందుద్విత్వమువచ్చి తరువాత షకారము రాకూడదు. అట్లువచ్చెనేని ''వి+ష్+స్+స్ యామి'' అని కావలసియుండును. అదిసరియయినదికాదు. ప్రథమమందుచెప్పంబడినసూత్రప్రకారము ప్రథమవిధియు తరువాత చెప్పంబడినసూత్రప్రకారముతరువాతవిధియు, రావలయునని యీసూత్రము బోధించుచున్నది. కావున వి+స్యామి, ''విష్యామి''అనియయినది. తదనంతరంబ ''విష్+ష్యామి''అగుచున్నది.

(౪) ''ఉపసర్గనిష్పూర్వో అనుదాత్తేపదే'' (౬-అ ౪-సూ)
ఈసూత్రముబట్టి ౯-వ మంత్రమునందుండెడి స్యామి అనుపదము అనుదాత్తమగుట చేతను దానికిపూర్వము ''వి''అను ఉపసర్గయుండుట చేతనున్ను సకారమునకుష కారము సిద్ధించుచున్నది.

(౫)''ధీరాసోఽదబ్ధాస''అను ౧౧-అ,౧౬-సూత్రమీగ్రంథముయొక్క ౧౫౭-పుటయందు వ్రాయంబడినది. ఆ సూత్రమునుబట్టి ౭వ మంత్రమునందుండెడి ''అదాభ్యం''అనుపదముయొక్క ఆదిఅకారము ''అదబ్ధాస''అనుపదమునకు పరమందుండుటచేలోపించదు.

(౬) ''పూర్వాంతసస్థానోవిసర్జనీయః'' (౨-అ,౪౯-సూ)ఈసూత్రమునుబట్టి ౧౬వ- మంత్రమునందుండెడి''అగ్నేర్జిహ్వాసి'' యనువాక్యమునందు అగ్నిశబ్దాత్పరమైన విసర్గ పూర్వాచ్చుతోసమానస్థానముగచెప్పబడును.

౩. ఛన్దస్సు. ఆశాసానాయను ౭వ- మంత్రమును, సుప్రజసస్త్వాఅను ౮-వ-మంత్రమును, అనుష్టుప్ఛన్దస్సు. ఇందునుగూర్చి ౧౧౮-పుటచూడుము. ''ఇమం విష్యామి''అను౯వ-మంత్రముత్రిష్టుప్ఛన్దస్సు.''సమాయుషా''అను౧౦వ-మంత్రముఅనుష్టుప్ఛన్దస్సు.''దేవోవస్సవితోత్పునాతు'' అను ౨౦వ మంత్రము, గాయత్రీఛన్దస్సు.

౪. మీమాంస—''సంమార్ష్టి'' అనుజైమిని న్యాయమాల శ్లోకములు. ఈ అనువాకము యొక్క భాష్యము చివరను వ్రాయబడినవి. ''సమ్మార్ష్టిస్రుచ ఇత్యత్రకిం ప్రధానాఖ్యకర్మతా, గుణకర్మత్వ మథవా దృష్టాభావే అవఘాతవత్ ॥౧౬॥ గుణత్వం నహిసంభావ్యం ప్రాధాన్యంతు ప్రయాజవత్, అదృష్ట కల్పనేనాపి గుణత్వం స్యాద్ద్వితీయయా ॥ ౧౭॥'' (౨అ, పా) ఇందుకు ఆధారమైన జైమిని సూత్రములు ''ధర్మమాత్రేతు కర్మస్యాత్ అనిర్వృత్తేః,ప్రయాజవత్'' (౨అ, ౧పా, ౯-సూ)

''తుల్యశ్రుతిత్వాద్వా ఇతరైస్సమర్థస్స్యాత్'' (౨-అ, ౧-పా, ౧౦-సూ)

కర్మలు ''తానిద్వైధంగుణప్రధానభూతాని'' (౨-అ,౧-పా, ౬-సూ) అను ప్రమాణముబట్టిగుణము(లేకఅప్రధానము)ప్రధానముఅని ౨-విధములు. సమ్మార్జనము మొదలగుకర్మలు అప్రధానమని నిరూపింపబడినవి. ద్రవ్యఫలమును కోరనివేముఖ్యకర్మలుగచెప్పంబడినవి. ప్రయాజమంత్రములనుగూర్చి ౧౩-అనువాకము చూడుము.

౮. వ మంత్రమునందు 'సుపత్నీ' అనుపదము బహువచనముగ నున్నను ఏకవచనార్థమే చెప్పవలయుననని మీమాంసయందు పరిష్కరించిరి. అదియెట్లన్న. “పత్నీసన్నహనంకార్యం చోదకాదితిచేన్నతత్ । బద్ధవాసోధారణయోరర్థోక్తి బద్ధనసిద్ధితః” (జైమినిన్యాయమాల ౧౨-అ, ౧పా) ఇందుకుజైమినిసూత్రము.'సన్నహనంచవృత్తత్వాత్' (౧౨-అ, ౨౮-సూ) పత్నీమితిద్విపత్న్యాదౌ వూహ్యంనోవోహ్యతీర్థతః । నోపదేశస్యసామాన్యాత్ అతిదేశాత్ప్రవృత్తితః” (౯-అ, ౩-పా)

౫. 'ధర్మశాస్త్రం'—ఈయనువాకమునందు గృహస్థాశ్రమముచెప్పంబడినది. ఈయాశ్రమము ముఖ్యమైనదని బ్రాహ్మణమునందు చెప్పినయటుల నిదివరకు ౭-వమంత్రవివరణయందు వ్రాసియున్నాము. బ్రహ్మసూత్రములయొక్క ౩-అ,౪-పాదమునందు చెప్పంబడినది. “బ్రహ్మచర్యం సమాప్యగృహీభవేత్ వనీభూత్వాప్రవ్రజేత్” ఇతిసామాన్యప్రమాణము. ఈవిషయమై మనుస్మృతియందు చెప్పబడినదేమనగ “అధీత్యవిధివద్వేదాన్ పుత్రాంశ్చోత్పాద్యధర్మతః । ఇష్ట్వాచశక్తితోయజ్ఞైః మనోమోక్షేనివేశయేత్' (౬-అ, ౩౫-శ్లో).

౬. ఉపనిషత్తు. పుత్రునిపొందుట యావశ్యకమని ఉపనిషత్తులయందును చెప్పంబడినది. “అథత్రయోవావలోక మనుష్యలోక పితృలోకే దేవలోకఇతి సోయంమనుష్యలోకః పుత్రేణైవజయ్యోనాన్యేన కర్మణా' బృహదారణ్యకోపనిషత్ (౩-అ, ౫-బ్రా, ౧౬-వా) అనగపుత్రునిచేతనే మనుష్యలోకము జయించవలసినది. ఈవిషయమైయే ౧౭-వ వాక్యమునందు చెప్పంబడినది. తండ్రిచనిపోయె సమయమునకుమారునిబిలచి జ్ఞానబోధచేసి తానుఈలోకమునందు చేయవలసిన విధులయందు కుమారుని ప్రవేశపెట్టవలయును. ఈప్రకారముగచేయుట మనుష్యలోకము జయించునట్లుగ నెంచవయును “తస్మాత్ పుత్రమనుశిష్టం లోక్యమాహుః తస్మాత్ ఏనమనుశాసతి సయదైవం విదస్మాత్ లోకాత్ ప్రైత్యథైభిరేవ ప్రాణైస్సహ పుత్రమావిశతిసయద్యనేన కించిదక్ష్ణయాకృతం భవతి తస్మాదేనగ్ం సర్వస్మాత్ పుత్రోముంచతి తస్మాత్ పుత్రోనామ సపుత్రేణైవాస్మిల్లోకే ప్రతిష్ఠత్యథైన మేతేదేవాః ప్రాణా అమృతఆవిశన్తి”.

ఈవాక్యములకు శ్రీశంకరాచార్యులవారు చెప్పినభాష్యములోని ముఖ్యాంశములెవ్వియనగ “ఏవంసాధ్యలోకత్రయఫలభేదేనవినియుక్తానిపుత్రకర్మవిద్యాఖ్యానిత్రీణిసాధనాని” పుత్రేవాస్వాత్మవ్యాపార సంప్రదానం కరోతి అనేనప్రకారేణ పితా + + పుత్రః పితరం అస్మాత్ లోకాత్ కర్తవ్యతా బన్ధనమోచయిష్యతి తస్మాత్ పుత్రం అనుశిష్టంలోక్యం” అనగ మనుష్యలోకమునందు తానుచేయవలసిన విధులనుకుమారుడు పూర్తిచేసి తండ్రిని విడుపించువాడు కావున పుత్రుడని పేరుగలిగినది.

౭. పురాణం. మహాభారతశాంతిపర్వముయొక్క ౧౭౦ అధ్యాయమునందు పుత్రసంతానమునుగూర్చి చెప్పంబడినది "వేదానధీత్య బ్రహ్మచర్యేణ పుత్రపుత్రాని చ్ఛేత్పావనార్థం పిత్రూణామగ్నీనాధాయ విధివచ్చేష్టయజ్ఞోపనం ప్రవిశ్యాథమునిర్బు భూషేత్" (౬-శ్లోకము) అనికుమారునికి తండ్రి బోధచేసెను. అయితే ఆకుమారుడు బహుజ్ఞానియై ఆశ్రమములయందు క్రమముగ ప్రవేశించకనే బ్రహ్మవిద్యను సంపాదించెను. ఇటులమహానుభావులకు తప్ప యన్యులకుసంభవించదు. గనుకసామాన్యులందరు బ్రహ్మచర్య గృహస్థాశ్రమములయందు ప్రవేశించవలసినది. శ్రీశంకరాచార్యులుమొదలగునట్టి మహానుభావులు తమతమశిష్యులద్వారా పుత్రుడుచేయవలసినకార్యములు చేయించెదరు. మరియుప్రతిమనుజుడుతనకుతెలసినవిద్యను పుత్రునిద్వారాగాని, శిష్యులద్వారాగాని, మనుష్యలోకమున కుపయోగముగనుండుకొరకు వ్యాపకముచేయవలసినదియేగానిదానినినశింపచేయకూడదు. కావుననేఛాన్దోగ్యోపనిషత్తునందు 'ఇదంవావతత్ జ్యేష్ఠాయపుత్రాయపితా బ్రహ్మప్రబ్రూయాత్ ప్రాణాయ్యావాన్తేవాసినే' అనిచెప్పంబడినది. (౩-ప్ర, ౧-ఖం, ౪-వాక్యం.)

౮. ఈయనువాకమునకు సంబంధించిన ఇతరశాఖలు, బ్రాహ్మణము, కల్పము.

శాఖలు.

| | |
|---|---|
| కాఠకసంహిత | ౧. ౧౦ |
| మైత్రాయణీసంహిత | ౧. ౧. ౧౧ |
| కపిష్ఠలకఠసంహిత | ౧. ౧౦ |
| వాజసనేయసంహిత | ౧. ౨౯-౩౧ |

బ్రాహ్మణము.

| | |
|---|---|
| కాఠకబ్రాహ్మణము | ౩౧. ౯ |
| మైత్రాయణీబ్రాహ్మణము | ౪ ౧.౧౨. ౧౩ |
| తైత్తిరీయబ్రాహ్మణము | ౩. ౩. ౧-౪౦ |
| శతపథబ్రాహ్మణము | ౧. ౩.౧. ౪- ౨౭ |

కల్పము.

| | |
|---|---|
| మానవశ్రౌతం | ౧. ౨. ౫ |
| కాతీయశ్రౌతము | ౨. ౬. ౪౬-౭. ౯ |
| ఆపస్తంబశ్రౌతము | ౨, ౪. ౨- ౭. ౧౧ |

దశమోఽనువాకము

సంపూర్ణము.



ఓమ్
శ్రీపరబ్రహ్మణేనమః.

కృష్ణయజుర్వేద

# తైత్తిరీయసంహితా మంత్రభాగస్య

ఏకాదశో ఽనువాకః.

కాండఋషి ప్రజాపతిః.

---

## ౧. కృష్ణః అసి ఆఖరేష్ఠః అగ్నయే త్వా స్వాహా.

జ్ఞానార్థము.

టీ ॥ కృష్ణః=(ఓచిత్స్వరూపమా నీవు కృష్ణరూపమును ధరించి, ఆఖరేష్ఠః =వనమనెడు శరీరమందుండు వాడవు, అసి=అగుచున్నావు, త్వా= (అట్టి) నిన్ను, అగ్నయే = భగవంతునికొరకు, స్వాహా=సమర్పించుచున్నాను.

తా॥ ఓచిత్స్వరూపమానీవు వనమందు కృష్ణమృగమున్నరీతిని శరీరమందుంచున్నావు. నిన్ను భగవంతునికి సమర్పించుచున్నాను.

కర్మార్థము.

టీ॥ కృష్ణః=[ఓయిధ్మా అనగా మోదుగ లేక రావిసమిధానీవు] కృష్ణరూపమైనదానవున్ను, ఆఖరేష్ఠః= వృక్షమందుండువాడవున్ను, అసి= అగుచున్నావు, అగ్నయే=అగ్నికొరకు, [ప్రియమైన] త్వా=నిన్ను, స్వాహా=ప్రోక్షించుచున్నాను.

వినియోగము ॥ ఈ మంత్రముచెప్పి మోదుగ లేక రావి మొదలైనసమిధలు మీద ప్రోక్షించవలయును.

---

వి ॥ కృష్ణశబ్దమునుగూర్చి "కృష్ణస్యమృగాఖ్యాయాం ఆద్యుదాత్తత్వమ్" అని భట్టభాస్కరమునందు చెప్పంబడినది (౧-౧-౧౧) అందువలన ఇచ్చట కృష్ణశబ్దమునకు కృష్ణమృగమని యర్థము. భగవంతుడు దేవతలయందుండు వాడనియు, కృష్ణరూపమునుధరించి వృక్షమనెడి యీశరీరమునందు ప్రవేశించెననియు బ్రాహ్మణము చెప్పుచున్నది. "అగ్నిర్దేవేభ్యోనిలాయత కృష్ణోరూపం కృత్వాసవనస్పతీన్ ప్రావిశత్" (తై. బ్రా. 3-3-౬)

"ఆఖరేష్ఠః" ఆఖరమనగ త్రవ్వెడియాయుధము, ఆఖరేష్ఠః అను శబ్దమును గూర్చి "ఆఖరేతిష్ఠతి స్థాక, షత్వం, వేదేనిత్యమలుక్" అనితారానాథవాచస్పత్య

మునందు చెప్పంబడినది. (పుట. ౬౦3) అనగ ఆఖరమందుండునది. ఇది వేదము సందెప్పవలుక్ష్మాసమగుటచేత ఆఖరస్థః అనియుండదు. ఆఖరమనగ రంధ్రము, త్రవ్వెడియాయుధమని విలియం నిఘంటువునందు చెప్పంబడినది. (పుట.౧౧3) ఆఖరమునందుండునది గనుక నిచ్చట ఆఖర శబ్దమునకు రంధ్రమని యర్థము చెప్పవలయును.

శరీరము వనస్పతియనగ వృక్షమని యిదివరకు వ్రాసియున్నాము (దశమో౽నువాక సామాన్యవిషయము-చూడుము) ఆఖరేష్ఠః అనగ నీశరీరమందుండు వాడని గ్రహించవలయును.

ఈమంత్రమునందు అధ్యాహారపదము ఏమియైనది స్వాహాశబ్దార్థము వలన గ్రహించందగును. ఈశబ్దమునుగూర్చి విద్యారణ్యమునందు చెప్పంబడిన దేమనగ “అతో౽గ్నయేప్రియంత్వాంప్రోక్షామి తదేతత్కర్తవ్యమితిస్వకీయాసరస్వతీబ్రూతె। సో౽యమర్థః స్వాహాశబ్దవాచ్యః అత ఏవ అగ్నిహోత్రబ్రాహ్మణే ప్రజాపతేః స్వకీయయా వాచాసహసంవాదే ఏవమామ్నాయతె తం వాగభ్యవదజ్జుహుధీతి సో౽బ్రవీత్ కస్త్వమసీతిస్సైవతెవాగిత్యబ్రవీత్ సో౽జుహో౽త్స్వాహేతి।తత్స్వాహాకారస్యజన్మఇతి। అథవానానార్థవాచీస్వాహాశబ్దో అత్రప్రోక్షణంబ్రూతె” (చెన్నపట్టణం కూర్పుపుట ౧౬౭)

స్వ+ఆహా=స్వాహా, స్వ అనగ నీసంబంధమైనదానిని అని, ఆహా=చెప్పచున్నది. (ఈవిషయమై సామాన్యవిషయములంజూడుము)

ఈమంత్రమునకు విద్యారణ్యభాష్యము “హేఇధ్మవహ్నెప్రియతమత్వాత్ తదభేదోపచారేణకృష్ణోమృగో౽సి। తథావనస్పతిష్ఠో౽అసి। అతో౽గ్నయేప్రియంత్వాం ప్రోక్షామి” (చెన్నపట్టణంకూర్పుపుట ౧౬౭)

ఈమంత్రమునకు బ్రాహ్మణము “కృష్ణో౽సిఆఖరేష్ఠో౽గ్నయేత్వాస్వాహేత్యాహ। అగ్నయ ఏవైనంజుష్టంకరోతి।అథో౽అగ్నేరేవ మేధమవరుంధె” (తై.బ్రా.3-3-౬) ఈ మంత్రమునకు వినియోగము “కృష్ణో౽స్యాఖరేష్ఠ ఇతిత్రిఃప్రోక్షతి” (ఆపస్తంబ శ్రౌత ౨-౮-౧)

---

౨. వేదిః అసి బర్హిషే త్వా స్వాహా.

జ్ఞానార్థము.

టీ॥ వేదిః= (ఓశరీరమానీవు) పృథివీరూపమైనదానవు, అసి=అగుచున్నావు, త్వా=నిన్ను, బర్హిషే=ప్రజలకొ

కర్మార్థము.

టీ॥ వేదిః=ఓవేదిప్రదేశమానీవు మాచేత పొందబడినదానవు, అసి=అగుచున్నావు,బర్హిషే=దర్భనుంచుటకొరకు,

రకు, స్వాహా=సమర్పించుచుచున్నాను.

తా ॥ ఓశరీరమా నిన్ను ప్రజలకొరకు సమర్పించుచున్నాను.

త్వా=నిన్ను, స్వాహా=ప్రోక్షించుచున్నాను.

వినియోగము ॥ ఈ మంత్రము చెప్పి వేదికయందు దర్భనుంచుటకు ప్రోక్షించవలయును.

వి ॥ ఆత్మ భగవత్సంబంధమగుటచె దానిని భగవంతునికి సమర్పించుటను గూర్చి ప్రథమ మంత్రమునందు చెప్పంబడినది. శరీరము పృథివి సంబంధమగుటచే ప్రజలయొక్క యుపయోగము నిమిత్తమర్పించవలయునని యీమంత్రమునందు చెప్పంబడినది. పరోపకారమిదంశరీరమని ప్రసిద్ధి.

ఈమంత్రమునకు విద్యారణ్యభాష్యము "హేవేదేత్వంలబ్ధాసి । తదిమామవిన్దంత యదిమామవిన్దంత తద్వేదైర్వేదిత్వం" ఇతి శ్రుతేః । అథోబర్హిర్ధారయితుం త్వాంప్రోక్షామి" (పుట. ౧౬౭)

ఇచ్చటవేదియను పదము పృథివియనియు, బర్హిషి అనుపదము ప్రజలనియు బ్రాహ్మణమునందు వ్యాఖ్యానము చేయంబడినది. "వేదిరసిబర్హిషేత్వాస్వాహేత్యాహ । ప్రజావైబర్హిః పృథివీవేదిః" (తై. బ్రా. 3-3-౬) ఈ మంత్రమునకు వినియోగము. "వేదిరసీతిత్రిర్వేదిం" (ఆపస్తంబశ్రౌత ౨-౮-౧)

## 3. బర్హిః అసి స్రుగ్భ్యః త్వా స్వాహా.

జ్ఞానార్థము.

టీ ॥ బర్హిః= (నీవు) సంతానము, అసి=అగుచున్నావు, స్రుగ్భ్యః= యజమానులకొరకు, త్వా=నిన్ను, స్వాహా=సమర్పించుచున్నాను.

తా ॥ సంతానమును భగవద్భక్తులకు సమర్పించుచున్నాను.

కర్మార్థము.

టీ॥ బర్హిః=ఓదర్భా(నీవు వేదికయందు పరచబడుదానవు) అసి = అగుచున్నావు, స్రుగ్భ్యః= హోమము చేసేపాత్రములనుంచుటకు, త్వా=నిన్ను, స్వాహా=ప్రోక్షించుచున్నాను.

వినియోగము॥ ఈమంత్రము చెప్పి దర్భలుమీద హోమముచేసెడి పాత్రములనుంచుటకు ప్రోక్షించవలయును.

వి ॥ "బర్హిః" అనగ ప్రజలనియు, స్రుక్ అనగ యజమానుడనియు, బ్రాహ్మణమునందు వ్యాఖ్యానము చేయబడినది. ప్రజలనగ మనుజులు, సంతానము. అని రెండర్థములు, ప్రజమొదలగు ౧౫-పదములు అపత్యార్థమునందు చెప్పంబడినది

(వేదనిఘంటు, ౨-౨) ఈమంత్రమునకు విద్యారణ్యాభాష్యము "హేదర్భత్వంవే దేర్బ్రహ్మణమసి। అతస్త్వయిస్రుచః స్థాపయితుంత్వాంప్రోక్షామి" (పుట.౧౬౮)

ఈమంత్రమునకు బ్రాహ్మణము ‹‹బర్హిరసి స్రుగ్భ్యస్త్వాస్వాహేత్యాహ। ప్రజావై బర్హిః యజమానః స్రుచః'' (తై. బ్రా. 3-3-౬)

ఈమంత్రమునకు వినియోగము. ‹‹బర్హిరసీతిత్రిర్బర్హిః। అంత్తర్వేదిపురోగ్రంథి బర్హిరాసాద్య'' (ఆపస్తంబశ్రౌత. ౨-౮-౧)

## ౪. దివే త్వా.

జ్ఞానార్థము.

టీ ॥ త్వా=నిన్ను, దివె=స్వర్గలోకముకొరకు, (సమర్పించుచున్నాను)

తా ॥ యజమానుడు తనను స్వర్గలోకమునకు సమర్పించుకొనుచున్నాడు.

కర్మార్థము.

టీ ॥ దివే=[ఓదర్భసముదాయమా] స్వర్గలోకముకొరకు, త్వా=నిన్ను, [అగ్రభాగములో ప్రోక్షించుచున్నాను].

వినియోగము॥ ఈమంత్రము చెప్పిదర్భసముదాయముయొక్క అగ్రభాగమందుప్రోక్షించవలయును.

వి ॥ ౪- ౫- ౬- మంత్రములను కలపి బ్రాహ్మణమునందు వ్యాఖ్యానము చేయంబడినది ‹‹ దివేత్వాంతరిక్షాయత్వా పృథివ్యై త్వేతి బర్హిరాసాద్యప్రోక్షతి, ఏభ్య ఏవైనం లోకేభ్యఃప్రోక్షతి '' (తై. బ్రా- 3- 3- ౬)

ఈ మంత్రమునకు వినియోగము ‹‹దివేత్వేత్యగ్రం ప్రోక్షతి '' (ఆపస్తంబ శ్రౌ ౨- ౮- ౧)

## ౫. అన్తరిక్షాయ త్వా.

జ్ఞానార్థము.

టీ ॥ అన్తరిక్షాయ= అంతరిక్షముకొరకు, త్వా = నిన్ను, (సమర్పించుచున్నాను.)

తా ॥ యజమానుడు తనను అంతరిక్షముకొరకు సమర్పించుకొనుచున్నాడు

కర్మార్థము.

టీ ॥ అన్తరిక్షాయ = [ఓదర్భసముదాయమా] అంతరిక్ష లోకము కొరకు, త్వా= నిన్ను, [అగ్రభాగములో ప్రోక్షించుచున్నాను].

వినియోగము॥ ఈమంత్రము చెప్పి వేదియందుంచిన దర్భసముదాయముయొక్క మధ్యభాగమందు ప్రోక్షించ వలయును.

వి ॥ ఈమంత్రముయొక్క బ్రాహ్మణమును గూర్చి ఈయనువాకముయొక్క ౪-వ మంత్రముచూడుము.

ఈమంత్రబ్రాహ్మణమును గూర్చి ౪-వ మంత్రము చూడుము.

ఈమంత్రమునకు వినియోగము. "అంతరిక్షాయత్వేతిమధ్యం," (ఆపస్తంబ శ్రౌత ౨-౮-౧-)

## ౬. పృథివ్యై త్వా.

జ్ఞానార్థము.

టీ ॥ పృథివ్యై = పృథివికొరకు, త్వా=నిన్ను, (సమర్పించుచున్నాను).

తా ॥ యజమానుడు తనను పృథివి కొరకు సమర్పించుకొనుచున్నాడు,

కర్మార్థము.

టీ ॥ పృథివ్యై= [ఓదర్భసముదాయమా] పృథివికొరకు, త్వా = నిన్ను [మూలమందు ప్రోక్షించుచున్నాను]

వినియోగము. ఈమంత్రముచెప్పి పైచెప్పిన దర్భసముదాయముయొక్క ఆదిభాగమందు ప్రోక్షించవలయును],

వి ॥ ఈమంత్ర బ్రాహ్మణమునుగూర్చి ఈయనువాకము యొక్క ౪-వ మంత్రము చూడుము. యజమానుడు త్రిలోకములయందుండెడి సమస్తభూతముల కుపకారిగనుండవలయునని ౪-౫ ౬-మంత్రములయొక్కతాత్పర్యమైనట్లుర్యతోచుచున్నది బ్రాహ్మణమును గూర్చి ౪-వ మంత్రము చూడుము.

ఇందుకువినియోగము "పృథివ్యైత్వేతిమూలం"(ఆపస్తంబశ్రౌత.౨-౮-౧-)

## ౭. (౧)స్వధా పితృభ్యః (౨) ఊర్గ్ భవ బర్హిషద్భ్యః (3) ఊర్జా పృథివీం గచ్ఛత.

జ్ఞానార్థము.

టీ ॥ (౧)పితృభ్యః = పితృదేవతల కొరకు, స్వధా=స్వధాకారము. (౨) బర్హిషద్భ్యః=మాసపితృదేవతలకొరకు, ఊర్గ్=బలము, భవ=కొగాక. (3) ఊర్జా=బలముతో, పృథివీం=భూమిని గచ్ఛత=పొందండి.

కర్మార్థము.

టీ ॥ పితృభ్యః=[ఓఉదకమానీవు] పితృదేవతలకొరకు, స్వధా=ఇవ్వబడినావు, బర్హిషద్భ్యః=ధర్భయందుండు, పితృదేవతలకొరకు, ఊర్గ్= రసరూపమయినదానవు, భవ=అగుము, ఊర్జా=[ఓఉదకములారామీరు].రసముతో, పృథివీం=భూమిని, గచ్ఛత=పొందండి.

తా ॥ పితృదేవతలకు సంతోషమూ గాక. పృధివి ఫలించుగాక.

వినియోగము॥ ఈమంత్రము చెప్పివేదికయొక్క దక్షిణ భాగమందు దర్భప్రోక్షణ శేషమైనఉదకమునుంచవలయును

వి ॥ ఈమంత్రమును గూర్చి విద్యారణ్య భాష్యమునందు చెప్పంబడినదేమనగ "హేజలమయాత్వం పితృభ్యోదత్తమసి, అతోబర్హిష్యవస్థితేభ్యః పితృభ్యోరసరూపంభవ, హేజలావయవాభవదీయేనరసరూపేణ పృధివీంగచ్ఛత" (పుట. ౧౬౮)

ఈమంత్రము బ్రాహ్మణమనుసరించి 3 -భాగములగచేయంబడియె. (౧)స్వధాపితృభ్య ఇత్యాహ, స్వధాకారోహిపితృణాం, (౨)ఊర్గ్భవ బర్హిషద్భ్యః ఇతి దక్షిణాయైశ్రోణె రోత్తరస్యై నినయతి సంతత్యై, మాసావైపితరోబర్హిషదః మాసానేవప్రీణాతి। మాసావాఓషధీర్వర్ధయంతి। మాసాః పచంతిసమృద్ధ్యై। అనతిస్కన్దన్ హపర్జన్యోవర్షతి యత్రైతదేవంక్రియతే (3)ఊర్జాపృథివీం గచ్ఛతేత్యాహ।పృథివ్యామేవోర్జందధాతి।తస్మాత్పృథివ్యా ఊర్జాభుంజతే" (తై.బ్రా 3-3-౬)

ఈమంత్రమునకు వినియోగము "స్వధా పితృభ్యఇతి దక్షిణాయైశ్రోణేరోత్తరస్యాః సంతతంనినీయ" (ఆపస్తంబ శ్రౌత ౨- ౮- 3) ఇందుకును విద్యారణ్యమునందు చెప్పిన వినియోగమునకును కొంచము భిన్నముగనున్నది. "అతిశిష్టాఃప్రోక్షణీర్దక్షిణాయైశ్రోణెరుత్తరస్యాః శ్రోణెస్సంతతం నినయతి, స్వధాపితృభ్య ఊర్గ్భవ బర్హిషద్భ్యః ఊర్జాపృధివీం గచ్ఛత" (పుట ౧౬౮)

## ౮. విష్ణోః స్తూపః అసి.

జ్ఞానార్థము.

టీ ॥ విష్ణోః = (ఓమనుజుడానీవు) యజ్ఞమునకు, స్తూపః=ధారకుడవు, అసి=అగుచున్నావు.

తా ॥ పైచెప్పిన మహాయజ్ఞములను మనుజుడు చేయవలయును.

కర్మార్థము.

టీ॥ విష్ణోః=(ఓప్రస్తరమాఅనగాదరకట్టానీవు] వ్యాప్తమయిన యజ్ఞమునకు, స్తూపః = సంఘాతరూపముగ ధారకమయినదానవు,అసి=అగుచున్నావు.

వినియోగము ॥ ఈమంత్రము చెప్పిదర్భ కట్టను గ్రహించవలయును.

వి ॥ ప్రతిమనుజుడు ప్రతిదినము పంచమహా యజ్ఞములను చేయవలసినవిధియైయున్నది. ఆమహాయజ్ఞము లెవ్వియైనవి. స్వాధ్యాయబ్రాహ్మణమునందు చెప్పంబడినది. 'పంచవా ఏతె మహాయజ్ఞాః సతతిప్రతాయంతెసతతిసంతిష్ఠంతె దేవయజ్ఞః పితృయజ్ఞో భూతయజ్ఞో మనుష్యయజ్ఞో బ్రహ్మయజ్ఞ ఇతి' (యజురారణ్యకం

౨-(ప్ర,౫-అ,౧౦-ప) వీటినిగురించియే యీయనువాకము చెప్పుచున్నది. కావుననే విద్యారణ్యభాష్యమునందిమంత్రమునకుపూర్వమునందు చెప్పంబడినదేమనగ“స్వధాకారః పితౄణాం ప్రియఇత్యయమర్థో వాజసనేయి శాఖాయాంప్రసిద్ధః దేవా ఉపజీవంతి స్వాహాకారంచ, వషట్కారంచ,హన్తకారంమనుష్యాః స్వధాకారం పితరః ఇతిశ్రుతిః” (౧౮౯)

“స్తూపః” అనుశబ్దమును గూర్చి భట్ట భాస్కరమునందు చెప్పంబడినదేమనగ “తస్యస్తూపః సంఘాతోసి త్వదాత్మనాయజ్ఞః సంహత ఇతిస్తుతిః” (౧-౧-౧౧) యాస్కనిరుక్తమునందు “స్తూపః స్త్యాయతేస్సంఘాతః” అని చెప్పంబడినది. (౧౦-అ, 33 - ఖం,)దుర్గాచార్యటీకయందు “స్త్యైసంఘాతె తస్య స్తూపః సంఘాతః” అనిచెప్పంబడినది. (కలకత్తాకూర్పు పుట - ౧౩౭) ఈపదముస్తుపః అనివాజసనేయులు పఠించుచున్నారు. (౨- అ, ౨- కం) ష్టై ష్ట్యై స్త్యై శబ్దసంఘాతయోః” అని మహీధరభాష్యమునందు చెప్పంబడినది. (కలకత్తాకూర్పు పుట. ౨౧ శతపథశ్రుతియందు చెప్పంబడినదేమనగ “విష్ణోఃస్తూపోసీతి యజ్ఞోవై విష్ణుః తస్యాయమేవ శిఖా” (౧-అ,3-3-౫.)అయినను బ్రాహ్మణమునను సరించి యజ్ఞమునుధరించినవాడుఅనగచేయువాడనియర్థము వ్రాయంబడినది. ఈబ్రాహ్మణమునందుచెప్పంబడినదేమనగ“విష్ణోస్తూపోసీత్యాహయజ్ఞోవైవిష్ణుఃయజ్ఞస్యధృత్యై” (త్రైబ్రా 3-3-౬)

ఈపదమునకనేకార్థములు చెప్పంబడియున్నను తాత్పర్యమొకటిగనే తోచుచున్నయది.

తైత్తిరీయ బ్రాహ్మణమందు “ధృత్యై” అని యుండుటవలన మహాయజ్ఞములను ధరించవలసినది. అనగచేయవలసినది. అనితోచుచున్నది. నిరుక్తమునందు సంఘాతమని చెప్పటంజేసి భట్ట భాస్కరమునందు చెప్పినప్రకారము యజ్ఞములనుజయించవలెనని తోచుచున్నది. ఈమహాయజ్ఞములుచేయుట మహాదుర్లభము భూతములయందు దయయు, మనుష్యులయందు ప్రేమయు, పితృలయందు విశ్వాసమును, దేవతలయందు గౌరవమును, బ్రహ్మయందు భక్తిని చూపించవలయును. వీనిని క్రమముగ నెరవేర్చుటయె యుద్ధమును జయించుట.గావుననె స్తూపః అనగశిఖ యని శతపథశ్రుతియందుచెప్పంబడినది.

ఈమంత్రమునకు విద్యారణ్యభాష్యము “ హేప్రస్తరత్వం వ్యాపినోయజ్ఞస్య సంఘాతరూపోధారకోసి” (పుట. ౧౮౯)

ఈమంత్రమునకు వినియోగము విష్ణోఃస్తూపోసీతికర్షన్ని వాహవనీయం ప్రతిప్రస్తరముపాదత్తే” (ఆపస్తంబశ్రౌత ౨- ౮. ౫.)

## ౯. ఊర్ణామ్రదసం త్వా స్తృణామి స్వాసస్థం దేవేభ్యః.

జ్ఞానార్థము.

టి ॥ ఊర్ణామ్రదసం=కనుబొమ్మలనడుమనుండెడు మహాపురుషలక్షణమైన సుడిచే మృదువుగచేయబడిన, త్వా=నిన్ను, దేవేభ్యః=భగవంతునికొరకు, స్వాసస్థం=మంచిస్థానమగునటుల, స్తృణామి=ప్రీతిచేయుచున్నాను.

తా ॥ మహాయజ్ఞములచేతసతతము మర్దనచేయబడిన నీమనస్సు భగవంతుని యొక్కనివాసమున కర్హమైనదిగచేయుచున్నాను.

కర్మార్థము.

టి॥ ఊర్ణామ్రదసం=కంబళివలె మృదువైనట్టియు, దేవేభ్యః=దేవతలకు, స్వాసస్థం=సుఖస్థానమగునట్టియు, త్వా=[దర్భసముదాయమా] నిన్ను, స్తృణామి = వేదికయందు పరచుచున్నాను,

వినియోగము॥ ఈమంత్రముచెప్పి వేదియందు దర్భను పరచవలయును.

వి॥ ఈఅనువాకముయొక్క ౧-౯మంత్రములు మహాయజ్ఞములు చేయవలయుననియు, నట్టియజ్ఞములచే పరిశుద్ధిచేయంబడిన మనుజునియొక్క మనస్సనెడి స్థానము భగవన్నివాసమునకు ప్రియమైనదిగ చేయవలయుననియు తాత్పర్యము. ఇదియెమనోయజ్ఞము, ధ్యానము, తపస్సని గ్రహించవలయును.

“ఊర్ణా” పదమునుగూర్చి గురుబాలప్రబోధికయందు చెప్పంబడినదేమనగ కనుబొమ్మల నడుమనుండెడు మహా పురుషలక్షణమైన సుడిపేరు “ఊర్ణోతీత్యూర్ణా ఊర్ణుఞ్ ఆచ్ఛాదనే” అని(పుట. ३౧౫)

నిరుక్తమునందు చెప్పంబడినదేమనగ “ఊరణః ఊర్ణావాన్ భవత్యూర్ణా పునః వృణోతేరూర్ణోతేర్వా” (౫-అ, ౨౧-ఖం)

“మ్రదసం” అనుశబ్దమునుగూర్చి భట్టభాస్కరమునందు చెప్పంబడినదేమనగ “మ్రదమర్దనే సుజ్ యస్మాత్ మమ్రదిత్యాదినా రర్విధీయతే” (౧-౧-౧౧)

“స్తృణామి” అనునది “స్తృ ప్రీతౌ” అనుధాతువువలన నిష్పన్నమైనట్టు తారానాథవాచస్పత్యమునందు చెప్పంబడినది(పుట. ౫३४౨)

“స్వాసస్థం” అనుశబ్దమునుగూర్చి భట్టభాస్కరమునందు చెప్పంబడినదేమనగ “శోభనాస్సుఖవంతః ఆసితారః స్థాతారశ్చయస్మిన్ సః స్వాసస్థః ఆసితారః ఆసాః పచాద్యచ్ స్థాతారః స్థాః క్విప్ సమహారద్వంద్వః ఆసస్థంశోభనం ఆసస్థం అస్మిన్నితి స్వాసస్థంసనఖ్యామిత్యుత్తరపదాన్తోదాత్తత్వం” (౧౧-౧౧)

“పరిధిః, పరితః, సర్వతః, ధాతారక్షకః” అనిభట్టభాస్కరభాష్యమునందు చెప్పంబడినది (౧-౧-౧౧). అంతటనుండెడికట్ట అట్టికట్టచే నన్నుచుట్టుకాపాడు మని యజమానుడు భగవంతుని ప్రార్థించుచున్నాడు. అనగ నెచ్చటచూచినను భగవంతుడే గనుపడవలయునని ప్రార్థన.

‘ఇడః’ ఈశబ్దమున కనేకార్థములు గలవు. ఇళః, ఇలః, అనికూడప్రయోగములుగలవు. ఈడ = స్తుతౌ అనుధాతువువలన నిష్పన్నమైనట్టు వేదనిఘంటు నిర్వచనమునందు వ్రాయంబడినది. (పుట. ౧౮) ‘ఇడః’ అనగ “స్తోతుమర్హః” అనిశుక్లయజుర్వేద భాష్యమునందు చెప్పంబడినది. (బొంబాయికూర్పు పుట. ౧౦౩).

‘ఈడితః’ రోళితః అనికూడపాఠముగలదు. ‘సర్వైః ఈడితః స్తుతః’ అని భట్టభాస్కరమునందు చెప్పంబడినది. (౧-౧-౧౧).

ఈపదమును స్వాసస్థాం అనివాజసనేయులు పఠించుచున్నారు. (వాజసనేయసంహిత ౨-అ, ౨-కం)

దేవేభ్యః ఏకవచనార్థె బహువచనము. ౬౦-వ పుటచూడుము.

ఈమంత్రమునకు బ్రాహ్మణము “ఊర్ణామ్రదసంత్వా స్తృణామిత్యాహ। యథాయజుర్వైతత్। స్వాసస్థందేవేభ్యఇత్యాహ। దేవేభ్య ఏవైనథ్స్వాసస్తంకరోతి” (తై. బ్రా. ౩-౩-౬)

ఈమంత్రమునకు వినియోగము “ ఊర్ణామ్రదసంత్వాస్తృణామీతిబర్హిషావేదింస్తృణాతి” (ఆపస్తంబశ్రౌత ౨-౯-౨)

౧౦. గంధర్వః అసి విశ్వావసుః విశ్వస్మాత్ ఈషతః యజమానస్య పరిధిః ఇడః ఈడితః

జ్ఞానార్థము.

టి ॥ గంధర్వః=గంధర్వుడను పేరుగలిగినట్టియు, విశ్వావసుః=విశ్వావసుడను పేరుగలిగిభగవంతుడవైననీవు, విశ్వస్మాత్=సమస్తమైన, ఈషతః=హింసలవలన, యజమానస్య=యజమానునకు, పరిధిః=సంరక్షకుడవు, అసి= అగుచున్నావు,ఇడః=స్తోత్రార్హుడవు, ఈడితః =స్తోత్రముచేయబడువాడవు,

తా ॥ గంధర్వుడు విశ్వావసుడను

కర్మార్థము.

టి ॥ విశ్వావసుః= [ఓమధ్యమపరిధి అనగా మోదుగపుడకానీవు] విశ్వావసుడనుపేరుగల, గన్ధర్వః=గంధర్వునివంటిదానవు,అసి=అగుచున్నావు, విశ్వస్మాత్ =(గనుక) సమస్తమైన,ఈషతః= హింసరాకుండనటుల, యజమానస్య=యజమానునకు,పరిధిః=సంరక్షకురాలవును, ఇడః=అన్నరూపమైనదానవును, ఈడితః = అందిరిచేత] స్తుతించబడుదానవును అగుగాక.

పేరుగలిగిన నీవు, యజమానుని అన్ని బాధలనుండి రక్షించుము. నిన్నెల్లప్పుడు యజమానుడు స్తోత్రముచేయుగాక.

వినియోగము ॥ ఈమంత్రము చెప్పి మధ్యమ మోదుగపుడకనుఅగ్నికితూర్పుగానుంచవలయును.

వి ॥ మహాయజ్ఞములను సత్కార్మలనుచేయుచు మనుజుడు పక్వమును జెంది భగవంతుని తన మనస్సునందు నిలుపుకొని ప్రకృతి సంబంధమైన యేచింతలు రాకుండునటుల భగవంతునినిరంతరము ధ్యానించుచు నుండవలయునని యీ అనువాకము విశదముగ దెలియచేయుచున్నది.

“గన్ధర్వః” ఈశబ్దమునకు అనేకార్థములుగలవు. ఇందుకువ్యుత్పత్తి “గాః స్తుతిరూపా గీతిరూపా వావాచః రశ్మీన్వాధారయతి. ధృ—వ, గోర్గమాదేశోవా” అని తారానాథ వాచస్పత్యమునందు చెప్పంబడినది. (౨౫౨౨) గన్ధర్వపదము భగవత్పరమైనటుల “దేవసవితః” అనుమంత్రముయొక్క భాష్యమునందు చెప్పంబడినది. దేవసవితః ప్రసువయజ్ఞం ప్రసువయజ్ఞపతింభగాయ దివ్యోగంధర్వః కేతపూః కేతన్నః పునాతువాచస్పతిర్వాచన్నః స్వదతు” శుక్లయజుర్వేదము(౧౧-అ, ౭-కం), ఇందుకు మహీధరభాష్యము “హేదేవ సవితః యజ్ఞంప్రసువ ప్రకర్షేణ ప్రేరయ యజ్ఞపతిం యజమానంచ భగాయసౌభాగ్యాయ ప్రసువ। కించదివ్యోదివిభవస్స్వర్గస్థః కేతపూః కేతం పరిచిత్తే వర్తమానంజ్ఞానం పునాతిశోధయతీతి కేతపూః ఈదృశోగంధర్వః గాంవాచంధారయతీతిగంధర్వః సవితానోస్మాకంకేతం చిత్తవర్తిజ్ఞానం పునాతు బ్రహ్మావివర్తనేన శోధయతువాచః వాణ్యాః పతిస్సవితా నోస్మదీయాంవాచం స్వదతు స్వాదయతు అస్మదుక్తావాక్తస్మైరోచతా మిత్యర్థః” (పుట. ౧౨౬)

ఈమంత్రమునకు కొంచము భేదముగ నీశాఖయొక్క ౧-కా, ౭-పు, ౭-అ, ౧-వ మంత్రముగ పఠింపబడుచున్నది. ఇందుకు విద్యారణ్యభాష్యము. ౮౪౬-పుట యందువ్రాయంబడినది అచ్చటకూడ గంధర్వః అనగ సవితః అనియర్థము చెప్పబడినది. “విశ్వావసుః” అనగ “విశ్వంవాసయతి యః సః అనివ్యుత్పత్తి” శుక్లయజుర్వేదభాష్యమునందు చెప్పంబడినది (బొంబాయి కూర్పుపుట. ౨౦౩) “విశ్వానివసూని అస్మిన్నితి బహువ్రీహిః” అని భట్టభాస్కరమునందు చెప్పంబడినది (౧-౧-౧౧) ఇందువలన “విశ్వావసు” డనగ సర్వప్రపంచ మందుండువాడు లేదా సర్వప్రపంచమును తనయందుంచుకొను నట్టివాడు భగవంతుడుగాని, మరియొకడుగాడు. కావున “గంధర్వః, విశ్వావసువు” అనగ భగవంతుడని యిచ్చటదెలియందగును.

“ఈషితః” పంచమీవిభక్తి “ఈషగతిహింసాదానేషు” అనుధాతువువలన నిష్పన్నమైనది.

ఈమంత్రమునకు విద్యారణ్యభాష్యము «హేమధ్యమ పరిధేత్వం విశ్వావసు నామకోగంధర్వోసితద్వాత్ రక్షకత్వాత్ । తేనసర్వస్మాద్ధింసకాత్ యజమానస్యపరి పోషకో అన్నరూపస్తుతోభవ'' (పుట. ౧౭౧) ఈమంత్రము శాఖలయందు భిన్న భిన్నముగ పఠించబడుచున్నది. 'విశ్వస్మాదీషమాణః' అని మైత్రాయణీ సంహిత యందును, 'విశ్వస్మాదీషతః'అని కాఠకసంహితయందును; «విశ్వస్మాద్యృషతః'' అనిక పిష్ఠలసంహితయందును; «విశ్వస్యారిష్ట్యై'' అని వాజసనేయ సంహితయందును పఠింపబడుచున్నది. (మైత్రాయణీసంహిత పుట. ౭)

ఈమంత్రమునకు బ్రాహ్మణము «గంధర్వోసి విశ్వావసురిత్యాహ విశ్వమేవా యుర్యజమానే దధాతి'' (తై బ్రా. 3-3-౬) కర్మయందుపయోగింపంబడుటప్రస్త రము యజమానునికి «ఉపలక్షణము'' అని బ్రాహ్మణమందు చెప్పంబడినది «యజ మానోవైప్రస్తరః'' (తై బ్రా. 3-3-౬)

ఈమంత్రమునకు వినియోగము «గంధర్వోసి విశ్వావసురిత్యేతైః ప్రతిమం త్రముదగగ్రంమధ్యమం ప్రాగగ్రావితరౌ'' (ఆపస్తంబశ్రౌత ౨-౯-౫)

## ౧౧. ఇంద్రస్య బాహుః అసి దక్షిణః యజమానస్య పరిధిః ఇడః ఈడితః.

జ్ఞానార్థము.

టీ ॥ ఇంద్రస్య = భగవంతునియొక్క, బాహుః=బలము, దక్షిణః=దక్షిణదిక్కునసుండి, యజమానస్య = యజమానునకు, పరిధిః=అంతటరక్షించునది, అసి=అగుచున్నది, ఇడః=ఓభగవంతుడానీవు స్తోత్రార్హుడవు, ఈడితః=నీవు స్తోత్రము చేయబడువాడవు.

తా॥ భగవంతుడు దక్షిణదిక్కునుంచి తనకేయా పత్తులు రాకుండునటుల చేయవలసినదని యజమానుడు ప్రార్థించుచున్నాడు.

కర్మార్థము.

టీ ॥ ఇంద్రస్య = ఓదక్షిణపరిధిఅనగా మోదుగపు కట్టా ఇంద్రునియొక్క, బాహుః=బాహువంటిదానవు, అసి=అగుచున్నావు, దక్షిణః=(గనుక)దక్షిణదిక్కునందుండి, యజమానస్య=యజమానునకు, పరిధిః=సంరక్షకురాలవును, ఇడః=అన్నరూపమైనదానవున్ను, ఈడితః = అందరిచేత స్తుతింపబడుదానవును అగుగాక.

వినియోగము ॥ ఈమంత్రముచెప్పిఅగ్నికి దక్షిణదిక్కునందు మోదుగసమిధనుంచవలయును.

వి ॥ ఇంద్రశబ్దము భగవత్పరమైనటుల ప్రసిద్ధి.

'బాహుః' అనగ «బలంబలకారీవా'' అని శుక్లయజుర్వేద భాష్యమునందు చెప్పబడినది. (బొంబాయికూర్పుపుట.౧౦౩)

దక్షిణః అనగ "దక్షతేపరకార్యం శీఘ్రంకరోతీతి దక్షిణః. దక్షవృద్ధౌ శీఘ్రార్థేచ" అనిగురుబాలప్రబోధికయందు చెప్పబడినది (పుట. ౨౬౬). ఈప్రమాణమును బట్టి భక్తులను శీఘ్రముగ రక్షించువాడని కూడనర్థము చెప్పవచ్చును (పూర్వమంత్రవివరణచూడుము)

ఈమంత్రమునకు బ్రాహ్మణము "ఇంద్రస్య బాహురసి దక్షిణఇత్యాహ । ఇంద్రియమేవ యజమానేదధాతి" (తై. బ్రా. 3-3-౬)

ఈమంత్రమునకు వినియోగము. "ఇంద్రస్య బాహురసి దక్షిణోయజమానస్య పరిధిరిడ ఈడిత ఇతిదక్షిణం" (విద్యారణ్యం పుట. ౧౭౧) దీనియొక్క వినియోగము ఆపస్తంబమందు కొంచముభిన్నముగ చెప్పంబడినది. "ఆహవనీయ మభ్యాగ్రందక్షిణాం" (౨-౯-౬)

౧౨. మిత్రావరుణౌ త్వా ఉత్తరతః పరిధత్తాం ధ్రువేణ ధర్మణా యజమానస్య పరిధిః ఇడః ఈడితః.

జ్ఞానార్థము.

టీ ॥ మిత్రావరుణౌ=మిత్రుడనియు వరుణుడనియు; పేర్లుగలిగిన భగవంతుడు, త్వా=నిన్ను, ఉత్తరతః=ఉత్తర దిక్కునుంచి బాధరాకుండునటుల, పరిధత్తాం=ధరించుగాక, ధ్రువేణ = నిత్యమైన, ధర్మణా=ధర్మముచేత, యజమానస్య=యజమానుని, పరిధిః=అంతటరక్షించువాడు. ఇడః = స్తోత్రార్హుడవు, ఈడితః=స్తోత్రముచేయబడువాడవు.

తా ॥ భగవంతుడు యజమానునకు ఉత్కర దిక్కునుంచి ఏలాటిబాధలు రాకుండ రక్షించుగాక.

కర్మార్థము.

టీ ॥ త్వా=[ఓయుత్తరపరిధి అనగా మోదుగసమిధా] నిన్ను, మిత్రావరుణౌ=మిత్రావరుణదేవతలు, ఉత్తరతః=అగ్నికి ఉత్తరదిక్కునందు, పరిధత్తాం=ఉంచుదురుగాక, ధృవేణ=(నీవు) నిత్యమైన, ధర్మణా=ధర్మముచేత, యజమానస్య=యజమానునకు, పరిధిః=సంరక్షకురాలవును, ఇడః=అన్నరూపమైన దానవును, ఈడితః = అందరిచేతస్తుతింపబడుదానవును అగుగాక.

వినియోగము ॥ ఈమంత్రముచెప్పి అగ్నికి ఉత్తరభాగమందు పరిధినుంచవలయును.

వి ॥ మిత్రావరుణ శబ్దములు భగవత్పరము ప్రసిద్ధి "ఇంద్రంమిత్రం వరుణమగ్నిమాహురథోదివ్యః ససుపర్ణోగరుత్మాన్ । ఏకంసద్విప్రాబహుధావదంత్యగ్నింయమంమాతరిశ్వానమాహుః" (ఋగ్వేదము ౧-మం, ౧౬౪-సూ, ౪౬ఋక్కు)

మిత్రమనగ 'ప్రమీతేర్మరణాత్ త్రాతారం' అనియు "వరుణంపాపస్యనివారకం" అనియుసాయన భాష్యమునందు చెప్పంబడినది. (సీమకూర్పు ౨౬-౬,

పుట)మిత్రశబ్దమునుగూర్చి సంధ్యావంధనభాష్యమునందు శ్రీదేశికులవారుచెప్పిన దేమనగ ‹‹ మిత్రస్త్రాతా, సఖావా; వేదాన్తైరపరిచ్ఛిన్నమహిమేతి సమిత్రఃయస్యా మతంతస్యమతం మతంయస్యనవేధసఃఇతిశ్రుతేః. రక్షకత్వంతు తస్యైవప్రసిద్ధం భగవతః ’’ అని చెప్పబడినది.

వరుణశబ్దమును గూర్చి ‹‹ హేవరుణపరమాత్మన్ వరుణో వారుణోవృక్షఇతి తన్నామ సహస్రపాఠాత్ ’’ అని పైచెప్పినసంధ్యాభాష్య పుట. ౧౭.

ధర్మణా అనగ ‘‘స్వాభావికధారణశక్త్యా’’ అని శుక్లయజుర్వేదభాష్యమునందు చెప్పంబడినది(బొంబాయికూర్పు పుట ౧౦౩)

ఈమంత్రమునకు బ్రాహ్మణము ‹‹ మిత్రావరుణౌత్వోత్తరతః పరిధత్తామిత్యాహ ప్రాణాపానౌ మిత్రావరుణౌ ప్రాణాపానావేవాస్మిన్దధాతి’’ (త్రైబ్రా 3-3-౬)

ఈమంత్రమునకు వినియోగము ‹‹అవాగ్రముత్తరం’’ (ఆపస్తంబశ్రౌ-౨-౯-౬)

౧౩. సూర్యః త్వా పురస్తాత్ పాతు కస్యాః చిత్ అభిశస్త్యాః

| జ్ఞానార్థము. | కర్మార్థము- |
|---|---|
| టీ ॥ సూర్యః=భగవంతుడు, త్వా=నిన్ను, పురస్తాత్=తూర్పుదిక్కునుంచి కస్యాశ్చిత్=ఎటువంటి, అభిశస్త్యాః=హింసవలననుండియు, పాతు = రక్షించుగాక. | టీ ॥ త్వా = [ఓఆహవనీయాగ్ని]నిన్ను, సూర్యః= సూర్యుడు, పురస్తాత్=తూర్పుదిక్కునందు, కస్యాశ్చిత్ = ఏయొక,అభిశస్త్యాః=హింసవలననుంచియు, పాతు = రక్షించుగాక. |
| తా ॥ భగవంతుడునిన్ను తూర్పుదిక్కున నుండి రక్షించుగాక | వినియోగము॥ ఈమంత్రముచెప్పి ఆహవనీయాగ్ని నభిమంత్రించవలయును. |

వి ॥ సూర్యః అనగ భగవంతుడని విష్ణుసహస్రనామములయందు చెప్పంబడినది. శ్రీశంకరులవారు ఈశబ్దమునుగురించి వ్రాసినభాష్యమేమనగ ‹‹సూతేఃశ్రియమితి సూర్యః సూతేసువతేర్వా సూర్యశబ్దోనిపాత్యతే రాజసూయేత్యాది శ్రీపాణినివచనాత్ సర్వస్యజగతః ప్రసవితాసవితా । రసానాంచతథాదానాద్రవిరిత్యభిధీయతే ప్రజానాంచ ప్రసవనాత్ సవితేత్యభిధీయత ఇతి విష్ణుధర్మోత్తరే రవిర్లోచనం చక్షురసేత్యి రవిలోచనః అగ్నిర్మూర్ధాచక్షుషీ చంద్రసూర్యావితి మంత్రవర్ణాత్’’ (పుట. ౬3) సూర్యశబ్దమునుగూర్చి శ్రీదేశికులవారు సంధ్యాభాష్యమునందు చెప్పినదేమనగ ‹‹సుష్ఠుఈరయతి ప్రేరయతీతి సూర్యః పరమాత్మా’’ అని.

పురస్తాత్ అనుశబ్దమునుగూర్చి ౧౬-వ పుటచూడుము. ‹‹శస్త్యాః’’ అనునది ‘శసుహింసాయాం’ అనుధాతువువలన నిష్పన్నమైనదని భట్టభాస్కరమునందు చెప్పబడినది. (౧-౧-౧౧)

ఈమంత్రమునకు బ్రాహ్మణము- ‘‘పురస్తాత్ప్రత్యఙ్త్యాహ । రక్షసామపహ త్యై కస్త్వాశ్చిదభిశస్త్యా ఇత్యాహ । అపరిమితాదేవైనంపాతి’’ (తై. బ్రా. 3-3-౬

ఈమంత్రమునకు వినియోగము ‘‘సూర్యస్త్వా పురస్తాత్ప్రత్యఙ్త్యా హవనీయ మభిమన్త్ర్య ఉపర్యాహవనీయే ప్రస్తరంధారయన్నగ్నిం కల్పయతి’’ (ఆపస్తంబ శ్రౌతం. ౨ - ౯ - ౭)

౧౪. వీతిహోత్రం త్వా కవే ద్యుమంతం సమ్ ఇధీమహి అగ్నే బృహంతం అధ్వరే.

జ్ఞానార్థము.

టీ ॥ కవే = జ్ఞానస్వరూపుడైన, అగ్నే=ఓభగవంతుడా, వీతిహోత్రం = స్తోత్రరూపమైన వాక్కులు గలిగినట్టియు, ద్యుమంతం=బహుప్రకాశముగలిగినట్టియు, బృహంతం=మహత్తుగలిగినట్టియు, త్వా=నిన్ను, అధ్వరే = అహింసయైన ధ్యానమునందు, సం = లెస్సగ, ఇధీమహి=జ్వలింపచేసుకొనుచున్నాడను.

తా॥ స్తోత్రరూపమైనట్టియు, బహుప్రకాశమానమైనట్టియు, మహత్తుగలిగినట్టియు, భగవంతుని లెస్సగజ్వలింప చేసుకొనుచున్నాడను.

కర్మార్థము.

టీ॥కవే=విద్వాంసుడవైన, అగ్నే=ఓయగ్నీ, వీతిహోత్రం = సమృద్ధికొరకు చేయబడినహోమముగల, ద్యుమంతం =దీప్తివంతుండైనట్టియు, బృహన్తం=గొప్పవాడైనట్టియు, త్వా=నిన్ను, అధ్వరే=యాగనిమిత్తము, సమిధీమహి=జ్వలింప జేయుచున్నాడను.

వినియోగము ॥ ఈమంత్రము చెప్పిఆఘారసమిధలను అగ్నికితూర్పున నందు ఊర్ధ్వముఖముగ నుంచవలయును.

వి ॥ ఈమంత్రము ఋగ్వేదముయొక్క ౫-మం, ౨౬-సూ, ౯-మంత్రముగనున్నది. అచ్చట సాయనభాష్యమునందు ‘‘వసూయవఋషయః’’ అనియు ‘‘గాయత్రీఛన్దః’’ అనియు చెప్పంబడినది (సీమకూర్పుపుట. 333) ఈ అనువాకమునకు కాండఋషి ప్రజాపతియైనను, ‘మంత్రద్రష్ట వసూయవః’ అనిగ్రహించవలయును. ఈమంత్రము ‘‘నిత్యహోతారంత్వాక వేద్యుమంతస్సమిధీమహి’’ అని మైత్రాయణులు పఠించుచున్నారు. (౧-౧-౧౧)

వీతిహోత్రం ఈపదమునకు వ్యాఖ్యాతలచే భిన్నోత్పత్తులు వ్రాయంబడినవి ‘‘వీతయఃప్రాప్తిహేతవో హోత్రాఖ్యాయజ్ఞక్రియాభవంతి యస్మాత్ తంపరమేశ్వరం’’ అనిశుక్లయజుర్వేదభాష్యం (బొంబాయి కూర్పుపుట. ౧౦౫) లేకవీ=విశేషమైన యీతిబాధలను హోత్రం=హరించువాడు. హోత్రమనునది ‘‘హుదానాదన

యోః'' అనుధాతువువలన నిష్పన్నమైనది. కావుననే హోత్రమనగ భక్షించువాడు, నశింపచేయువాడు, అనియుచెప్పందగును. లేక భట్టభాస్కరమునందు చెప్పిన ప్రకారము ''హోత్రాంవాక్ స్తోత్రరూపో హోతృ వ్యాపారోవా యస్యతం'' అనిచెప్పంబడినది. (౧-౧-౧౧)

''ఇధీమహిఅనునది'' 'నిన్దీదీప్తౌ'అనుధాతువువలన నిష్పన్నమైనది. భగవంతుడుప్రకాశమానుడైనను మనయజ్ఞానము వలన యతనిప్రకాశమును గ్రహించలేకయున్నారము. ధ్యానయజ్ఞమునందు పైచెప్పినరీతిని మనస్సును నిరోధించిన యెడల భగవత్ప్రకాశమును చూడవచ్చునని యీమంత్రము తెలియచేయుచున్నది.

బృహంతం అనగ 'మహాంతం' అని భట్టభాస్కరము నందు చెప్పంబడినది (౧ - ౧ - ౧౧)

అధ్వరః అహింసయైనకర్మ. ఇందుకు వ్యుత్పత్తి ''ధ్వరతేర్వధకర్మణః పుంసి సంజ్ఞాయాం ఘఃనఞ్పూర్వః ధ్వరాహింసా తదభావోయత్ర'' అనివేదనిఘంటు నిర్వచనమునందుచెప్పంబడినది. (పుట. 3౪౭)

ఈమంత్రమునకు విద్యారణ్యభాష్యము ''హేవిద్వన్ అగ్నేత్వా మధ్వరంనిమిత్తీకృత్య సమిధీమహి । కీదృశంత్వాం వీతయేవ్యాప్తయేసమృద్ధయే హోత్రంహోమోయస్యతం వీతిహోత్రం'' (పుట. ౧౭౧)

ఈమంత్రమునకు బ్రాహ్మణము ''వీతిహోత్రంత్వాకవ ఇత్యాహ । అగ్నిమేవ హోత్రేణసమర్థయతి । ద్యుమన్తంస మిధీమహీత్యాహ సమిద్ధ్యై । అగ్నేబృహంత మధ్వర ఇత్యాహవృధ్యై'' (తై. బ్రా. 3-3-౬)

ఈమంత్రమునకు వినియోగము ''వీతిహోత్రంత్వాకవ ఇతిదక్షిణాంసమిద స్యాయుషేత్వేత్యుత్తరాం'' (ఆప ౨,౯,౧౦)

## ౧౨. విశః యంత్రే స్థః.

**జ్ఞానార్థము**

టీ ॥ విశః=ప్రజలను, యంత్రే=నియామకముచేయువారు, స్థః = ఔచున్నారు.

తా॥ నిన్నుధ్యానించు మనుజులయొక్క చిత్తమును చలించకుండచేయుము.

**కర్మార్థము.**

టీ ॥ విశః = [ఓవిధృతులారా అనగా వేదికయందు పరిచెడిరెండు దర్భలారామీరు] ప్రజలకు, యంత్రే=నియామకులు, స్థః=అగుచున్నారు.

వినియోగము ॥ ఈమంత్రముచెప్పివేదికయందు విధృతుల నుంచవలయును.

వి ॥ ఈమంత్రముయొక్క తాత్పర్యమును ఇతరశాఖలయందు మంత్రబ్రా

హ్మణములనుబట్టిగ్రహించదగును. ఈమంత్రమునందు 'యంత్రే. స్థః' అనునవిద్వివచనములు. ఈమంత్రమునకు బదులు ''సవితుః బాహూ స్థః' అని వాజసనేయులును (౨-అ, ౫-కం) ''విశ్వజనస్య విధృతీ స్థః'' అనిమైత్రాయణులును (౧-౧-౧౨) పఠించుచున్నారు. కర్మయందు విధృతులను రెండు దర్భలు ఉపయోగించబడుచున్నవి. ఆరెండుదర్భలు భగవంతునికి బాహువులవంటివి. యజమానుని చిత్తచలత్వము గనుండుటకు భగవంతుని బాహువులచే కట్టివేయవలయునని భగవత్ప్రార్థన. ఈఅర్థము బ్రహ్మసూత్రములయొక్క (౪-అ, ౧-పా) 'ధ్యానాచ్చ' 'అచలత్వం చాపేక్ష్య' అనునీరెండు సూత్రములు బోధించుచున్నవి.

విశః । షష్ఠ్యేకవచనము. 'విశ ప్రవేశనే' అనుధాతువువలన నిష్పన్నమైనది. నీయందు ప్రవేశించిన మనుజునియొక్క చిత్తమని ఈశబ్దముయొక్క వ్యుత్పత్తివలన గ్రహించందగును.

యంత్రే 'గృధృషవిమచిత్యాదినాయమేష్ట్రక్ ప్రత్యయః' అనిభట్టభాస్కరమునందు చెప్పంబడినది (౧-౧-౧౧)

ఈమంత్రమును విద్యారణ్యభాష్యము ''హేదర్భరూపే విధృత్యౌయువాం ప్రజాయాః నియామికేభవతః'' (పుట. ౧౭౨)

శతపథశ్రుతియందు చెప్పంబడినదేమనగ ''సవితుర్బాహూస్థఇత్యయం వైస్తుపః ప్రస్తరో అథాస్యైతేబ్రువావేవతిరశ్చీనిదధాతి. తస్మాదిమేతిరశ్చ్యౌబ్రువౌ''అని (౧-కా,3-అ,౪-బ్రా,౧౦-ఖ) ఇందువలన విధృతియను రెండు దర్భలు యజమానునియొక్క రెండుకను బొమ్మలుగచెప్పంబడినది. ఆ కనుబొమ్మల మధ్యను మనస్సును చంచలములేకుండ నుంచవలయునని యీశ్రుతిబోధించుచున్నది.

ఈమంత్రమునకు యర్థముభట్టభాస్కరమునందుచెప్పినదేమనగ ''విశఃప్రజాయాః యంత్రేయమనేధారికే స్థః'' (౧-౧-౧౧)

ఈమంత్రమునకు బ్రాహ్మణము ''విశోయన్త్రే స్థఇత్యాహ విశాంయత్యై'' (తైబ్రా 3-3-౬)ఈబ్రాహ్మణమునకు భట్టభాస్కరము ''విశాంప్రజానాం యత్యై ధారణాయ భవతిః'' అని.

ఈమంత్రమునకువినియోగము ''విశోయన్త్రేస్థఇత్యన్తర్వేద్యుదగగ్రేనిధాయ'' (అపస్తం ౨, ౯, ౧3)

విధృతిఅనగ''పరిభోజనీయె భ్యోమధ్యమబర్హిర్ముష్టేర్వా అన్యతోవా ఆహృతం ప్రారంభదర్భద్వయం విశేషేణధృతిఃధారణం ప్రస్తరాదీనాంధారణంయస్మిన్నితివ్యుత్పత్త్యా విధృతిపదవాచ్యం'' అని శ్రౌతపదార్థనిర్వచమునందు చెప్పంబడినది (పుట. ౨౫-౧౬౨ వాక్యం)

## ౧౬. వసూనాం రుద్రాణాం ఆదిత్యానాం సదసి సీద.

**జ్ఞానార్థము.**

టీ॥ వసూనాం = వసువులయొక్కయు, రుద్రాణాం=రుద్రులయొక్కయు, ఆదిత్యానాం = ఆదిత్యులయొక్కయు, సదసి=సభయందు, సీద=ఉండుము.

తా ॥ ఓయజమానుడానీవు దేవత్వమును పొందిన వసురుద్రాదిత్యుల యొక్క సమీపమందుండుము.

**కర్మార్థము.**

టీ ॥ వసూనాం = [ఓప్రస్తరమానీవు] వసువులకున్ను, రుద్రాణాం = రుద్రులకున్ను, ఆదిత్యానాం = ఆదిత్యులకున్ను, సదసి=స్థానమయిన [విధృతిద్వయమందు], సీద=ఉండుము.

వినియోగము ॥ ఈమంత్రముచెప్పి ప్రస్తరమును విధృతుల యందుంచవలయును.

---

వి ॥ ౧౫-వ మంత్రమునందు యజమానుడు తనచిత్తమును అచలత్వముగనుండునట్లుల ప్రార్థించెను. అట్లుండినయతను దేవత్వము పొందినవారితో కలసియుండునని ఈమంత్రము చెప్పుచున్నది. వసువులు, రుద్రులు, ఆదిత్యులు, దేవత్వముపొందినవారు "వస్వాదయః ప్రసిద్ధాః దేవతాః" (భట్టభాస్కరము ౧-౧-౧౧) కర్మయందు యజమానునకు సాదృశ్యముగ ప్రస్తరము నుపయోగించుచున్నారు. "యజమానో వై ప్రస్తర ఇతి" (తై. బ్రా. 3-3-౬)

ఈమంత్రమునకు బ్రాహ్మణము "వసూనాంరుద్రాణాం ఆదిత్యానాం సదసి సీదేత్యాహ । దేవతానామేవసదనే ప్రస్తరꣳసాదయతి" తై బ్రా 3-3-౬)

ఈమంత్రమునకు వినియోగము "వసూనాం రుద్రాణాం ఆదిత్యానాం సదసి సీదేతితయోః ప్రస్తరమత్యాదధాతి" (ఆపస్తంబశ్రౌత ౨-౯-౧3)

---

## ౧౭. జుహూః.

**జ్ఞానార్థము.**

టీ॥ (ఓయజమానుడనీవు) జుహూః =ఆకాశము.

తా॥ ఓయజమానుడ నీవుపైచెప్పిన ప్రకారం చేసినయడల ఆకాశము వంటివాడవు అగుచున్నావు.

**కర్మార్థము.**

టీ॥ జుహూః=ఓజుహువాన్నీవు పేరుచేత ఘృతాచీయను] దానవగుచున్నావు. ప్రియమైన ఘృతాచీయను పేరుచేత ప్రియమైన స్థానమందుండుము.

వినియోగము ॥ ఈమంత్రము చెప్పి ఆప్రస్తరమందు జుహూపాత్రము నుంచవలయును.

వి ॥ యజమానుడు తనచిత్తమును చలించకుండ భగవంతునియందుంచి నయడల నతని చిత్తము ప్రకృతిచే బంధింపబడక నంతటను వ్యాపించును. అన గపొందును. ౧౭-౧౮-౧౯ మంత్రములు సర్వలోకములయందు వ్యాపించుటయని చెప్పుచున్నవి.

ఈ మూడుమంత్రములకు ఏకబ్రాహ్మణము “జుహూరసి ఘృతాచీనామ్నే త్యాహ । అసౌవైజుహూః । అంతరిక్షంఉపభృత్ । పృథివీధ్రువా । తాసామేతదే వ ప్రియంనామ యద్ఘృతాచీతి । యద్ఘృతాచీత్యాహ । ప్రియేణైవైనానామ్నాసా దయతి” తై.బ్రా. 3-3-౬)

ఈమంత్రమునకు వినియోగము “జుహూరసిఘృతాచీత్యేతైః ప్రతిమంత్ర మ మూచీర సంస్పృష్టాః స్రుచః ప్రస్తరేసాదయతి” (ఆపస్తంబశ్రౌత ౨-౯-౧౫)

## ౧౮. ఉపభృత్.

జ్ఞానార్థము.

టీ॥ (ఓయజమానుడానీవు) ఉపభృత్ = అంతరిక్షము.

తా॥ ఓయజమానుడా నీవుపైచెప్పిన ప్రకారము చేసినయడల నంతరిక్షమును పొందుచున్నావు.

కర్మార్థము.

టీ ॥ ఉపభృత్=ఉపభృత్ పాత్రమానీవు(పేరుచేతఘృతాచ్యయను దానవగుచున్నావు. ప్రియమైనఘృతాచియను పేరుతోప్రియమైన స్థానమందుండు.

వినియోగము ॥ ఈమంత్రము చెప్పి ప్రస్తరమందుపభృత్తునుంచవలయును.

వి ॥ ౧౭-వ మంత్రవివరణచూడుము.

ఈమంత్ర బ్రా. “అన్తరిక్షముపభృత్” అనిచెప్పంబడినది.

ఈమంత్రమునకు “ఉత్తరేణోపభృతం” (ఆప- ౨, ౧౦, ౨)

## ౧౯. ధ్రువా అసి ఘృతాచీ నామ్నా ప్రియేణ నామ్నా ప్రియే సదసి సీద.

జ్ఞానార్థము.

టీ॥ ధ్రువా=(ఓయజమానుడానీవు) పృథివీలోకము, అసి = అగుచున్నావు, ఘృతాచీ = అమృతపూర్ణుడవనెడి, నామ్నా=పేరుచేతను, ప్రియేణ=ప్రియమైనట్టి,నామ్నా=(ఘృతాచీయను) పేరుచేతనున్న, ప్రియే=ప్రియమైన, సదసి= సభయందు, సీద = ఉండుము.

కర్మార్థము.

టీ ॥ ధ్రువా= ఓధ్రువపాత్రమా [నీవు], నామ్నా=పేరుచేత, ఘృతాచీ=ఘృతాచియనుదానవు, అసి = అగుచున్నావు, ప్రియేణ=ప్రియమైన, నామ్నా =ఘృతాచియను పేరుచేత, ప్రియే=ప్రియమైన, సదసి = స్థానమైనవిధృతియందు, సీద=ఉండుము.

తా॥ఓయజమానుడా నీవు పైచెప్పినప్రకారము చేసెనేని నీకీర్తి పృథివీలోకమును వ్యాపించినవాడవగుచున్నావు. మరియు నీవు ప్రియమైనటువంటి అమృతపూర్ణుడవను పేరునుపొంది ప్రియమైన భగవత్సన్నిధియందుండెదవు.

వినియోగము ॥ ఈ మంత్రము చెప్పి ధృవాపాత్రము ప్రస్తరమందుంచ వలయును.

---

వి ॥ ౧౭-వ మంత్రవివరణచూడుము.

"పృథివీధ్రువా" అని బ్రాహ్మణము (తై. బ్రా. 3-3-౬). ఘృతాచీ అనుపదమునుగూర్చి "ఘృతమంచతిప్రాప్నోతీతి ఘృతాచీ ఘృతపూర్ణాభవసి" అనిమహీధరభాష్యమునందు చెప్పంబడినది. (పత్రం. ౨3) ఘృతాచీయనగ రాత్రియనియర్థము గూడగలదు (వేదనిఘంటు ౧-అ, ౭-ఖం) ఘృతశబ్దమున కనేకార్థములుగలవు, ఉదకము, ఆజ్యము, అమృతము, మొదలగునవి. ఘృక్షరణదీప్త్యోః అనుధాతువువలన నిష్పన్నమైనట్టు వేదనిఘంటు నిర్వచనమునందు చెప్పంబడినది. (పుట. ౪౬) కర్మయందుపయోగింపంబడు ఘృతము అమృతమునకు సాదృశ్యము.

ఈమంత్రమునకు వినియోగము ౧౫-మంత్రవినియోగమును చూడుము.

---

౨౦. (౧) ఏతాః అసదన్ సుకృతస్య లోకే (౨) తాః విష్ణో పాహి. (3) పాహి యజ్ఞం పాహి యజ్ఞపతిం పాహి మాం యజ్ఞనియం.

జ్ఞానార్థము.

(౧) ఏతాః=వీరు, సుకృతస్య=పుణ్యమైన, లోకే=లోకమునందు, అసదన్=ఉంచుచున్నారు,(౨) తాః=వారిని, విష్ణో=ఓభగవంతుడా, పాహి=రక్షించుము, (3) యజ్ఞం=యజ్ఞమును, పాహి=రక్షించుము, యజ్ఞపతిం=యజమానుని, పాహి = రక్షించుము, యజ్ఞనియం=యజ్ఞమును సంపూర్తిచేయునట్లుగ, మాం=నన్ను, పాహి = రక్షించుము.

కర్మార్థము.

టీ॥ ఏతాః=ఈ[జుహువు, ఉపభృత్తు, ధృవయనెడిపాత్రములు], సుకృతస్య=సుకృతమునకు, లోకే=స్థానమైన ప్రస్తరమందు, అసదన్ = ఉంచుచున్నవి. విష్ణో=ఓవిష్ణూ, తాః = ఆ [పాత్రములను] పాహి=రక్షించుము, యజ్ఞం=యాగమును, పాహి=రక్షించుము, యజ్ఞపతిం=యజమానుని, పాహి =రక్షించుము, యజ్ఞనియం=యజ్ఞమును చేయుచుండే, మాం=నన్ను, పాహి =రక్షించుము,

తా॥ ఓభగవంతుడా నిన్నుధ్యానించువారిని రక్షించుము. నాతపోయజ్ఞము ను సంపూర్తిచేయుము.

వినియోగము ॥ ఈమంత్రము చెప్పి హోమముచేసెడిపాత్రములనభిమంత్రించవలయును.

వి ॥ బ్రాహ్మణమననుసరించి ఈమంత్రము 3-భాగములు చేయంబడినది. ౧-వ భాగమునకు బ్రాహ్మణము ‟ఏతా అసదన్ సుకృతస్యలోకఇత్యాహ। సత్యం వై సుకృతస్యలోకః । సత్యఏవైనాన్సుకృతస్య లోకేసాదయతి'' (తై బ్రా. 3-3-౬) అనగ సత్యమేపుణ్యలోకమును గలుగచేయును.

ఈ మంత్రము ౧౧-అక్షరములుగల ౧-పాదము. ‟ఏతా అసదన్ ఇత్యేక పదాత్రిష్టుప్'' అని విద్యారణ్యభాష్యమునందు చెప్పంబడినది. (పుట. ౨౧౭).

(౨) వ భాగమునకు బ్రాహ్మణము ‟తావిష్ణోపాహీత్యాహ.। యజ్ఞోవై విష్ణుః యజ్ఞస్యధృత్యై'' (తై బ్రా 3-3-౬)

(3)వ భాగమునకు బ్రాహ్మణము ‟పాహియజ్ఞం పాహియజ్ఞపతిం పాహిమాంయజ్ఞనియమిత్యాహ । యజ్ఞాయ యజమానాయాత్మనే । తేభ్యఏవ ఆశిషమాశాస్తే నార్త్యై'' (తై బ్రా 3-3-౬)

ఈమంత్రమునకు వినియోగము ‟ఏతా అసదన్నితి స్రుచో అభిమంత్ర్య'' (ఆపస్తంబశ్రౌత ౨-౧౦-౪)



పదునొకండవ యనువాక సామాన్యవిషయములు..

(౧) ఈయనువాకము కర్మరీత్యా ‹‹ఇద్మాబర్హిః స్రుచంప్రోక్షణాది'' యని చెప్పంబడినది. జ్ఞానరీత్యా ‹‹శరీరాదిప్రోక్షణం'' అనిచెప్పందగును. 'శరీరమిద్మం' తైత్తిరీయోపనిషత్తునందు చెప్పంబడినది. (౪-పు, ౭౭-అను)

(౨) ప్రాతిశాఖ్య—ఈఅనువాకముయొక్క యేయేమంత్రములు తైత్తిరీయప్రాతిశాఖ్య సూత్రభాష్యమునం దుదహరింపంబడినవో ఆయాసూత్రములను, మంత్రములను, వివరించుచున్నారము. ‹‹ఋకారర్కార రషపూర్వో నకారోణకారం సమానపదే'' (౧౩-అ, ౬-సూ) ఈసూత్రమునుబట్టి ౧-వ మంత్రమునందుండు కృష్ణోసి'అనుపదముయొక్క నకారమునకుషకారముండుటచేణకారము సిద్ధించును.

(౩) వ్యాకరణం.—వర్ణవాచక శబ్దమునకు సాధారణముగనాద్యుదాత్తముండవలయును. అయితె నీలవర్ణార్థమైన కృష్ణశబ్దమునకు‹‹కృష్ణస్యఅమృగాఖ్యాచేత్'' అను సూత్రమునుబట్టి యంతోదాత్తము సంభవించును. ఈయనువాకము యొక్క ప్రథమమంత్రమునందు 'కృష్ణః' అని ఆద్యుదాత్తముండుటచే వర్ణార్థముకాదనియు, మృగార్థమనియు, స్వరమునుబట్టి గ్రహించవలయును. (స్వరప్రక్రియ. ౩౧౫పుట) మరియు నీశబ్దమునుగూర్చి (౪,౧,౧) చూడుడు.

(౪) నిరుక్తం—స్వాహాశబ్దమునుగూర్చి యాస్కమహాముని చే చెప్పంబడినదే మనగ ‹‹స్వాహే త్యేతత్ సు ఆహేతివా స్వావాగాహేతివాస్వం ప్రాహేతివా స్వాహుతం హవిర్జుహోతీతి వాతాసామేషాభవతి'' (నిరుక్తం ౮-అ, ౨౦-ఖం) పరాయాతము ద్వితీయాష్టక, ప్రథమప్రపాఠకమునకు అగ్నిహోత్రబ్రాహ్మణమని పేరు. ఈప్రపాఠకముయొక్క రెండవ అనువాకమునందు 'స్వాహా' శబ్దముయొక్క వ్యుత్పత్తిచెప్పంబడినది.ఆవాక్యమును, దానిభాష్యమును, ముఖ్యముగ దెలుసు కొనదగుటం జేసిదాని నిచ్చట వ్రాయుచున్నారము. ‹‹ఇదానీంస్వాహాకారోత్పత్తిందర్శయతి।తం వాగభ్యవదజ్జుహుధీతి । సోఽబ్రవీత్ । కస్త్వమసీతి । స్యైవతేవాగిత్యబ్రవీత్ । సో జుహూధ్వాస్వాహేతి । తథ్స్వాహాకార స్యజన్మఇతి। తంహోమవిషయే సందిహానం ప్రజాపతిం కాచిదదృశ్యావాక్ జుహుధీత్యబ్రవీత్ । తతఃప్రజాపతినా కస్త్వమితిపృష్టేసతితవస్వకీ యాయావాగస్తి సైవాహమస్మీత్యబ్రవీత్ । తతఃప్రజాపతిస్స్వాహేత్యుచ్చారయన్ అజుహోత్ । స్వకీయ్యావాక్ జుహుధీత్యాహేతి అస్యమంత్రస్యార్థః । తస్మాత్ పదద్వయం మిలిత్వాస్వాహాకారం మన్త్రస్యస్వరూ

పంసంపన్నమ్'' (కలకత్తాకూర్పు పుట. ౩౬౭) అనగ యజమానునియొక్క చైత
న్యము భగవంతుని పూజించుచున్నపుడు భగవంతుని నీవెవరవని యడుగగ నేను
నీసంబంధమైనవాడనేయని యర్థమిచ్చుచున్నటుల 'స్వాహా' అనుపదము తెలియచే
యుచున్నది. ''స్వ+ఆహా'' అనగ స్వకీయమనిచెప్పుచున్నది. ఇందువలనజీవాత్మ, ప
రమాత్మ సంబంధమైనదని యెంచవలయునుగాని ప్రకృతిసంబంధమైనదని యెంచ
దగదు. 'స్వాహా' అనుపదముబహుచోట్ల నుచ్చరింపబడుచున్నది. గావున నెచ్చట
నిట్టియర్థమునే గ్రహించియుచ్చరించుట మిగులనానందకరంబు.

(౫) ఛన్దః-ఈయనువాకమునందుండెడి వీతిహోత్రమను ౧౪-వ మంత్రము
'త్రిపదదాగాయత్రీ' ౨౦-వ మంత్రముయొక్క ప్రధమభాగమైన ''ఏతాసదస్సుకృత
స్యలోకే'' అనునది ''ఏకపదాత్రిష్టుప్'' అనగ ౧౧ అక్షరములుగలది.

(౬) మీమాంస-ఈయనువాకముతో సంబంధించిన కర్మయందు 'ప్రస్తర
ము' యజమానునిరూపకముగ నుపయోగింపంబడు చున్నది. అందుకుకారణము జై
మినిన్యాయమాలయందు చెప్పంబడినదేమనగ ''యజమానః ప్రస్తరోత్ర గుణోవానా
మవాస్తుతిః । సామానాధికరణ్యేన స్యాదేకస్య అన్యనామతా । గుణోవాయజమా
నోస్తు కార్యేప్రస్తరలక్షితే । అంశాంశిత్వాద్యభావేన పూర్వవన్నాత్ర సంస్తుతిః ।
అర్థభేదాదనామత్వం గుణత్వేప్రహీయేతసః । యాగసాధకతాద్వారా విధేయప్ర
స్తరస్తుతిః'' (౧-అధ్యా, ౪-పాదం, ౩౭. ౩౮. ౪౦-శ్లోకములు)- ఇందుకుజైమిని
సూత్రము 'తత్సిద్ధి' (౧-అ, ౪-పా, ౨౩ సూత్రము) ఈసూత్రమునకు యర్థము ''యే
నోద్దేశ్యంసిధ్యతి సోర్థవాదః'' ఇందునుగూర్చి శబరస్వామి వ్రాసినదేమనగ ''తా
యజమానే ప్రతీతేప్రతీయతే తస్మాత్తోయజమానశబ్దేన ప్రత్యాయ్యేతే'' (మీమాంసక
లకత్తాకూర్పుపుట. ౧౧౧) అనగ నీసూత్రమునకు ''యజమానః ప్రస్తరః'' అనియు
(తై బ్రా. ౩-౩-౯-౩) ''యజమానోవా ఏకకపాలః'' (తై బ్రా. ౧-౬-౩-౪) అ
నెడి రెండు దాహరణము లివ్వంబడినవి. ఆప్రస్తరము, ఏకకపాలము యజమానుని
కి సాదృశ్యము. ఇదియేకర్మయొక్కభావన. ఇదియేజ్ఞానార్థము.

(౭) ధర్మశాస్త్రం-పదియవయనువాకమునందు గృహస్థాశ్రమము చెప్పంబడి
నది. అందుచేయవలసిన విధులు ఈయనువాకమునందు చెప్పంబడినవి. ప్రతిగృహ
స్థు పంచమహాయజ్ఞములు చేయవలసినవిధియైయున్నది ''తాసాంక్రమేణ సర్వా
సాం నిర్వృత్యర్థం మహర్షిభిః।పంచక్లుప్తా మహాయజ్ఞాః ప్రత్యహంగృహమేధినాం।
అధ్యాపనంబ్రహ్మయజ్ఞః పితృయజ్ఞస్తుతర్పణం । హోమోదైవంబలిర్భౌతోన్య యజ్ఞో

అతిథిపూజనం" (మనుస్మృతి 3-అ, ౬౯, ౭౦-శ్లోకములు) ఈమహాపంచయజ్ఞములనుగూర్చి యీయనువాకముయొక్క ప్రథమభాగమునందు చెప్పంబడినది. పంచమహాయజ్ఞములనగ "భూతపిత్రమర బ్రహ్మమనుష్యాణాం మహామఖః" ఈవాక్యమునకు విజ్ఞానేశ్వర వ్యాఖ్యానము "బలికర్మభూతయజ్ఞః స్వధాపితృయజ్ఞః । హోమోదేవయజ్ఞః । స్వాధ్యాయోబ్రహ్మయజ్ఞః । అతిథిసత్క్రియా మనుష్యయజ్ఞః ఏతేపంచ మహాయజ్ఞాః" (యాజ్ఞవల్క్యస్మృతి యొక్క విజ్ఞానేశ్వర భాష్యము పుట. ౧౬)

(ర) పతంజలియోగము-పంచమహాయజ్ఞములను చేయుటయేగాక యజమానుడు భగవంతుని ధ్యానముచేయవలయునని యీయనువాకముయొక్క రెండవభాగముచెప్పుచున్నది. ఈవిషయమై పతఞ్జలియోగమునందు చెప్పెడియంశమునుచూడందగును. ఈయనువాకమునందును, చెప్పంబడిన సంగతులను ఆలోచించిన కర్మయొక్కభావార్థము దెలుసుకొనుట యావశ్యమని తోచనగును. ధ్యానమునకు పూర్వముమనస్సును, పంచమహాయజ్ఞము లాచరించుటచే పవిత్రము చేసుకొనవలయును. ఈసంగతినేపతంజలులవారు "మైత్రీకరుణాముదితోపేక్షాణాం సుఖదుఃఖపుణ్యాపుణ్యవిషయాణాం భావనాతశ్చిత్త ప్రసాదనం" అనిచెప్పిరి. (౧-ప, 33-సూ) తదనంతరంబ "సమిధీమహ్యగ్నే త్యాది" రీతిని ౧౪-వ మంత్రమునందుచెప్పిన ప్రకారముజ్యోతియందు మనస్సును"విశోకా వాజ్యోతిష్మతీ"స్థిరముగదుఃఖములేకనుంచవలయునని.(౧-అ,3౬-సూ) ఈప్రకారముగ మనస్సునుచంచలింపక భగవంతునియందే దృష్టినుంచెడితపసిపదునారవమంత్రమందుచెప్పినరీతిగసిద్ధపురుషులనుజూచును"మూర్ధజ్యోతిషిభావదర్శనం" అనియోగశాస్త్రమునందు చెప్పంబడినది (3-ప, 3౨-సూ) ఈసూత్రమునుగూర్చి చెప్పినభాష్యమేమనగ "శిరఃకపాలేబ్రహ్మరంధ్రాఖ్యం ఛిద్రం ప్రకాశ ఆధారత్వాత్ జ్యోతిః । యథాగృహాభ్యం తరస్థస్యమణేః ప్రసరన్తీ ప్రభా కుంచికావివర ప్రదేశేసంఘట్టతే తథాహృదయస్థః సాత్త్వికః ప్రకాశఃప్రసృతస్తత్ర సంపిణ్డితత్వంభజతే । తత్రకృతసంయమస్య యేద్యావాపృథివ్యోః అంతరాళవర్తినః సిద్ధాః దివ్యాః పురుషాః తేషామితర ప్రాణ్య దృశ్యానాంతేస్యదర్శనం భవతితాన్ పశ్యతి తైశ్చసంభావ్యత ఇత్యర్థః" (పుట. ౭౭) కపాలమందుండెడి బ్రహ్మరంధ్రమునుగూర్చి ౯-వ అనువాకముయొక్క ౧౨-వ మంత్రముచూడుము.

(౯) పురాణం—ఈయనువాకమునందు చెప్పినరీతిని మనస్సునుదృఢముగనుంచుట కఠినమైనను అభ్యాసమువలన సిద్ధినిపొందవచ్చునని భగవద్గీతయందు చె

ప్పంబడినది. "అసంశయం మహాబాహో మనోదుర్నిగ్రహంచలం । అభ్యాసేనతు కౌంతేయ వైరాగ్యేణచగృహ్యతే । అసంయతాత్మనాయోగో దుష్ప్రాపఇతి మేమనః వశ్యాత్మనాతుయతతాశక్యో అవాప్తుముపాయతః" (౬-అ, ౩౫. ౩౬.శ్లోకములు) కావునఅభ్యాసముచేయుచు మనస్సుయొక్క స్థిరత్వముపొందుట కీయనువాకమునందు చెప్పినరీతిని ప్రయత్నించవలయును.

(౧౦) ఈయనువాకముతో సంబంధించిన శాఖలు, బ్రాహ్మణము, కల్పము,

శాఖలు.

| | |
|---|---|
| తైత్తిరీయసంహిత | ౨, ౬, ౫, ౧ |
| కాఠకసంహిత | ౧. ౧౧ |
| కపిష్ఠలకఠసంహిత | ౧. ౧౧ |
| మైత్రాయణీసంహితే | ౧. ౧. ౧౨ |
| వాజసనేయసంహిత | ౨. ౧-౬ |

బ్రాహ్మణము.

| | |
|---|---|
| కాఠకబ్రాహ్మణము | ౩౧. ౧౦ |
| మైత్రాయణీబ్రాహ్మణము | ౪ ౧. ౧౩ |
| శతపథబ్రాహ్మణము | ౧. ౩. ౩. ౧-౪, ౧౬ |
| తైత్తిరీయబ్రాహ్మణము | ౩. ౩. ౬. ౨-౧౧ |

కల్పము.

| | |
|---|---|
| మానవశ్రౌతము | ౧. ౨ |
| కాతీయశ్రౌతము | ౨. ౭. ౧౯-౮. ౨౦ |
| ఆపస్తంబశ్రౌతము | ౨. ౮. ౧ - ౧౦. ౪. |

ఏకాదశోఽనువాకము

సంపూర్ణము.



ఓమ్

శ్రీపరబ్రహ్మణేనమః.

కృష్ణయజుర్వేద

# తైత్తిరీయసంహితా మంత్రభాగస్య

## ద్వాదశో௨నువాకః.

కాండఋషి ప్రజాపతిః.

౧. (౧) భువనం అసి వి ప్రథస్వ (౨) అగ్నే యష్టః ఇదం నమః.

జ్ఞానార్థము.

టీ ॥ (౧) భువనం = నీవుజగత్తువు, అసి=అగుచున్నావు, వి + ప్రథస్వ= విస్తీర్ణముకమ్ము, (౨) అగ్నే=ఓభగవంతుడా, యష్టః = యజ్ఞనియామకుడవు, (గావుననీకు) ఇదం=ఈ, నమః=నమస్కారము.

తా ॥ నేను సంచరించుటకు జగత్తు విశాలమైనది యాగాక. భగవంతుడా నీకు నమస్కారము.

కర్మార్థము.

టీ॥ యష్టః=యాగనిర్వాహకుడవైన అగ్నే = ఓయగ్నీ [నీవు], భువనం=[సర్వపదార్థములకును] కారణము, అసి=అగుచున్నావు, విప్రథస్వ=[గనుక] వృద్ధినొందుము, ఇదం=ఈ, నమః=నమస్కారము [నీకు అగుగాక].

వినియోగము ॥ ఈమంత్రము చెప్పి జుహువనెడి, ఉపభృత్తనెడి, పాత్రములను యెదురుగ దోసిలించవలయును.

వి ॥ ఈప్రపాఠకము యొక్క ప్రారంభము నందు బ్రహ్మచర్య వ్రతముచెప్పంబడినది. అదియేవత్సోపకరణం. తదనంతరంబ గృహస్థాశ్రమము చెప్పంబడినది. ఈయనువాకమునందు ౩. ౪. ఆశ్రమములుచెప్పంబడినవి. సాధారణముగనాలుగాశ్రమములని చెప్పుచున్నను ముఖ్యమైనవి మూడాశ్రమములు. "తఏవహిత్రయోలోకాస్తఏవత్రయ ఆశ్రమాః । తఏవహిత్రయో వేదాస్తయేవోక్తాస్త్రయోగ్నయః" అని మనుస్మృతియందు చెప్పంబడినది. (౨.అ, ౨౩౦-శ్లో). ౩-వ ఆశ్రమము వానప్రస్థము, సన్యాసము, అని రెండువిధములు. ఈరెండువిధములు మనుస్మృతియొక్క ౬-వ అధ్యాయమునందు చెప్పంబడినది. "ఏవంగృహాశ్రమేస్థిత్వా విధివత్స్నాతకోద్విజః । వనేవసేత్తునియతో యథావద్విజితేంద్రియః" అని (మనుస్మృతి ౬-అ, ౧-శ్లో) ౩-౪. ఆశ్రమములయందు ప్రవేశించువాడొక స్థలమందుండక దే

శాటనచేయుట విధి గనుక భువనమును గూర్చి యీయనువాక ప్రారంభమునందు చెప్పంబడినది.

భువనము— "సమస్తభూతజాతస్య తస్మాద్భువనం" అని భట్టభాస్కరమునందు చెప్పంబడినది. (౧-౧-౧౨) "త్రిష్వథో జగతీలోకో విష్టపంభువనంజగత్" అని (అమరకోశ ౨-కా, ౬-శ్లో)

'విప్రథస్వ'—అనుపదమునుగూర్చి "విస్తీర్ణోభవతు" అని భట్టభాస్కరమునందు చెప్పంబడినది. (౧-౧-౧౨) యజమానుడు దేశాటనచేయ బోవునపుడు ప్రపంచము విశాలమవుగాక అని ప్రార్థించుచున్నాడు.

యష్టః—'యాగస్యనిర్వర్తకః' అని భట్టభాస్కరమునందు చెప్పంబడినది. (౧-౧-౧౨). అనగ యజ్ఞమునియమించువాడు. నియమించినవాడు భగవంతుడే యని యీమంత్రము బోధించుచున్నది. వీటినినేను సంపూర్తిగ నెరవేర్చునటుల నాశీర్వదించబడవలయునని నమస్కారపూర్వక ప్రార్థన.

ఈమంత్రమునకు విద్యారణ్యభాష్యము "హేయాగనిష్పాదక అగ్నేత్వం భువనమసి భవంత్యస్మాద్భూతానీతి భువనం, అతోభూతకారణత్వాత్ విస్తృతోభవ ! తుభ్యమిదం అఞ్జలిరూపంనమోఅస్తు" (పుట. ౧౭౬)

ఈమంత్రమునకు బ్రాహ్మణము "భువనమసి విప్రథస్వేత్యాహ । యజ్ఞోవైభువనం । యజ్ఞ ఏవయజమానం ప్రజయాపశుభిః ప్రథయతి । అగ్నేయష్టరిదంనమ ఇత్యాహ । అగ్నిర్వై దేవానాంయష్టా । యఏవదేవానాంయష్టా । తస్మాఏవనమస్కరోతి" (తై బ్రా. 3-3-7). వానప్రస్థము యజ్ఞమైనటుల 'యజ్ఞోవైభువనం' అను శ్రుతి వలన దెలియందగును.

ఈమంత్రమునకు వినియోగము "భువనమసీత్యగ్రేణ ధ్రువాంజుహూం వాఞ్జలింకృత్వా" (ఆప ౨-౧3-౨).

## ౨. జుహు అ ఇహి అగ్నిః త్వా హ్వయతి దేవయజ్యాయై.

జ్ఞానార్థము.

టీ ॥ జుహు=ఓకుడిహస్తమా, త్వా=నిన్ను, అగ్నిః = భగవంతుడు, దేవయజ్యాయై = భగవత్పూజకొరకు, హ్వయతి=పిలుచుచున్నాడు, అ + ఇహి= ఏహి=రమ్ము.

ఓకుడిహస్తమానీవు భగవంతుని నమస్కారము చేయుకొరకు రమ్ము.

కర్మార్థము.

టీ ॥ జుహు=ఓజుహువనెడి పాత్రమా, త్వా=నిన్ను, అగ్నిః=అగ్ని, దేవయజ్యాయై = దేవయాగము కొరకు, హ్వయతి = పిలుచుచున్నాడు, ఏహి = రమ్ము.

వినియోగము॥ ఈమంత్రముచెప్పి జుహువనెడిపాత్రనుస్వీకరించవలయును.

వి ॥ ౨. 3. మంత్రములచే రెండుహస్తములు అంజలిగకూర్చుటయని చెప్ప బడుచున్నది.

జుహు అనగ కుడి హస్తము అని ఇదివరకు వ్రాసియున్నారము.

ఈ మంత్రమునకును, మూడవ మంత్రమునకును, కలిపి బ్రాహ్మణము చెప్పం బడినది. "జుహ్వ్యాహ్యగ్నిస్త్వా హ్వాయతి దేవయజ్యాయా ఉపభృదేహి దేవస్త్వా సవితా హ్వాయతి దేవయజ్యాయా ఇత్యాహ । ఆగ్నేయీవై జుహూః । సావిత్ర్యు పభృత్ । తాభ్యామేవైనే ప్రసూత ఆదత్తే" (తై. బ్రా. 3-3-2)

ఈ మంత్రమునకు వినియోగము "జుహ్వేహీతి జుహూమాదత్త" (ఆప ౨-౧౬-౨)

3. ఉపభృత్ అ ఇహి దేవః త్వా సవితా హ్వాయతి దేవయజ్యాయై

జ్ఞానార్థము.

టీ॥ ఉపభృత్=ఓయడమహస్తమా, సవితా=ప్రేరకుడైన, దేవః= దేవుడు, త్వా=నిన్ను, దేవయజ్యాయై=దేవపూజకొరకు, హ్వాయతి=పిలుచుచున్నాడు, అ+ఇహి= ఏహి=రమ్ము.

తా॥ ఓయడమహస్తమా భగవంతునికినమస్కారము చేయుటకురమ్ము.

కర్మార్థము.

టీ॥ ఉపభృత్=ఓయుపభృత్తా, సవితా=ప్రేరకుడైన, దేవః = దేవుడు, త్వా=నిన్ను, దేవయజ్యాయై=దేవయాగముకొరకు, హ్వాయతి=పిలుచుచున్నాడు, ఏహి=రమ్ము.

వినియోగము॥ ఈమంత్రముచెప్పి ఉపభృత్తనెడిపాత్రను స్వీకరించవలయును

వి ॥ భగవదనుగ్రహమువలన ప్రథమ ద్వితీయాశ్రమములను సంపూర్తిచేసి మూడు నాలుగాశ్రమములయందు ప్రవేశించు యజమానుడు అట్టి భగవదనుగ్రహమునకుగాను, ప్రతిగ నేమియుజేయలేక తనయొక్క నమ్రతను కృతజ్ఞతను జూపుటకు రెండుహస్తములతో నమస్కారముచేయుచున్నట్టు ౧ - ౨ - 3 మంత్రములు చూపించుచున్నవి. ఉపభృత్ అనగ యడమహస్తమని శ్రుతిప్రమాణము.

ఈమంత్రముయొక్క బ్రాహ్మణమునుగూర్చి ౨-వ మంత్రవివరణ చూడుము.

ఈ మంత్రమునకు వినియోగము "ఉపభృదేహీత్యుపభృతం" (ఆపస్తంబ శ్రౌత ౨-౧3-౨). ఈవినియోగమునకును విద్యారణ్యభాష్యమునందు చెప్పంబడిన వినియోగమునకును కొంచము భిన్నముగనున్నది. "సవ్యేనోపభృతం ఉపభృదేహి దేవస్త్వాస వితాహ్వాయతి దేవయజ్యాయై" (పుట. ౧౭౭)

౮. (౧) అగ్నావిష్ణూ మా వాం అవ క్రమిషం (౨) వి జిహాథాం మా మా సం తా ప్తం (౩) లోకం మే లోకకృతౌ కృణుతం.

జ్ఞానార్థము.

టీ ॥ (౧) అగ్నావిష్ణూ=అగ్నియని విష్ణువని పేరుగలిగిన భగవంతుడా, వాం=(మిమ్ము) నిన్ను, మా+అవ+క్రమిషం=అతిక్రమించను (౨) మా=నన్ను, వి+జిహాథాం=విడువవద్దు, మా+సంతాప్తం=(మీరు) సంతాపపెట్టవద్దు, (౩) లోకకృతౌ = లోక కర్తయైనమీరు, లోకం=స్థానమును, మే=నాకు, కృణుతం=చేయండి.

తా ॥ అగ్ని, విష్ణువని పేరుగలిగినభగవంతుడా నన్ను విడువకుము. నాకుసంతాపముగలుగజేయకుము. నాకుతగినస్థానమును గలుగజేయుము.

కర్మార్థము.

టీ॥ అగ్నావిష్ణూ= ఓ యగ్నావిష్ణు దేవతలారా (ఆధార హోమముకొరకు, మీమధ్యగా వెళ్లుచున్న, నేను పాదముచేత), వాం=మిమ్మును, మాఅవక్రమిషం=(నేను) దాటను; విజిహాథాం= నా, గమనముకొరకు మీరిద్దరున్ను విడండి, మా=నన్ను, మా+సంతాప్తం= మీరుసంతాపపెట్టవద్దు, లోకకృతౌ= స్థానకర్తలగు మీరు, మే=నాకు, లోకం=గమనస్థానమును, కృణుతం=కలగచేయండి.

వినియోగము॥ ఈమంత్రముచెప్పి ప్రస్తరమనుదర్భసముదాయమునుదక్షిణపాదముచేత దాటవలయును.

---

వి ॥ అగ్నావిష్ణూఅనునవి ద్వివచనమైనను ఒకడైన భగవంతునికే జెందును (౮౦-వపుటచూడుము). ఈమంత్రమునకు సమానమైన శుక్లయజుర్వేదమంత్రమునందు «విష్ణోమాత్వావక్రమిషం'' అని ఏకవచనముగ చెప్పంబడినది. (౨-అ,౮. మం) ఈవాక్యమునకు «విష్ణో మా త్వా అవక్రమిషం'' ఇందుకుశుక్లయజుర్వేద భాష్యము «హే విష్ణో వ్యాపకయజ్ఞ పురుష అంఘ్రిణాపాదేన త్వాత్వాం అ హం మా అవ క్రమిషం అవక్రమణం మాకార్షం పాదేన అతిక్రమణదోషో మేమాభూదిత్యర్థః (కలకత్తాకూర్పు పత్రం ౨౮. ౧-౨ పఙ్క్తులు).

విజిహాథాం—అను పదమునుగూర్చి «విగచ్ఛతం'' అని భట్టభాస్కరమునందు జెప్పంబడినది (౧-౧-౧౨). అనగ లెస్సగపొందుము. «జిహాథాం''అనునది మధ్యమపురుష ద్వివచనము. ఇందుకుప్రథమపురుష ఏకవచనము జిహీత జిహీత అనగ «గచ్ఛేత'' అను ఓహాఙ్ గతౌ అనుధాతువువలన నిష్పన్నమైనదని సాయన భాష్యమునందు జెప్పంబడినది. (ఋగ్వే ౧-మం, ౩౯-సూక్తం, ౭-ఋక్కు) యజమానుడు ఇతర ప్రదేశమునకు వెళ్లుచుతననువిడువవద్దనియు, విడిచినయడల సంతాపముగలుగుననియు చెప్పుచున్నాడు. ఈయర్థమునె శుక్లయజుర్వేద మంత్రమునందు మరియొకవిధముగ జెప్పంబడినది «వసుమతీమగ్నే తెచ్ఛాయాముపస్థేయం''

(౨-అ, ౮-మం) ఇందుకుభాష్యము ‘‘వసుమతీంవసూని జిహ్వాని వస్తూని భవంతి యస్యాంతాం’’

‘‘అగ్నే’’—ఈశబ్దమునుగూర్చి ‘‘పరమేశ్వర । తేతవ ఛాయాం ఆశ్రయం, ఉపక్రియార్థే క్షేమముపపత్స్యయ’’ (బొంబాయికూర్పు పుట. ౧౧౬) అనగ ఓభగవంతుడానిన్ను ఎల్లపుడుఛాయవలె నాశ్రయించియుండెదను.

ఈమంత్రమునకు విద్యారణ్యభాష్యము ‘‘హే అగ్నావిష్ణూ అఘూరహోమార్థం యువయోర్మధ్యేగచ్ఛన్నహ్యహం పాదేనయువాం మావక్రమిషం మమగమనావకాశాయయువాం వియుక్తౌభవతం । మాంప్రతిసన్తాపంమాకురుత । కించస్థానకారిణౌయువాం మమ గమనస్థానం కురుతం’’ (పుట. ౧౨౯)

ఈమంత్రము బ్రాహ్మణమునననుసరించి (3) భాగములుచేయంబడినది. ౧-వ భాగమునకుబ్రాహ్మణము ‘‘అగ్నావిష్ణూ మావా మవక్రమిషమిత్యాహ । అగ్నిః పురస్తాత్ । విష్ణుర్యజ్ఞఃపశ్చాత్ । తాభ్యామేవప్రతిప్రోచ్యాత్యాక్రామతి’’ ౨-వ భాగమునకు బ్రాహ్మణము ‘‘విజిహాథా మామాసన్తాప్తమిత్యాహాహింసాయై’’ 3-వ భాగమునకు బ్రాహ్మణము ‘‘లోకంమేలోకకృతౌ కృణుతమిత్యాహ । ఆశిషమేవైతామాశాస్తే’’ (తై. బ్రా. 3-3-౭)

ఈ మంత్రమునకు వినియోగము ‘‘అగ్నావిష్ణూమా వామవక్రమిష మిత్యగ్రేణస్రుచో అపరేణమధ్యమం పరిధి మనవక్రామం ప్రస్తరం దక్షిణేన పదాదక్షిణాతి క్రామత్యుదకస్వ్యేన’’(ఆపస్తంబశ్రౌ ౨-౧3-౭) ఈ వినియోగమునకు బోధాయనులు చెప్పినవినియోగమునకునుకొంచము భేదము. ‘‘అత్యాక్రామన్ జపతి అగ్నావిష్ణూమా వా మవక్రమిషం విజిహాథాం మామా సంతాప్తం లోకం మేలోకకృతౌ కృణుతం’’ (విద్యారణ్యము పుట ౧౭౮)

---

౫. విష్ణోః స్థానం అసి (౨) ఇతః ఇంద్రః అకృణోత్ వీర్యాణి.

**జ్ఞానార్థము.**

టీ ॥ (౧) విష్ణోః = యజ్ఞముయొక్క స్థానం = స్థానము అసి = అగుచున్నావు (౨) ఇతః = ఈస్థానమునందుండిన వాడవై, ఇంద్రః = ఇంద్రుడను మహాపురుషుడు చేయునట్లు, వీర్యాణి = అంతశ్శత్రువధరూపమైన, వీరకృతములను, అకృణోత్ = చేయుము.

**కర్మార్థము.**

టీ ॥ విష్ణోః = [ఓభూప్రదేశమా]యజ్ఞపురుషునకు, స్థానం = స్థానముగా, అసి = అగుచున్నావు. ఇతః = ఈస్థానబలమువలన, ఇంద్రః = ఇంద్రుడు, వీర్యాణి = అసురవధరూపమైన వీరకృతములను, అకృణోత్ = చేసెను.

వినియోగము ॥ ఈమంత్రము చెప్పి ఆహవనీయదక్షిణ భాగమందుండ వలయును.

తా ॥ ఓయజమానుడా నీవు యతికి అనుకూలమైన స్థానమును సంపాదించి యచ్చట యతికి ధర్మంబైన అంతశ్శత్రు నాశనమును ఇంద్రుడనుమహాపురుషుడు చేయునట్లుగ చేయుము.

వి॥ విష్ణోః అనగ ఇచ్చట యజ్ఞార్థముగ బ్రాహ్మణమునందు చెప్పంబడినది. “యజ్ఞోవైవిష్ణుః” (౧-౧-౧౨)

ఇతః—అనునది అవ్యయము. ఈ పదమునుగూర్చి “ఇతఃప్రశస్తె అస్మిన్స్థానే స్థిత్వాయాగం నిర్వర్తయామీతి భావః” అనిభట్టభాస్కరమునందు చెప్పంబడినది. (౧-౧-౧౨) అనగ ప్రశస్తస్థానమునందుండి తృతీయ చతుర్థాశ్రమములగు యాగ ములను సంపూర్తిచేయుటకు యజమానుడు ప్రార్థించుచున్నాడు.

ఇంద్రః—అను పదమున కనేకార్థములు గలవు. ఇచ్చట దేవతావాచకము గాని బ్రహ్మవాచకము గాదు. దేవతలు పూర్వకాలంబున యజ్ఞములుచెసి స్వర్గలోకముపొందినటుల ప్రసిద్ధియైయున్నది. కావుననే ఈ మంత్రముయొక్క బ్రాహ్మణ మునందు “విష్ణోస్థానమసీత్యాహ । యజ్ఞోవైవిష్ణుః । ఏతత్ఖలువై దేవానా మపరాజితమాయతనం యద్యజ్ఞః । దేవానామేవా పరాజిత ఆయతనేతిష్ఠతి (3-3-౭)

ఈ మంత్రమునకు విద్యారణ్యభాష్యము “హే భూప్రదేశత్వం యజ్ఞ పురుషస్య స్థానమసి ॥ ఇతోదేవ యజనస్థానబలాత్ ఇంద్రః అసురవధరూపాణి వీర్యాణి అకరోత్” (పుట ౧౭౯)

ఈమంత్రముయొక్క రెండవభాగమునకు బ్రాహ్మణము “ఇతః ఇంద్రో అకృణోద్వీర్యాణీత్యాహ ఇంద్రియమేవయజమానేదధాతి” (తై.బ్రా. 3-3-౭)

ఈమంత్రమునకు వినియోగము “విష్ణోస్థానమసీత్యవతిష్ఠతె । అన్తర్వేది దక్షిణః పాదో భవత్యవఘ్రః సవ్యః। అధోర్ధ్వస్తిష్ఠన్దక్షిణం పరిధి సంధి మన్వవహృత్య” (ఆపస్తంబశ్రౌత ౨-౧3, ౯-౧౧.)

బోధాయనులుచెప్పిన వినియోగమేమనగ “స్థానంకల్పయతి విష్ణోస్థానమసి’ విద్యారణ్యభాష్యము పుట. ౧౭౯)

౬. సమారభ్య ఊర్ధ్వః అధ్వరః దివిస్పృశం అహ్రుతః యజ్ఞః యజ్ఞపతేః ఇంద్రావాన్ స్వాహా.

జ్ఞానార్థము.

టీ॥ సమారభ్య=లెస్సగ నారంభించి,

కర్మార్థము.

టీ॥ సమారభ్య = [నైరుతిదిక్కు]

దివిస్పృశం=స్వర్గలోకమును స్పృశించుచున్నట్టియు. ఊర్ధ్వః=ఊర్ధ్వభాగమైనట్టియు,అధ్వరః=యడతెగనట్టియు, అహ్రుతః = వంకరలేనట్టియు, యజ్ఞపతేః=యజమానునియొక్క, యజ్ఞః=తపోయజ్ఞము, ఇంద్రా వాన్+స్వాహా=భగవదర్పణమాగాక.

తా ॥ ఏతపస్సైనతే ఈలోకమునందు ప్రారంభమై తైలధారవలె అవిఛిన్నమైకుటిలరాహిత్యముగ స్వర్గమునుపొందునో యట్టితపస్సు భగవదంగీకార మగును.

మొదలుకొని, దివిస్పృశం = ఈశాన్య దిక్కును స్పృశించుచున్నట్టి, ఊర్ధ్వః=పొడువైనట్టియు, అధ్వరః=ఎడతెగనట్టియు, అహ్రుతః=వంకర లేనట్టియు, ఇంద్రవాన్=ఇంద్ర దేవతాకరమైనట్టిదిగా, యజ్ఞపతేః=యజమానునియొక్క యజ్ఞః=అఘారహోమము, స్వాహా=ఇవ్వబడినది.

వినియోగము॥ ఈమంత్రముచెప్పి అఘారహోమమును చేయవలయును.

వి ॥ ఈ మంత్రమునందు యతి చేయవలసిన తపోలక్షణమును గురించి చెప్పంబడినది.

ఈ మంత్రమునకు విద్యారణ్యభాష్యము ‘‘యజ్ఞపతేః యజమానస్య యజ్ఞ ఆఘారః స్వాహాదేవతాయై దత్తః కదృశోయజ్ఞః ఇంద్రదేవతాకత్వేన ఇద్రవాన్ నైరతీం రాక్షసీన్ దిశం సమారభ్య ఊర్ధ్వోదీర్ఘో అధ్వరోహింసారూపేణ విచ్ఛేదేన రహితః ఐశానీంద్దైవికిం దిశంస్పృశతి అహ్రుతః అకుటిలః’’ (పుట. ౧౮౦)

ఈమంత్రమునకు బ్రాహ్మణము. ‘‘సమారభ్యోర్ధ్వో అధ్వరోదివిస్పృశమిత్యాహవృద్ధ్యై ఆఘారమాఘార్యమాణ మనుసమారభ్య ఏతస్మిన్ కాలేదేవాః స్సువర్గం లోకమాయన్ ॥ సాక్షాదేవయజ మానస్సువర్గంలోకమేతి అథోసమృద్ధ్యైనైవ యజ్ఞేనయజమానస్సువర్గంలోకమేతి । అహ్రుతోయజ్ఞో యజ్ఞపతేరిత్యాహాఅనార్త్యై । ఇంద్రావాంధ్స్వాహేత్యాహ । ఇంద్రియమేవయజమానేదధాతి’’ (తై-బ్రా. 3-3-2) అనగ తపోయజ్ఞము చేసిన విబుధులు స్వర్గలోకమును బొందిరి. ఆప్రకారముగనే యజమానుడు స్వర్గలోకమును పొందును. తపోయజ్ఞము సమృద్ధిగజేసిన యజమానుడు స్వర్గమును బొందుచున్నాడు.

ఈమంత్రమునకు వినియోగము. ‘‘సమారభ్యోర్ధ్వో అధ్వర ఇతి ప్రాంచముదఞ్చమృజుంసంతతంజ్యోతిష్మత్యాఘారమాఘారయన్ సర్వాణీధ్మకాష్ఠాని సంస్పర్శయతి’’ (ఆపస్తంబశ్రౌత౨-౧౪-౧)

ఈవినియోగమునకు బోధాయనులుచెప్పిన వినియోగము కొంచముభిన్నముగ నున్నది. ‘‘అన్వారబ్ధె యజమానే మధ్యమే పరిధౌ సంస్పృశన్ ఋజుతిష్ఠన్

ఋజుమాఘారయతి సన్తతం ప్రాంచమవ్యవచ్ఛింధన్ ఇతఇంద్రో అకృణోద్వీర్యాణి సమారభ్యోర్ధ్వో అధ్వరోదివి విస్పృశమహ్రుతో యజ్ఞోయజ్ఞపతే రింద్రావాన్ త్స్వాహా'' (విద్యారణ్యం పుట. ౧౭౯)

## ౭. బృహద్భాః.

**జ్ఞానార్థము.**

టీ॥ బృహత్ = (ఆలోకము) గొప్పదిగ, భాః = ప్రకాశించునది.

తా ॥ స్వర్గము గొప్పదిగ ప్రకాశించును.

**కర్మార్థము.**

టీ॥ బృహద్భాః = గొప్పదైన తేజస్సుగల అగ్ని (అగుచున్నది).

వినియోగము ॥ ఈమంత్రము చెప్పి స్రుక్కునెత్తుకొనవలయును.

వి ॥ బృహద్భాః అనగ స్వర్గలోకము అని బ్రాహ్మణమునందు జెప్పంబడినది ''బృహద్భాః ఇత్యాహాసువర్గోవై లోకోబృహద్భాః సువర్గస్యలోకస్య సమష్ట్యై'' (తై. బ్రా. 3 - 3 - ౭)

ఈమంత్రమునకు విద్యారణ్యము „అనేనాఘారేణ జ్వాలారూపం యథాబృహద్భవతితథాయమగ్నిర్భాసతెతతోజుహూఃమాదహ్యాతామిత్యుద్గృహ్ణాతి' (పు.౧౮౦

ఈ మంత్రమునకు వినియోగము 'బృహద్భా ఇతి స్రుచముద్గృహ్య'' (ఆపస్తంబశ్రౌత. ౨-౧౪-౧౦)

## ౮. పాహి మా అగ్నే దుశ్చరితాత్ ఆ మా సుచరితే భజ.

**జ్ఞానార్థము.**

టీ॥ అగ్నే = భగవంతుడా (నీవు), మా = నన్ను, దుశ్చరితాత్ = దుష్కృతమువలన, పాహి = రక్షించుము, సుచరితే = సత్ప్రవర్తనయందు, మా = నన్ను, ఆ = విస్తారముగ, భజ = స్థాపించుము.

తా॥ ఓ భగవంతుడా నన్ను దుష్కృతమువలన రక్షించి సత్ప్రవర్తనయందు విస్తారముగ స్థాపించుము.

**కర్మార్థము.**

టీ॥ అగ్నే = ఓయగ్నీ (నీవు), మా = నన్ను, దుశ్చరితాత్ = దుష్కృతమువలన, పాహి = రక్షించుము, సుచరితే = మంచివ్యాపారమందు, మా = నన్ను, ఆభజ = స్థాపించుము.

వినియోగము ॥ ఈ మంత్రము చెప్పి జుహూపభృత్తులను తాకకుండా వెళ్లుచు జపము చేయవలయును.

వి॥ ''భజస్థాపయ'' అని విద్యారణ్యభాష్యమునందు చెప్పంబడినది (పుట. ౧౮౦)

ఈమంత్రముయొక్క వ్యాఖ్యానము ముఖ్యముగ చూడందగినది. అగ్నిశబ్ద ప్రయోగమునకు ప్రయోజనమేమనగ. ''అగ్నిర్వావపవిత్రం'' దుశ్చరితమనగ = ''వృ

జినం అనృతం దుశ్చరితం'' సుచరితమనగ—'' ఋజుకర్మగ్ంసత్యగ్ం సుచరితంకాయికంనిషిద్ధాచరణం వృజినం'' అనియు, '' విహితాచరణమృజుకర్మ'' అనియు ''వాచికసత్యానృతే'' అనియు విద్యారణ్యమునందు చెప్పంబడినది. (విద్యారణ్యాం పుట ౧౮౧) కావున మోక్షసిద్ధి కొరకు నిషిద్ధమైనకర్మలను చేయకయు, అనృతమునుపలుకకయు, విహితమైనకర్మలను చేయవలసినదని వేదము ఘోషిల్లుచున్నది.

ఈమంత్రమునకు వినియోగము ''పాహిమాగ్నే దుశ్చరితా దామా సుచరితే భజేత్యసంస్పర్శయన్ స్రుచౌప్రత్యాక్రామతి'' (ఆప ౨-౧౪-౧౦)

## ౯. మఖస్య శిరః అసి సమ్ జ్యోతిషా జ్యోతిః అజ్క్తామ్.

**జ్ఞానార్థము.**

టీ॥ మఖస్య=యజ్ఞముయొక్క, శిరః=సంపూర్తిచేసినవాడవు, అసి=అగుచున్నావు, (అట్లయ్యేనేని) జ్యోతిషా=జ్యోతిస్సుచేత, జ్యోతిః = పరంజ్యోతిని, సమ్=లెస్సగ, అజ్క్తాం=కలుసుకొనుగాక.

తా॥ ఏమనుజుడైతే పూర్వముచెప్పినప్రకారము తపోయజ్ఞమును సంపూర్తి చేయునో యతడు భగవత్సాలోక్య సాయుజ్య సామీప్యమును పొందును.

**కర్మార్థము.**

టీ ॥ మఖస్య=[ఓయాఘారశేషమా నీవు] యజ్ఞమునకు, శిరః=శిరస్సువలెనే, అసి=అగుచున్నావు, జ్యోతిషా = ఆ జ్యోతిస్సుతో, జ్యోతిః=[ధ్రువాపాత్రమందుండెడి] ఆజ్యరూపమైనజ్యోతిస్సును, సం+అజ్క్తాం = లెస్సగకలుసుకొనుగాక.

వినియోగము॥ ఈమంత్రముచెప్పి జుహూపాత్రముచేధ్రువాపాత్రమందు మూడాజ్యబిందువుల నుంచవలయును.

వి॥ మఖః—అనుశబ్దము యజ్ఞార్థములయందు చెప్పంబడినది. (వేదనిఘంటు 3.అ, ౧౭-ఖం) ''మహపూజాయాం'' అను ధాతువవలన నిష్పన్నమైనదని వేదనిఘంటు నిర్వచనమునందు చెప్పంబడినది. (పుట ౧౪౯)

శిరశ్శబ్ద నిష్పత్తినిగూర్చి ఉణాదిసూత్రము ''శ్రయతేఃస్వాంగే శిరఃకిచ్చ'' (అనునది ౪-అ, ౧౯3-సూ)

'' సమజ్క్తాంసంగచ్ఛతాం'' అని భట్టభాస్కరమునందు చెప్పంబడినది. (౧-౧-౧౨)

పరమాత్మయు, జీవాత్మయు, జ్యోతిస్స్వరూపులనుట ప్రసిద్ధి. జీవాత్మయందుండెడియజ్ఞానము నశించినయెడ భగవంతుని పొందుననియీమంత్రము చెప్పుచున్నది.

దీనికనుగుణ్యముగనే బ్రాహ్మణము అట్లు తెలియజేయుచున్నది. ‹‹ మఖస్యశిరోసి సంజ్యోతిషాజ్యోతిరఙ్క్తామిత్యాహ ॥ జ్యోతిరేవాస్మా ఉపరిష్టాద్దధాతి సువర్గస్య లోకస్యానుఖ్యాత్యై'' (తై. బ్రా. 3-3-౮)

ఈమంత్రమునకు విద్యారణ్యభాష్యము ''హేఆఘారశేషత్వం యజ్ఞస్యశిరో వదుత్తమమఙ్గమసి । అతస్త్వద్రూపేణజ్యోతిషా ధ్రౌవాజ్యరూపంజ్యోతిఃసమఙ్క్తాం సంయుజ్యతాం'' (పుట ౧౮౧)

ఈమంత్రమునకు వినియోగము ‹‹ మఖస్యశిరోసీతిజుహ్వాధ్రువాంద్విస్త్రిర్వా సమనక్తి'' (అపస్తంబ ౨-౧౪-౧౨)



## పంద్రెండవ యనువాక సామాన్యవిషయములు.

౧. ఈ యనువాకము కర్మరీత్యా ఆఘారాయని చెప్పబడుచున్నది. జ్ఞానరీత్యా ప్రాణాపానాయని చెప్పందగును. "ప్రాణా ఆఘారః" అని శ్రుతిః (తై. బ్రా. 3-3-8)

౨. ప్రాతిశాఖ్యా—ఈ అనువాకములోనియేయేమంత్రములు తైత్తిరీయప్రాతిశాఖ్య సూత్రములయొక్క భాష్యమునం దుదహరింపబడినవో యా సూత్రములను, మంత్రములను, వివరించుచున్నారము.

(౧) "ఇంద్రావద్వాక్ పరః" (3-అ, 3-సూ) ఈ సూత్రమునుబట్టి ౬-వ మంత్రమునందుండెడి ఇంద్రావాక్ అనుపదమునందు ఇంద్రశబ్దమునకు వాక్ పరమగుచుండగ దీర్ఘమువచ్చి ఇంద్రావాగ్రైయైనది.

(౨) వ్యోః, అభోః, వాః, హః, అవిభః, అజీగః, అకః, అనంతః, వివః, సువః, పునః, అహరహః, ప్రాతః, వస్తః, శమితః, సమితః, సనుతః, స్తనుతః, సోతః, హోతః, పితః, మాతః, యష్టః, ఏష్టః, నేష్టః త్వష్టః, (౮ - అ, ౮ - సూ) ఈ సూత్రమునుబట్టి ౧-వమంత్రమునందు "యష్టరిదంనమః"అనువాక్యమునందుండెడి యష్టః అనుపదముయొక్క "విసర్గ" రకారమగుచున్నది.

(3) అరతిం, అస్యయజ్ఞస్య, అతిద్రుతః, అతియన్తి, అన్నృణః, అవిమ్యక్, అనమీవః, అగ్నేషు, అర్చిః,అజీతాక్,అజ్యానిం,అహ్నియాః,అంబాలి, అర్వన్తం, అస్తు, అకృణోత్, అఙ్గిరః, అప్సుయః, అస్కభాయత్, అచ్యుతః, అశ్వసనిః, అస్థభిః, అశిశ్రేత్, అంగె, అఘ్నియ, (౨౧-అ,౧౭-సూ) ఈసూత్రమునుబట్టి ౫-వమంత్రముయొక్క ఇంద్రో అకృణోత్ అను వాక్యమునందుండెడియకారము లోపించలేదు.

3. ఛన్దస్సు—(౧) "అగ్నేయష్టరిదంనమః"అనుమంత్రముఏకపదాగాయత్రీ.

(౨) "పాహిమాంఅగ్నేదుశ్చరితాత్ । ఆమాసుచరితేభజ" అను మంత్రము ద్విపదా గాయత్రీ

౪. మీమాంసనుగురించి భాష్యమందు అనేకసంగతులు చెప్పబడ్డవి వాటిని ముందుదహరించనగును.

౫. ఈయనువాకముతో సంబంధించిన శాఖలు, బ్రాహ్మణము, కల్పము.

**శాఖలు.**

| | |
|---|---|
| కాఠకసంహిత | ౧. ౧౨ |
| మైత్రాయణీసంహిత | ౧. ౧౩ |
| కపిష్ఠలకఠసంహిత | ౧. ౧౨ |
| వాజసనేయసంహిత | ౨. ౮-౯ |

**బ్రాహ్మణము.**

| | |
|---|---|
| కాఠకబ్రాహ్మణము | ౩౧. ౧౧ |
| మైత్రాయణీబ్రాహ్మణము | ౪. ౧. ౧౪ |
| తైత్తిరీయబ్రాహ్మణము | ౩. ౩. ౭ |
| శతపథబ్రాహ్మణము | ౧.౪.౫.౨-౭ |

**కల్పము.**

| | |
|---|---|
| మానవశ్రౌతము | ౧. ౩. ౧-౪ |
| కాతీయశ్రౌతము | ౩. ౧. ౧౬-౨౨ |
| ఆపస్తంబశ్రౌతము | ౨. ౧౪. ౧౨ |

ద్వాదశోఽనువాకః

సంపూర్ణము.



ఓమ్

శ్రీపరబ్రహ్మణేనమః.

కృష్ణ యజుర్వేద

# తైత్తిరీయసంహితా మంత్రభాగస్య

త్ర యో ద శో ఽ ను వా కః.

కాండఋషి ప్రజాపతిః.

## ౧. వాజస్య మా ప్రసవేన ఉద్గ్రాభేణ ఉత్ అగ్రభీత్.

**జ్ఞానార్థము.**

టీ ॥ వాజస్య=జ్ఞానముయొక్క, ప్రసవేన=ప్రేరణచే,ఉద్గ్రాభేణ=(సద్వృత్తులను) ఊర్ధ్వముగనెత్తుటచేత, మా=నన్ను,ఉదగ్రభీత్=ఊర్ధ్వముగనెత్తును.

తా ॥ జ్ఞానప్రసరణచే సద్వృత్తులను ఊర్ధ్వముగ నుంచుటవలననయూర్ధ్వ లోకమును జెందును.

**కర్మార్థము.**

టీ ॥ వాజస్య = అన్నముయొక్క, ప్రసవేన=ఉత్పత్తికిహేతువైన, ఉద్గ్రాభేణ= (జుహువనెడిపాత్రమును) పైకెత్తిగ్రహించుటచేతను, మా=నన్ను, ఉదగ్రభీత్=పైకియెత్తును.

విని ॥ ఈమంత్రముచెప్పిదక్షిణహస్తముతో జుహూపాత్రనెత్తవలయును.

---

వి ॥ వాజశబ్దమునుగూర్చి ౧౨3-పుటచూడుడు.

ఈమంత్రము ౧-కాం, ౨-ప్ర, ౪-అ, ౭-పన్నమందును, ౪-కా, ౨-ప్ర,3-అ, ౪-పన్నమందును, ౫-కా, ౪-ప్ర, ౨-అ, ౨-పన్నమందును యున్నది. మరియు శుక్లయజుర్వేదముయొక్క ౧-అ, ౨3-ఖండికయందు గూడను గలదు. „వాజస్యమాప్రసవ ఉద్గ్రాభేణోదగ్రభీత్'' అనియున్నది.

ఈమంత్రమునకు విధృతిఋషియని మహీధరభాష్యమునందు చెప్పంబడినది. (కలకత్తాకూర్పు పత్రం ౭౯)

మైత్రాయణీసంహితయందుగూడ కొంచెము భేదము గలదు. "వాజస్యమా ప్రసవేన ఉద్గ్రాభేణోదజిగ్రభత్'' (౧-౧-౧3)

ఈమంత్రమునకు విద్యారణ్యభాష్యము „అన్నస్యప్రసవహేతునా అముష్యా జుహ్వా ఊర్ధ్వగ్రహణేన ఇన్ద్రోమామూర్ధ్వమగ్రహీత్''(పుట ౧౯౪)

ఈమంత్రమునకు మహీధరభాష్యము "వాజస్య అన్నస్య ప్రసవః ప్రసూతిః ఉత్పత్తిః అనుజ్ఞా వా ఉద్గ్రాభేణ హ్యుగ్రహణేన ఊర్ధ్వంవిగ్రహ్యాదీయత ఇత్యుద్గ్రహణందానంతేన మా మాముదగ్రభీత్ ఉదగ్రహీల్ ఉద్గృహ్ణాత్" (పత్రం ౩౯-౧౭-అ, ౬౩-కం)

ఈమంత్రమునకు బ్రాహ్మణము. "అథస్రుచావనుష్టుగ్భ్యాం వాజవతీభ్యాం వ్యూహతి । ప్రతిష్ఠావా అనుష్టుక్ । అన్నం వాజఃప్రతిష్ఠిత్యై । అన్నాద్యస్యఅవరుధ్యై" (తై.బ్రా. ౩-౩-౯)

ఈమంత్రమునకు వినియోగము "వాజస్యమాప్రసవే నేతిదక్షిణేనహస్తేనఉత్తానేన స్రుప్రస్తరాంజుహూముద్యచ్ఛతి" (ఆప ౩-౫-౭) ఈవినియోగమునకును విద్యారణ్యయనందుజెప్పిన వినియోగమునకును కొంచెము భిన్నముగనున్నది. "వాజస్యమాప్రసవేన ఉద్గ్రాభేణోదగ్రభీదితి దక్షిణేనజుహూముద్గృహ్ణాతి" (పుట ౧౯౭)

---

౨. అథ సపత్నాన్ ఇంద్రః మే నిగ్రాభేణ అధరాన్ అకః.

**జ్ఞానార్థము.**

టీ॥ అథ=అటుతరువాత, నిగ్రాభేణ=(దుర్గుణములను) క్రిందుగనుంచుటచే (అనగ నణచుట), మే=నాయొక్క, సపత్నాన్=శత్రువులను, ఇంద్రః=భగవంతుడు, అధరాన్=నికృష్టులనుగ, అకః=చేయును.

తా॥ నాదుర్వృత్తులనణచుటచే నాయంతశ్శత్రువులను భగవంతుడు నశింపచేయును.

**కర్మార్థము.**

టీ॥ అథ=అటుతర్వాత, నిగ్రాభేణ=[ఉపభృత్తును] క్రిందుగ ధరించుటచేత, మే = నాయొక్క, సపత్నాన్=శత్రువులను, అధరాన్=నికృష్టులనుగా ఇంద్రః=ఇంద్రుడు, అకః=చేయును.

వినియోగము ॥ ఈమంత్రము చెప్పి యెడమ చేతితో ఉపభృత్పాత్రమును క్రిందుగపట్టుకొనవలయును.

---

వి॥ "సపత్నాన్" శబ్దమునుగూర్చి ౧౬౩-పుటచూడుము.

ఈమంత్రమునకు విద్యారణ్యము. "అథోపభృతోనీచగ్రహణేన మమవైరిణో నికృష్టాన్ బద్ధానకరోత్" (పుట ౧౯౭)

ఈమంత్రమునకు మహీధరభాష్యము "అథనిగ్రాభేణనీచైర్గ్రహణేన నీచైర్హస్తంకృత్వాభిక్షాదిః ప్రార్థ్యతేయాచిష్ణుతయా అన్నాభావేనవా ఇంద్రోమేమమసపత్నాన్శత్రూన్ అధరానధమాన్ తిరస్కృతాన్ అకః కరోతుమాం దాతారం కరోతుశత్రూన్ భిక్షూన్కరోత్విత్యర్థః । కరోతేర్లఙ్బహులం ఛన్దసీతిశపిలుప్తే గుణేతిపి లుప్తే అకఇతిరూపమ్" (కలకత్తాకూర్పపత్రం ౩౯)

ఈమంత్రమునకు బ్రాహ్మణము ప్రాచీంజుహూమూహతి । జాతానేవభ్రాతృవ్యాన్ ప్రణుదతే । ప్రతీచీముపభృతం । జనిష్యమాణానేవ ప్రతినుదతే । సవిషూచవీవాహో హ్యా సపత్నాన్ యజమానః అస్మిన్ లోకే ప్రతితిష్ఠతి'' (తై౹బ్రా. 3-3-౯) ఈబ్రాహ్మణము పూర్వాపరమంత్రములకుగూడ కొంతజెందును.

ఈమంత్రమునకు వినియోగము ''అథంసపత్నానితిసవ్యే నోపభృతం నియచ్ఛతి'' (ఆప 3-౫-౪)

## 3. ఉద్గ్రాభంచ.

| జ్ఞానార్థము. | కర్మార్థము. |
|---|---|
| టీ ॥ ఉద్గ్రాభంచ=ఊర్ధ్వముగనుంచుటయు. | టీ ॥ ఉద్గ్రాభంచ=ఉత్కర్షమును. |
| తా ॥ సద్వృత్తులనువృద్ధిచేయుట. | వినియోగము ॥ ఈమంత్రము చెప్పి జుహూపాత్రముపైకి నెత్తవలయును. |

వి॥ 3-౪-౫ మంత్రములంగలసియన్వయమైనను వినియోగమునుబట్టి విభజింపబడినది. దీనివిషయమై ౫-మంత్రవివరణచూడుము.

## ౪. నిగ్రాభంచ.

| జ్ఞానార్థము. | కర్మార్థము. |
|---|---|
| టీ॥ నిగ్రాభంచ=నిర్గుణములను అణుచుటయు. | టీ॥ నిగ్రాభంచ=నాయొక్క శత్రువులకు అపకర్షమును. |
| తా॥ దుర్వృత్తుల నణచుట. | వినియోగము॥ ఈమంత్రముచెప్పి ఉపభృత్పాత్రమును క్రిందుగ పట్టవలయును. |

వి॥ 3-౪-౫ మంత్రములుంగలసి యన్వయమైనను వినియోగమునుబట్టి వివరించబడినది. దీనిగూర్చి ౫-వమంత్ర వివరణచూడుము.

## ౫. బ్రహ్మ దేవాః అవీవృధన్.

| జ్ఞానార్థము. | కర్మార్థము. |
|---|---|
| టీ ॥ బ్రహ్మ=పరబ్రహ్మయు, దేవాః=సిద్ధులున్ను, అవీవృధన్=వృద్ధిపొందించుగాక. | టీ॥ బ్రహ్మ=బ్రహ్మయు, దేవాః=దేవతలు,అవీవృధన్=వృద్ధిచేసిరి. |

తా॥ యజమానునియొక్క సద్వృత్తులను వృద్ధిపొందించుటకును, దుర్వృత్తులను నశింపచేయుటకును భగవంతుడు, సిద్ధులు, అతనికి సహాయులగుదురుగాక.

వినియోగము॥ ఈమంత్రముజెప్పి జుహువునుతూర్పుముఖముగ త్రోయుట.

వి॥ ౩-౪-౫ మంత్రములుగలపి యర్థముచెప్పవలయును. ౩-౪-మంత్రముల యందు ఉద్గ్రాభంచ, నిగ్రాభంచ, అనునవి ౫-వ మంత్రమునందుండెడి అవీవృధత్ అనుక్రియకు కర్మలైయున్నవి. అవీవృధత్ అనగ వర్ధయంతు అనిభట్టభాస్కరమునందు చెప్పంబడినది. (౧-౧-౧౩)

ఈమంత్రమునకు విద్యారణ్యభాష్యము "పూర్వబ్రహ్మదేవాశ్చ వైరిణో నికృష్టంశ్చమమోత్కృష్టంవర్ధితవన్తః" పుట (౧౯౪)

ఈమంత్రమునకు మహీధరభాష్యము "ఇంద్రాగ్నీ దేవత్యానుష్టుప్ దేవా ఉద. గ్రాభముదగ్రాహ మస్మద్విషయ ముత్కృష్టం నిగ్రాభం నిగ్రాహం శత్రువిషయమపకృష్టం బ్రహ్మాత్రయీలక్షణం యజ్ఞవిషయమవీవృధత్ వర్ధయన్తు । అథ అథానంతరం మేమమసపత్నాన్ శత్రూన్ విషూచీనాన్విషగంచనానానాగతీన్కృత్వా ఇంద్రాగ్నోద్వ్యస్యత వినాశయేతామపునరాగమ నాయక్షిపతామిత్యర్థః"(కలకత్తా కూర్ప్యపత్రం ౩౧౯, ౧౭-అ, ౬౪-కం)

ఈమంత్రమునకు వినియోగము "బ్రహ్మదేవా అవీవృధన్నితి ప్రాచీంజుహూం ప్రోహతి" (అప ౩-౫-౬)

౬. అథ సపత్నాన్ ఇంద్రాగ్నీ మే విషూచీనాన్ వ్యస్యతామ్.

జ్ఞానార్థము.

టీ॥ అథ=అటుతరువాత, ఇంద్రాగ్నీ=ఇంద్రుడు, అగ్నియనుపేరుకలిగిన భగవంతుడు, మే = నాయొక్క, సపత్నాన్ = శత్రువులను, విషూచీనాన్ స్థానభ్రష్టులయ్యేటట్లు, వి+అస్యతాం— చేయుగాక.

తా॥ ఇంద్రాగ్నులనుపేర్లుగలభగవంతుడునాయొక్క శత్రువులను స్థానభ్రష్టులనుచేయుగాక.

కర్మార్థము.

టీ॥ అథ=అటుతరువాత, ఇంద్రాగ్నీ=ఇంద్రాగ్నిదేవతలు, మే=నాయొక్క, సపత్నాన్=శత్రువులను, విషూచీనాన్ = స్వస్థాన భ్రష్టులయ్యేటట్లు, వ్యస్యతాం=ప్రవర్తించుగాక.

వినియోగము ॥ ఈమంత్రము చెప్పి వామహస్తముచే నుపభృత్తును వెదకి వెలుపల పడమరగానుంచుట.

వి॥ ఈమంత్రమునకు విద్యారణ్యభాష్యము "అథేన్ద్రాగ్నీ మమసపత్నాన్ విష్వగ్గతయాస్వస్థానభ్రష్టాయథా భవంతితథావిశేషేణప్రవర్తయతామ్"(పుట౧౯౪)

ఈమంత్రమునకు వినియోగము "అథాసపత్నానితి సవ్యేనోపభృతం ప్రతీచీంబహిర్వేది నిరసిత్వాప్రోక్షైనామభ్యుదాహృత్య" (ఆప 3-౫-౭)

## ౭. వసుభ్యః త్వా.

**జ్ఞానార్థము.**

టీ ॥ వసుభ్యః = వసువులకొరకు, త్వా=నిన్ను, (శుద్ధిచేయుచున్నాను)

తా ॥ ఓయజమానుడా నీహృదయమును వసువులనెడి సిద్ధులదర్శనార్థము శుద్ధిచేసుకొనుము.

**కర్మార్థము.**

టీ ॥ త్వా=(ఓమధ్యమపరిధీ)నిన్ను వసుభ్యః=వసువుల కొరకు తుడుచుచున్నాను.

వినియోగము ॥ ఈమంత్రముచెప్పిజుహువుచేతను మధ్యమపరిధిని తుడువవలయును.

వి ॥ ౭-౮-౯-మంత్రములకు నేకబ్రాహ్మణము "వసుభ్యస్త్వా రుద్రేభ్యస్త్వాఆదిత్యేభ్యస్త్వేత్యాహ । యథాయజురేవైతత్" (త్రై॥బ్రా. 3-3-౯)

ఈమంత్రమునకు ౮-౯ మంత్రములకు ఏకవినియోగము "వసుభ్యస్త్వేతి మధ్యమం రుద్రేభ్యస్త్వేతిదక్షిణం ఆదిత్యేభ్యస్త్వేత్యుత్తరం" (ఆప 3-౫·౭)

## ౮. రుద్రేభ్యః త్వా.

**జ్ఞానార్థము.**

టీ ॥ రుద్రేభ్యః = రుద్రులకొరకు, త్వా=నిన్ను, (శుద్ధిచేయుచున్నాను)

తా ॥ రుద్రులనెడి విబుధులునీహృదయమందు ప్రవేశించుటకు తగినట్టుగాశుద్ధిచేయుము.

**కర్మార్థము.**

టీ ॥ త్వా= (ఓదక్షిణపరిధీ)నిన్ను. రుద్రేభ్యః = రుద్రులకొరకు తుడుచుచున్నాను.

వినియోగము ॥ ఈమంత్రముచెప్పిదక్షిణపరిధిని తుడువవలయును.

వి ॥ ౭-వ మంత్ర వివరణచూడుము.

## ౯. ఆదిత్యేభ్యః త్వా.

**జ్ఞానార్థము.**

టీ॥ ఆదిత్యేభ్యః=ఆదిత్యులకొరకు, త్వా=నిన్ను, (శుద్ధిచేయుచున్నాను).

తా ॥ ఓయజమానుడా నీహృదయమును ఆదిత్యులు వసించుటకు తగినట్టుగ శుద్ధినిచేయుము.

**కర్మార్థము.**

టీ ॥ త్వా=ఓయుత్తరపరిధీ నిన్ను, ఆదిత్యేభ్యః=ఆదిత్యులకొరకు తుడుచుచున్నాను.

వినియోగము ॥ ఈమంత్రముచెప్పి ఉత్తరపరిధిని తుడువవలయును.

వి ॥ ౪-వ మంత్ర వివరణచూడుము.

## ౧౦. అక్తం రిహాణాః వియంతు వయః.

జ్ఞానార్థము

టీ॥ అక్తం=తేజస్సును, రిహాణాః=గ్రహించువారు(అనగయజమానులు), వయః=బ్రహ్మను; వియంతు = పొందుదురుగాక.

తా ॥ జ్ఞానమునుపొందినవారు స్వర్గమును జెందుదురు.

కర్మార్థము.

టీ ॥ అక్తం=ఆజ్యముచేతడుపబడిన ప్రస్తరాగ్రహామును, వయః=పక్షులు,రిహాణాః= ఆస్వాదించినవై, వియంతు= ఎరుగబడుగాక.

వినియోగము ॥ ఈమంత్రము చెప్పిజుహువును ప్రస్తరాగ్రమున తుడువ॰ వలయును.

వి॥ “అక్తం” ఈశబ్దము అజగతిక్షేపణయోః అనుధాతువువలననిష్పన్నమైనది. కర్మయందాజ్యముచే ప్రస్తరము తడుపబడుచున్నది. జ్ఞానార్థమునందు తేజస్సుచే యజమానుడు తడుపబడుచున్నాడు. కావుననే బ్రాహ్మణమునందు ఆజ్యమనగ తేజస్సనియు, ప్రస్తరమనగ యజమానుడనియు, చెప్పంబడినది.

“రిహాణాః”—ఈశబ్దమునుగూర్చి భట్టభాస్కరమునందు చెప్పంబడినదేమనగ “రిహాణాః లిహానాః ఆస్వాదయన్తః తేవక్ష్యమాణారశ్మయః లిహ ఆస్వాదనేస్వరితేత్ వర్ణవ్యత్యయేన లకారస్యరేఫః” (౧-౧-౧౩) అనగ ఆజ్యమనెడి తేజస్సును ఆస్వాదించువాడు. ఈపదమునుగూర్చి “అర్చికాః రహాతీత్యర్చతి కర్మసుపఠితం” నిఘంటు ౩-౧౪-అని శుక్లయజుర్వేదభాష్యమునందు చెప్పంబడినది. (బొంబాయి కూర్పు పుట ౧౩౪) ఈరెండు వ్యుత్పత్తులవలన తేజస్సును పొందిన యజమానులనియర్థము వ్రాయబడినది.

వయంతు—“వీగతివ్యాప్తిగతిప్రజనకాంతి వ్యసనఖాదనేషు” అను ధాతువువలన నిష్పన్నమైనది.

వయః—ఈశబ్దమునుగూర్చి వ్యాఖ్యాతలు భిన్నాభిప్రాయములిచ్చిరి. మాధవాచార్యులవారు చెప్పినదేమనగ “మంత్రేప్రథమా బహువచనాంతో విశబ్దః పక్షివాచీ । బ్రాహ్మణేతుద్వితీయైకవచనాంతో వయశ్శబ్దః”(చెన్నపట్టణంకూర్పు౨౦౧) అనగ మంత్రమునందు పక్షివాచియైన ప్రథమా బహువచనాంతమైన విశబ్దమున్నది. బ్రాహ్మణమునందైతే వయశ్శబ్దముద్వితీయైకవచనాంతముగనున్నది. భట్టభాస్కరమునందు చెప్పంబడినదేమనగ “వయఃప్రజనిష్ణవః ఆదిత్యరశ్మయః” అని(౧-౧. ౧౩) శుక్లయజుర్వేద భాష్యమునందు దయానందస్వాములవారిచే చెప్పంబడిన దేమనగ

౹౹పక్షిణఇవగాయత్ర్యా దీనిఛన్దాంసి'' (బొంబాయికూర్పు ౧౩౭) మహీధరభాష్యమునందు చెప్పంబడినదేమనగ '' పక్షిరూపాపన్నాని గాయత్ర్యాదానిఛన్దాంసి'' (కలకత్తాకూర్పు పత్రం. ౨౭) వయః, యేకవచనము, బహువచనము అగుచున్నది. బహువచనమైనపుడు పక్షులు, ఏకవచనము విః, ఈవిః, అనుశబ్దమువా తేర్ద్విచ్చ అను ఉణాదిసూత్రము వలన వ్యుత్పన్నమైనది. (౪- అ, ౧౩౩- సూ) వయః అనుశబ్దము ఏకవచనముగ వేదనిఘంటువునందు చెప్పంబడినది. అన్ధః, వాజః, వయః, బ్రహ్మ, వర్చః, ఇత్యాది. ౨౮ శబ్దములు ఏకార్థముగ చెప్పంబడినవి. (౨-అ, ౨౭-ఖం) కావునలక్షితలక్షణ న్యాయముచే వయశ్శబ్దమునకు బ్రహ్మయని జ్ఞానార్థమునందు చెప్పంబడినది. ఏకవచనమైన వయశ్శబ్దముయొక్క వ్యుత్పత్తినిగూర్చి ''వయగతౌ ఇత్యస్మాదసున్'' అని దేవరాజయజ్వ నిర్వచనమునందు చెప్పంబడినది. (పుట.౨౦౭) వ్యాఖ్యాతలు భిన్నభిన్నముగ చెప్పినను బ్రాహ్మణము ననుసరించి అర్థముగ్రహించుటయుచితము. కర్మయందాజ్య ముంచుచున్నారు. అది యే తేజస్సు అని శ్రుతిచెప్పుచున్నది. ౹౹తేజోవా ఆజ్యం'' కర్మయందు ప్రస్తరముంచబడుచున్నది. ప్రస్తరము యజమానుడని శ్రుతిచెప్పుచున్నది. ౹౹యజమానఃప్రస్తరః'' అట్టియజమానులు స్వర్గమునుబొందుచున్నారు. '' స్వర్గలోకంగమయతి'' అని శ్రుతియందు చెప్పుటవలన యజమానుడు తనస్వశక్తిచేత స్వర్గలోకమును బొందలేడనియు అతనియొక్క శుద్ధత్వమునుబట్టి భగవంతుడు స్వర్గమును బొందించుననియు తెలియజేయుటకు గాను ౹౹గమ్ల్''ధాతువుణ్యాంతముగ ప్రయోగింపబడుచున్నది. ఈమంత్రముయొక్క బ్రాహ్మణముచూచినయెడల నర్థముస్పష్టముకాగలదు.

ఈమంత్రము '' వ్యంతువయోక్తగ్ం రిహాణా'' అని (౨-అ, ౧౮ - కం,) శుక్లయజుర్వేద మాధ్యందినశాఖయందును ౹౹వ్యంతువయోరివోరిహాణా'' అని (౨-అ, ౧౮-కం) యజుర్వేదీయ కాణ్వశాఖయందును. ౹౹అప్తుభీరిహాణావ్యంతువయః'' అని మైత్రాయణీసంహితయందును (౧-౧-౧౩) భిన్నముగ పఠింపబడుచున్నది. ఈమంత్రమునకు శతపథశ్రుతియందు చెప్పంబడిన వ్యాఖ్యానమేమనగ ౹౹సోనక్తివ్యంతువయోక్తగ్ంరిహాణా ఇతి వయఏవైనమేతద్భూతమస్మాన్మనుష్యలోకా ద్దేవలోకమభ్యుత్పాతయతి'' (౧- ౮, ౩, ౧౪)

ఈమంత్రమునకు మైత్రాయణీ బ్రాహ్మణమందు చెప్పంబడిన వ్యాఖ్యానమేమనగ ౹౹ఇత్యాత్మన్యజ్ఞస్యశిరః ప్రత్యథా దధోమనఏవ యజ్ఞేప్రతిదధాతిస్తనగ్ స్తనినీః ప్రజాఉపజీవంతి కిమస్తనాఇతి బ్రహ్మవాది నోవదంత్యప్తుభీరిహాణా వ్యంతువయా ఇత్యేతద్వావ్రతా ఉపజీవన్తి'' (౪-౧-౧౪)

ఈమంత్రమునకు తైత్తిరీయబ్రాహ్మణమునందు చెప్పంబడినవ్యాఖ్యానమేమనగ "అక్తగ్ంరిహాణా ఇత్యాహ। తేజోవా ఆజ్యం। యజమానః ప్రస్తరః। యజమానమేవ తేజసానక్తి। వియంతువయ ఇత్యాహ। వయ ఏవైనంకృత్వా। సువర్గంలోకం గమయతి" (తై. బ్రా. 3-3-౯)

## ౧౧. ప్రజాం యోనిం మా నిః మృక్షం.

జ్ఞానార్థము.

౧౦-వ అనువాకముయొక్క ౬-వ మంత్రము చూడుము.

కర్మార్థకము,

టీ॥ ప్రజాం=యజమానునియొక్క సంతానమును, యోనిం=భార్యనున్ను, మానిర్మృక్షం=తుడువను.

వినియోగము॥ ఈమంత్రము చెప్పియు పభృత్తును ప్రస్తరమధ్యముచే తుడువవలయును.

వి॥ ఈమంత్రమునకు బ్రాహ్మణము "ప్రజాంయోనింమా నిర్మృక్షమిత్యాహ। ప్రజాయైగోపీథాయ" (తై. బ్రా. 3-3-౯)

## ౧౨. ఆప్యాయంతాం ఆపః ఓషధయః.

జ్ఞానార్థము,

టీ॥ ఆపః=ఉదకములు, ఓషదయః=ఓషధులను, ఆ+ప్యాయంతాం=వృద్ధిపొందించునుగాక.

తా॥ ఉదకములు ఓషధులను వృద్ధిబొందించి భూతములకు సౌఖ్యము కలుగ చేయుగాక.

కర్మార్థము.

టీ॥ ఆపః=ఉదకములు, ఓషధయః=ఓషధులను, ఆ+ప్యాయంతాం=వృద్ధిపొందించుగాక.

వినియోగము॥ ఈమంత్రముచెప్పిధృవనుప్రస్తరమూలముచేతుడువవలయును.

వి॥ ఈమంత్రమునకు విద్యారణ్యభాష్యము "ఓషధయ ఇతి ద్వితీయావివక్షితేత్యాహ। ఆప్యాయంతామాప ఓషధయ ఇత్యాహ। ఆపఏ ఓషధీరాప్యాయయతి అత్రబహువచనంద్రష్టవ్యం" (పుట ౨౦౧)

## ౧౩. (౧) మరుతాం పృషతయః స్థ దివం గచ్ఛ
## (౨) తతః నః వృష్టిం ఆ ఈరయ.

జ్ఞానార్థము.

టీ॥ మరుతాం = వాయువులయొ

కర్మార్థము.

టీ॥ మరుతాం=ఓప్రస్తరదర్భలారా

క్క, పృషతయః=బిందువులు, స్థ=అగుచున్నారు, దివం = ద్యులోకమును, గచ్ఛ=పొందుము, (౨) తతః=అందువలన, నః=మాకు, వృష్టిం = వర్షమును, ఆ+ఈరయ=ప్రేరణచేయుము.

తా ॥ వాయువుచే ప్రేరణచేయబడిన యుదకబిందువులు మేఘమండలమందు ప్రవేశించి మనకువర్షముగలుగజేయును.

మీరువాయుప్రేరిత వర్షముయొక్క, పృషతయః=బిందువులవలన(పుట్టినవారు),స్థ=అగుచున్నారు, దివం=(ఓప్రస్తరమా నీవు) స్వర్గలోకమును, గచ్ఛ=పొందుము, తతః=ఆపొందుటవలన, నః=మాకు, వృష్టిం=వర్షమును, ఈరయ=ప్రేరణజేయుము.

వినియోగము ॥ ఈమంత్రముచెప్పిపలాశశాఖను ప్రస్తరమును ఆహవనీయాగ్నియందు వేయవలయును.

వి॥ 'వృష్టి' శబ్దమునుగూర్చి భట్టభాస్కరమునందు చెప్పంబడినదేమనగ "వృష్టిహేతురాదిత్యరశ్మిః వృష్టిః కరణే క్తిః" (౧-౧-౧౩)

ఈమంత్రమునకు విద్యారణ్యభాష్యము "సహశాఖయా వత్సాపకరణహేతుభూతయా హేప్రస్తరావయవాదర్భా యూయంవాయు ప్రేరితవృష్టిజన్యతయా వాయూనాంబిందవఃస్థ । హేప్రస్తరత్వందివంగత్వా వృష్టింప్రేరయ" (పుట. ౨౦౨)

"మరుతాంపృషయస్థ దివంగచ్ఛ"అనుప్రథమభాగము ఏకపదయాజగతిఅనగ ౨౨ అక్షరములు గలది. "తతోనోవృష్టిమేరయ"అను ౨-వ భాగముఏకపదయాగాయత్రీ అనగ ౮ అక్షరములుగలది, అనిభట్టభాస్కరము నందు చెప్పంబడినది- (౧ - ౧ - ౧౩)

ఈమంత్రమునకు బ్రాహ్మణము "మరుతాం పృషయఃస్థేత్యాహ । మరుతోవై వృష్ట్యాఈశతే వృష్టిమేవావరుంధే" (తై. బ్రా. 3-3-౯)

ఈమంత్రమునకు వినియోగము "మరుతాంపృషతయస్థేతి సహశాఖయా ప్రస్తరమాహవనీయే ప్రహరతి" (ఆప 3-౬-౬)

## ౧౪. (౧) ఆయుష్పాః అగ్నే అసి (౨) ఆయుః మే పాహి (3) చక్షుష్పాః అగ్నే అసి (౪) చక్షుః మే పాహి.

జ్ఞానార్థము.

టీ ॥ (౧) అగ్నే=ఓభగవంతుడా, ఆయుష్పాః=ఆయుస్సునురక్షించువాడవు, అసి=అగుచున్నావు. (౨) మే = నాయొక్క, ఆయుః=ఆయుస్సును, పా

కర్మార్థము.

టీ ॥ అగ్నే = ఓయగ్నినీవు, ఆయుష్పాః = ఆయుస్సును రక్షించుదానవు, అసి=అగుచున్నావు, మే=నాయొక్క, ఆయుః=ఆయుస్సును, పాహి=రక్షిం

హి=రక్షించుము. (౩) అగ్నే=ఓభగవంతుడా, చక్షుష్పాః=చక్షుస్సునురక్షించువాడవు, అసి=అగుచున్నావు. (౪) మే=నాయొక్క, చక్షుః=చక్షుస్సును, పాహి=రక్షించుము.

తా ॥ ఓభగవంతుడా నాయొక్క ఆయుస్సును, చక్షుస్సును, రక్షించుము.

చుము, అగ్నే=ఓయగ్నీనీవు, చక్షుష్పాః చక్షుస్సునురక్షించువాడవు, అసి=అగుచున్నావు, మే=నాయొక్క, చక్షుః=చక్షుస్సును, పాహి=రక్షించుము.

వినియోగము॥ ఈమంత్రముచెప్పిఆహవనీయాగ్నినియభిమంత్రించవలయును.

వి ॥ ఈమంత్రమునకు వ్యాఖ్యానము విద్యారణ్యమందు మృగ్యము.

భట్టభాస్కరమునందు చెప్పంబడినదేమనగ "హేఅగ్నేఆయుష్పాః సర్వేషాం ఆయుషోరక్షకో భవసితస్మాత్ ఆయుర్మే పాహి చక్షుషశ్చత్వంరక్షితాసి తస్మాత్ మేచక్షుః పాహి అవినష్టంకురు" (౧-౧-౧౨)

ఈమంత్రమునకు బ్రాహ్మణము "ఆయుష్పాఅగ్నేస్యాయుర్మే పాహీత్యాహ । ఆయురేవాత్మన్ధత్తే । యావద్వాఅధ్వర్యుః ప్రస్తరంప్రహరతి । తావదస్యచక్షుర్మీయతే । చక్షుష్పాఅగ్నేసి చక్షుర్మేపాహీత్యాహ । చక్షురేవాత్మన్ధత్తే" (తై.బ్రా. 3-3-౯)

ఈమంత్రమునకు వినియోగము "ఆయుష్పా అగ్నేఅస్యాయుర్మేపాహి । చక్షుష్పాఅగ్నేఅసి । చక్షుర్మేపాహి" (విద్యా. ౨౦౨ పేజి)

## ౧౫. ధ్రువా అసి.

జ్ఞానార్థము.

టీ ॥ ధ్రువా=(నీవు) నిత్యమైనవాడవు, అసి=అగుచున్నావు.

తా ॥ ఓభగవంతుడా నీవు నిత్యమైనవాడవు గనుక మమ్ము నిత్యులనుగ జేయుము.

కర్మార్థము.

టీ॥ ధ్రువా=(నీవు వేదిభూమి) స్థిరముగ, అసి=అగుచున్నావు.

వినియోగము ॥ ఈమంత్రముచెప్పి వేదిమధ్యభూమిని స్పృశించవలయును.

వి॥ ఈమంత్రమునకు విద్యారణ్యభాష్యము మృగ్యము.

భట్టభాస్కరమునందుచెప్పంబడిన దేమనగ "ధ్రువానిత్యాత్వమసి । తస్మాన్మామపి ధ్రువంకుర్వితిభావః" (౧ - ౧ - ౧౩)

ఈమంత్రమునకుబ్రాహ్మణము."ధ్రువాసీత్యాహ । ప్రతిష్ఠిత్యై"(తై.బ్రా. 3-3-౯)

ఈమంత్రమునకు వినియోగము "ధ్రువాసీత్యంతర్వేదిపృథివీ మభిమృశతి" (విద్యారణ్యభాష్యము ౨౦౨)

ఈమంత్రమునకు దేవలుడు మంత్రఋషి.

౧౬. యం పరిధిం పర్యదధ్థాః అగ్నే దేవ పణిభిః వీయమాణః
తం తే ఏతం అను జోషం భరామి న ఇత్
ఏషః త్వత్ అపచేతయాతై.

జ్ఞానార్థము.

టీ॥ దేవ = ప్రకాశించుచున్న, అగ్నే=ఓభగవంతుడా, పణిభిః=స్తుతులచేతనే,వీయమాణః=సాధ్యుడవైన,యం=ఏ, పరిధిం=పరిధిని, పర్యదధ్థాః = అంతటస్థాపించితివో, తే=(అట్టి)నీకు,అనుజోషం=ప్రియమైన,తం=ఆ,(పరిధిని) భరామి = పొందుచున్నాను, ఏషః= ఇది, త్వత్=నీవలన, న+ఇత్+అపచేతయాతై = అనురాగము లేనిది కాకపోవుగాక.

తా॥ ఓభగవంతుడానీవు ఏరక్షనను అంతట గలుగజేయుచున్నవో యారక్షణను నేనుబొందుదునుగాక.

కర్మార్థము.

టీ॥దేవ=ప్రకాశించుచున్న,అగ్నే=ఓయగ్నీ, పణిభిః=స్తుతులచేతను, వీయమాణః=సాధ్యుడవగుచున్ననీవు,యం= ఏ, పరిధిం=పరిధిని, పర్యదధ్థాః=పశ్చమభాగమందు ధరించితివో, తే=(అట్టి) నీకు, అనుజోషం = ప్రియానుకూలమైన, తం=ఆ, ఏతం=ఈపరిధిని,భరామి (నీయందు) ఉంచుచున్నాను,ఏషః=ఈ పరిధి,త్వత్=నీవలన, న+ఇత్ + అపచేతయాతై=అనురాగములేనిది కాకపోవుగాక.

వినియోగము ॥ ఈమంత్రము చెప్పి ఆహవనీయాగ్నియందుమధ్యమపరిధిని వేయవలయును.

---

వి॥ పరిధిః అనుశబ్దమునుగూర్చి భట్టభాస్కరమునందు చెప్పంబడినదేమనగ ‘‘పరితఃదధతీతి పుష్ణాతీతి పరిధిః’’ అనగ సంరక్షణ (౧-౧-౧౩)

పణిభిః అనునదిపణస్తుతౌ అనుధాతువువలన నిష్పన్నమైనది.

ఈమంత్రము ‘‘పురస్తాత్ జ్యోతి(స్త్రి)ష్టుప్’’ అని విద్యారణ్యామునందుచెప్పంబడినది. (పుట ౨౧౭) ‘‘పురస్తాత్ జ్యోతిః ప్రథమేన’’అని ఈఛన్దస్సునకు పింగళునిచే లక్షణముచెప్పంబడినది (౩-అ, ౫౨-సూ) ఇందుకు హలాయుధభాష్యము ‘‘ప్రథమేనతై ౹ష్టుభేన పాదేన శేషైశ్చ గాయత్రైః, పురస్తాత్ జ్యోతిర్నామ త్రిష్టుప్ భవతి’’ (కలకత్తాముద్రపుట ౩౪)

యంపరిధిం మొదలు వీయమాణవ కు పాదము ౧౯ - అక్షరములుగలది. శేషించినదానియందు ౨౧-అక్షరముమాత్రమే గలదు. ఛన్దస్సునుబట్టి ౨౨-అక్షరములుండవలసియున్నది. మైత్రాయణీపాఠమందు ౨౨-అక్షరములుగలవు. “తంత ఏతమనుజోషంభరామి నేదేషయుష్మదపచేతయాతై”అని (౪-కా, ౧-ప్ర, ౧౪-అ) ఈ మంత్రము శుక్లయజుర్వేదమునందు భిన్నముగపఠింపబడుచున్నది. అదియెట్లన్న “యంపరిధింపర్యదత్థా అగ్నే దేవపణిభిర్గుహ్యమానః।తంత ఏతమనుజోష్యం భరామ్యేషనే త్వదపచేతయాతా అగ్నేః ప్రియంపాథోపీతమ్” (౨-అ, ౧౭-కం)

ఈమంత్రము “త్రిష్టుబ్విరాడ్రూపా అగ్నే ఈయజురన్తా అగ్నేః ప్రియమితి యజుః దేవలదృష్టా” అని మహీధరభాష్యమునందు చెప్పంబడినది (కలకత్తాకూర్పుపత్రం-౨౭) ఇందువలన ఈమంత్రముయొక్క మంత్రఋషి దేవలుడుగాని ప్రజాపతిగాడనియు, నతనుకాండఋషిగాని మంత్రఋషిగాడనియు దీనిచేస్పష్టముగ దెలియనగును.

భట్టభాస్కరమునందు చెప్పంబడినదేమనగ “నైవాపరక్త చేతాభవేత్” (౧-౧-౧౩)

మహీధరభాష్యమునందు చెప్పంబడినదేమనగ “చితీసంజ్ఞానేణిజంతాల్లేట్। తస్యాత్మనేపదే ప్రథమైకవచనంతాంతంటితఅత్మనేపదానామితి తస్యైకారః వైతోన్యత్రేతిలేడేకారస్యపాక్షికఐ । లేటోడాటావిత్యాడాగమః । గుణాయాదేశౌ । అపపూర్వః అపచేతయాతై” (కలకత్తాకూర్పుపత్రం ౨౮)

ఈమంత్రమునకు విద్యారణ్యభాష్యము “హేఅగ్నే దేవస్తుతిభిః ప్రాప్యస్త్వం స్వయంయం మధ్యమపరిధిం పశ్చిమభాగే స్థాపితవానసితవానుకూలతయాప్రియంతమేతం పరిధింత్వఇభరామి । ఏషత్వత్తోపరక్తోనైవ” (పుట ౨౦౨)

ఈమంత్రమునకు బ్రాహ్మణము “యంపరిధింపర్యదత్థాః ఇత్యాహ । యథా యజురేవైతత్ । అగ్నే దేవపణిభిర్వీయమాణ ఇత్యాహ । అగ్నయ ఏవైనంజుష్టంకరోతి । తంతఏతమనుజోషం భరామీత్యాహ । సజాతానేవాస్మా అనుకాన్ కరోతి” (తై. బ్రా. 3-3-౯)

ఈమంత్రమునకు వినియోగము “యంపరిధిం పర్యదధా అగ్నే దేవ పణిభిర్వీయమాణః తంతఏతమనుజోషం భరామినేదేషత్వదప చేతయాతై । ఇత్యధేతరావుపసమస్యతి । యజ్ఞస్యపాథఉపసమితం” (విద్యారణ్యభాష్యం ౨౦౨)

౬॥ పూర్ణమ్। మే। భూయాః॥ ౭॥ అక్షితమ్। అసి॥

౮॥ మా। మే। క్షేష్ఠాః॥

**జ్ఞానార్థము**

౧॥ (అమృతస్థానమగు ఓభగవంతుడా) సత్ = యోగ్యమైనవాడవు, అసి = అగుచున్నావు. ౨॥ మే = నాకు, సత్ = యోగ్యమైనవాడవు, భూయాః = అగుదువుగాక. ౩॥ సర్వం = సర్వవ్యాపకుడవు, అసి = అగుచున్నావు. ౪॥ మే = నాకు, సర్వం = సర్వస్వరూపమగువాడవు, భూయాః = అగుదువుగాక. ౫॥ పూర్ణం = పూర్ణమగువాడవు, అసి = అగుచున్నావు. ౬॥ మే = నాకు, పూర్ణం = పరిపూర్ణమగువాడవు, భూయాః = అగుదువుగాక. ౭॥ అక్షితం = అక్షయమగువాడవు, అసి = అగుచున్నావు. ౮॥ మే = నాకొరకు, మా-క్షేష్ఠాః = క్షీణింపకుము.

తా॥ సదూప్రుడును సర్వవ్యాపకుడును నిత్యపరిపూర్ణుడును యగు భగవన్తుడు తనకు అక్షయమగు బ్రహ్మానందము గలుగజేయవలయునని ప్రార్థించుచున్నాడు. కావుననె బ్రాహ్మణముసందు "అమృతమాత్మన్ధత్తే" అనిచెప్పబడుచున్నది.

**కర్మార్థము-**

౧॥ (ఓపూర్ణపాత్రమా నీవు) సత్ = యోగ్యమగుదానవు, అసి = అగుచున్నావు. ౨॥ మే = నాకు, సత్ = యోగ్యమగుదానవు, భూయాః = అగుదువుగాక. ౩। సర్వం = అన్నిదిక్కులయందును వ్యాపించినదానవు, అసి = అగుచున్నావు. ౪॥ మే = నాకు, సర్వం = సమస్తమును జేయుదానవు, భూయాః = అగుదువుగాక. ౫॥ పూర్ణం = ఉదకపరిపూర్ణమగుదానవు, అసి = అగుచున్నావు. ౬॥ మే = నాసంబంధమగు, (ప్రయోజనమును) పూర్ణం = పరిపూర్ణమును (జేయుకొరకు) భూయాః = అగుదువుగాక. ౭॥ అక్షితం = అక్షయమగుదానవు, అసి = అగుచున్నావు. ౮॥ మే = నాసంబంధమగు, (కార్యమునుజేయుటవిషయమై) మా-క్షేష్ఠాః = క్షయమునొందకుము.

వి॥ అంతర్వేదియందున్న ప్రణీతపాత్రయందు అధ్వర్యుడు ఉదకమును వేయుచుండ యజమానుడీమంత్రమును జపించవలయును.

వివరణ॥ పూర్వమంత్రమందు యజమానుడు తనమనస్సును భగవంతునియందు ఉంచున్నట్టు చెప్పంబడినది. భగవంతుడు ఎట్టివాడైనది యీమంత్రమందు చెప్పంబడినది- పూర్ణపాత్ర భగవత్స్థానే కర్మయందుపయోగింపబడుచున్నది.

వి॥భా॥ హేపూర్ణపాత్ర త్వం సదసి సంయవనాదికార్యకారితయా శోభనమసి। అతోమమఫలప్రదానేన సద్భూయాః। సర్వమసి। మత్సేకేన వక్ష్యమాణేన ప్రాచ్యాదిసర్వదిగ్వ్యాప్తమసి। అతోమమామేక్షితంసర్వం కర్తుం క్షమం భూయాః।

అద్భిఃపూర్ణమసి। అతో మమ ప్రయోజనం సంపూర్ణంకర్తు ముద్యుక్తం భూయాః। అక్షితమసి। పూర్ణత్వాదేవ త్వం క్షయరహితమసి। అతో మమ కార్యకరణే మాక్షేష్ఠాః క్షయంమాప్రాప్నుహి॥" (౧। ౬। ౫। పుట ౭౪౯)

బ్రాహ్మణము॥ "సదసిసన్మేభూయాఇత్యాహాపోవై యజ్ఞఆపోఽమృతం యజ్ఞమేవామృతమాత్మన్థత్తె॥ " (౧। ౭। ౫ )

ఈమంత్రము మైత్రాయణీసంహితయందు "సదసిసన్మేభూయాః పూర్ణమసి పూర్ణంమేభూయాస్సర్వమసి సర్వంమేభూయా అక్షితమస్యక్షితం మే భూయాః॥" (౧। ౪। ౧। పుట ౪౮) అనిపఠింపబడుచున్నది.

ఆపస్తంబశ్రౌ॥సూ॥ అంతర్వేదిప్రణీతాస్వధ్వర్యుః సన్తతాముదకధారాంస్రావయతి। సదసిసన్మేభూయాఇత్యానీయమానాయాంజపతి॥" (౪।౧౪।౩। పుట౨౨౨)

౪॥ మం॥ ప్రాచ్యాన్దిశిదేవా ఋత్విజో మార్జయంతామ్॥

ప॥ ప్రాచ్యామ్। దిశి। దేవాః। ఋత్విజః। మార్జయంతామ్॥

జ్ఞానార్థము.

ప్రాచ్యాం-దిశి = పూర్వదిక్కునయందు, దేవాః = దేవతలున్ను, ఋత్విజః = ఋత్విక్కులున్ను, (నన్ను) మార్జయంతాం = పరిశుద్ధుని చేయుదురుగాక.

తా॥ పూర్వదిక్కునయందుండు సర్వవిబుధులున్ను తనను పవిత్రము జేయుటకు సహాయులు కావలయునని ప్రార్థించుచున్నాడు.

కర్మార్థము.

ప్రాచ్యాం- దిశి= పూర్వదిక్కునయందు, దేవాః= దేవతలున్ను, ఋత్విజః = ఋత్విక్కులున్ను, (నన్ను) మార్జయంతాం=శుద్ధుని జేయుదురుగాక.

వి॥ ఈమంత్రమును జెప్పి యజమానుడు పూర్వదిక్కునయందు మార్జన జేయవలయును.

వివరణ॥ పూర్వమంత్రమందు భగవద్వర్ణనజేసి ఆయనను పొందుటకు తాను పరిశుద్ధుడుకావలయునుగనుక సర్వవిబుధులు తనకు సహాయము చేయవలయునని ఈ మంత్రముచేత ప్రార్థించుచున్నాడు.

వి॥భా॥ ఋత్విగ్దేవాద్యభిమానినః సర్వే ప్రాణినో యాగం ద్రష్టుం ప్రాచ్యాదిదిక్షునివసంతి। అతఏవబ్రాహ్మణమామ్నాయతే। సర్వాణిహైభూతాని వ్రతముపయన్తమనూపయన్తీతి। మానసగృహాదీనామచేతనత్వేపి తదభిమానినః పురుషా ఇహావివక్షి

తా॥ అన్తర్ధానాదిశక్తియోగాద్దేతేషామదర్శనమవిరుద్ధం। తఏతే దేవాదయస్తస్యాం తస్యాందిశి మాంశోధయంతు॥" (౧, ౬, ౫- పుట ౭౪౯)

బ్రాహ్మణము॥ "ప్రాచ్యాందిశిదేవా ఋత్విజోమార్జయంతా మిత్యాహైషవై దర్శపూర్ణమాసయోరవభృథో యాన్యేవైనం భూతాని వ్రత ముపయంత మనూప యంతి తైరేవసహావభృథమవైతి॥" (౧, ౭, ౫)

మైత్రాయణీసంహితయందు॥ "ప్రాచ్యాదిశా ఋత్విజో మార్జయంతాం॥" (౧, ౪, ౧- పుట ౪౭)

ఆపస్తంబశ్రౌతసూ॥ "ప్రాచ్యాందిశిదేవాఋత్విజోమార్జయంతా మిత్యేతైర్య థాలింగంప్రతిదిశం॥" (౪, ౧౪, ౪)

౫॥ మం॥ దక్షిణాయాన్దిశిమాసాః పితరో మార్జయంతామ్॥

ప॥ దక్షిణాయామ్। దిశి। మాసాః। పితరః। మార్జయంతామ్॥

జ్ఞానార్థము.

దక్షిణాయాం- దిశి = దక్షిణదిక్కు యందు, మాసాః=మాసములున్ను, పితరః=పితృదేవతలున్ను, మార్జయంతాం= పరిశుద్ధుని జేయుదురుగాక.

తా॥ దక్షిణదిక్కుయందుండు మాస స్వరూపులును, పితృస్వరూపులునగు విబుధులు తనను పవిత్రము జేయుటకు సహాయులు కావలయునని ప్రార్థించుచున్నాడు.

కర్మార్థము.

దక్షిణాయాం- దిశి = దక్షిణదిక్కుయందు, మాసాః=మాసములున్ను, పితరః=పితృదేవతలున్ను, (నన్ను) మార్జయంతాం=పరిశుద్ధిని జేయుదురుగాక.

వి॥ ఈమంత్రమును జెప్పి యజమానుడు దక్షిణదిక్కుయందు మార్జన జేయవలయును.

వి॥భా॥ పూర్వమంత్రమును జూడవలయును.

బ్రాహ్మణము॥ మృగ్యము॥

మైత్రాయణీసంహితయందు॥ "దక్షిణాయాం దిశామాసాః పితరో మార్జయన్తాం॥" [౧, ౪, ౧]

ఆపస్తంబశ్రౌతసూ॥ పూర్వమంత్రమును జూడవలయును.

౬॥ మం॥ ప్రతీచ్యాన్దిశిగృహాః పశవో మార్జయంతామ్॥

ప॥ ప్రతీచ్యామ్। దిశి। గృహాః। పశవః। మార్జయంతామ్॥

**జ్ఞానార్థము.**

ప్రతీచ్యాం. దిశి = పశ్చిమదిక్కునందు, గృహాః = గృహములున్ను, పశవః = ప్రాణులున్ను, మార్జయంతాం = పరిశుద్ధుని జేయుదురుగాక.

తా॥ పశ్చిమదిక్కునందుండు గృహపశ్వాద్యభిమానముగల విబుధులు తనను పవిత్రము జేయుటకు సహాయులు కావలయునని ప్రార్థించుచున్నాడు.

**కర్మార్థము.**

ప్రతీచ్యాం. దిశి = పశ్చిమదిక్కునందు, గృహాః = గృహములున్ను, పశవః = ప్రాణులున్ను, (నన్ను) మార్జయంతాం = పరిశుద్ధుని జేయుదురుగాక.

వి॥ ఈమంత్రమును జెప్పి యజమానుడు పశ్చిమదిక్కునందు మార్జనము జేయవలయును

ప॥ భా॥ పూర్వమంత్రమును జూడవలయును.

బ్రాహ్మణము॥ మృగ్యము.

మైత్రాయణీ సంహితయందు॥ "ప్రతీచ్యా దిశా గృహాః పశవో మార్జయంతాం॥" (౧, ౪, ౧)

ఆపస్తంబశ్రౌతసూ॥ పూర్వమంత్రమును జూడవలయును.

---

౭ మం॥ ఉదీచ్యాన్దిశ్యాపఓషధయో వనస్పతయో మార్జయన్తామ్॥

ప॥ ఉదీచ్యామ్।దిశి।ఆపః।ఓషధయః।వనస్పతయః।మార్జయన్తామ్॥

**జ్ఞానార్థము.**

ఉదీచ్యాం. దిశి = ఉత్తరదిక్కునందు, ఆపః = ఉదకములున్ను, ఓషధయః = ఓషధులున్ను, వనస్పతయః = వనదేవతలున్ను, మార్జయంతాం = పరిశుద్ధిని జేయుదురుగాక.

తా॥ ఉత్తరదిక్కునందుండు ఉదకాభిమానులున్ను, ఓషధ్యభిమానులున్ను, వనస్పత్యభిమానులున్ను అగు విబుధులు తనను పవిత్రము జేయుటకు సహాయులు కావలయునని ప్రార్థించుచున్నాడు.

**కర్మార్థము.**

ఉదీచ్యాం. దిశి = ఉత్తరదిక్కునందు ఆపః = ఉదకములున్ను, ఓషధయః = ఓషధులున్ను, వనస్పతయః = వనదేవతలున్ను, (నన్ను) మార్జయంతాం = పరిశుద్ధిని జేయుదురుగాక.

వి॥ ఈమంత్రమును జెప్పి యజమానుడు ఉత్తరదిక్కునందు మార్జనము జేయవలయును.

వి॥భా॥ పూర్వమంత్రమును జూడవలయును.

బ్రాహ్మణము॥ మృగ్యము.

ఆపస్తంబశ్రౌతసూ॥ పూర్వమంత్రమును జూడవలయును.

---

౮॥ మం॥ ఊర్ధ్వాయా న్దిశి యజ్ఞ స్సంవత్సరో యజ్ఞపతి ర్మార్జ యంతామ్॥

ప॥ ఊర్ధ్వాయామ్। దిశి। యజ్ఞః। సమ్- వత్సరః। యజ్ఞ- పతిః। మార్జయంతామ్॥

**జ్ఞానార్థము**

ఊర్ధ్వాయాం- దిశి = ఊర్ధ్వదిక్కునందు, యజ్ఞః=యజ్ఞమున్ను, సంవత్సరః=సంవత్సరమున్ను, యజ్ఞపతిః=యజ్ఞాధిపుడున్ను, మార్జయన్తాం=పరిశుద్ధిని జేయుదురుగాక.

తా॥ ఊర్ధ్వ దిక్కునందుండు యజ్ఞాత్మకుడును, సంవత్సరాత్మకుడున్ను,యజ్ఞాధిపుడున్ను, ఆనెడి విబుధులు తనను పవిత్రము జేయుటకు సహాయులు కావలయునని ప్రార్థించుచున్నాడు.

**కర్మార్థము.**

ఊర్ధ్వాయాం- దిశి=ఊర్ధ్వదిక్కునన్దు, యజ్ఞః=యజ్ఞమున్ను,సంవత్సరః=సంవత్సరమున్ను,యజ్ఞపతిః=యజ్ఞాధిపుడున్ను,(నన్ను) మార్జయన్తాం=పరిశుద్ధిని జేయుదురుగాక.॥

వి॥ ఈమన్త్రమును జెప్పి యజమానుడు ఊర్ధ్వదిక్కునందు మార్జనచేయవలయును॥

---

వి॥భా॥ పూర్వమంత్రమును జూడవలయును.

బ్రాహ్మణము॥ మృగ్యము.

మైత్రాయణీసంహితయందు॥ "ఊర్ధ్వాయాదిశాయజ్ఞస్సంవత్సరో మార్జయన్తాం॥" అని పఠింపబడుచున్నది. (౧, ౪, ౧)

ఆపస్తంబశ్రౌతసూ॥ పూర్వమంత్రమును జూడవలయును.

---

౯॥ మం॥ విష్ణోః క్రమో౽స్యభిమాతిహా॥ ౨॥ గాయత్రేణ ఛన్దసా పృథివీమనువిక్రమే॥ ౩॥ నిర్భక్త్స్సయన్ద్విష్మః॥

ప॥ ౧॥ విష్ణోః। క్రమః। అసి। అభిమాతి-హా ॥ ౨॥ గాయత్రేణ। ఛన్దసా। పృథివీమ్। అను। వి। క్రమే॥ ౩॥ నిః-భక్తః। సః। యమ్। ద్విష్మః॥

జ్ఞానార్థము.

౧॥ విష్ణోః=భగవంతునియొక్క, క్రమః=పాదవిన్యాసమగు, (నీవు) అభిమాతి-హా=పాపమును పోగొట్టెడువాడవు, అసి=అగుచున్నావు. ౨॥ గాయత్రేణ = గాయత్రీరూపమైన, ఛందసా=మంత్రముచేతను, పృథివీం = భూలోకమును, అను=అనుసరించి, విక్రమే = ఆక్రమించుచున్నాను. ౩॥ యం=ఏపాపమును, ద్విష్మః=ద్వేషించుచున్నామో, సః=ఆ పాపము, నిర్భక్తః = పోగొట్టబడినది, (అగుగాక)॥

తా॥ నేను బ్రహ్మలోకమును పొందే ఇచ్ఛగలవాడనై గాయత్రి ఛందస్సుగల మంత్రసామర్థ్యముచే భూలోకమును జయించుచున్నానుగనుక అందుకు ప్రతిబంధకమగు పాపము నశించవలయునని ప్రార్థన॥

కర్మార్థము.

౧॥ (ఓ మొదటి ప్రక్రమమా నీవు) అభిమాతి-హా = పాపము కొట్టెటటువంటి, విష్ణోః = విష్ణుమూర్తియొక్క, క్రమః=ఆక్రమము, అసి=అగుచున్నావు. ౨॥ గాయత్రేణ = గాయత్రీరూపమైన, ఛన్దసా=ఛన్దోదేవతచేతను, పృథివీం= భూలోకమును, అను=అనుసరించి, విక్రమే=ఆక్రమించుచున్నాను. ౩॥ యం= ఏపాపమును, ద్విష్మః = ద్వేషించుచున్నామో, సః=ఆపాపము, నిర్భక్తః= (ఈప్రదేశమువలన) వెళ్లగొట్టబడినది.

వి॥ ఈమంత్రమును జెప్పి యజమానుడు అంతర్వేదియొక్క దక్షిణభాగమందు కుడిపాదముచేత ఒక అడుగు పూర్వాభిముఖముగా నడువవలయును. ఎడమపాదమును ముందువేయకూడదు.

వివరణ॥ ౪-౭ మంత్రములవరకు విబుధులనుసరించి చెప్పి గాయత్రీమంత్రోచ్చారణవలన పాపమును నశింపజేయుటకు భగవంతుని ప్రార్థించుచున్నాడు.

వి॥భా॥ "చతుర్భిరనుఛందసం తృతీయే చతుర్థమనువర్తయతి । న చతుర్థాయ ప్రక్రామతి। నాహవనీయముపాత్యేతి। తృతీయే పదేఽవస్థాయ చతుర్థమంత్రం పఠేత్। చతుర్థమంత్రాయ ప్రక్రమం న కుర్యాత్। కింతు మంత్రమంతరేణ తూష్ణీమేవ చతుర్థం ప్రక్రమం కుర్యాత్। తం ప్రక్రమం కుర్వన్నాహవనీయం నాతిక్రమేత్ । కింత్వాహవనీయాత్పశ్చాదేవ వేదిమధ్యే చతురః ప్రక్రమాన్ సమాపయేత్। మంత్రార్థస్తు। అత్ర య

యజమానస్యాత్మానం విష్ణుత్వేన భావయేత్। చతురః ప్రక్రమణదేశాన్ పృథివ్యాది లోకరూపత్వేన భావయేత్। గాయత్ర్యాది ఛందోఽభిమానిదేవతాః తేషాం ప్రక్రమాణా మనుగ్రాహికాః। అభిమాతిశబ్దో నరకప్రదం పాపమాచష్టే। పాప్మా వా అభిమాతిరితి శ్రుతేః। హే ప్రక్రమ విష్ణుక్రమ త్వం పాపఘాతీ విష్ణోః క్రమోఽసి। గాయత్రీ ఛందో దేవతయాఽనుగృహీతోఽహమేతత్ప్రదేశరూపాం పృథివీమనుసృత్య విక్రమే పాదం ప్రక్షిపామి। యమభిమాతిం వయం ద్విష్మః సోఽభిమాతి ర్నిర్భక్తోఽస్మాత్ప్రదేశా న్నిస్సారిత ఏవ ముత్తరత్రియోగ్యం॥" (౭౫౦)

బ్రాహ్మణము॥ "విష్ణుముఖా వై దేవాశ్ఛందోభిరిమాన్లోకానవజయ్య మభ్యజయన్। యద్విష్ణుక్రమాన్ క్రమతే। విష్ణురేవ భూత్వా యజమానశ్ఛందోభిరిమాన్లోకానవజయ్యమభిజయతి। విష్ణోః క్రమోఽస్యభిమాతిహేత్యాహ। గాయత్రీ వై పృథివీ త్రైష్టుభమంతరిక్షం జాగతీ ద్యౌరానుష్టుభ దిశశ్ఛందోభిరేవేమాన్లోకాన్ యథాపూర్వ మభిజయతి॥" (౧, ౭, ౫)

మైత్రాయణీసంహిత॥ "విష్ణుః పృథివ్యాం వ్యక్రంస్త గాయత్రేణ ఛందసా నిర్భక్తః సయంద్విష్మః॥" (౧, ౪, ౧ పుట ౪౭)

ఆపస్తంబ శ్రౌ॥సూ॥ "విష్ణోః క్రమోసీతి దక్షిణే వేద్యంతే దక్షిణేన పదా చతురో విష్ణుక్రమాన్ ప్రాచః క్రామత్యుత్తర ముత్తరం జ్యాయాంస మనతిహారం త్సవ్యం॥" (౪, ౧, ౪, ౯ పుట ౨౨౩)

"నాహవనీయమతిక్రామతి।" [౪, ౧౪, ౭] అనగ విష్ణుక్రమములచే నాహవనీయము నతిక్రమించకూడదు-

---

౧౦॥ సం॥ ౧॥ విష్ణోః క్రమోఽస్యభిశస్తిహా॥ ౨॥ త్రైష్టుభే- ఛందసాన్తరిక్షమనువిక్రమే॥ ౩॥ నిర్భక్తస్స యం ద్విష్మః॥

పద॥ ౧॥ విష్ణోః। క్రమః। అసి। అభిశస్తి- హా॥ ౨॥ త్రైష్టుభేన। ఛందసా। అన్తరిక్షమ్। అను। వి। క్రమే॥ ౩॥ నిః భక్తః। సః। యమ్। ద్విష్మః॥

జ్ఞానార్థము

౧॥ విష్ణోః = విష్ణువుయొక్క, క్రమః = పాదవిన్యాసముగు, (నీవు) అభిశస్తి-హా = అపవాదనుకొట్టెడి దానవు, అసి = అగుచున్నావు ౨॥ త్రైష్టుభేన = త్రిష్టుబ్రూపమైన, ఛందసా = ఛందోమంత్రము చేతను, అంతరిక్షం = అంతరిక్షమును, అను = అనుసరించి, విక్రమె = ఆక్రమించుచున్నాను. ౩॥ యం = ఏ, (అపవాదను) ద్విష్మః = ద్వేషించుచున్నామో, సః = ఆ, (అపవాద) నిర్భక్తః = పోగొట్టబడినది, (అగుగాక)॥

తా। నేను బ్రహ్మలోకమును పొందే ఇచ్ఛగలవాడనై త్రిష్టుప్ఛందస్సుగల మన్త్ర సామర్థ్యముచే బ్రహ్మలోకమును జయించుచున్నాను గనుక అందుకు ప్రతిబంధమగు అపవాదము నశించవలయునని ప్రార్థనము.

కర్మార్థము-

౧॥ అభిశస్తి-హా = అపవాదమును కొట్టెడి, విష్ణోః = విష్ణువుయొక్క, క్రమః = ఆక్రమము, అసి = అగుచున్నావు. ౨॥ త్రైష్టుభేన = త్రిష్టుబ్రూపమైన, ఛందసా = ఛందోదేవత చేతను, అంతరిక్షం = అంతరిక్షమును, అను = అనుసరించి, విక్రమె = ఆక్రమించుచున్నాను. ౩॥ యం = ఏ, (అపవాదను) ద్విష్మః = ద్వేషించుచున్నామో, సః = ఆ, (అపవాద) నిర్భక్తః = వెళ్లకొట్టబడినది.

వి॥ ఈమంత్రమును జెప్పి యజమానుడు కుడిపాదముచేత పూర్వవిన్యాసముకంటే అవకాశము అధికముగ నుండునటుల రెండవ విన్యాసమును చేయవలయును- ఎడమపాదమును ముందువేయకూడదు-

వివరణ॥ పూర్వమంత్రమందు గాయత్రీఛందస్సుగలిగిన మంత్రముచేత భగవంతుని ప్రార్థించుచున్నానని చెప్పి ఈమంత్రమందు త్రిష్టుప్ఛందస్సు గలిగిన మంత్రముచే ప్రార్థించుచున్నానని చెప్పుచున్నాడు-

వి॥భా॥ "అభిశస్తి హైన్యరా పాదీతో ఉపవాదః"॥ మిగిలినది పూర్వమంత్రమునకువలెను దెలియదగినది- [౭౫౦]

బ్రాహ్మణము॥ పూర్వమంత్రమును జూడవలయును॥

మైత్రాయణీ సంహిత॥ "విష్ణుకంతరిక్షే వ్యక్రగ్స్త త్రైష్టుభేన ఛందసా నిర్భక్తస్సయన్ద్విష్మః॥" [౧, ౪, ౧]

ఆపస్తంబశ్రౌ॥సూ॥ పూర్వమంత్రమును జూడవలయును॥

౧౧॥ మం॥ ౧॥ విష్ణోః క్రమో౽స్యరాతీయతో హన్తా॥ ౨॥ జాగతేన ఛందసా దివమనువిక్రమె॥ ౩॥ నిర్భక్తస్స యన్ద్విష్మః॥

ప॥ ౧॥ విష్ణోః। క్రమః। అసి। అరాతీయతః। హన్తా॥ ౨॥ జాగతేన। ఛన్దసా। దివమ్। అను। వి। క్రమే॥ ౩॥ సః- భక్తః। సః। యమ్। ద్విష్మః॥

జ్ఞానార్థము

౧॥ విష్ణోః=భగవంతునియొక్క, క్రమః= పాదన్యాసమగు, (నీవు) అరాతీయతః=ధర్మమునకు హాని నిచ్ఛయించు చున్నవారిని, హన్తా=కొట్టేదానవు, అసి=అగుచున్నావు. ౨॥ జాగతేన=జగతీరూపమైన, ఛందసా = ఛందస్సుగల మంత్రముచేత, దివం = స్వర్గమును, అను=అనుసరించి, విక్రమె=ఆక్రమించుచున్నాను. ౩॥ యం = ఏవిరోధమును, ద్విష్మః=ద్వేషించుచున్నామో, సః=ఆ విరోధము, నిర్భక్తః=వెళ్లగొట్టబడినది అగుగాక.

తా॥ నేను బ్రహ్మలోకమును పొందే ఇచ్ఛగలవాడనై జగతీఛందస్సుగల మంత్రసామర్థ్యముచే స్వర్గలోకమును జయించుచున్నాను గనుక అందుకు ప్రతిబంధమగు విరోధము నశించవలయునని ప్రార్థనము.

కర్మార్థము-

౧॥ అరాతీయతః=విరోధులను, హన్తా=కొట్టేటటువంటి, విష్ణోః=విష్ణుయొక్క, క్రమః=ఆక్రమము, అసి=అగుచున్నావు. ౨॥ జాగతేన=జగతీరూపమైన, ఛన్దసా=ఛందోదేవతచేతను, దివం= స్వర్గమును, అను = అనుసరించి, విక్రమే= ఆక్రమించుచున్నాను. ౩॥ యం= ఏవిరోధమును, ద్విష్మః = ద్వేషించుచున్నామో, సః = ఆవిరోధము, నిర్భక్తః=వెళ్లగొట్టబడినది.

వి॥ ఈమన్త్రమును జెప్పి యజమానుడు కుడిపాదముచేత పూర్వవిన్యాసముకంటే అవకాశము అధికముగ నుండునటుల మూడవవిన్యాసమును చేయవలయును। ఎడమ పాదమును ముందువేయకూడదు.

వివరణ॥ పూర్వమంత్రమందు త్రిష్టుప్ఛందస్సు గలిగిన మంత్రముచేత భగవంతుని ప్రార్థించుచున్నానని చెప్పి ఈమంత్రమందు జగతీఛందస్సు గలిగిన మంత్రముచే ప్రార్థించుచున్నానని చెప్పుచున్నాడు॥

వి॥భా॥ "రాతిర్దానం ద్రవ్యలాభః। తన్నివారణ మరాతిః। తదిచ్ఛంతో౽రాతీయతః। తృతీయప్రక్రమస్త్వాం హన్తి।" మిగిలినది పూర్వమంత్రముకువలెను తెలియదగినది. [ ౭౫౦ ]

బ్రాహ్మణము॥ ౯వ మంత్రమును జూడవలయును.

మైత్రాయణీసంహితయందు॥ "విష్ణుర్ద్విపృథ్వ్యాగ్రిగ్స్త జాగతేన ఛందసా సర్వ
క్తస్సయన్ద్విష్మః॥" ( ౧, ४, ౧ )
ఆపస్తంబశ్రౌతసూ॥ ౯ వ మంత్రమును జూడవలయును॥

౧౨॥ మం॥ ౧॥ విష్ణోః క్రమోఽసి శత్రూయతో హన్తా॥ ౨॥ ఆనుష్టుభేనఛన్దసాదిశోనువిక్రమే॥ ౩॥ నిర్భక్తస్సయన్ద్విష్మః॥

ప॥ ౧॥ విష్ణోః। క్రమః। అసి। శత్రు - యతః। హన్తా॥ ౨॥ ఆనుస్తుభేన। ఛన్దసా। దిశః। అను। వి। క్రమే॥ ౩॥ నిః- భక్తః। సః। యమ్। ద్విష్మః॥

జ్ఞానార్థము,

౧॥ విష్ణోః = విష్ణువుయొక్క, క్రమః = పాదన్యాసమగు, (నీవు) శత్రూయతః = శత్రుత్వమునిచ్ఛయించుచున్న, (కామాదులను) హన్తా = కొట్టెడువాడవు, అసి = అగుచున్నావు. ౨॥ ఆనుష్టుభేన = అనుష్టుబ్రూపమైన, ఛందసా = ఛందో దేవతచేతను, దిశః = దిక్కులను, అను = అనుసరించి, విక్రమే = ఆక్రమించుచున్నాను. ౩॥ యం = ఏశత్రువును, ద్విష్మః = ద్వేషించుచున్నామో, సః = ఆశత్రువు, నిర్భక్తః = వెళ్లగొట్టబడినవాడు, (అగుగాక.)

తా॥ నేను బ్రహ్మలోకమును పొందే ఇచ్ఛగలవాడనై అనుష్టుప్ ఛందస్సుగల మన్త్రసామర్థ్యముచే సర్వదిక్కులను జయించుచున్నాను గనుక అందుకు ప్రతిబంధకములగు అంతశ్శత్రువుల నశించవలయునని ప్రార్థనము.

కర్మార్థము,

౧॥ శత్రూయతః = శత్రుత్వమునిచ్ఛయించినవారిని, హన్తా = కొట్టెడి, విష్ణోః = విష్ణువుయొక్క, క్రమః = ఆక్రమము వు, అసి = అగుచున్నావు. ౨॥ ఆనుష్టుభేన = అనుష్టుబ్రూపమైన, ఛందసా = ఛందో దేవతచేతను, దిశః = దిక్కులను, అను = అనుసరించి, విక్రమే = ఆక్రమించుచున్నాను. ౩॥ యం = ఏశత్రువును, ద్విష్మః = ద్వేషించుచున్నామో, సః = ఆశత్రువు, నిర్భక్తః = వెళ్లగొట్టబడెను.

వి॥ ఈమన్త్రమును చెప్పి యజమానుడు కుడిపాదముచేత పూర్వవిన్యాసముకంటే అవకాశము అధికముగ నుండునటుల నాలగవవిన్యాసమును చేయవలయును। ఎడమ పాదమును ముందు వేయకూడదు.

వివరణము॥ పూర్వమంత్రమందు జగతీఛందస్సు గలిగిన మంత్రముచేత భగవంతుని ప్రార్థించుచున్నానని చెప్పి ఈమంత్రమందు అనుష్టుప్ఛందస్సు గలిగిన మంత్రముచే ప్రార్థించుచున్నానని చెప్పుచున్నాడు.

వి॥భా॥ "శత్రుత్వం హింసకత్వం। తదిచ్ఛంతో వైరిణశ్శత్రూయతః। చతుర్థ ప్రక్రమస్థాన్ హంతి॥" (పుట ౨౫౦) మిగిలినది పూర్వమంత్రముకువలెను దెలియదగినది.

బ్రాహ్మణము॥ ౬వ మంత్రమును జూడవలయును.

ఆపస్తంబశ్రౌతసూ॥ ౬వ మంత్రమును జూడవలయును.

ఈమంత్రవినియోగము విషయమై ఆపస్తంబులవారు చెప్పిన విశేషసూత్రము. "అవస్థాయ చతుర్థం జపతి।" [౪, ౧౪, ౮] అనగ దీనియర్థము రుద్రివృత్తియందు। మంత్రమనుచ్చరించక ఊరికినె నాలుగవవిన్యాసము జేసి అక్కడనుండి ఈమంత్రము జపించవలయును. (లేక) మూడవవిన్యాసమునందుండి ఈమంత్రమును పఠించి ఊరికినె నాలుగవ విన్యాసమును జేయవలయును. అని వ్రాయబడినది. విద్యారణ్య భాష్యమునందు బోధాయనకల్పము ననుసరించి యిందులో రెండవ పక్షముగనె వ్రాయబడినది.

---

## ఈయనువాకముయొక్క సామాన్యవిషయములు.

### వినియోగసంగ్రహం.

శ్లో॥ "అహ్వ్యర్థుర్వాప్యయనంస్యాత్ త్వ్రిజాస్వావమ్యుత్యజ్ఞతుణం॥

కారపరస్సకారం ప్రాకృతో౽నిత్యే॥ ప్రా॥ అ ౬, సూ ౧౪ ఈసూత్రమువలన ఈయనువాకముయొక్క ౨ వ మంత్రములో తస్మిన్ త్సాదధామి। అనుస్థలమందు తస్మిన్ అనేపదాంతమందున్న నకారము నిత్యమైన తకారము పరముకలదై సకారమును పొందినది.

(౨) ధీరాసో దక్షాసపీకాదశాసబుక్షీణాం పుత్రశ్చార్యా తే అషాఢః పితారః పృథివీ యజ్ఞ అసతే యేగృహ్ణోమగ్రేవాగ్వివజజ్ఞే సగ్గ్స్యానో యువయోర్యః పృష్ఠేపతిర్వోగో౽షుమ్నః పువస్సుమిద్ధబుషభః పాథో వచో వర్షిష్ఠే జుషాణో యోరుదోర్వృష్ణః పూర్వః॥ ప్రా॥ అ ౧౧, సూ ౧౬ ఈసూత్రమువలన ఈయనువాకముయొక్క ౧ వ మంత్రములోను "పృథివీయజ్ఞే అస్మిన్" అనుస్థలమునందు పృథివీయజ్ఞే పూర్వముగల అస్మిన్ అనేపదాదియందున్న అకారమునకు లోపము గాదు.

(౩) శక్తిరధీత్విషీవాశీ శాతో౽వ్రివధ్యాహుతీ వ్యాహృతీ స్వాహాకృతీ ప్రాణినీ శచీపతీ శ్రోణీ పృష్టీ పూత్యభీచర్వణీ పర్యధీ పారీ శతూర్ విషూ వసూ అనూ హనూ సూ విభూ ఇత్యవగ్రహః॥ ప్రా। అ ౩। సూ ౭। ఈసూత్రమువలన ఈయనువాకముయొక్క ౫ వ మంత్రములోను, "శతూర్యతః" అనేస్థలమందు శతూర్ అనే అవగ్రహ హ్రస్వమును బొందినది.

(౪) ఈయనువాకముతో సంబంధించిన శాఖలు, బ్రాహ్మణము, కల్పము.

| శాఖలు. | బ్రాహ్మణము. |
|---|---|
| తైత్తిరీయసంహిత॥ ౧ [illegible] ౫, ౧, ౪, | శతపథబ్రాహ్మణము। ౧, ౯, ౩, ౧౦, ౧౨, ౬. ౭, ౨, ౧౩, [illegible]. |
| కాఠకసంహిత॥ ౫, ౫, ౧౬, ౯. | |
| వాజసనేయసంహిత మాధ్యందినశాఖ. } ౨, ౫, ౩. | కాతీయము॥ ౩, ౩, ౧౨, ౯, ౧౧, ౧౬, ౫, ౧౧. |
| వాజసనేయకాణ్వశాఖ। ౨, ౨౫, ౧౨, ౫. | శాంఖాయనము॥ ౪, ౧౧, ౧. ౧౨ [illegible] |
| మైత్రాయణీసంహితా॥ ౧, ౪, ౧. | ఆపస్తంబశ్రౌ।సూ॥ ౩, ౧౩, ౪ ౯, ౧౧, ౪. |

తైత్తిరీయసంహితాయాం ప్రథమకాండే షష్ఠప్రపాఠకే
పంచమో౽నువాకస్సమాప్తః.

ఓమ్.

# మంత్రభాగార్థః.

## తైత్తిరీయ సంహితాయాం ప్రథమకాండే సప్తమప్రపాఠకే షష్ఠోనువాకః.

### కాండఋషిః- ప్రజాపతిః.

౧॥ మం॥ ౧॥ అగన్మసువః॥ ౨॥ సువరగన్మ॥ ౩॥ సన్దృశస్తే మా ఛిత్సి॥ ౪॥ యత్తేతపస్తస్మైతే మావృక్షి॥

ప॥ ౧॥ అగన్మ। సువః॥ ౨॥ సువః। అగన్మ॥ ౩॥ సమ్-దృశః। తే। మా। ఛిత్సి॥ ౪॥ యత్। తే। తపః। తస్మై। తే। మా। ఆ। వృక్షి॥

**జ్ఞానార్థము**

౧॥ [ఓభగవంతుడ] సువః=స్వర్గమును, అగన్మ= [మేము] పొందుదుముగాక. ౨॥ సువః=స్వర్గమును, అగన్మ=పొందుదుముగాక. ౩॥ తే=నీయొక్క, సన్దృశః=అనుగ్రహమువలన, మాఛిత్సి=విచ్ఛేదము నొందకపోదుముగాక. ౪॥ తే=నీకొరకు, యత్తపః=ఏతపస్సుగలదో, తస్మై=ఆతపస్సుకొరకు, మావృక్షి=విచ్ఛేదము నొందకపోదుముగాక.

తా॥ అఖండమగు తపస్సుచేత భగవత్కటాక్షము నవిచ్ఛిన్నముగ సంపాదించినవారమై మోక్షమును బొందవలయుననని ప్రార్థనము.

**కర్మార్థము.**

౧॥ (ఓయాహవనీయాగ్నీ, మేము నీయనుగ్రహమువలన) సువః=ఫలభోగస్థానమును, అగన్మ=పొందుదుముగాక. ౨॥ సువః=సూర్యలోకమును, అగన్మ=పొందుదుముగాక. ౩॥ తే = నీయొక్క, సన్దృశః = కటాక్షమువలన, మాఛిత్సి=విచ్ఛేదమునొందకపోదుముగాక. ౪॥ తే=నీకొరకు, యత్తపః=ఏతపస్సు, [చేయబడగలదో] తస్మై=ఆతపస్సుకొరకు, తే=నీయొక్క, [అనుగ్రహమువలన] మావృక్షి= విచ్ఛేదము నొందకపోదునుగాక.

వి॥ ఆదివరకు ఉన్నచోటనేయుండి, ఈమంత్రముచే నాహవనీయోపస్థానమును జేయవలయును.

వివరణము॥ పూర్వానువాకమునందు చిత్తమును భగవత్తేజస్సుచే పరిపూర్ణముగజేసి తదేకాయత్తముగ నుండవలయునని జెప్పబడినది. ఈయనువాకమునందు భగవత్ప్రార్థన చెప్పబడుచున్నది-

“అగన్మసువః” అని రెండుపర్యాయములుండుటవలన నత్యాదరణముగ నెంచవలయును. కావున బ్రాహ్మణమునందు “సువర్గమేవలోకమేతి” అనిచెప్పబడినది.

“అగన్మ” ఇచ్చటిలకారమును ప్రార్థనార్థకముగ యోచించుటకు ప్రమాణము శుక్లయజుర్వేద దయానంద సరస్వతిభాష్యమందు [ ౨. ౨౫ ] “అగన్మ ప్రాప్నుయామ” అని జెప్పంబడినది.

ఈమంత్రవినియోగమునుగూర్చి ఆపస్తంబశ్రౌతసూత్రమునందు విద్యారణ్యభాష్యమునకు భేదముగ “అగన్మ” అనునదిమొదలు “సంజ్యోతిషాభూవం” అనువరకు ఏకమంత్రముగ పఠించి సూర్యోపస్థానము జెప్పబడినది.

వి॥భా॥ “పఞ్చ్మే ఽనువాకే అప్యాయనాదిమంత్రా వర్ణితాః। అత్ర షష్ఠే సూర్యోపస్థానాదిమంత్రా ఉచ్యంతే। ఆద్యేన సువశ్శబ్దేన కర్మణః ఫలభోగభూమిరభిధీయతే। ద్వితీయేన సువశ్శబ్దేన మోక్షద్వారభూత ఆదిత్యలోకః। హే ఆహవనీయ త్వత్ప్రసాదాత్ ప్రథమం ఫలభోగస్థానం సపుత్రపౌత్రా వయమగన్మ। తతో మోక్షద్వారమాదిత్యలోకమగన్మ। తదర్థం అహం తవ సన్దృశః కటాక్షాన్మాఛిత్సి। విచ్ఛిన్నో మాభూవం। త్వదర్థం యత్త్వోఽస్మాభి రనుష్ఠాస్యతే తస్మై తపసే తే తవ అనుగ్రహాన్మావృక్షి। ఆసమన్తాద్వృక్తా విచ్ఛిన్నో మాభూవమ్॥” (పు ౭౫౨)

బ్రాహ్మణము॥ “ అగన్మ సువ స్సువరగన్మేత్యాహ సువర్గమేవ లోకమేతి। సన్దృశస్తే మాఛిత్సియత్తేతపస్తస్మై తేమావృక్షీత్యాహయథాయజురేవైతత్।” (౧,౭,౬)

వాజసనేయసంహిత॥ ౨, ౨౫.

మైత్రాయణీసంహిత॥ ౧, ౪, ౧.

విద్యారణ్యమందు చెప్పబడిన వినియోగసూత్రము॥ “అథాత్రైవ తిష్ఠన్నాహవనీయముపతిష్ఠతే। ” వి। భా। [పుట ౭౫౨]

ఆపస్తంబ శ్రౌత సూ॥ “ అగన్మ సువ స్సువ రగన్మేత్యాదిత్య ముపతిష్ఠతే। ౪, ౧౪, ౧౧.

---

౨ మం॥ ౧॥ సుభూరసి॥ ౨॥ శ్రేష్ఠో రశ్మీనామ్॥ ౩॥ ఆయుర్ధా

అసి॥ ౪॥ ఆయుర్మే ధేహి॥ ౫॥ వర్చోధా అసి॥ ౬॥ వర్చో మయి ధేహి॥

ప॥ ౧॥ సు- భూః। అసి॥ ౨॥ శ్రేష్ఠః। రశ్మీనామ్॥ ౩॥ ఆయుః- ధాః। అసి॥ ౪॥ ఆయుః। మే। ధేహి॥ ౫॥ వర్చః- ధాః। అసి॥ ౬॥ వర్చః। మయి। ధేహి॥

జ్ఞానార్థము

౧॥ [ఓ భగవంతుడా నీవు] సుభూః= యోగ్యమగువాడవు, (అనగ శ్రేయస్సునిచ్చువాడవు) అసి=అగుచున్నావు. ౨॥ రశ్మీనాం = తేజశ్శాలులలో, శ్రేష్ఠః= శ్రేష్ఠుడవు, అగుచున్నావు. ౩॥ ఆయుర్ధాః= (శాశ్వతమైన) ఆయువును ధరింపచేయువాడవు, అసి=అగుచున్నావు. ౪॥ మే= నాయందు, ఆయుః=(శాశ్వతమైన) ఆయువును, ధేహి=ఉంచుము. ౫॥ వర్చోధాః=బ్రహ్మవర్చస్సును ధరింపచేయువాడవు, అసి = అగుచున్నావు. ౬॥ మయి=నాయందు, వర్చః = బ్రహ్మవర్చస్సును, ధేహి=ఉంచుము.

తా॥ తేజశ్శాలియును, జననమరణక్లేశనాశకుడును, వర్చస్సును గలుగజేయునట్టివాడునగు భగవంతుడు మాకొరకు బ్రహ్మవర్చస్సును, స్థిరాయువును అనగ మోక్షమును ఈయవలయునని ప్రార్థనము.

కర్మార్థము-

౧॥ (ఓ సూర్యుడా నీవు) సుభూః= యోగ్యముగనుదయించువాడవు, అసి= అగుచున్నావు. ౨॥ రశ్మీనాం=కిరణవంతులలో, శ్రేష్ఠః=శ్రేష్ఠుడవు, (అగుచున్నావు.) ౩॥ ఆయుర్ధాః = ఆయువును ధరింపచేసేవాడవు, అసి = అగుచున్నావు. ౪॥ మే=నాయందు, ఆయుః = ఆయువును, ధేహి=ఉంచుము. ౫॥ వర్చోధాః = వర్చస్సును ధరింపచేయువాడవు, అసి=అగుచున్నావు. ౬॥ మయి = నాయందు, వర్చః = వర్చస్సును, ధేహి= ఉంచుము.

వి॥ ఈమంత్రముచే సూర్యోపస్థానము చేయవలయును.

వివరణము॥ పూర్వమంత్రమందు తపస్సుయొక్క ఫలము మోక్షమని చెప్పంబడినది. ఈమంత్రమందు భగవద్వర్ణన చేయంబడినది.

వి॥ భా॥ “హేఆదిత్య త్వం సుభూరసి। సుష్ఠుభవత్యుదేతీతి సుభూః। రశ్మీనాం రశ్మియుక్తానాం చంద్రాదీనాం మధ్యే శ్రేష్ఠోఽసి। ఆయుషః స్థాపయితాసి। అతో మయ్యాయుః స్థాపయ। వర్చోదా అసి। వర్చః బ్రహ్మవర్చసం మయి ధేహి। బ్రహ్మవర్చసం మయి స్థాపయేతి తస్యార్థః॥”

బ్రాహ్మణము॥ “సుభూరసి శ్రేష్ఠో రశ్మీనా మాయుర్ధా అస్యాయుర్మే ధేహీ త్యాహాశిష మేవైతామాశాస్తే॥” (౧, ౭, ౬.)

వాజసనేయసంహిత॥ ౨, ౨౫.

మైత్రాయణీసంహిత॥ ౧, ౪, ౧.

విద్యారణ్యమందు చెప్పబడిన వినియోగసూత్రము॥ “అథాదిత్య ముపతిష్ఠతే॥”

వి॥ భా॥ (ప్రట ౭౫౨)

ఆపస్తంబశ్రౌతసూత్రము॥ పూర్వమంత్రమును జూడవలయును.

---

౩ మం॥ ౧॥ ఇదమహమముమ్భ్రాతృవ్య మాభ్యోదిగ్భ్యోఽస్యై

దివోఽస్మాదన్తరిక్షాదస్యై పృథివ్యా అస్మా దన్నాద్యా

న్నిర్భజామి॥ ౨॥ నిర్భక్తస్సయన్ద్విష్మః॥

ప॥ ౧॥ ఇదమ్। అహమ్। అముమ్। భ్రాతృవ్యం। ఆభ్యః। దిక్ భ్యః।

అస్యై। దివః। అస్మాత్। అన్తరిక్షాత్। అస్యై। పృథివ్యాః।

అస్మాత్। అన్న- అద్యాత్। నిః। భజామి॥ ౨॥ నిః- భక్తః।

సః। యమ్। ద్విష్మః॥

జ్ఞానార్థము.

౧॥ ఇదం- అహం=ఈ నేను, భ్రాతృవ్యం=శత్రువగు, అముం=ఈ, (పాపమును) ఆభ్యోదిగ్భ్యః = ఈదిక్కులవల్లనున్న, అస్యై=ఈ, దివః=స్వర్గ

కర్మార్థము.

౧॥ ఇదం-అహం=ఈ, నేను, భ్రాతృవ్యం=శత్రువగు, అముం=ఈ, [పాపము] ఆభ్యోదిగ్భ్యః = ఈదిక్కులవల్లనున్న, అస్యై=ఈ, దివః=స్వర్గము

మువల్లనున్ను, అస్మాత్ = ఈ, అంతరిక్షాత్ = అంతరిక్షమువల్లనున్ను, అస్యై = ఈ, పృథివ్యాః = భూమివల్లనున్ను, అస్మాత్ = ఈ, అన్నాద్యాత్ = అనుభవించదగినదానివలనయును, నిర్భజామి = వెళ్లగొట్టుచున్నాను. ౨॥ యం = ఏ, పాపమును, (మేము) ద్విష్మః = ద్వేషించుచున్నామో, సః = ఆపాపము, నిర్భక్తః = వెళ్లగొట్టబడినది, (అగుచున్నది).

తా॥ భగవదనుగ్రహము చేనీమంత్ర సామర్థ్యము చేత మోక్షప్రాప్తి ప్రతిబంధకమగు నాయొక్క పాపరూపశత్రువును సర్వదిక్కులవల్లను వెళ్లగొట్టుచున్నాను- అనగ నశింపచేయుచున్నాను-

వల్లనున్ను, అస్మాత్ = ఈ, అంతరిక్షాత్ = అంతరిక్షమువల్లనున్ను, అస్యై = ఈ, పృథివ్యాః = భూమివల్లనున్ను, అస్మాత్ = ఈ, అన్నాద్యాత్ = అన్నరూపమగు భోజ్యమువలన, నిర్భజామి = వెళ్లగొట్టుచున్నాను- ౨॥ యం = ఏపాపమును, ద్విష్మః = ద్వేషించుచున్నామో, సః = ఆపాపము, నిర్భక్తః = వెళ్లగొట్టబడినది, [అగుచున్నది]

వి॥ పాప నిస్సరణకొరకీమంత్రముచే ప్రార్థించవలయును-

వివరణము॥ పూర్వమంత్రమందు భగవద్గుణవర్ణనము చేసి ఈమంత్రమందు తనసంబంధమైన పాపమును నశింపజేయుమని ప్రార్థించుచున్నాడు.

వి॥ భా॥ "యోభ్రాతృవ్యో మదీయో వైరీ పృథివ్యాదిలోకత్రయే ప్రాచ్యాదిదిక్షు మమవిరోధమాచరతి। మదీయమన్నాద్యం చాపజిహీర్షతి। అముం భ్రాతృవ్యం తతః పృథివ్యాదేర్నిర్భజామి। శీఘ్రమేవ నిస్సారయామి। ఇదానీం విరోధమనాచరంతమపి కాలాంతరే తదాచరణశంకయా యంభ్రాతృవ్యం వయం ద్విష్మః సోపి నిస్సారితః॥" (పుట ౭౫౨)

బ్రాహ్మణము॥ "ఇదమహమముమ్భ్రాతృవ్య మాభ్యో దిగ్భ్యోఽస్యై దివ ఇతి మా సేవ లోకాన్భ్రాతృవ్యస్యసంవిద్యాప్రునరిమం లోకంప్రత్యవరోహతి॥" (౧,౭,౬)

వాజసనేయసంహిత॥ ౨, ౨౫.

మైత్రాయణీసంహిత॥ ౧, ౪, ౧.

విద్యారణ్యమందు చెప్పబడిన విసయోగసూత్రము॥ అస్త్రైభ్యో లోకేభ్యోభ్రాతృవ్యం నిర్భజతి॥ " (౭౫౨)

ఆపస్తంబశ్రౌతసూత్రము॥ ౧వ మంత్రమును జూడవలయును.

౪॥ మ॥ సజ్జ్యోతిషాఽభూవమ్॥

ప॥ సమ్। జ్యోతిషా। అభూవమ్॥

**జ్ఞానార్థము.**

[నేను] జ్యోతిషా = తేజస్సుతో, సం-అభూవం = ఏకీభావమునొందినవాడన గుదును గాక.

తా॥ నాసంబంధమగుసర్వపాపము వశించి భగవత్తేజస్సుతో కలుసుకొనవల యునని ప్రార్థనము.

**కర్మార్థము.**

[నేను] జ్యోతిషా = తేజస్సుతోడి, సం-అభూవం = ఏకీభావమును పొందిన వాడనగుదును గాక.

వి॥ ఈమంత్రముచే ఆత్మాభిమర్శనమును జేయవలయును.

వివరణము॥ పూర్వమంత్రమందు పాపక్షయము జెప్పంబడినది. ఈమంత్రమం దు పాపక్షయమును పొందినవారు తేజోరూపులని చెప్పంబడినది.

వి॥భా॥ “అహ మాదిత్యజ్యోతిషా సమభూవం। సంగతో భూయాసం॥” (పుట ౭౫౨)

బ్రాహ్మణము॥“సంజ్యోతిషాభూవమిత్యాహాస్మిన్నేవలోకే ప్రతితిష్ఠతి॥౧, ౭, ౬.

వాజసనేయసంహిత॥ ౨, ౨౫.

మైత్రాయణీసంహిత॥ ౧, ౪, ౧.

విద్యారణ్యమందుచెప్పబడిన వినియోగసూత్రము॥ “సంజ్యోతిషాభూవమిత్యాత్మానం ప్రత్యభిమృశతి॥” (పుట ౭౫౨)

ఆపస్తంబశ్రౌతసూత్రము॥ ౧ వ మంత్రమును చూడవలయును.

---

౫॥ మం॥ ఐన్ద్రీ మావృత మన్వావర్తే॥

ప॥ ఐన్ద్రీమ్। ఆ-వృతమ్। అను-ఆవర్తే॥

**జ్ఞానార్థము**

[నేను] ఐంద్రీం = భగవద్విషయమైన, ఆ-వృతం = తిరుగుటను, అన్వావర్తే = పొందుచున్నాను.

తా॥ తేజోరూపమును బొంది భగవంతుని కలుసుకొనుచున్నాను.

**కర్మార్థము.**

(నేను) ఐంద్రీం = ఆదిత్యసంబంధమగు ఆ-వృతం = తిరుగుటను, అన్వావర్తే = అనుసరించి తిరుగుచున్నాను.

వి॥ యజమానుడీమంత్రము నుచ్చరించి ప్రదక్షిణమును చేయవలయును.

వివరణము॥ ఇంద్రశబ్దమునుగూర్చి పు ౨౫ చూడుము. అట్టి భగవంతుని సంబంధమైనది ఐంద్రీం అనిచెప్పబడుచున్నది.

పాపమువలన విముక్తుడైనవాడు తేజోరూపమును పొందునని పూర్వమంత్రమునందు చెప్పంబడినది. తేజోరూపమును పొందినవాడు భగవంతునితో కలిసియుండునని ఈమంత్రమందు చెప్పంబడుచున్నది.

వి॥భా॥ “పరమైశ్వర్యయోగా దాదిత్యఇంద్రః। తదీయమావర్తేన మను ఆవృతమపి ప్రాదక్షిణ్యేనావర్తే॥” (పు ౭౫౩)

బ్రాహ్మణము॥ ఐంద్రీమావృతమన్వావర్త ఇత్యాహాసౌవా ఆదిత్యఇన్ద్రస్తస్యై వావృతమనుపర్యావర్తతె। దక్షిణాపర్యావర్తతె। స్వమేవవీర్యమను పర్యావర్తతె। తస్మాద్దక్షిణోర్ధ ఆత్మనో వీర్యావత్తరోఽథో ఆదిత్యస్యైవావృత మను పర్యావర్తతే॥” (౧, ౭, ౬)

ఆపస్తంబశ్రౌతసూత్రము॥ “ఐంద్రీమావృతమన్వావర్త ఇతి ప్రదక్షిణమావర్తతె॥” (౪, ౧౫, ౨. పుట ౨౨౬)

---

౬॥ మం॥ ౧॥ సమహంప్రజయా॥ ౨॥ సమ్మయాప్రజా॥ ౩॥ సమహగ్ం రాయస్పోషేణ॥ ౪॥ సమ్మయారాయస్పోషః॥

ప॥ ౧॥ సమ్। అహమ్। ప్ర- జయా॥ ౨॥ సమ్। మయా। ప్ర- జా॥ ౩॥ సమ్। అహమ్। రాయః। పోషేణ॥ ౪॥ సమ్। మయా। రాయః। పోషః॥

జ్ఞానార్థము.

౧॥ అహం=నేను, ప్రజయా=సంతానముతోడ, సమ్=కూడుకొనినవాడను,(అగుదునుగాక) ౨॥ ప్రజా=సంతానము, మయా=నాతో, సమ్=కూడుకొనినది, (అగుగాక) ౩॥ అహం=నేను, రాయః=మోక్షధనముయొక్క,

కర్మార్థము-

అహం=నేను, ప్రజయా=సంతానముతోటి, సమ్=కూడుకొనినవాడను, [అగుదునుగాక] ౨॥ ప్రజా=సంతానము, మయా=నాతోటి, సమ్=కూడుకొనినది, [అగుగాక] ౩॥ అహం=నేను, రాయః=ధనముయొక్క, పోషే

పోషేణ=పుష్టితో, సం=కూడుకొనినవాడను, (అగుదునుగాక) ౪॥ రాయస్పోషః=మోక్షధనవృద్ధి, మయా=నాతో, సం=కూడుకొనినది, (అగుగాక)

తా॥ తన పుత్రపౌత్రాదులతోగూడ తనకు మోక్షప్రాప్తి గలుగవలయునని తాత్పర్యము.

ణ=పుష్టితో, సం=కూడినవాడను, [అగుదునుగాక] ౪॥ రాయస్పోషః = ధనపుష్టి, మయా = నాతోడ, సం=కూడుకొనినది (అగుగాక)

వి॥ యజమానుడీమంత్రము నుచ్చరించి తిరిగి అనువర్తించవలయును.

వివరణము॥ పూర్వమంత్రములయందు తనయొక్క మోక్షమును గురించి ప్రార్థించి ఈమంత్రమందు తనయొక్క పుత్రపౌత్రాదులకు మోక్షము కలుగజేయవలయునని ప్రార్థన చెప్పబడుచున్నది.

వి॥ భా॥ "అహం ప్రజయా సంగతో భూయాసం । ప్రజా మయా సంగతా భూయాత్। తథా రాయస్పోషేణ సంగతో భూయాసం। రాయస్పోషో మయా సంగతో భూయాత్॥" (పు ౭౫౩)

బ్రాహ్మణము॥ "సమహం ప్రజయా సమ్మయా ప్రజేత్యాహాశిష మేవైతా మాశాస్తే॥" (౧, ౭, ౬)

ఆపస్తంబశ్రౌతసూత్రము॥ "సమహం ప్రజయా సమ్మయా ప్రజేతి పునరావర్తతే॥" (౪, ౧౫, ౪. పుట ౨౨౬)

విద్యారణ్యమునందు చెప్పబడిన వినియోగసూత్రము। "అథోదఙ్పర్యావర్తతే॥" (పుట ౭౫౩)

౭॥ మం॥ ౧॥ సమిద్ధో అగ్నే మే దీదిహి॥ ౨॥ సమేద్ధా తే అగ్నే దీద్యాసమ్॥

ప॥ ౧॥ సమ్- ఇద్ధః। అగ్నే। మే। దీదిహి॥ ౨॥ సమ్- ఏద్ధా। తే। అగ్నే। దీద్యాసమ్॥

జ్ఞానార్థము

౧॥ హేఅగ్నే=ఓభగవంతుడా, సమిద్ధః = ప్రకాశింపజేయబడిన, (నీవు)

కర్మార్థము.

౧॥ హేఅగ్నే=ఓయగ్ని, సమిద్ధః=ప్రజ్వలింపచేయబడిన, (నీవు) మే=నా

మే = నాకొరకు, దీదిహి = ప్రకాశించుము. ౨॥ హే అగ్నే = ఓ భగవంతుడ, తే = నీకు, సమేద్ధా = ప్రకాశింపజేసే, (నేను) దీద్యాసం = ప్రకాశించుదునుగాక.

తా॥ నేజేయు ధ్యానముచే నీవు లెస్సగ ప్రకాశించి నీతేజస్సుచేత నన్ను ప్రకాశింపజేయుమని ప్రార్థనము.

కొరకు, దీదిహి = ప్రకాశించుము. ౨॥ హే అగ్నే = ఓయగ్ని, తే = నీకు, సమేద్ధా = ప్రజ్వలింపజేసే, [నేను] దీద్యాసమ్ = ప్రకాశించుదునుగాక.

వి॥ యజమానుడీమంత్రము నుచ్చరించి ఆహవనీయమందు సమిధను హోమము చేయవలయును.

వివరణము. భగవంతుని ఆరాధించువాడే తేజోయుక్తుడగునని ఈమంత్రమందు చెప్పంబడినది.

అగ్నిశబ్దమునుగూర్చి ౩౭ వ పుట చూడుము.

వి॥భా॥ "అత్ర సమిత్ప్రక్షేపాయ స్వాహేతిశబ్దోఽధ్యాహృతః। హే అగ్నే అనయా సమిధా ప్రదీప్తస్త్వం। మే మదర్థం। దీదిహి దీప్యస్వ। తవ దీపయితా అహమపి త్వత్ప్రసాదాద్దీప్తో భూయాసమ్॥" [పు ౨౫౩]

బ్రాహ్మణము॥ "సమిద్ధో అగ్నే మే దీదిహి సమేద్ధా తే అగ్నే దీద్యాసమిత్యాహ యథాయజురేవైతత్॥" (౧, ౭, ౬)

ఆపస్తంబశ్రౌతసూత్రము॥ "సమిద్ధో అగ్నే మే దీదిహి సమేద్ధా తే అగ్నే దీద్యాసమిత్యాహవనీయముపసమిన్ధే॥" (౪, ౧౫, ౫ పుట ౨౨౬)

౭॥ మ॥ ౧॥ వసుమాన్ యజ్ఞః॥ ౨॥ వసీయాన్భూయాసమ్॥

ప॥ ౧॥ వసు- మాన్। యజ్ఞః॥ ౨॥ వసీయాన్। భూయాసమ్॥

జ్ఞానార్థము,

౧॥ (ఓభగవంతుడ) యజ్ఞః = [ఈ] యంతర్యాగము, వసుమాన్ = మోక్షధనముగలది. ౨॥ (నేను) వసీయాన్ = మోక్షధనము గలవాడను, భూయాసమ్ = అగుదునుగాక.

తా॥ నీయనుగ్రహముచేత ఈయంతర్యాగము మోక్షసాధనమై నాకు మోక్షమునుగలుగజేయవలయునని ప్రార్థనము.

కర్మార్థము,

౧॥ (ఓయగ్ని) యజ్ఞః = ఈయజ్ఞము, వసుమాన్ = ధనముగలది. ౨॥ (నేను) వసీయాన్ = మిక్కిలి ధనముగలవాడను, భూయాసమ్ = అగుదునుగాక.

వి॥ యజమానుడీమంత్రముచేత నాహవనీయమును ప్రార్థించవలయును.

వివరణము॥ పూర్వమంత్రమందు భక్తునియొక్క తేజోరూపము చెప్పంబడినది. ఈమంత్రమందు ధ్యానయజ్ఞము మోక్షధనమునిచ్చునని చెప్పంబడుచున్నది.

వి॥భా॥ "అయంయజ్ఞస్త్వత్ప్రసాదాత్ వసుమాన్ ధనవాన్। అహమపిత్వత్ప్రసాదాద్వసీయాన్ వసుమత్తరో భూయాసమ్॥" [ప్ర ౭౫౩]

బ్రాహ్మణము॥ "వసుమాన్యజ్ఞో వసీయాన్భూయాసమిత్యాహాశిషమేవైతామాశాస్తే॥" (౧, ౭, ౬)

ఆపస్తంబశ్రౌతసూత్రము॥ "వసుమాన్యజ్ఞోవసీయాన్భూయాసమిత్యుపతిష్ఠతే॥" [౪, ౧౫, ౫ పు ౨౨౭]

---

శతసంఖ్యాకా వైఖానసా ఋషయః॥ గాయత్రీఛన్దః॥

౯॥ మం॥ ౧॥ అగ్న ఆయూంషి పవసే॥ ౨॥ ఆసువోర్జమిషఞ్చనః॥

౩॥ ఆరేబాధస్వదుచ్ఛునామ్॥

ప॥ ౧॥ అగ్నే। ఆయూంషి। పవసే॥ ౨॥ ఆ। సువ। ఊర్జమ్। ఇషమ్। చ। నః॥ ౩॥ ఆరే। బాధస్వ। దుచ్ఛునామ్॥

జ్ఞానార్థము

౧॥ హేఅగ్నే = ఓభగవంతుడా, ఆయూంషి = శాశ్వతమైన ఆయువులను, పవసే = శోధించుచున్నావు. ౨॥ నః = మాకు, ఊర్జం = బలమును, ఇషం = ఇష్టమగు మోక్షమును, ఆసువ = లెస్సగ ఇమ్ము. ౩॥ దుచ్ఛునామ్ = దుఃఖమును గలుగజేయు శత్రుసంహతిని, ఆరే = దూరమందు, బాధస్వ = బాధించుము.

తా॥ ఓభగవంతుడా మాసంబంధమగు కామక్రోధాద్యంతశ్శత్రువులనశింపజేసి మాకు ధ్యానధారణశక్తిని గలుగజేయుమని ప్రార్థనము.

కర్మార్థము.

౧॥ హేఅగ్నే = ఓయగ్నీ, [మాయొక్క] ఆయూంషి = ఆయువులను, పవసే = శోధించుచున్నావు. ౨॥ నః = మాకు, ఊర్జం = బలమును, ఇషం = అన్నమును, ఆసువ = ప్రేరణచేయుము. ౩॥ దుచ్ఛునామ్ = శత్రుసేనను, ఆరే = దూరమందు, బాధస్వ = బాధింపుము.

వి॥ యజమానుడీమంత్రముచే గార్హపత్యోపస్థానమును జేయవలయును.

వివరణము॥ పూర్వమంత్రమందు ధ్యానయజ్ఞము మోక్షప్రదాయకమని చెప్పం బడినది. అట్టి ధ్యానయజ్ఞమునకు సాధకమగు అంతశ్శత్రుసంహారము ఈమంత్రమందు చెప్పంబడినది.

అగ్నిశబ్దమునుగూర్చి ౩౩ వ వ్రుటజూడుము.

ఋషిఛందస్సులనుగూర్చి। శతసంఖ్యాకా వైఖానసాఖ్యాసంహితాఋషయః। త్వం సోమసూరఇత్యేషానుష్టుప్ శిష్టా గాయత్ర్యః। అనిఋగ్వేదభాష్యము. ౯, ౬౬.

వి॥భా॥ "హే అగ్నే పుత్రపౌత్రాదియుక్తానా మస్మాక మాయూగ్ంషి పవసె శోధయసి। అపమృత్యుం పరిహరసీత్యర్థః। నోఽస్మభ్య మూర్జమ్బలమిషమన్నంచ ఆసువ స్రాత్ సువ ప్రేరయ దేహీత్యర్థః। దుచ్ఛునాం వైరిసేనాం ఆరే దూరే బాధస్వ నివారకురు॥"

బ్రాహ్మణము॥ "బహువై గార్హపత్యస్యాన్తే మిశ్రమివ చర్యత అగ్నిపావమానీభ్యాం గార్హపత్యముపతిష్ఠతె। పునాత్యేవాగ్నిం పునీతఆత్మానం ద్వాభ్యాం ప్రతిష్ఠిత్యై।" (౧, ౭, ౬, ౮)

ఆపస్తంబశ్రౌతసూత్రము॥ "అగ్న ఆయూగ్ంషిపవసఇత్యాగ్నిపావమానీభ్యాం గార్హపత్యముపతిష్ఠతె। అగ్నేగృహపతఇతిచ॥" (౪, ౧, ౬, ౨ పు ౨౨౭)

ఈమంత్రము ౧, ౩, ౧౪ లో ౨౩ వ మంత్రముగను, ౧౫, ౫ లో ౭ వ మంత్రముగను, యజురారణ్యములో ౨, ౫ లో ౪ వ మంత్రముగను, ఋగ్వేదమునందు ౯, ౬౬ సూక్తములో ౧౯ వ ఋక్కుగను, సామవేద ఉత్తరార్చికసంహితయందు, ప్ర ౭, అ ౧, సూక్తం ౧౨లో ౧ వ మంత్రముగను పఠింపబడుచున్నది.

---

శతసంఖ్యాకా వైఖానసా ఋషయః॥ గాయత్రీఛందః॥

౧౦॥ మం॥ ౧॥ అగ్నేపవస్వస్వపా అస్మె॥ ౨॥ వర్చస్సువీర్యమ్। దధత్పోషగ్ంరయిమ్మయి॥

ప॥ ౧॥ అగ్నే। పవస్వ। సు-అపాః। అస్మె॥ ౨॥ వర్చః। సు-వీర్యమ్। దధత్। పోషమ్। రయిమ్। మయి॥

జ్ఞానార్థము

౧॥ హే అగ్నే = ఓభగవంతుడా, స్వాహాః = శోభనకర్మగల, (నీవు) అస్మే = మమ్మును, పవస్వ = పవిత్రము జేయుము.
౨॥ మయి = నాయందు, వర్చః = బ్రహ్మవర్చస్సును, సు-వీర్యం = యోగ్యమగు సామర్థ్యమును, పోషం = పుష్టినిన్ని, రయిం = బ్రహ్మవిద్యాధనమును, దధత్ = ఉంచుము.

తా॥ శాశ్వతాయువు నిచ్చెడి భగవంతుడ మాకు ధారణశక్తిని, పుష్టిని, బ్రహ్మవిద్యాధనమును నమ్మని ప్రార్థనము.

కర్మార్థము:-

౧॥ హే అగ్నే = ఓయగ్ని, స్వాహాః = యోగ్యమగు కర్మగల, [నీవు] అస్మే = మమ్మును, పవస్వ = పవిత్రము చేయుము.
౨॥ మయి = నాయందు, వర్చః = బ్రహ్మవర్చస్సునున్ను, సు-వీర్యం = వ్యవహార సామర్థ్యమునున్ను, పోషం = పుష్టినిన్ని, రయిం = ధనమునున్ను, దధత్ = ఉంచుము.

వి॥ యజమానుడీమంత్రముచే గార్హపత్యోపస్థానమును జేయువలయును.

వివరణము॥ "పూర్వమంత్రమందు అంతశ్శత్రుసంహారణ చెప్పంబడినది. ఈ మంత్రమందు తనయొక్క పవిత్రతనుగూర్చి ప్రార్థన జెప్పంబడినది.

"స్వాహాః" అను సకారాంతశబ్దము సుశబ్దపూర్వక ఆప్లృధాతువుకంటె బహులగ్రహణమువలన అసున్ ప్రత్యయము చేసి, ఆపః కర్మాఖ్యాయాం హ్రస్వోనుట్చవా అను ఉణాదిసూత్రము ౪, ౨౦౨ చేత హ్రస్వముగలది.

"దధత్" జుహోత్యాదిపఠితమగు ధాఞ్ధాతువుకంటె లేట్ జేసి దానికి అడాగమము జేయగ ఘోర్లోపో లేటివా ౭, ౩, ౭౦ అను పాణిని సూత్రముచే ఆకారలోపముగలది.

వి॥భా॥ "సకారాంతోఽయం శబ్దః కర్మవాచీ। శోభనమపః కర్మ యస్యాసౌ స్వాహాః హే అగ్నే త్వం స్వాహా అసి। అస్మాన్పవస్వ శోధయ। మయి బ్రహ్మవర్చసం వ్యవహారసామర్థ్యం పోషం పుష్టిం రయిం ధనఞ్చ స్థాపయ॥" (పు ౭౫౩)

బ్రాహ్మణము పూర్వమంత్రమును జూడవలయును.

ఆపస్తంబశ్రౌతసూత్రము॥ పూర్వమంత్రమును జూడవలయును.

ఈమంత్రము ౧, ౩, ౧౪ లో ౨౪ వ మంత్రముగను, ౧౫, ౫ లో ౭ వ మంత్రముగను, యజురారణ్యకములో ౨, ౫ లో ౫ వ మంత్రముగను, ఋగ్వేదమునందు ౯, ౬౬ సూక్తములో ౨౧ వ ఋక్కుగను, సామవేద ఉత్తరార్చిక సంహితయందు ప్ర ౭, అ ౧, సూక్తం ౧౨ లో ౩ వ మంత్రముగను పఠింపబడుచున్నది.

ఈఋక్కులరెంటికిన్ని సామాన్యముగ గాయత్రీఛందస్సుగ ఋగ్వేదభాష్యమునందు జెప్పంబడినది. అందు రెండుఋక్కులయందు మొదటి రెండుపాదముల

యందు ఏడేసివర్ణములున్నవి- ఒక్కొక్క వర్ణము తక్కువగనుండుటచేత "నిచృద్గాయత్రీ" యని చెప్పబడును- ఇందుకు ప్రమాణము- "ఏకద్వ్యూనాధికానైవ నిచృదూనాధికాభురిక్॥" (ఋగ్వేదప్రాతిశాఖ్య పుట ౩ ౨౮)

ఒకటిరెండువర్ణములు తక్కువగునేని, "నిచృద్గాయత్ర" యనియు, ఒకటిరెండుఅధికమగునేని, "భురిగ్గాయత్రి" యనియు నభిప్రాయము.

---

క. ౧౧॥మం॥ ౧॥ అగ్నే గృహపతే సుగృహపతిరహన్త్వయా గృహపతినా భూయాసమ్॥ ౨॥ సుగృహపతిర్మయా త్వం గృహపతినా భూయాశ్శతగ్ం హిమాః॥

ప॥ ౧॥ అగ్నే। గృహ-పతే। సు-గృహపతిః। అహమ్। త్వయా। గృహ-పతినా। భూయాసమ్॥ ౨॥ సు-గృహపతిః। మయా। త్వమ్। గృహ-పతినా। భూయాః। శతమ్। హిమాః॥

జ్ఞానార్థము.

౧॥ గృహపతే = గృహపాలకుడవైన, అగ్నే = ఓభగవంతుడా, గృహపతినా = గృహపాలకుడవగు, త్వయా = నీచేతను, అహం = నేను, సు-గృహపతిః = మంచియజమానుడను, భూయాసమ్ = అగుదునుగాక. ౨॥ గృహపతినా = గృహపతినగు, మయా = నాచేత, త్వం = నీవు, శతం = అనేకములగు, హిమాః = వత్సరములు, సు-గృహపతిః = యోగ్యమగు గృహపాలకుడవు, భూయాః = అగుదువుగాక.

తా॥ ఓభగవంతుడ గృహపాలకుడ

కర్మార్థము.

౧॥ గృహపతే = గృహపాలకుడవగు, అగ్నే = ఓయగ్ని, గృహపతినా = గృహపాలకుడవగు, త్వయా = నీచేత, అహం = నేను, సు గృహపతిః = యోగ్యమగుగృహపతిని, భూయాసమ్ = అగుదునుగాక. ౨॥ గృహపతినా = గృహపతినైన, మయా = నాచేత, త్వం = నీవు, శతం-హిమాః = అనేకసంవత్సరములు, సు-గృహపతిః = యోగ్యముగ గృహపాలకుడవు, భూయాః = అగుదువుగాక.

వగు నీయనుగ్రహముచే నేను గృహస్థుడనై సత్కర్మల జేయుచుండవలయునని యు అట్టి నాచే ప్రార్థింపబడుచున్న నీవు శాశ్వతముగ నాగృహముల రక్షించుచుండవలయుననియు ప్రార్థనము. అనగ శాశ్వతముగ నిన్ను నేధ్యానించుచుండవలయుననియు శాశ్వతముగ నన్ను నీవు రక్షించుచుండవలయుననియు ప్రార్థనము.

వి॥ ఈమంత్రము చేయజమానుడు గార్హపత్యోపస్థానమును చేయవలయును.

వివరణము॥ పూర్వమంత్రమందు శుద్ధత్వము జెప్పంబడినది. మోక్షప్రాప్తికి సాధనమగు సత్కర్మలను ఆచరించవలయునని ఈమంత్రమందు చెప్పంబడినది.

అగ్నిశబ్దమునుగూర్చి ౩౭ వ పుట జూడుము.

వి॥భా॥ "అయం గార్హపత్యోఽగ్నిరస్మిన్గృహే సర్వదా ధార్యమాణత్వాత్ గృహపతిః హేగృహపతేఽగ్నే గృహపతినా త్వయాఽనుగృహీతోఽహం సుష్ఠుగృహపతిర్భూయాసం। త్వమపి గృహపతినా మయా పూజితః సుష్ఠుగృహపతిర్భూయాః। హిమశబ్దో హేమంతవాచీసన్ సంవత్సరముపలక్షయతి॥" (పు ౭౫౮)

ఈమంత్రము శుక్లయజుర్వేదమందు "అగ్నే గృహపతే సుగృహపతిస్త్వయాఽగ్నేఽహం గృహపతినా భూయాసగ్ం సుగృహపతిస్త్వం మయాఽగ్నే గృహపతినా భూయాః। అస్థూరిణౌ గార్హపత్యాని సన్తు శతగ్ం హిమాః। సూర్యస్యావృత మన్వావర్తే॥" అని పఠింపబడుచున్నది. (౩, ౩౭)

ఈమంత్రము మైత్రాయణీ సంహితయందు "అగ్నే గృహపతే సుగృహపతిరహం త్వయా గృహపతినా భూయాసగ్ం సుగృహపతిస్త్వం మయా గృహపతినా భూయా అస్థూరిణౌ గార్హపత్యం దీదాయ శ్శతగ్ం హిమా ద్వాయూః॥" అని పఠింపబడుచున్నది- [౧, ౪, ౩]

బ్రాహ్మణము॥ "అగ్నే గృహపత ఇత్యాహ యథాయజురేవైతచ్ఛతగ్ం హిమా ఇత్యాహ శతన్త్వా హేమన్తానిన్ధిషీయేతివా వైతదాహ॥" (౧, ౭, ౬)

ఆపస్తంబశ్రౌతసూత్రము॥ పూర్వమంత్రమును జూడుము.

విద్యారణ్యమందు "అగ్నే గృహపతే" మొదలు, "అముష్మై జ్యోతిష్మతీం" అనువరకు ఏకమంత్రముగ జేసి గార్హపత్యోపస్థానము క్రింద ఏకముగ వినియోగము చెప్పంబడినది. అదిహేతువంజేసి ఈమంత్రమువద్దను ఈపైమంత్రమువద్దనుగూడ ౧౧-

అంకె వేయబడినది. ఆపస్తంబసూత్రము ననుసరించి రెండుమన్త్రములని తెలియుటకై వేరుగ విభాగించి- క- ఖ- అను గుర్తు వ్రాయబడినది.

ఖ. ౧౧॥ మం॥ ౧॥ తామాశిష మాశాసే తన్తవే జ్యోతిష్మతీమ్॥

౨॥ తామాశిషమాశాసేఽముష్మై జ్యోతిష్మతీమ్॥

ప॥ ౧॥ తామ్। ఆ- శిషమ్। ఆ। శాసే। తన్తవే। జ్యోతిష్మతీమ్॥-౨॥

తామ్। ఆ- శిషమ్। ఆ। శాసే। అముష్మై। జ్యోతిష్మతీమ్॥

జ్ఞానార్థము.

౧॥ తన్తవే = పుట్టబోవుప్రజలకొరకు, జ్యోతిష్మతీమ్ = ప్రకాశింపజేసెడి, తాం = ఆశిషం = ఆఆశీర్వచనమును, ఆ-శాసె = కోరుచున్నాను. ౨॥ అముష్మై = పుట్టినట్టి ఈప్రజలకొరకు, జ్యోతిష్మతీమ్ = ప్రకాశింపజేసెడి, తాం- ఆశిషం = ఆయాశీర్వచనమును, ఆశాసె = కోరుచున్నాను.

తా॥ ఇదివరకు పుట్టినవారికిన్ని పుట్టబోయెడివారికిన్ని కూడ బ్రహ్మానందము గలుగవలయునని కోరుచున్నాను.

కర్మార్థము-

౧॥ [నేను] తన్తవే = [పుట్టబోయెడి] సంతానముకొరకు, జ్యోతిష్మతీమ్ = ప్రకాశింపజేసెడి, తాం- ఆశిషమ్ = ఆయాశీర్వచనమును, ఆశాసె = కోరుచున్నాను. ౨॥ అముష్మై = (పుట్టినట్టి) ఈ సంతానముకొరకు, జ్యోతిష్మతీమ్ = ప్రకాశింపజేసెడి, తాం = ఆ, ఆశిషం = ఆశీర్వచనమును, ఆశాసె = కోరుచున్నాను.

వి॥ యజమానుడు పుట్టబోయెడి సంతానము విషయమై ప్రథమవాక్యము నుచ్చరించవలయును. రెండవవాక్యము నుచ్చరించుచు అముష్మై అను స్థానమందు వృద్ధికొరకు తన పుత్రులయొక్క నామములను చతుర్థ్యన్తములుగా బలుకవలయును.

వివరణము॥ పూర్వమంత్రమందు సత్కర్మాచరణ చెప్పంబడినది. ఈమంత్రమందు తనకు పుట్టబోవునట్టియు, పుట్టినట్టియు, సంతానము, సత్కర్మాచరితలై తేజోరూపులు అగుటనుగూర్చి చెప్పంబడినది.

“[illegible] ఉత్పన్నబహుపుత్రోత్పత్తిరూపే జ్యోతిష్మతీం తదుత్పత్తిప్రకాశనసమర్థాం తామాశిష మాశాసే అముష్మై ఉత్పన్నబహుపుత్రాయ దేవదత్తాదినామకాయ జ్యోతిష్మతీ మతిబుద్ధిప్రకాశనసమర్థాంతా మాశిషమాశాసే॥” (పుట ౧౫౪)

బ్రాహ్మణము॥ “పుత్రస్య నామగృహ్ణాత్యన్నాదమేవైనం కరోతి తామాశిష మాశాసే తన్తవే జ్యోతిష్మతీమితి బ్రూయాదస్యపుత్రోఽజాతస్స్యాత్ తేజస్వ్యేవాస్య బ్రాహ్మణోర్చసీ పుత్రో జాయతే తామాశిషమాశాసేఽముష్మై జ్యోతిష్మతీమితి బ్రూయాద్యస్యపుత్రో జాతస్స్యాత్ తేజ ఏవాస్మిన్బ్రహ్మవర్చసం దధాతి॥” [౧, ౭, ౬]

ఆపస్తంబశ్రౌతసూత్రము॥ “పుత్రస్య నామగృహ్ణాతి। తామాశిషమాశాసే తన్తవ ఇత్యజాతస్య। అముష్మా ఇతి జాతస్య॥” [౪, ౧౬, ౩]

౧౨॥ మం॥ ౧॥ కస్త్వాయునక్తి॥ ౨॥ సత్వావిముఞ్చతు॥

ప॥ ౧॥ కః। త్వా। యునక్తి॥ ౨॥ సః। త్వా। వి। ముఞ్చతు॥

జ్ఞానార్థము

౧॥ [ఓజీవాత్మ] కః=ఎవడు, త్వా=నిన్ను, యునక్తి=ప్రకృతితో గూర్చుచున్నాడో. ౨॥ సః=ఆభగవంతుడు. త్వా=నిన్ను, విముఞ్చతు = విడిపించుగాక.

తా॥ ప్రేరకుడగు భగవంతుడే, సుఖదుఃఖములను విడిపించి ముక్తుని జేయవలయునని ప్రార్థనము.

కర్మార్థము

౧॥ (ఓయజ్ఞమా) కః= [వీ] బ్రహ్మ, త్వా=నిన్ను, యునక్తి = కూర్చెనో। సః=ఆబ్రహ్మ, త్వా=నిన్ను, విముఞ్చతు=విడచుగాక.

౨॥ యజమానుడీమంత్రమునుజపించుచు యజ్ఞవిమోకమును జేయవలయును.

వివరణము. పూర్వమంత్రములయందు తనకును తనసంతానమునకును మోక్షప్రాప్తి జెప్పబడినది. ఈమంత్రమునందు అట్టి మోక్షప్రాప్తి భగవంతుడే కలుగచేయునని చెప్పంబడినది.

వి। భా। “కశ్శబ్దః ప్రజాపతిమాచష్టే। హేయజ్ఞ పూర్వం యః ప్రజాపతిస్త్వాం యునక్తి యుక్తవాన్ సఏవేదానీన్త్వాం విముఞ్చతు॥” (పుట ౭౫౪)

ఈమంత్రము వాజసనేయసంహితయందు “కస్త్వా విముఞ్చతి సత్వా విముఞ్చతి। కస్మై త్వా విముఞ్చతి పోషాయ రక్షసాం భాగోఽసి।” అని పఠింపబడుచున్నది. [౨, ౨౩]

బ్రాహ్మణము॥ "కస్త్వాయునక్తి సత్వావిముఞ్చత్విత్యాహ ప్రజాపతిర్వై కః ప్రజాపతినైవైనం యునక్తి ప్రజాపతినా విముఞ్చతి ప్రతిష్ఠిత్యై॥" [౧, ౭, ౬]

ఆపస్తంబశ్రౌతసూత్రము॥ "కస్త్వాయునక్తి సత్వావిముఞ్చత్వితి యజ్ఞంవిముఞ్చతి॥" (౪, ౧౬, ౧౦)

---

౧౩॥ మం॥ ౧॥ అగ్నేవ్రతపతే వ్రతమచారిషమ్॥ ౨॥ తదశకమ్॥ ౩॥ తన్మేఽరాధి॥

ప॥ ౧॥ అగ్నే। వ్రత- పతే। వ్రతమ్। అచారిషమ్॥ ౨॥ తత్। అశకమ్॥ ౩॥ తత్। మే। అరాధి॥

**జ్ఞానార్థము.**

౧॥ వ్రతపతే= వ్రతపాలకుడవైన, అగ్నే=ఓభగవంతుడ, వ్రతం = సత్య వ్రతమును, అచారిషం = చేసితిని. ౨॥ తత్= ఆసత్యవ్రతమును, (పూర్తి నొందించుకొరకు,) అశకం = సమర్థుడ నైతిని. ౩॥ మే = నాసంబంధమైన, తత్ = ఆవ్రతము, అరాధి = సమృద్ధ మైనది.

తా॥ వ్రతపాలకుడవగు నీయనుగ్ర హామువలన పూర్ణమగు సత్యవ్రతముగ చాడెను గనుక ముక్తునిజేయుమని ప్రా ర్థనము.

**కర్మార్థము.**

౧॥ వ్రతపతే = వ్రతాధిపుడవైన, అగ్నే=ఓయగ్ని, వ్రతం=యజ్ఞవ్రతము ను, అచారిషం = చేసితిని. ౨॥ తత్= ఆవ్రతమును, (సమాప్తినొందించుకొరకు) అశకం=సమర్థుడనైతిని. ౩॥ మే= నాసంబంధమైన, తత్ = ఆవ్రతము, అరాధి=సమృద్ధమైనది.

వి- యజమానుడు ఈమంత్రమునుజ పించి వ్రతమును విడువవలయును.

---

వివరణము॥ పూర్వమంత్రమందు భగవంతుడే మోక్షమును కలుగచేయునని చెప్పంబడినది. ఈమంత్రమునందు భగవదనుగ్రహామువలననే వ్రతమును నెరవేర్చిన ట్లుల జెప్పంబడినది.

అగ్నిశబ్దమునుగూర్చి ౩౭ వ పుట జూడుము.

వి॥భా॥ "యజ్ఞరూపస్య వ్రతస్య పతే హేఅగ్నే త్వత్ప్రసాదాదిదం వ్రతం

చరితవానస్మి। తద్వ్రితం సమాపయితుమశకం శక్తోఽభూవం। మదీయంవ్రత మరాధి సమృద్ధమభూత్॥" (పు ౭౫౭)

ఈమంత్రము వాజసనేయసంహితయందు "అగ్నే వ్రతపతే వ్రతమచారిషం త దశకం తన్మే రాధీదమహం యఏవాస్మి సోఽస్మి॥" అనిపఠింపబడుచున్నది. (౨,౨౮)

బ్రాహ్మణము॥ "ఈశ్వరంవై వ్రతమవిసృష్టం ప్రదహః। అగ్నే వ్రతపతే వ్రత మచారిషమిత్యాహ। వ్రతమేవవిసృజతె। శాన్త్యా అప్రిదాహాయ॥" (౧, ౭, ౬)

ఆపస్తంబశ్రౌతసూత్రము॥ "అగ్నే వ్రతపతే వ్రతమచారిషమితి వ్రతం విసృజ తె॥" [౪, ౧౬, ౧౧]

---

౧౪॥ మం॥ ౧॥ యజ్ఞోబభూవ॥ ౨॥ స ఆబభూవ॥ ౩॥ సప్రజజ్ఞే॥ ౪॥ సవావృధే॥ ౫॥ సదేవానామధిపతిర్బభూవ॥ ౬॥ సో అస్మాగ్ం అధిపతీన్కరోతు॥ ౭॥ వయగ్ంస్యామ పతయో రయీణామ్॥

ప॥ ౧॥ యజ్ఞః। బభూవ॥ ౨॥ సః। ఆ। బభూవ॥ ౩॥ సః। ప్ర। జజ్ఞే॥ ౪॥ సః। వావృధే॥ ౫॥ సః। దేవానామ్। అధి-పతిః। బభూవ॥ ౬॥ సః। అస్మాన్। అధి-పతీన్। కరోతు॥ ౭॥ వయమ్। స్యామ। పతయః। రయీణామ్॥

**జ్ఞానార్థము**

౧॥ యజ్ఞః = ఈయన్తర్యాగము, బభూవ=అయినది॥ ౨॥ సః = అది, ఆబభూవ=తిరిగిఅవునుగాక॥ ౩॥ సః= అది, ప్రజజ్ఞే= లెస్సగతెలుసుకొనెను॥ ౪॥ సః=అ(అంతర్యాగము)వావృధే=

**కర్మార్థము.**

౧॥ యజ్ఞః=(ఈచేయబడిన) యజ్ఞము, బభూవ=(సంపూర్ణము)అయినది, ౨॥ సః=ఆయజ్ఞము, ఆ-బభూవ= పునరావృత్తముగుగాక॥ ౩॥ సః=ఆయజ్ఞము, ప్ర-జజ్ఞే=లెస్సగతెలుసుకొనెను.

తిరిగితిరిగివృద్ధిపొందుగాక॥ ౫॥ సః= అది, దేవానాం=ఇంద్రియములకు, అధిపతిః=ప్రభువు, బభూవ= అగుగాక॥ ౬॥ సః=అది, అస్మాన్=మమ్ములను, అధిపతీన్= ప్రభువులనుగా, కరోతు= చేయును గాక॥ ౭॥ వయమ్=మేము, రయీణాం = మోక్షధనమునకు, పతయః=ప్రభువులము, స్యామ = అగుదుము గాక.

తా॥ ధ్యానయజ్ఞము మేము ఎల్లప్పుడును చేయుచుందుము గాక. అందువలన మాకు మోక్షధనము కలుగును గాక యని ప్రార్థనము.

౪॥ సః=ఆయజ్ఞము, వావృధే= తిరిగి తిరిగి వృద్ధిపొందును గాక. ౫॥ సః=ఆయజ్ఞము, దేవానాం= దేవతలకు, పతిః= ప్రభువు, బభూవ=అగుగాక. ౬॥ సః= ఆయజ్ఞము, అస్మాన్=మమ్ములను, అధిపతీన్=కర్మపాలకులనుగాను, కరోతు= చేయుగాక. ౭॥ వయమ్=మేము, రయీణాం = యజ్ఞసాధనములగుధనములకు, పతయః=అధిపతులము, స్యామ=అగుదుము గాక.

వి॥ తిరిగియజ్ఞప్రాప్తికొరకు యజమానుడీమంత్రమును జపించవలయును.

వివరణము॥ పూర్వమంత్రమందు భగవదనుగ్రహముపలనే వ్రతమును నెరవేర్చునటుల చెప్పంబడినది. ఈమంత్రమందు అట్టివ్రతమును ఎల్లప్పుడూ చేయుచుండవలయునని చెప్పంబడుచున్నది.

సా॥భా॥ "ఇదానీమనుష్ఠితోఽయం యజ్ఞో బభూవ సమ్యాగ్నిష్పన్నోభూత్। సయజ్ఞ ఆబభూవ పునరప్యావృత్తో భవతు। సయజ్ఞః ప్ర[illegible] జజ్ఞే అస్మాననుష్ఠాతౄన్ [illegible] వాన్। అతఏవాస్మద్గృహే సయజ్ఞో వావృధే పునః పునరనుష్ఠానే [illegible]ర్ధతాం। సయజ్ఞోస్మాభిరిజ్యమానానాన్దేవానామధికం పాలయితా భవతు। స యజ్ఞోఽస్మా[illegible] పతీన్ అధికమనుష్ఠానస్య పాలకాన్కరోతు వయమపి [illegible] యజ్ఞ[illegible]స్య ప్రసాదాద్రయీణాం యజ్ఞసాధనానాం ధనానాం పతయో భూయాస్మ" (పు ౭[illegible])

బ్రాహ్మణము॥ "యజ్ఞో బభూవ సఆబభూవేత్యాహైవమనై యజ్ఞస్య పునరాలమ్భస్తేనైనం పునరాలభతే॥" (౧, ౭, ౬)

ఆపస్తంబశ్రౌతసూత్రము॥ "యజ్ఞో బభూవేతి యజ్ఞస్య పునరాలమ్భంజపతి॥" (౪, ౧౬, ౧౨)·

ఋషిః వామదేవః॥ ఛన్దః త్రిష్టుప్॥

౧౫॥ మం॥ ౧॥ గోమాగ్ం అగ్నేఽవిమాగ్ం అశ్వీ యజ్ఞో నృవత్స

ఖాసదమిదప్రమృష్యః। ఇడావాగ్ం ఏషోఽసురప్రజావాన్
దీర్ఘోరయిః పృథుబుధ్నస్సభావాన్॥

ప॥ ౧॥ గో-మాన్। అగ్నే। అవి-మాన్। అశ్వీ। యజ్ఞః। నృవత్-స
ఖా। సదమ్। ఇత్। అప్ర- మృష్యః। ఇడా-వాన్। ఏషః। అ
సుర। ప్రజా- వాన్। దీర్ఘః। రయిః। పృథు- బుధ్నః। స
భా- వాన్॥

### జ్ఞానార్థము.

౧॥ అసుర=ప్రభువైన, అగ్నే=ఓ భగవంతుడ, ఏషః=ఈ, యజ్ఞః=యజ్ఞము, గోమాన్=ఆవులు కలదియు, అవిమాన్=భాగములు గలదియు, అశ్వీ=అశ్వములుగలదియు,-అనగ గవాశ్వాది సమృద్ధినిచ్చేది, నృవత్సఖా=విబుధులకు హితమైనది, సదమిత్=ఎల్లప్పుడును, అప్రమృష్యః=అనింద్యమైనది, ఇడావాన్=బ్రహ్మజ్ఞానము గలది, ప్రజావాన్=ప్రజలుగలది, దీర్ఘః=అవిచ్ఛిన్నమైనది, రయిః=మోక్షధనముగలది, పృథుబుధ్నః=వికలము పొందనిది, సభావాన్=విద్వత్సభగలది [అగుగాక]

తా॥ ధ్యానయజ్ఞము ఇహపరసౌఖ్యములను కలుగజేయుచు నిర్విఘ్నముగ జరగవలయునని ప్రార్థనము.

### కర్మార్థము.

౧॥ అసుర = ప్రాణములుగల, అగ్నే=ఓయగ్ని, ఏషః=ఈ, యజ్ఞః=యజ్ఞము, గోమాన్=బహుగోవులుగలదియు, అవిమాన్ = బహుభాగములుగలది, అశ్వీ=అశ్వములుగలది, సదమిత్=ఎల్లప్పుడును, అప్రమృష్యః= అనింద్యమైనది, ఇడావాన్ = అన్నముగలది, ప్రజావాన్=సంతానముగలది, దీర్ఘః=అవిచ్ఛిన్నమైనది, రయిః = ధనముగలది, పృథుబుధ్నః = వికలమునుపొందనటువంటిది, సభావాన్ = విద్వత్సభగలదియు [అగుగాక]

వి॥ యజమానుడీమంత్రమును పూర్వదిక్కుగ వెళ్లి జపించవలయును.

వివరణము॥ పూర్వమంత్రమందు అట్టివ్రతములను ఎల్లప్పుడు చేయవలయునని చెప్పబడినది. ఈమంత్రమందు అట్టిసత్కర్మలయొక్క లక్షణము చెప్పబడుచున్నది.

“అసురఅనుశబ్దము క్షేపణార్థకమగు అసు అనుధాతువుకంటె ఉరన్ప్రత్యయ ముగలది॥” [ఋగ్వేదవిద్యారణ్యభాష్యము- మం ౧, సూ, ౨౪, ఋ ౧౪ పు౨౫౦]

అసిమసోరురణ్॥ ఉ॥ సూ॥ ౧, ౪౨, ౪౩, ఉరన్ప్రత్యయః॥ యద్వా। అస్తి భూ॥ ప॥ తిష్ఠతి శ్యాస్వృస్నిహిత్రస్యసివసి॥ ౧। ౧౦॥ ఇత్యాదినా ఉప్రత్యయః। అ సుః శరీరేవసతీత్యసుః ప్రాణః॥ రోమత్వర్థీయః। యద్వా। అసగతిదీప్త్యాదానేషు పూర్వస్మాదేవ సూత్రాదురన్ప్రత్యయః॥ (వేదనిఘంటువు ౧, ౧౯, ౨౯)

అనగ ప్రాణార్థకమగు అసుశబ్దముకంటె మతుబర్థకమగు రప్రత్యయము లేక దీప్తి అర్థముగల అసుధాతువుకంటె ఉరన్ప్రత్యయము గలది-

వి॥భా॥ “హేఅగ్నే పునరావర్తనాయ ప్రార్థ్యమానో యజ్ఞ ఏతైర్విశేషణైర్వి శిష్టో భూయాత్। బహవో గావోఽస్య సంతీతి గోమాన్- ఏవ మవిమా నశ్వీతి యో జ్యం। నృవత్సఖా ఋత్విగ్భిః ప్రైర్మనుష్యైర్యుక్తా దేవాః సఖాయో యస్య యజ్ఞస్య తాదృశః। సదమిత్ సదైవ। స ర్వేషా మప్రమృష్యోఽనభిభవనీయః- ఇడావా నన్న వాన్ ప్రజావాన్ బహ్వపత్యప్రదః దీర్ఘః పునఃపునరనుష్ఠానాదవిచ్ఛిన్నః రయిః బ హుధనోపేతః పృథుబుధ్నో విస్తీర్ణమూలః మంత్రేష్వనుష్ఠానేషుచ మూలభూతేషు వైకల్యరహితః। సభావాన్। అవికలం యజ్ఞం ద్రష్టుమిచ్ఛన్త్యా మహత్యా విద్వత్సభ యా యుక్తః అసుః ప్రాణః సోఽస్యాస్తీత్యసురః హేఅసుర ప్రాణవన్నగ్నే ఏవపు నః ప్రార్థ్యమానో యజ్ఞః ఉక్తవిశేషణవిశిష్టో భూయాత్॥” [పు ౭౫౫]

ఈమంత్రము మైత్రాయణీసంహితయందు॥ “ గోమం అగ్నే ఽ వివం అశ్వీయ జ్ఞో నృవత్సఖాసదమిదప్రమృష్యః। ఇడావానేషో అసుర ప్రజావాన్దీర్ఘో రయిః పృథు బధ్నః సభావాన్॥” అనిపఠింపబడుచున్నది. (౧, ౪, ౩ పు ౫౧)

బ్రాహ్మణము॥ “అనవరుద్ధావా ఏతస్య విరాడ్య ఆహితాగ్నిస్సన్సభః పశ వఃఖలువై బ్రాహ్మణస్య సభేష్ట్వా ప్రాఙుత్క్రమ్య బ్రూయాద్గోమాగ్ం అగ్నే విమా గ్ం అశ్వీయజ్ఞ ఇత్యవసభాగ్ం రుంధే ప్రసహస్రం పశూనాప్నోత్యాస్య ప్రజాయాం వా జీజాయతే॥” (౧, ౭, ౮)

ఆపస్తంబశ్రౌతసూ॥ “గోమానితిప్రాఙుదేత్యగోమతీంజపతి॥” (౪, ౧౮, ౧౩)



## ఈయనువాకముయొక్క సామాన్యవిషయములు.

### వి ని యో గ సం గ్ర హ ము.

౧॥ "అగన్మస్వార్వాగ్న్యుపస్థానంసుభూర్భ్వానోరుపస్థితిః। ఇదం నిస్సారయేచ్ఛత్రుం సంజ్యోతిషాభిమర్శనమ్॥ ఐంద్రీ ప్రదక్షిణావృత్తిః సమహం తద్విపర్యయః। సమిద్ధస్సమిదాధానం వసుపూర్వాగ్న్యుపస్థితిః॥ అగ్నఆయాహి త్రిభిర్మంత్రైరపరాగ్నేరుపస్థితిః। కస్త్వాయజ్ఞవిమోకస్స్యాద్యదగ్నే తద్వ్రతముత్సృజేత్॥ యజ్ఞేతిపునరాలభ్యం జపేద్గోమాంస్తు గోమతీం। షష్ఠేఽనువాక ఏతస్మిన్మంత్రాః పఞ్చదశేరితాః॥"

### మీ మాం స.

(౨) నవమాధ్యాయస్య ప్రథమపాదే చింతితమ్। "అగన్మాదే స్స్వర్గదేవా హోతూయద్వా ప్రచోదితమ్। ఆద్యో లిఙ్గేష్టమఙ్గస్యాపూర్వాకాంక్షితత్వతః॥" దర్శపూర్ణమాసయోర్మంత్రౌ శ్రుతౌ। అగన్మ సువరిత్యేకః। అగ్నేరహముజ్జితి మనూజ్జేషమిత్యపరః। తయోరుభయోః క్రమేణ స్వర్గదేవౌ ప్రయోజకౌ। కుతః। తల్లిఙ్గదర్శనాత్। తథా సతి సౌర్యం చరుం నిర్వపేద్బ్రహ్మవర్చసకామ ఇత్యత్ర స్వర్గాగ్న్యోరభావాన్నాస్త్యూహ ఇతి ప్రాప్తే బ్రూమః। చోదితం యదపూర్వం తస్యైవ ఫలత్వేన అనుష్ఠేయతయా ఇతి కర్తవ్యతాకాంక్షాయుక్తా। తతో మంత్రయోరపూర్వత్వం ప్రయోజకం। తథా సతి వికృతౌ అగన్మ బ్రహ్మవర్చసం సూర్యస్యాహముజ్జితిమనూజ్జేషమిత్యేవం మంత్రయోరస్త్యూహః॥

(౩) ఈయనువాకము కర్మరీత్యా సూర్యోపస్థానాది మంత్రములని చెప్పబడుచున్నది.

జ్ఞానరీత్యా భగవత్ప్రార్థనాదిమంత్రములని చెప్పందగును.

(౪) ప్రాతిశాఖ్య। ఈయనువాకముయొక్క యేయేమంత్రములు తైత్తిరీయ ప్రాతిశాఖ్యసూత్రభాష్యమునందుదహరింపబడినవో ఆయా సూత్రములను మంత్రములను వివరించుచున్నాము.

| అ. | సూ. |
|---|---|
| ౧౧ | ౧౧ |
| ౯ | ౨౧ } |
| | ౨౨ } |
| ౧౧ | ౧౬ |

"ధీరాసో జఙ్ఘా సవికాదశా సబుభీణాం పుత్రశ్చార్యా తే అషాఢః పితోర్దః పృథివీ యజ్ఞ ఆసతే యేగృహ్ణోమ్యగ్రేవాగవిపజజ్ఞే సర్గస్సాత్వోయువయోర్యాః ప్వ

ష్ఠే పతిర్వ్యాగోశుష్మః పువస్సమిద్ధబుషభః పాథో వచో వర్షిష్ఠే జుషాణో యోరు దో౹వృష్ణః పూర్వ్యః॥" ప్రా॥ అ ౧౧, సూ ౧౬ ఈసూత్రమువలన ఈయనువాకము యొక్క ౧౫ వ మంత్రములోని "ఇడావాగ్ఏషో అసుర" అనుస్థలమునందు "వాగ్ ఏషః" అనుపదము పూర్వమగుటచే "అసుర" అనుపదాదియందున్న అకారము లోపించలేదు.

(౫) ఈయనువాకముతో సంబంధించిన శాఖలు, బ్రాహ్మణము, కల్పము.

శాఖలు.

తైత్తిరీయసంహిత॥ ౧, ౭, ౬, ౧, ౭.
కాఠకసంహిత॥ ౫, ౫, ౬.
వాజసనేయసంహితా. ౨, ౨౫, ౨౮.
మైత్రాయణీసంహిత॥ ౧, ౪, ౧, ౩.

బ్రాహ్మణము.

శతపథబ్రాహ్మణము। ౧, ౯, ౩, ౧౪, ౩౩.

కల్పము.

శాంఖాయనసూత్రము। ౪, ౧౨, ౮, ౧౬, ౪, ౧౩, ౩, ౪
ఆపస్తంబశ్రౌ।సూ॥ ౪, ౧౪, ౧౧, ౪, ౧౬, ౧౩.
కాతీయము॥ ౩, ౮, ౧౫, ౨౯.

తైత్తిరీయసంహితాయాం ప్రథమకాండే షష్ఠప్రపాఠకే

షష్ఠోనువాకస్సమాప్తః.

సమాప్తంచేదం ప్రాజాపత్యంనామ ప్రథమం మండలమ్.



ఓం- పరబ్రహ్మణేనమః-

తైత్తిరీయసగ్ంహితయందు ప్రజాపతిఋషిసంబంధమగు కాణ్డములకు మన్త్రభాగార్థము ముగిసినది. ౧౨౧వ పుటయందు కాండలయొక్క వివరము వ్రాయంబడినది- వాటిలో ప్రజాపతిఋషి సంబంధమగు కాణ్డములెయ్యవియైనదియు స్పష్టముగ తెలియుటకై, కాండానుక్రమణికయొక్క ౨వ యధ్యాయమునందు జెప్పంబడినశ్లోకము నిచ్చట వివరణముతోగూడ వ్రాయుచున్నారము.

శ్లో॥ "శాఖాదియాజమానంచ హౌత్రాణి హౌత్రఞ్చ దార్శికం।
తద్విధీన్పితృమేధఞ్చ నవాహుః కస్య తద్విదః॥"

౧॥ "శాఖాది"= ౧॥ ఇషేత్వా, సం, ౧, ౧, ౧-౧౩॥
౨॥ "తద్విధిః"=౩౫॥ తృతీయస్యామితో దివి, పరాయాతం, ౩, ౨, ౧-౧౧॥
ప్రత్యుష్టగ్ం రక్షః ప్రత్యుష్టాః, పరాయాతం, ౩, ౩, ౧-౧౧॥
౩॥ "యాజమానం"=౮॥ పయస్వతీః, సం॥ ౧, ౫, ౧౧, ౨॥
సన్త్వాసించామి, సం॥ ౧, ౬, ౧-౬॥
౪॥ "యాజమానవిధిః"=౯॥ యథావై, సం॥ ౧, ౬, ౭, ౧౧॥
పాకయజ్ఞంవా, సం॥ ౧, ౭, ౧॥
పరోక్షంవా అన్యేదేవాః, సం॥ ౧, ౭, ౩-౬॥
౫॥ "హౌత్రాణి"=౨౮॥ చిత్తిస్స్రుక్, ఆరణ్యకం, ౩, ౧౬-౧౩॥
౬॥ "హౌతృవిధిః"=౨౯॥ ప్రజాపతిరకామయత, పరాయాతం, ౨, ౨, ౧-౧౧॥
బ్రహ్మవాదినోవద పరాయాతం, ౨, ౩, ౧-౧౧॥
౭॥ "హౌత్రమ్"=౩౮॥ సత్యమ్ప్రపద్యే. పరాయాతం, ౩, ౫, ౧-౧౩॥
దేవావైనర్చి నా, ౨, ౫, ౭-౧౧॥
సగ్ంశ్రవాః సౌ, ౧, ౭, ౨॥
మనుః పృథివ్యా ॥ ౨, ౬, ౭-౧౦॥
౮॥ "దార్శికమ్"=౧౫॥ విశ్వరూపోవై త్వష్ట్రః, సం॥ ౨, ౫, ౧-౬॥
దేవావైసామిధే సం॥ ౨, ౫, ౧౧॥
సమిద్ధోయజ ॥ ౨, ౬, ౧-౬॥
ఇన్ద్రోవృత్రగ్ం హ, పరాయాతం, ౧, ౩, ౧౨॥
"పితృమేధమ్"=౩౭॥ పరేయువాగ్ంసం, ఆరణ్యకం। ౬, ౧-౧౨॥

వీటిలో ౧, ౨ భాగములు సంహితకు సంబంధించియున్నవి- ౩- ౯, భాగములు పరాయాతమని వాడుకలోనున్న సారస్వతశాఖయొక్కయు, ఆరణ్యశాఖయొక్కయు భాగములయ్యున్నవి- సంహితభాగము ౨ విధములు- ఆధ్వరమనియు యాజమానమనియు= ౧-౨౮౨ ఆధ్వరము. ౨౮౩-౩౭౮ వరకు యాజమానమని తెలియందగినది. శ్రౌతకర్మలలో ముఖ్యమైనవి, దార్శికము, సోమము, ఆధానము, ఇవియే ప్రకృతులని విద్యారణ్యమునందు జెప్పంబడినది ॥ "ప్రకృతిస్త్రివిధా అగ్నిహోత్రమిష్టిస్సోమశ్చేతి॥" (పుట ౭) దార్శికము ప్రధానమగుటచే ఈ కర్మ వేదప్రారంభమునందు జెప్పంబడినది. ఈ సంగతి, "ఏవవై దేవరథో యద్దర్శపూర్ణమాసౌ" అను బ్రాహ్మణముచేత [తై ॥ సం॥ ౨, ౫, ౪] జెప్పబడుచున్నది. బ్రహ్మచర్యగృహస్థాశ్రమాదులు ఈమండలమునందు జెప్పంబడినవి - ఇట్టి యాశ్రమములను, సమముగ నాశ్రయించి మనుజునియందు పశుత్వకామములను నశింపజేయుటకుగా సోమమను కర్మను జేయవలయును. ఈకర్మ ద్వితీయ మండలమునందు జెప్పబడుచున్నది.

